# నవ గ్రహాలు

దోషాలు, శాంతులు, పరిహారాలు,
యోగాలు, దానాలు, స్నానాలు,
ప్రదక్షిణలు, ముద్రలు, అవస్థలు,
పూజలు, ఎన్నో..... మరెన్నో....













నిత్ర పబ్లికేషన్స్



# నవ గ్రహాలు



దోషాలు, శాంతులు, పరిహారాలు, యోగాలు,
దానాలు, స్నానాలు, ప్రదక్షిణలు, ముద్రలు,
అవస్థలు, పూజలు, ఎన్నో.... మరెన్నో....











ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయ చ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

నిత్ర పబ్లికేషన్స్



## మా మాట

నవగ్రహాల ద్వారానే ఈ భూమండలం మొత్తం నడుస్తుంది. స్థావర జంగమములు ఏర్పడినవి ఈ గ్రహాల వల్లే అంటారు. మనిషి పుట్టిన స్థలాన్ని, కాలాన్ని అనుసరించి 'జన్మకుండలి' రచన జరుగుతుంది. జన్మ సమయంలో ఉండే గ్రహాల స్థితిగతుల ఆధారంగా మనిషి యొక్క జాతకాన్ని జ్యోతిషులు సూచిస్తారు. ఈ జ్యోతిషంలో ఏ గ్రహాలు ఉచ్ఛ దశలో ఉన్నాయి, ఏ గ్రహాల వలన ఆ జాతకునికి ఇబ్బందులు ఉన్నాయి, గ్రహాల కదలికలు .. ఇలా గ్రహాలకు సంబంధించిన అనేక విషయాలను ఆ జ్యోతిషుడు సూచిస్తాడు. దాని ప్రకారం గ్రహ పూజాదులు చేసుకొన వలసి ఉంటుంది.

ఈ పుస్తకంలో గ్రహ దోషాలు అంటే ఏమిటి, వ్యక్తులపై గ్రహ ప్రభావం ఎలా ఉంటుంది?, గోచారం ప్రకారం శుభ స్థానాలు, రాజ యోగాలను ప్రసాదించే గ్రహాలు, నవగ్రహ ప్రదక్షిణ ఎలా చేయాలి,

నవగ్రహాలలో ఏ గ్రహ ప్రభావం ఎలా ఉంటుంది, గ్రహ శాంతి విధానాలు, గ్రహ పూజా విధానాలు, గ్రహాల అవస్థలు, ద్విగ్రహ యోగం అంటే ఏమిటి, గ్రహ శాంతికై ఏ క్షేత్రాలను దర్శించాలి .. ఇలా అనేక విషయాలు వివరించబడ్డాయి. గ్రహాలపైన ఈ పుస్తకంలో ఇవ్వబడిన సమాచారం కేవలం ప్రాథమిక అవగాహన కొరకు మాత్రమే ఉద్దేశించబడింది. ఒక వ్యక్తి జాతకం ప్రకారం గ్రహాల విషయంలో జ్యోతిషుడు సూచించిన పద్ధతులను మాత్రమే ఆ వ్యక్తి అనుసరించవలసి ఉంటుంది.

ఈ పుస్తకంలోని విషయ సేకరణకు అనేక పుస్తకాలు, వ్యాసాలు, దిన, వార, మాస పత్రికలు, టీవీ ప్రసంగాలు, అంతర్జాలము మాకు ఎంతగానో ఉపయోగపడ్డాయి. వారందరికీ పేరు పేరునా ధన్యావాదాలు.

ముందుగా మీకున్న సమస్య ఏమిటో, దాన్ని తీర్చగలిగే శక్తి ఏ గ్రహానికుందో తెలుసుకోవటానికి అనుభవజ్ఞులైన జ్యోతిషులను సంప్రదించి వారి సలహాపై ఈ నవగ్రహాలకు సంబంధించిన ఏ కార్యక్రమాన్నైనా ప్రారంభించాలి. అప్పుడే ఆ కార్యం సమగ్రం అవుతుంది.

నవగ్రహాల అనుగ్రహం మీపై ప్రసరించాలని భావిస్తూ .....



- నిత్య పబ్లికేషన్స్



# విషయసూచిక







# న వ గ్ర హా లు



**మానవుడి జాతక చక్రంలో కొలువుదీరి, అతని జీవిత చక్రాన్ని నియంత్రించే అశేష, విశేష దైవ స్వరూపాలు నవగ్రహాలు! మానవుల ఆలోచన, అభివ్యక్తీకరణ, ఆచరణ ఈ మూడు నవగ్రహ వీక్షణ మీదే ఆధారపడి వుంటాయి అంటారు.**

జ్యోతిషం అనేది నవగ్రహాల మీద ఆధారపడి ఉంటుంది. దీనిలో నక్షత్రాల గుర్తింపు ఉంటుంది. నవగ్రహాల కదలికల మీద, ఏ గ్రహాలు బలంగా ఉన్నాయి, ఏ గ్రహాలు బలహీనంగా ఉన్నాయి, ఎన్నాళ్లు కదలికలు ఉంటాయి వంటి అంశాల మీద ఆధారపడి ఉంటుంది.

మానవ జీవితాన్ని ఎక్కువగా ప్రభావితం చేసేవే నవగ్రహాలు. గ్రహ గతులను బట్టి మానవజీవితం నడుస్తూ ఉంటుంది. గ్రహాలను మానవ జీవితంపై ప్రభావితం కాకుండా చేయడం ఎవరి వల్లకాదు. లాభ నష్టాలు, జయాపజయాలు, మిత్రుత్వం, శత్రుత్వం ద్వారా గ్రహ ప్రభావాలపై ఆధారపడి ఉంటాయి. శుభప్రదంగా, సుఖవంతంగా మానవుడు తన జీవితాన్ని నడుపుకుంటున్నాడు అంటే అందుకు కారణం గ్రహాలు శుభస్థానాలలో ఉండటమే కారణం. ఎప్పుడయితే మానవుడు కష్ట, నష్టాల వలయంలో చిక్కుకున్నాడు అంటే గ్రహస్థితి బాగుండనట్లే లెక్క.

హిందువుల జీవిత ఆచారాలలో నవగ్రహాలకు ఎంతో ప్రాముఖ్యత ఉంది. మానవుల స్థితిగతులు, భవిష్యత్తు వ్యవహారాలపై నవగ్రహాల ప్రభావం ఉంటుంది. ఈ భూప్రపంచంలో దేవతలతో సమానంగా నవగ్రహాలకి కూడా ప్రాధాన్యం ఇవ్వబడింది. మానవులు చేసిన కర్మలను అనుసరించే వారికి శుభాశుభ ఫలితాల్ని నవగ్రహాలు అందిస్తుంటాయి.

జాతకునికి ఏ గ్రహం పాపగ్రహమో, ఏది ఎక్కువ బాధిస్తుందో తెలుసుకొని ఆయా గ్రహాలకు వారి ప్రీతికరమైన ధాన్యం, వస్త్రం మొదలైన వాటిని సంకల్పయుతంగా దానమిచ్చి, శాస్త్రోక్తంగా కర్మలు చేస్తే ఆ గ్రహ పీడా నివారణ జరిగి కొంత ఉపశమనం కలుగుతుంది. దీనినే గ్రహశాంతి అనవచ్చు.

నవ గ్రహాల్లో ప్రతీ గ్రహమూ శుభాన్ని – అశుభాన్ని రెండింటినీ కలిగిస్తుంది. ఈ శుభాశుభాలనేవి ఆ జాతకుడి గ్రహస్థితిని బట్టి ఉం టుంది. నవగ్రహాల ద్వారా కలిగే అశుభాల్ని నివారించుకోవటానికి మార్గం లేదా అంటే ఉన్నది అని చెప్పవచ్చు. అదే నవగ్రహాలని నిత్యం స్తుతిస్తూ, పూజిస్తూ వుండడం. ఆయా గ్రహ మంత్రాల్ని జపం చేయటం లేదా చేయించు కోవటం. ఈ కార్యక్రమాలద్వారా నవగ్రహ శాంతిని పొందచ్చు. ఈ నవగ్రహ పూజ, జప, దానాల వల్ల పూర్తిగా దోషం నుంచి తప్పించు కోలేకపోయినా, ఆ దోషం ద్వారా కలుగబోయే పెద్ద ప్రమాదం నుంచి సులభంగా బయటపడవచ్చు అని విజ్ఞుల భావన.

నవగ్రహాల ద్వారానే ఈ భూమండలం మొత్తం నడుస్తుందని, స్థావర జంగమములు ఏర్పడినవి ఈ నవ గ్రహాల వల్లేనని, త్రిమూర్తులు త్రిదేవినులు కొలువైనది ఈ గ్రహాల్లోనేనని, గ్రహరూపి జనార్దన, గ్రహ రూపి మహేశ్వర అనే వచనం ప్రకారం హరిహరులు గ్రహ రూపంలో కొలువై ఉన్నారని మనకు పెద్దల మాటల ద్వారా తెలుస్తుంది.



# నవగ్రహముల జననము



**1) సూర్యుడు :** శ్రీ కశ్యప ఋషికి దక్షుని పుత్రికయగు అదితికిని "వివస్వంతుడు (సూర్యుడు)" జన్మించెను (ప్రభవ నామ సంవత్సర మాఘ మాస శుద్ధ సప్తమి) కశ్యపుని కొడుకు కనుక "కాశ్యపుడు" అని అదితి కొడుకు కనుక "ఆదిత్యుడు" అని అండమున మృతము లేనివాడు కనుక "మార్తాండుడు" అని నామములు వచ్చెను. సూర్యునకు సంజ్ఞాదేవికిని "వైవస్వతుడు" "యముడు" "యమున" లు జన్మించెను.

**2) చంద్రుడు :** అత్రి మహర్షి అనసూయల సంతానం. అత్రి మహర్షి తపస్సు చేయుచుండగా అతని వీర్యము భూమిపై పడెను. సోమరూపైన వీర్యమును బ్రహ్మ లోకహితార్థమై తన రథమెక్కించుకొని భూమి చుట్టు ఇరవైఒక్క మారలు ప్రదక్షిణలు చేసెను. ఆయన తేజస్సుచే జగదాధార భూతములైన సర్వౌషదులు మొలకెత్తెను (నందన నామ సంవత్సర కార్తీక శుద్ధ చతుర్ధశి) సోముని బ్రహ్మ భూమికి రాజును చేసెను. చంద్రుని కుమారుడు బుధుడు.





**3) కుజుడు :** శివుని నుండి వెలువడిన తేజము పార్వతీ దేవి గ్రహించి గర్భవతి అయినది. ఆమె ఆ తేజమును భరింపలేక భూదేవికి ఇచ్చెను. ఆమె ఆ తేజమును ధరింపగా "కుజుడు" (అంగారకుడు) జన్మించెను (అక్షయ నామ సంవత్సరం వైశాఖ బహుళ విదియ). రుద్రుని తేజము, విష్ణువు సంరక్షణ, భూదేవి ఓర్పు లభించినవాడు కనుక గ్రహమండలమున స్థానము పొందెను.



**4) బుధుడు :** సోమునకును రోహిణి తారకు బుధుడు జన్మించెను (సౌమ్య నామ సంవత్సరం భాద్రపద శుద్ధ ఏకాదశి) బుధునికి వైరజకిని పురూరవుడు జన్మించెను.



**5) బృహస్పతి :** సురూప ఆంగీరసులకు "బృహస్పతి" జన్మించెను (సౌమ్య నామ సంవత్సరం ఆశ్వీయుజ శుద్ధ ద్వాదశి). ఇతని భార్య "తారాదేవి" ఇతడిని దేవతలకు గురువుని చేసెను కనుక ఇతడిని "గురుడు" అనెదరు.



**6) శుక్రుడు :** భృగు ప్రజాపతికిని ఉషనలకు సంతానం "ఉశనుడు" జన్మించెను. (మన్మథ నామ సంవత్సరం శ్రావణ శుద్ధ దశమి) కుచేలుని ధనమును హరించుటచే పరమేశ్వరుడు కోపించి అతడిని చంపుటకు రాగా ఉశనుడు తన యోగశక్తితో శివుని ఉదరమున ప్రవేశించెను. పరమేశ్వరుడు అతడిని శిశ్నము ద్వారా బయటకు విడిచెను. అతడు శుక్రము రూపమున విసర్జింపబడెను కనుక అతడిని

"శుక్రుడు" అనెదరు. అత్యంత మహా మంత్ర శక్తిని పొందినవాడు కనుక రాక్షసులు శుక్రుడిని వారి గురువుగా పొందిరి. నాటి నుండి "శుక్రచార్యునిగా" పేరుపొందెను. గ్రహమండలమున స్థానంపొందెను.



**7) శని :** సూర్యునికి ఛాయ దేవికిని కలిగిన సంతానమే "శని" (వికారి నామ సంవత్సరం మార్గశిర కృష్ణ నవమి). సూర్యునకు సంజ్ఞాదేవికిని "వైవస్వతుడు" "యముడు" "యమున" లు జన్మించెను. సూర్యుని తీక్షతను భరించలేక సంజ్ఞాదేవి తన నీడను (ఛాయను) తనకు బదులుగా నిలిపి పుట్టింటికి వెల్లిపోయెను. తరువాత ఛాయకు "శని" భగవానుడు జన్మించెను. యముడు ధర్మరాజు అను నామముతో పితృలోకపాలకుడయ్యేను శని గ్రహ పదవిని పొందెను. ఇతడు మానవ జీవితాలలో అత్యంత ప్రభావము చూపువాడు. త్రిమూర్తుల సైతం ముప్పుతిప్పలు పెట్టినటువంటివాడు. గ్రహమండలమున స్థానం పొందెను.



**8) రాహువు :** కశ్యప మహర్షికి సింహికకును "రాహువు" జన్మించెను. ఇతడు రాక్షల లక్షణములు కలవాడు కనుక రాక్షసునిగా పరిగణిస్తారు (రాక్షస నామ సంవత్సరం కృష్ణ చతుర్ధశి). క్షీర సాగర మథనంలొ లభించిన అమృతాన్ని మహావిష్ణువు "మోహిని"అను రూపముతో పంచు తున్నపుడు రాహువు దేవతల రూపం దాల్చి అమృతమును గ్రహించెను. సూర్య చంద్రులు చూసి విష్ణువుకి చెప్పగా తన చక్రముతో రాహువు తల

ఖండించెను అమృత ప్రభావంతో తల మొండెము జీవముతో ఉండుటచేత పాము శరీరం అతకబడింది.



**9) కేతువు :** విష్ణువుచే ఖండింపబడిన రాహువు శరీరముకు పాము తల తగిలించి కేతువు అని నామం పెట్టిరి. ఇతని భార్య పేరు చిత్రలేఖ. రాహు కేతువులు ఇద్దరు గ్రహమండలమున ఛాయగ్రహములుగా గుర్తింపు పొందిరి.

నవ గ్రహ దేవతల జన్మ వృత్తాంతములు చదివిన వారు ఆపదలు తొలిగి మహా యశస్సు పొందెదరు. ఆయుష్య ఆరోగ్యం సంకల్ప సాఫల్యము వారికి కలుగును. నవ గ్రహముల అనుగ్రహము కలిగి సర్వత్రా శుభమగును అని బ్రహ్మ పురాణమందు చెప్పబడినది.

## నవగ్రహాల తల్లిదండ్రులు, భార్యల పేర్లు

| | | |
|---|---|---|
| రవి (సూర్యుని) తల్లిదండ్రులు | - అతిది, కశ్యపులు | భార్యలు- ఉష, ఛాయ. |
| చంద్రుని తల్లిదండ్రులు | - అనసూయ, అత్రి మహర్షి | భార్య - రోహిణి. |
| కుజుని తల్లిదండ్రులు | - భూమి, భరద్వాజుడు | భార్య - శక్తి దేవి. |
| బుధుని తల్లిదండ్రులు | - తార, చంద్రుడు | భార్య - జ్ఞాన శక్తి దేవి. |
| గురుని తల్లిదండ్రులు | - తార, అంగీరసుడు | భార్య - తారాదేవి. |
| శుక్రుని తల్లిదండ్రులు | - ఉష, భ్రుగు | భార్య - సుకీర్తి దేవి. |
| శని తల్లిదండ్రులు | - ఛాయ, రవి | భార్య - జ్యేష్ట దేవి. |
| రాహువు తల్లిదండ్రులు | - సింహిక, కశ్యపుడు | భార్య - కరాళి దేవి. |
| కేతువు తల్లిదండ్రులు | - సింహిక, కశ్యపుడు | భార్య - చిత్రా దేవి. |

# గ్రహాల ప్రభావం..!

**ఎక్కడో ఉండే గ్రహాలు, నక్షత్రాల ఆజ్ఞతోనే మనకు మంచి చెడులు జరుగుతాయా..? మానవ జీవితంపై, రోజువారి ప్రవర్తనపై గ్రహాల ప్రభావం ఉంటుందా..? మొదలైన ప్రశ్నలకు సమాధానంగా మానవులపై ఒక్కో గ్రహం ఒక్కో తరహా ప్రభావం చూపుతాయి అని అంటారు.**



**చంద్ర గ్రహం :** చంద్రుడు మనసుకి అధిపతి. అందుకే మావన జీవితంపై ఎక్కువ ప్రభావం చూపేది ఈ గ్రహమే. అంతేకాదు జ్యోతిషంలో ముఖ్యమైన గ్రహం కూడా. ప్రకృతి వైపరీత్యాల జరుగుతున్నప్పుడు ముఖ్యంగా భూమిపై సముద్రంలో సంభవించే ఆటుపోట్లకి కారణం చంద్రుడే. అమావాస్య, పౌర్ణమి రోజుల్లో.. చంద్రుడు భూమికి దగ్గరగా వచ్చినపుడు సముద్రంలో కొన్ని వేల చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో నీటి బుగ్గ పైకి లేస్తుంది. అది పైకి బోర్లించిన గిన్నెలా సముద్ర జలాల్లో కనిపిస్తుంది. చంద్ర భ్రమణంతో పాటుగా ఆ నీటిబుగ్గ సముద్రంపై తేలియాడుతూ ప్రయాణిస్తుంది. దాని వల్లనే పోటు వచ్చి, సముద్ర జలాలు ఉప్పొంగుతాయి. దీనివల్ల చంద్రుడి ప్రభావం భూమిపై ఉందని నిరూపణ అయింది.

ఇందులోనే మరో ఉదాహరణ చెప్పుకోవచ్చు. మానవుని శరీరంలో కూడా నూటికి 70 శాతం నీరు ఉంటుంది. మనిషి ప్రవర్తనను నియంత్రించే

మెదడులో అయితే 96 శాతం నీరు ఉంటుంది. నీరే అనేది చంద్రుడిచే ఆకర్షించబడుతుంది. కాబట్టి అమావాస్య, పౌర్ణమి రోజుల్లో మానసిక వ్యాధిగ్రస్తులకి పిచ్చి ఎక్కువవుతుంది. చంద్రుడి వల్ల ప్రేరేపిం చబడతారు కాబట్టి వారిని ఇంగ్లీష్‌లో లూనాటిక్స్ (లూనార్ అంటే చంద్రుడు) అని వ్యవహరిస్తారు. అంటే ఇక్కడ మానవ మెదడుపై చంద్రుడి ప్రభావం నిజమని స్పష్టమవుతోంది.



**సూర్య గ్రహం :** సూర్యుడి కూడా మానవులపై అత్యంత ప్రభావం చూపే గ్రహమే. భూమిపై ఉన్న సమస్త ప్రాణికోటికి, వృక్ష కోటికి ఏకైక ఆధార భూతుడు. సూర్యుడి నుంచి వచ్చిన శక్తి రకరకాల రూపాల్లోకి మారి, భూమిలోకి, భూమి నుంచి మొక్కల్లోకి, మొక్కల నుంచి మనకి ప్రవహిస్తుంది. సూర్యుడి నుంచి వచ్చే రకరకాల రంగులు, ఫ్రీక్వెన్సీలు మొక్కలు, జంతువుల్లో రకరకాల మార్పుల్ని కలుగజేస్తాయి.

ప్రాణులకి ముఖ్యంగా మానవులకు అవసరమైన విటమిన్ 'డి' సూర్య కిరణాలతోనే వస్తుంది. అయితే, ప్రాణ హానిని కలుగజేసే అతి నీలలోహిత కిరణాలు (ఆల్ట్రా వయోలెట్ రేస్) కూడా సూర్యుడిలోనే పుడతాయి. ఈ క్రమంలోనే సూర్యుడి తాపం కనీసం 5 డిగ్రీలు అదనంగా పెరిగితే చాలు.. భూమి మీద జీవరాశికి ముప్పు ఏర్పడుతుంది. సూర్యుడు ప్రాణి కోటికి అత్యంత ముఖ్యమైన ఆధారం కాబట్టే సూర్యుడిని మన పూర్వీకులు 'సూర్య నారాయణుడు' అని నారాయణుడితో పోల్చారు. దీంతో మానవ జీవితంపై సూర్యుడి ప్రభావం తక్కువేమి కాదని చెప్పవచ్చు.



**సౌర కుటుంబం :** ఇతర గ్రహాల విషయానికి వస్తే... బుధుడు మొదలు.. వరుణుడు (యురేనస్) వరకు గ్రహాలన్నీ సౌర కుటుంబంలో భాగమే. గ్రహాలన్నీ పరస్పర అనుసంధానం చేసుకున్న వ్యవస్థ అని చెప్పవచ్చు. సౌర కుటుంబంలో ఉన్న ఏ ఒక్క గ్రహాన్ని తొలగించినా సౌర కుటుంబం మొత్తం కుప్పకూలిపోతుంది. సూర్యుడు తన అఖండమైన శక్తితో ఏ విధంగా తనకు దగ్గరగా ఉన్న బుధ గ్రహాన్ని ఆకర్షించి ఉంచాడో, అంతే శక్తివంతంగా తనకు అత్యంత సుదూరంలోని తోకచుక్కల్ని కూడా ఆకర్షించి, తన చుట్టూ పరిభ్రమించేలా చేసుకుంటున్నాడు. ఇదే క్రమంలో అత్యంత సాంద్రత కలిగిన గురుగ్రహం, నీటి కన్నా తక్కువ సాంద్రత కలిగిన శనిగ్రహం కూడా సూర్యుని చుట్టే పరిభ్రమిస్తున్నాయి.

అదే విధంగా ప్రతి గ్రహం ఒక్కొక్క ప్రత్యేకమైన రీతిలో ఫ్రీక్వెన్సీని విడుదల చేస్తూ ఉంటుంది. ఆయా గ్రహాల్లో ఉండే మూలకాల్ని బట్టి, అది విడుదల చేసే ఫ్రీక్వెన్సీ ఆధారపడి ఉంటుంది. సహజంగానే ఆ ఫ్రీక్వెన్సీ సౌర కుటుంబమంతా వ్యాపిస్తూ ఉంటుంది.

ఇలా గ్రహాలతో మానవ జీవితం ముడిపడి ఉంది. విశ్వంలో ఒక భాగమైపోయింది. విశ్వంలోని ప్రతి శక్తి, ఈ మానవ జీవిత యంత్రంపై ప్రభావం చూపుతూనే ఉంటుంది. మానవ శరీరంలో ఎన్నో మూలకాలున్నాయి. అవి అత్యంత సూక్ష్మమైన మోతాదుల్లో ఉన్నాయి. మానవ ప్రవర్తనపై ఈ మూలకాలన్నీ ప్రభావం చూపుతూనే ఉంటాయి. ఒక్కొక్క మూలకం పెరిగినా లేక తగ్గినా, అలా జరిగినా మానవుల భావోద్వేగాల్లో, ప్రవర్తనలో, ఆరోగ్యంలో మార్పు కనిపిస్తుంది. ఆయా మూలకాలు, ఆయా

గ్రహాల ఫ్రీక్వెన్సీ బట్టి ప్రభావితం అవుతాయి. దాన్ని బట్టే ఒక మానవ జీవితంలో ఉన్నత స్థితికి వెళ్ళడం లేదా పతనమవ్వడం వంటి పరిణా మాలు చోటు చేసుకుంటాయి.

గ్రహాలు తిరిగే కొద్ది మనిషి ఆలోచనలో, ప్రవర్తనలో మార్పును మనం స్పష్టంగా గమనించవచ్చు. ఉదయం ఉన్న మానసిక ప్రవర్తన మద్యాహ్నం ఉండకపోవచ్చు. అలాగే మద్యాహ్నంకు సాయంత్రంకు తేడా ఉంటుంది. ఆలోచనల్లో లేదా ప్రవర్తనలో మార్పు తీసుకురావడానికి పెద్ద పెద్ద కారణాలు అవసరం లేదు. మెదడులో ఒక చిన్న కణంలో సంభవించే మార్పు చాలు. కోపం రావడానికి గాని, ప్రేమ రావడానికి గాని. చంద్రుడు మన చేతిలో ఉన్న సీసాలో నీటిని ఏ విధంగాను ప్రభావితం చేయలేకపోవచ్చు. కాని, మెదడులో చెప్పుకోదగ్గ మార్పు తీసుకురాగలడు.

కుజు గ్రహం భూమి మీది గుండు సూదిని కదల్చలేకపోవచ్చు. కాని, అదే కుజుడు భూగర్భంలో ఉన్న అపారమైన ఇనుప ఖనిజ ద్రవాన్ని (లావా) ఖచ్చితంగా ప్రభావితం చేసి, భూకంపాలను సృష్టించగలడు. ఇవన్నీ గ్రహ ప్రభావితాలే. గ్రహాలకి, మానవ జీవితానికి ఉన్న సంబంధాన్ని, మనిషి జీవితం కూడా కొన్ని ప్రకృతి సూత్రాలకి అనుగుణంగా నడుచుకుంటుందనే భావనని నిరూపిస్తుంది జ్యోతిష శాస్త్రం.

మనకి తెలిసిన సైన్స్ ప్రకారం.. కేవలం గురుత్వాకర్షణ శక్తి మాత్రమే. భారీ గ్రహాలని, నక్షత్రాలని, తోకచుక్కల్ని ఒక చోట కట్టిపడేసి, ఒకదాని చుట్టూ ఒకటి తిరిగేలా చేయడం, పైగా ఒక్కొక్క ఖగోళ వస్తువుకి మధ్యలో కోట్ల కిలోమీటర్ల దూరం ఉన్నప్పటికీ అవన్నీ ఒకదానికొకటి ఆకర్షించబడి ఉంటాయి. అవన్నీ అలా బంధించబడి ఉండాలంటే కేవలం గురుత్వాకర్షణ శక్తి మాత్రం ఉంటే సరిపోదు. మధ్యలో ఇంకో పదార్థం ఉండి ఉండాలి. మనకి తెలియని ఆ పదార్థానికే కృష్ణద్రవ్యం (డార్క్ మేటర్) అని పేరు పెట్టారు మన ఖగోళ శాస్త్రవేత్తలు.



# మానవ జీవితం పైన గ్రహాలు చూపే ప్రభావం

***మనిషి ఆకారాన్ని బట్టి, మాట్లాడే తీరును బట్టి, ప్రవర్తించే తీరుని బట్టి ఏ గ్రహం ఆ సమయంలో అతనిపైన పనిచేస్తోందో తెలుసుకోవచ్చు అని, అలాగే జాతకంలోని బలీయమైన గ్రహాన్ని కూడా వెంటనే తెలుసుకోవచ్చు అంటారు.***

## సూర్యుడు

అధికారం చెలాయించటం, ఉన్నతులమని భావించటం మాత్రమే కాక అలాగే ప్రవర్తించటం, నాయకత్వ లక్షణాలు, పదిమందిలో తేలికగా గుర్తింపు ఉంటే వారు సూర్యుని ప్రభావంలో వారు.

## పూర్ణ చంద్రుడు

మృదుస్వభావం, జాలిపడేతత్త్వం, సహాయపడేతత్వం, మానవ సంబంధాలు.

## క్షీణ చంద్రుడు

ఏదీ తేల్చుకోలేని ఊగిసలాట ధోరణి, బలహీన మనస్తత్వం, పిచ్చి ధోరణి, విపరీత ఆలోచనలు.

## బుధుడు

తెలివి తేటలు, బహుముఖ ప్రజ్ఞ, హాస్య చతురత, కలుపుగోలుతనం.

## కుజుడు

ధైర్యం, దురుసుతనం, కయ్యానికి కాలుదువ్వటం, సాహసం, మొండి పట్టుదల.

## గురువు

ధార్మిక మనస్తత్వం, మంచితనం, సహాయపడే గుణం, అడ్డదారులు తొక్కని మనస్తత్వం, ముక్కుసూటితనం.

## శుక్రుడు

అందం, విలాసాలు, జల్సాలు, కళాకౌశలం, ఖరీదైన జీవితం.

## శని

కాయకష్టం చెయ్యటం, సోమరితనం, అశుభ్రంగా ఉండటం, పిరికితనం, చొరవలేకపోవటం.

## రాహు

మోసం, ఇతరుల సొమ్ము ఆశించటం, కుట్రలు, దౌర్జన్యాలు, సంప్రదాయాన్ని ప్రశ్నించటం, ఎదురు తిరగటం, వృధాగా తిప్పట, కాళ్ళరిగేలా తిరిగే ఉద్యోగాలు, అతి వాగుడు, గమ్యం లేని జీవితాలు గడపటం.

## కేతు

చాప కింద నీరులాంటి మనస్తత్వం, పిరికి ఆధ్యాత్మికత, మెట్ట వేదాంతము, ప్రమాదకర కుట్రలు చెయ్యటం, లేక ముచ్చు లాంటి ప్రవర్తన.

ఇక రెండు మూడు గ్రహాల కలయికలో ఆయా గుణాల సమ్మిళిత ప్రభావం మనిషి మీద ఉంటుంది అని కూడా అంటారు. ఆయా గ్రహాల దశలు జరిగేటప్పుడు పైన చెప్పిన లక్షణాలు ఎక్కువగా కనిపించటం, ఆలోచనలు అలాంటివే కలగటం, ప్రవర్తనలు కూడా అలాగే ఉండటం కొందరిలో గమనించవచ్చు.

కొందరు మనుషులను చూస్తే వారిలో కొన్ని గ్రహాల మూర్తీభావం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఇంకొందరి ప్రవర్తన చూస్తే వారికి ఏ దశ జరుగుతున్నదో అంచనా వెయ్యవచ్చు. అంతే కాదు కొన్ని కొన్ని శరీర భాగాల తీరును బట్టి కొన్ని గ్రహాల ప్రభావం చాలావరకూ అంచనా వెయ్యవచ్చు అని కొందరి భావన.



# గోచారము




గోచారము అంటే గోళాల యొక్క సంచారం ఆధారంగా జోస్యం చెప్పడం. గ్రహాలూ నిత్యము చలనము కలిగి ఉంటాయి. స్థిరముగా ఒక దగ్గర ఉండవు. అలా చలనము కలుగుతూ వివిధ రాశులలో తమతమ కక్ష్యలలో భ్రమణము చెందుతూ ఉంటాయి. దీనినే గోచారము అంటారు. చంద్రగోళం భూ ప్రదక్షణం చేసే సమయంలో ఒక్కొక్క రోజూ ఒక్కొక్క నక్షత్రం సమీపంలో కనిపిస్తుంది. చంద్రుడు సమీపంలోని నక్షత్రాన్ని జాతకుని జన్మ నక్షత్రం. ఈ నక్షత్రాలను వాటి ప్రక్కన కనిపించే నక్షత్రాలతో కలిపి ఒక ఊహా రేఖతో గుర్తించి వాటిని రాశులుగా గుర్తించారు. దీని ఆధారంగా చంద్రుని సమీపంలో ఉన్న నక్షత్రరాశిని జాతకుని రాశిగా వ్యవహరిస్తారు. సూర్యుడు ఒకరాశినుండి ఇంకొక రాశి మారటానిని సంక్రమణ లేక సంక్రాంతి అంటారు. సూర్యుడు జ్యోతిష్యశాస్త్రాన్ననుసరించి ఒక్కొక్క మాసంలో ఒక్కొక్క రాశిలో ప్రవేశిస్తాడు. సంవత్సర కాలంలో 12 రాశులలో సంచరిస్తాడు. తమిళులు తమ సంవత్సరాన్ని సూర్య సంచారాన్ని అను సరించి గణిస్తారు. సూర్యుడు మేషంలో ప్రవేశించే రోజు వారికి నూతన సంవత్సర ఆరంభం అవుతుంది. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినపుడు



హిందువులు పెద్ద పండుగగా ఆచరించే సంక్రాంతి పండుగ పర్వదినం. సంక్రాంతిని మకర సంక్రాంతి అనే పేరుతో కూడా పిలవడం హిందువుల అలవాటు. ఒక సంవత్సర కాలంలో 12 సంక్రాంతులు వస్తాయి. ఈ విధంగా సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని మొదలైన గ్రహాలు ఛాయా గ్రహాలుగా జ్యోతిష్యశాస్త్రాలలో పిలవబడే రాహువు, కేతువు యొక్క సంచారము జ్యోతిష్య గణనలో భాగాలు. ఇవి కాక తెలుగు, మలయాళ జ్యోతిష్కులు శని గ్రహ ఉపగ్రహాలలో పెద్దదైన మాందిని శని పుత్రునిగా వ్యవహరిస్తూ గణనలోకి తీసుకుంటారు. తమిళ జ్యోతిష్యంలో మాంది గణనలోకి తీసుకొనే ఆచారం లేదు. గ్రహాలు సూర్యుని చుట్టూ ప్రదక్షిణ చేసే కాలాన్ని 12 రోజులుగా విభజించి జ్యోతిష్య గణన చేస్తారు. వీటి ఆధారంగా గోచార ఫలితాలు ఉంటాయి.







ఒరిస్సాలోని కోణార్క్ ఆలయం మరియు తమిళనాడులోని కుంభకోణం వద్దనున్న సూర్యనార్ కోవిల్ సూర్యుడికి సంబంధించి దేశంలో రెండు ముఖ్య ఆలయాలు.

# గోచారము ప్రకారము గ్రహాలకు శుభస్థానాలు

జాతకులు జన్మించిన జన్మరాశి ఆధారముగా గోచారము ద్వారా ఫలితములు తెలుసుకోవచ్చు. ఒకవేళ జన్మరాశి తెలియనివారికి పేరును బట్టి నామ నక్షత్రము తెలుసుకొని నామ రాశిని తెలుసుకొని కొంతవరకు ఫలితములు తెలుసుకొనవచ్చును.

గ్రహబలము ఎంత బాగున్ననూ, గోచారము అనుకూలముగా లేనిచో మానవులు శుభ ఫలితములను పొందజాలరు. గోచారములో గ్రహములు జన్మరాశి నుండి వివిధ స్థానములలో ఉన్నప్పుడు ఫలితములు ఈ విధంగా ఉంటాయి అని అంటారు.

**సూర్యుడు** జన్మరాశి నుండి 3 6 10 11 స్థానములలోనూ

**చంద్రుడు** 1 3 6 7 10 11 స్థానములలోనూ

**బుధుడు** 2 4 6 8 10 11 స్థానములలోనూ

**గురుడు** 2 5 7 9 11 స్థానములలోనూ

**శుక్రుడు** 1 2 3 4 5 8 11 12 స్థానములలోనూ

**కుజ, శని, రాహువు, కేతువు**లు 3 6 11 స్థానములలోనూ ఉన్నప్పుడు శుభ ఫలితములు కలుగ చేయుదురు.

గోచార రీత్యా జన్మ రాశి నుండి పన్నెండు రాశులలో నవగ్రహములు సంచరించేటపుడు కలుగు ఫలితాలు ఈ విధముగా ఉంటాయి.

## సూర్యుడు :

స్థానభ్రష్టం, భయం, సంపదా, మానభంగం, మహోద్భయం
శత్రు క్షయం, వృధా, రోగం, దుఃఖం, సిద్ధి, ధనాదనే
క్రమేణ జన్మ రాష్యాది కురుతేతే పద్మ భాంధవః

**తాత్పర్యము :** సూర్యుడు జన్మ రాశిలో సంచరించునపుడు స్థాన మార్పిడి 2 వ రాశికి వచ్చినపుడు భయమును, 3 సంపదను, 4 మానహానిని, 5 విశేష భయమును, 6 శత్రు నాశనం, 7 దుఃఖము, 8 రోగము, 9 విచారమును, 10 కార్య సిద్ధిని, 11 ధన లాభమును, 12 ధన వ్యయమును కల్గించును.

## చంద్రుడు :

అన్నవృద్ధిం, ధన క్షీణం, ద్రవ్య లాభం, మహోద్గతం
కార్యనాశంచ, విత్తంచ, ద్రవ్యలాభంచ. మృత్యుచః
నృపక్రోధం, సుఖం, లాభం, ధనక్షీణంటు చంద్రమా

**తాత్పర్యము :** చంద్రుడు 12 రాశులలో సంచరించునపుడు 1 భోజన సౌఖ్యమును, 2 ధన క్షయమును, 3 ద్రవ్యలాభమును, 4 విశేష రోగ భయమును, 5 కార్య నాశనము, 6 ధనరాబడిని, 7 ద్రవ్య లాభమును, 8 మరణ సమాన ఫలితములను, 9 రాజ కోపమును, 10 సౌఖ్యమును, 11 లాభమును, 12 ధన నష్టమును కలిగించుచున్నాడు.

## కుజుడు :

ఖేదం, దౌర్భాగ్యం, సౌభాగ్యే, రిపుపీడాం , రిపోర్భయం
అర్ధసిద్ధి, మనర్ధంచ, శస్త్రభాదాం,ధనక్షయం
అశోకంచ, ధనం, క్రూర క్రమేణా కురుతే కుజః

**తాత్పర్యము :** కుజుడు ద్వాదశ రాశులలో చరించుచున్నప్పుడు 1 దుఃఖము, 2 భాగ్యహాని, 3 సౌభాగ్యము, 4 శత్రువుల వలన భాధలు, 5 శత్రుభయము,

6 ద్రవ్యసిద్ధి, 7 కార్యహాని, 8 శస్త్రభాద గాయములు ఏర్పడుట, 9 ధనవ్యయము, 10 దుఃఖనాశనము, 11 ధన యోగము, 12 క్రూరత్వమును కలుగ జేయును.

## బుధుడు :

**బంధనం, హేమలాభంచ. రిపుపీడం, రిపుక్షయం**
**దారిద్ర్యం, భూషణం, లాభం, మనసిద్ధిం, ధనక్షయం**
**ప్రమోదం, మోదసంహారం, బుదః కుర్యాత్క్రమాద్గతః**

**తాత్పర్యము:** బుధుడు పన్నెండు రాశులలో సంచరిచు సమయములలో 1 బంధనము, 2 సువర్ణ లాభము, 3 శత్రుభాధలు, 4 శత్రువుల నాశనము, 5 దరిద్రము, 6 ఆభరణ లాభము, 7 లాభములను, 8 సంతోషము, 9 ధననష్టము, 10 ప్రమోదము, 11 మోదమును, 12 నాశనము కలిగించును.

## గురుడు :

**దేశ త్యాగం, విత్తం లాభం, అనర్ధం, ధన నాశనం,**
**సంపద, క్లేశం, ఆరోగ్యం, ధన హానిం, ధనాగమం,**
**పీడనం, లాభ నష్టంచా క్రమేణ కురుతే గురుః**

**తాత్పర్యము :** గురుడు ద్వాదశ రాశులలో సంచరించు సమయములో 1 దేశ త్యాగము, 2 ధన లాభము, 3 కార్య హాని, 4 ధన నాశనము, 5 సంపద, 6 దుఃఖము, 7 ఆరోగ్యము, 8 ధన హాని, 9 ధనాగమము, 10 ఆయాసము, 11 లాభములను, 12 నష్టములను కల్గించుచున్నాడు.

## శుక్రుడు :

**ఆరోగ్యం భూషణం లాభం రతించ ప్రియదర్శనం**
**మానహానిం మహాద్రోగం భూలాభం ధాన్యవర్ధనం**
**ప్రమోదంచ ధనంచైవ సంతోషం కురుతే భ్రుగు**

**తాత్పర్యము :** శుక్రుడు ద్వాదశ రాశులలో సంచరించేటప్పుడు 1 ఆరోగ్యము,

2 అలంకారము, 3 లాభము, 4 రతిసౌఖ్యము, 5 మిత్రదర్శనము, 6 మానహాని, 7 విశేషరోగము, 8 భూలాభము, 9 ధాన్యవృద్ధి, 10 ప్రమోదము, 11 ధనము, 12 సంతోషములను కలుగ జేయును.

## శని :

**విపత్తి హానిం సంపత్తి కుక్షిరోగం సుతక్షయం**
**లక్ష్మీకరం మహర్దైన్యం మరణం దేహ శోషణం**
**బంధనం లాభ నష్టంచ క్రమేణ కురుతే శని:**

**తాత్పర్యము :** శని పన్నెండు రాశులలో సంచారము చేయునపుడు 1 ఆపదలను, 2 హానిని, 3 సంపదను, 4 గర్భసంభంద రోగములను, 5 సంతానమునకు కష్టములను నాశనమును, 6 మహా ఐశ్వర్యమును, 7 మహా దరిద్రమును, 8 మరణ సమాన ఫలితములను, 9 దేహ శోషణమును, 10 బంధనమును, 11 లాభమును, 12 అనేక విధాల నష్టములను కలిగించుచున్నాడు.

## రాహు, కేతువులు :

**రాహోర్జన్మ గతో భయంచ కలహం సౌభాగ్య మాన**
**క్షయే, విత్తభ్రంశం మహాత్సుఖే రిపుభయం చాష్టేచ**
**చోరాద్భయం శత్రోర్వృద్ధి ధనక్షయం శుభ ఫలం**
**భృత్యప్యనాశం వ్యయేకుర్యాత్ తత్ఫలమేవ**
**కేతు రనిశం చేత్యాహు గార్గ్యాతయః**

**తాత్పర్యము :** రాహు కేతు గ్రహములు జన్మరాశి నుండి పన్నెండు రాశులలో సంచరించు సమయమున 1 భయమును, 2 కలహాలను, 3 సౌభాగ్యమును, 4 మానహానిని, 5 ధన నష్టములను, 6 మహా సుఖములను, 7 శత్రువుల వలన భయమును, 8 చౌర భయమును, 9 శత్రువృద్ధిని, 10 ధనక్షయమును, 11 శుభ ఫలములను, 12 భృత్య నాశనమును కలిగించుదురు. 

# గ్రహశాంతి ఎవరు చేయించుకోవాలి?

“నవగ్రహాలనేవి నక్షత్రాల, రాశులపై అధిపతులని జ్యోతిష్య శాస్త్రము చెప్తుంది. మనుషులకు జీవనములో ఏదైనా తేడాలొచ్చినా, ఒడుదుడుకులు ఏర్పడినపుడు గ్రహగతులు బాగులేవని గ్రహశాంతి చేయాలని పెద్దలు చెప్తారు. ఆ విధంగా గ్రహశాంతి చేయించడం చేస్తారు. గ్రహశాంతి ఎవరికి అవసరం? గ్రహశాంతిలో ఏం చేస్తారు? అనే విషయాలపై నిపుణులు ఈ విధంగా సూచిస్తున్నారు.



మనకు నవగ్రహాలున్నాయి. నవ గ్రహాల్లో అగ్రజుడు సూర్యుడు బుద్ధిని వికసింపజేస్తాడు. మనస్సును స్థిరపరుస్తాడు. ధైర్యాన్ని ప్రసాదిస్తాడు.

కుజుడికి మనస్తాపం కలిగించే లక్షణాలున్నాయి. ఈయన్ని ప్రార్థిస్తే మనస్తాపానికి గల కారకాలను దూరం చేస్తాడు. ప్రశాంతతను ఇస్తాడు.

నవగ్రహాల్లో మూడోవాడైన రాహువు కంటి బలాన్ని తగ్గిస్తాడు. శరీరంలోని మాంసంలో దోషాన్ని ఏర్పరుస్తాడు. ఈయన్ని పూజిస్తే కంటికి బలాన్ని కలుగజేస్తాడు. శరీర మాంసంలోని దోషాలను నివృత్తి చేస్తాడు.

బృహస్పతిగా పిలువబడే గురువును ఆరాధిస్తే.. వృత్తి, ఉద్యోగాల్లో నైపుణ్యతను ప్రసాదిస్తాడు. మెదడును చురుకుగా ఉంచుతాడు.

శని ఉత్తముడు. ఆయన జీవితంలో మనకు ఎన్నో పాఠాలను నేర్పుతాడు. ఆయన్ని పూజిస్తే.. ఇలా చేయొద్దు.. ఇలా చేయమని జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. సరైన మార్గాన్ని అనుసరించమంటాడు. ఆ మార్గాన్ని చూపెడతాడు.

బుధ గ్రహం బుద్ధిమంతుడు. మనం చేస్తున్న ఉద్యోగంలో కొత్త మెలకువలను నేర్పించగల సమర్థుడు. ఇతనిని పూజిస్తే మాట్లాడటంలో నైపుణ్యాన్ని, వ్యాపారంలో అభివృద్ధిని చేకూరుస్తాడు. ధనార్జనకు శక్తిమంతుడు.

కేతువును పూజిస్తే.. తీర్థయాత్రలకు వెళ్తారు. లౌకిక ప్రపంచానికి కొద్ది దూరంగా ఉందామని.. దేవతాపూజలో నిమగ్నం చేసే ఆలోచనలను ఇస్తాడు.

శుక్రుడు శుక్రాచార్యుడు. ఈయన్ని పూజిస్తే దాంపత్య జీవితంలో అన్యోన్యతను పెంచుతాడు. సంతానాన్ని ఇవ్వగలుగుతాడు.



గ్రహాల అనుకూలత తగ్గిన పరిస్థితుల్లో శాంతి చేయించాలి. ఆర్థిక, మానసిక, శారీరక ఇబ్బందులు తలెత్తితే.. గ్రహదోషమని భావించాలి. అయితే ఏ గ్రహం వల్ల అశాంతి కలిగిందనే విషయాన్ని జ్యోతిష్యశాస్త్రంలో నిపుణులైన వారిని సంప్రదించి వారి సూచనల మేరకు, ఆ గ్రహానికి శాంతి చేయించుకోవడమే గ్రహశాంతి అంటారు. ఈ గ్రహశాంతి వలన గ్రహదోషాలు తొలగి స్వస్థత చేకూరుతుందని నమ్మకము.



**శని జయంతి రోజు భక్తులందరూ స్వామికి తైలాభిషేకం చేసి శాంతి పూజలు నిర్వహించాలి. తాంత్రిక విద్యల ప్రభావం నుంచి రక్షణ కోసం హోమం లేదా యజ్ఞాన్ని జరిపించాలి. చీమలకు బెల్లాన్ని ఆహారంగా ఇవ్వాలి.**



# హోమంలో ఏ సమిథలను ఉపయోగిస్తే ఏ గ్రహ దోషం నివారించబడుతుంది?

*శారీరక, మానసిక లోపాలకు శాంతిగా ఔషధులు, దానాలు, జపాలు, హోమాలు చేయడం భారతీయ సంప్రదాయంగా ఉంది. వాటిలో ముఖ్యమైనవి హోమ ప్రక్రియ జ్యోతిర్వైద్యంగా వినియోగపడుతుంది. హోమంలో నవగ్రహ సమిధలు ఉపయోగించటంవలన ఒక్కో సమిధ వలన ఆయా గ్రహం శాంతించి ఒక్కోరోగం నివారించబడుతుంది.*

ఒక్కో సమిధ ఒక్కో గ్రహానికి సంబంధించినదై వుంటుంది. అంటే అన్ని గ్రహాలూ సమతుల్య స్థితిలో వుంటేనే సృష్టి సక్రమంగా వుంటుంది. కొన్నిసార్లు వాతావరణం సానుకూలంగా ఉండదు. వ్యాధులు సోకటం, వర్షాలు సక్రమంగా పడకపోవటం లాంటివి జరుగుతాయి. ఏ ఒక్క గ్రహానికి సంబంధించిన శక్తి (ఎనర్జీ) భూమి మీద తక్కువగా వున్నా అసమతుల్యతలు ఏర్పడతాయి. అందుకే ఆయా గ్రహాలకు సంబంధించిన మూలికలు, ధాన్యాలతో ఇతర వస్తువులతో హోమం చేస్తారు. స్థూలంగా ఇదీ హోమం చేయటంలో ఉద్దేశ్యం.



హోమ ఫలాలు సమిష్టిగానే కాకుండా వ్యక్తిగతంగా కూడా అందుకునే విధంగా జ్యోతిష పండితులు కొన్ని సూచనలు చేశారు. ఎవరైనా ఒక వ్యక్తిపై నవగ్రహాలలో ఏదో ఒక గ్రహప్రభావం తక్కువగా వుంటే దానికి సంబంధించిన రంగంలో లేదా విషయంలో ఆ వ్యక్తికి వ్యతిరేక ఫలితాలు వస్తాయి.

ఏ వ్యక్తి అయితే వ్యతిరేక ఫలితాలను అనుభవిస్తున్నాడో ఆ వ్యక్తి ఇంట్లో హోమం చేయిస్తే చక్కటి ఫలితాలు వస్తాయి.

హోమం పొగ కంటిలోకి పోవడం వలన కంటిలో ఉండే నలత కంటిలో నుండి నీరు రూపంలో వెళ్లిపోతుంది. హోమాగ్ని సెగ మోకాళ్ళకు తాకటం వలన మోకాళ్ళ నొప్పులు రాకుండా నివారించుకోవచ్చు. గ్రహాలకు వేరు వేరు వృక్షాల సమిధలతో హోమం చేస్తే శుద్ధమైన ఆరోగ్యవంతులవుతారు.

**రవి :** తెల్లజిల్లేడు వాత, కఫ వ్యాధలను తగ్గిస్తుంది. తెల్లజిల్లేడు సమిధలతో ఇంట్లో హోమం చేస్తే వాస్తుదోషాలు నివారణ అవుతాయి. కళ్ళకి సంబం ధించిన అనారోగ్యాలు నయమవుతాయి. కోప స్వభావాలు తగ్గుతాయి. తలనొప్పి భాధలు ఉండవు. ఆయుర్వేదం ప్రకారం అర్కలో కుష్టు వ్యాధిని నయం చేసే శక్తి వుంది.

**చంద్రుడు :** మోదుగ సమిధలతో హోమం చేస్తే మానసిక సమస్యలు ఉండవు. ఆలోచనా విధానంలో మార్పులుంటాయి. సుఖవ్యాధులు దరిచేరవు. మోదుగాకును మెత్తగా నూరి పాలతో తాగిన స్త్రీ లకు ఋతు సంబంధ సమస్యలు, గర్భ సంబంధ సమస్యలు ఉండవు. వైద్య పరంగా చూస్తే జీర్ణ వ్యవస్థను అద్భుతంగా పునరుజ్జీవింప చేసే శక్తి మోదుగకు వుంది. రక్తాన్ని శుభ్రపరుస్తుంది.

**కుజుడు :** చంద్ర సమిధతో హోమం చేస్తే ఎర్ర రక్త కణాల ఇబ్బందులు, ఎముకల బలహీనత ఇబ్బందులను అరికడుతుంది. పచ్చి పోక చెక్కలు కషాయం పెట్టి సేవిస్తే మధుమేహం, కోప స్వభావాలు తగ్గుతాయి.

**బుధుడు :** ఉత్తరేణి సమిధను హోమంలో ఉపయోగిస్తే చర్మ వ్యాధులు తగ్గుతాయి. జీర్ణ సంబంధ సమస్యలు ఉండవు. ఉత్తరేణి పూల్లతో గాని వేరుతో గాని రోజూ దంతధావనం చేసుకుంటే దంత దోషాలు తొలగి పోతాయి. ఉత్తరేణి ఆకులు, గింజలు పొగ వేసి పీలిస్తే దీర్ఘ కాలంగా ఉన్న దగ్గు, జలుబు, ఆయాసం తగ్గుతాయి.

**గురువు :** రావి సమిధలతో హోమం చేస్తే సంతాన దోషాలు తొలగి పోతాయి. రావి చెక్క కాషాయాన్ని తేనెలో కలిపి తీసుకుంటే వాత రక్త దోషాలు తగ్గుతాయి. నోటిపూత పోతుంది. రావి చెక్క కాషాయాన్నిరోజు తీసుకుంటే ఆహారం త్వరగా జీర్ణం అవుతుంది. కాలేయ సమస్యలు ఉండవు. వివిధ కఫ దోషాలను రూపుమాపుతుందని ఆయుర్వేదశాస్త్రం తెలుపుతుంది.

**శుక్రుడు :** మేడి చెట్టు సమిదలతో హోమంచేస్తే వివాహ సమస్యలు, వైవాహిక సంబంధ సమస్యలు ఉండవు. గురు దత్తాత్రేయులవారికి అత్యంత ప్రీతికరమైన వృక్షం ఔదుంబర వృక్షం (మేడి చెట్టు) దత్తాత్రేయుల వారు ఎల్లప్పుడు సుక్ష్మ రూపంలో సుప్రతిష్టితులై ఈ వృక్ష మూలమునందు ఉంటారు. దీని కాయలు, చెట్టు మొదలు నుండి తీసిన రసం వాడితే మధుమేహవ్యాధి నివారించబడుతుంది. దీని విత్తనాలు పొడి చేసి తేనెతో కలిపి తీసుకున్నా మధుమేహం తగ్గిపోతుంది

**శని :** జమ్మి సమిధలతో హోమం చేస్తే అప మృత్యుభయం తొలగి పోతుంది. దీర్ఘకాల అనారోగ్యాలు తొలగిపోతాయి. శమీ వృక్ష గాలి

శరీరానికి తగిలిన శారీరక ఇబ్బందులు తొలగిపోతాయి. ప్రతిరోజు శమీ వృక్షానికి ప్రదక్షిణ చేసిన దీర్ఘకాల అనారోగ్యాలు తొలగిపోతాయి.

**రాహువు :** గరికలతో హోమం చేస్తే ఇంటిలో నరదృష్టి తొలగిపోయి సర్ప సంభంద దోషాలు తొలగిపోతాయి. గరిక రసాన్ని గజ్జి, చర్మంపైన ఉన్న కురుపులపై పెట్టిన చర్మ రోగాలు నివారించబడతాయి. దెబ్బ తగిలి రక్తం కారిపోతుంటే గరిక రసాన్ని పిండితే రక్తం ఆగిపోతుంది.

**కేతువు :** దర్భలతో హోమం చేస్తే కాలసర్ప దోషాలు తొలగిపోతాయి. మూర్ఛ రోగాలను తగ్గిస్తుంది.



వ్యక్తిగత జాతకంలో ఏవైనా గ్రహ సమస్యలు ఉన్నను, జాతక వివరాలు తెలియక దైనందిన జీవితంలో ఉద్యోగ, వ్యాపార, కుటుంబ, దాంపత్య, శత్రుపీడ, నరదృష్టి, ఆరోగ్య సమస్యలు, సంతాన సమస్యలు, కోర్టు వ్యవహార చిక్కులు, వాస్తు లోపాలు, అధికార హోదా పెరుగుటకు మొదలైన వాటికి హోమ శాంతి ప్రక్రియల హోమం చేసుకుంటే శుభం కలుగుతుంది అని పెద్దల భావన.



# రాజయోగాలను ప్రసాదించే గ్రహాల ఆధిపత్యం



నవగ్రహాల్లో ఐదు, రెండు, తొమ్మిది, పది మొదలైన స్థానాలలో ఏ గ్రహమైనా ఆధిపత్యం వహిస్తే రాజయోగాలను అందిస్తారని శాస్త్రం చెబుతోంది. అందులో రెండో స్థానం కుటుంబాధిపత్యం, ఐదో స్థానం త్రికోణస్థానంగా వ్యవహరించటంతో పాటు కుటుంబంలో మంచి అభివృద్ధి అవకాశాలు లభిస్తాయి.

పదకొండో స్థానం ధనాధిపత్యం, పదో స్థానంలో లాభాధిపత్యం వహించటంతో.. వృత్తుల్లో మంచి అభివృద్ధిని పొందుతారు. మంచి ఆనందదాయకమైన జీవితాన్నికూడా పొందుతారు. అదేసమయంలో ఈ జాతకుల గ్రహాలు నీచస్థానాలను పొందకూడదు.

రాహు 3, 5, 10, 11 స్థానాల్లో కేంద్ర, కోణాలలో ఆధిపత్యం వహిస్తే మంచి ఫలితాలుంటాయి. రాహు, కేతులు పాప గ్రహాలైన ఒక్కో సమయంలో వాటి ఆధిపత్యం వలన మంచి యోగాలు లభిస్తాయి. కేతు మూడోస్థానంలో ఉంటే మంచి ఫలితాలను ఆశించవచ్చును.

అయితే ఐదు, తొమ్మిది స్థానాల్లో ఉంటే కీడును కలిగిస్తాడు. పదో స్థానంలో తప్ప మిగిలిన కేంద్రస్థానాల్లో రాహు ఆధిపత్యం వహిస్తే మంచి ఫలితాలు ఉండవు. రాహు, కేతులు 3, 6, 10, 11 స్థానాల్లో ఉంటే

మంచి అభివృద్ధి అవకాశాలు లభిస్తాయని గ్రహించాలి. శుక్ర, చంద్రులు మూడో స్థానంలో ఉంటే శుక్రదశా కారణంగా మంచి రాజయోగాలను ప్రసాదిస్తాడు. ఈ కాలంలో కీర్తి ప్రతిష్టలు చేరుతాయి. పదో స్థానంలో ఆధిపత్యంతో పాటు 3, 11 స్థానాల్లో గ్రహాధిపత్యం ఉంటే సుమారైన ఫలితాలు కలుగుతాయి. సాధారణంగా 9వ స్థానంలో ఆధిపతిగా ఎనిమిదో స్థానంలో ఉంటే కీడైన ఫలితాలు కలుగుతాయి.

గురు ఎనిమిదో స్థానంలో ఉంటే మంచి యోగాలను అందిస్తాడు. తొమ్మిదో స్థానంలో ఆధిపత్యం వహిస్తూ అష్టమాధిపత్యం కారణంగా లేదా గ్రహాల దృష్టి ప్రభావం చేత దశాకాలంలో మంచి ఫలితాలు అందజేస్తారు.

10,11 స్థానాల్లో అధిపతులుగా ఉన్న గ్రహాలు వేరొక గ్రహ సంయుక్తంతోనూ లేదా దృష్టి ప్రభావంతో లాభాధిపతి దశాకాలంలో మంచి ఫలితాలను అందిస్తారు. పదో స్థానాధిపతి దశాకాలంలో శుభఫలాలు, అశుభఫలాలు సంయుక్తంగా కలుగుతాయి. శని గ్రహం 3, 9 స్థానాల్లో ఉంటే మంచి ఫలితాలను అందజేస్తాడు.

అంతేగాక వారి స్థానాల్లో 9వ స్థానంలో ఆధిపత్యం వహించినా మంచి లాభాలు లభిస్తాయి. 5, 10 స్థానాలకు చెందిన అధిపతులు 10వ స్థానంలో ఉంటే కీర్తి, అధికారయుక్తంగా జీవిస్తారు. 9, 10 స్థానాలకు చెందిన అధిపతులు లగ్నంతో పాటు 7వ స్థానంలో ఉంటే ఐశ్వర్యం, కీర్తి ప్రతిష్టలు చేకూరుతాయి.

గురు, చంద్రులు కటంకంలోనూ, సూర్య, శని, కుజ స్థానాలు ఉచ్ఛస్థానం పొందటం ద్వారా బంగారం, గృహనిర్మాణం, వాహనాలు వంటి నూతన వస్త్రాలను చేర్చటంలో ఆసక్తి వహిస్తారు.



# గ్రహ దోషాలకు చేయవల్సిన దానాలు

నవగ్రహ శాంతికి సంబంధించి పూజాది కార్యక్రమాలు చేసేవారు ఆయా ప్రత్యేక వస్తువులతో పూజని నిర్వహించాలి. పూజలో గ్రహ శాంతికి దోష నివారణకు దానాలు చేయాలి. ఇలా చేసిన వారికి దోష నివారణ జరిగి సకల శుభాలు కలుగుతాయి. కోరిన కోర్కెలు నెరవేరతాయి అని చెప్పబడుతుంది.



**రవిగ్రహ దోషం** ఉన్నవారు గోధుమపిండి, గోధుమరొట్టె, ఆరెంజ్ వస్త్రాలు, రాగి, రాగి జావ, మిరియాలు వస్తువులు దానం చేయవచ్చును.

**చంద్రగ్రహ దోషం** ఉన్నవారు అన్నదానం, బియ్యం, పాలు, నీళ్ళు, తెలుపు కాటన్ వస్త్రాలు, వెండి వస్తువులు, పొంగలి మొదలగునవి దానం చేయవచ్చును.

**కుజగ్రహ దోషం** ఉన్నవారు కందిపప్పు, మిరపకాయలు, పచ్చి ఖర్జూర, డేట్స్ సిరప్, బెల్ల, ఎరుపు వస్త్రాలు, వ్యవసాయ పనిముట్లు, శుక్రుడితో కలిసిన సోదరికి వస్త్రాభరణాలు బహుమతిగా ఇవ్వటం, ఎరుపు రంగు వస్త్రాలు మొదలగునవి దానం చేయటం.

**బుధగ్రహ దోషం** ఉన్నవారు పెసరపప్పు, ఆకుకూరలు, కూరగాయలు, ఆకుపచ్చ వస్త్రాలు, విద్యార్థులకు విద్యా సంబంధమైన వస్తువులు, పుస్తకాలు ఆవుకి పచ్చగడ్డి వెయ్యటం మొదలగునవి దానం చేయవచ్చును.

**గురు గ్రహ దోషం** ఉన్నవారు పండ్లు, తీపి పదార్థాలు,శెనగ గుగ్గిళ్ళు, ధార్మిక కార్యక్రమాల కోసం దానం, విద్యా, వైద్యం, భోజనం, పసుపు రంగు వస్త్రాలు, తియ్యని పానియాలు, బఠాని గుగ్గిళ్ళు, దానం చేయవచ్చును.

**శుక్రగ్రహ దోషం** ఉన్నవారు స్త్రీ లకు సంబందించిన బొట్టు బిళ్ళలు, జడ పిన్నులు, జడ రబ్బర్లు, గోరింటాకు, గోళ్ళ రంగులు, సెంటు, అద్దాలు, దువ్వెనలు, పౌడర్లు, పూలు, డ్రై ఫ్రూట్స్, బొబ్బర్లు, అలచందలు, రంగు రంగుల వస్త్రాలు మొదలగునవి దాన చేయవచ్చును.

**శనిగ్రహ దోషం** ఉన్నవారు వంటనూనె, నువ్వులు, ఇనుము, దేవా లయాలకు సిమెంట్, నీలిరంగు వస్త్రాలు, కార్మికులకు, పనిచేసేవారికి వస్తు, ధన రూపంలో దానం చేయవచ్చును.



**రాహుగ్రహ దోషం** ఉన్నవారు మినప సున్నిండలు, ఇడ్లీలు, మినపగారెలు, తడిపి నాబెట్టిన మినుములు ఆవుకి పెట్టటం, పొగరంగు వస్త్రాలు దానం చేయవచ్చును.

**కేతుగ్రహ దోషం** ఉన్నవారు పశువు లకు, పక్షులకు, చేపలకు ఆహారం పెట్టటం, ఉలవల పొడిని ఆవులకి పెట్టటం, విచిత్ర వర్ణ వస్తువులు దానం చేయవచ్చును.



# నవగ్రహ దోషాల నివారణకు స్నానాలు



*గ్రహదోషం అనగానే వాటికి శాంతి చేయించడానికి పలు రకాల పద్ధతులను అవలంభిస్తుంటారు. అయితే ఈ గ్రహదోషాలు తొలగి పోవడానికి సాంప్రదాయంగా నిర్వహించే పూజలే కాదు, వివిధ రకాల స్నానాలను గురించి కూడా శాస్త్రాలు చెబుతున్నాయి. స్నానౌషధములు సిద్ధౌషధ సేవల వల్ల వ్యాధులు, మంత్ర జపము వల్ల సకల భయం తీరునట్లుగా ఔషధస్నాన విధానం వల్ల గ్రహదోషములు నశించును.*

## సూర్య గ్రహ దోష నివారణకు

కుంకుమ పువ్వు, మణిశిల, ఏలుకలు, దేవదారు, వట్టివేళ్ళు, యష్టిమధుకము, ఎర్ర పుష్పాలు, ఎర్రగన్నేరు పువ్వులు.. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఈ నీటితో స్నానం చేయాలి. సూర్య గ్రహ దోష నివారణకు గాను సూర్యున్ని పూజించుట, ఆదిత్య హృదయం పారాయణ

చేయుటకు, కెంపు,(మాణిక్యము) ధరించుట, సూర్యునకు గోధుములు, బెల్లం, కంచు, గుర్రము, రక్త చందనం, పద్మములు, ఆదివారం, దానం చేస్తే.. రవి వలన కలిగిన దోషాలు తొలుగును.

కంచుతో చేయబడిన ఉంగరం ధరించుట వల్ల మంజిష్టం గజ మదం, కుంకుమ పువ్వు రక్త చందనములను రాగి పాత్రయందలి నీటిలో కలిపి ఆ రాగి పాత్ర యందలి నీటితో స్నానము చేసిన దోష నివృత్తి కలుగుతుంది. రాగి ఉంగరము ధరించడం కూడా మంచిదే.

శుభ తిథి గల ఆదివారము రోజున సూర్యుని **ఓం-హ్రాం-హ్రీం-హ్రౌం-సః సూర్యాయ నమః** అను మూలమంత్రమును 40 రోజులలో 6 వేలు జపము పూర్తి చేసిన సూర్య సంబంధమైన దోషాలు తొలగిపోతాయి అని చెప్పబడుతుంది.

## చంద్ర గ్రహ దోష నివారణకు

గో మూత్రం, ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు పేడ, ఆవు నెయ్యి, శంఖములు, మంచి గంధములు, స్పటికము.. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయాలి. చంద్రగ్రహ దోష నివారణకు చంద్రుని పూజించుట, దుర్గాదేవిని ఉపాసించుట, బియ్యం దానం చేయుట, ముత్యం ఉంగరాన్ని ధరించుటగాని, మాలగా వేసుకొనుట గాని చేయాలి. సీసం, తెల్లని ఆవు, ముత్యములు, తెల్లని వస్త్రం నేయితో నింపిన కలశం, ఎద్దులలో ఎదేని ఒకటి సోమవారం దానము చేసినచో చంద్రునకు సంబంధించిన దోషం పోవును. వట్టివేర్లు, దిరిసెన గంధం, కుంకుమ పువ్వు, రక్త చందనము కలిపి శంఖములోపోసిన నీటితో స్నానం ఆచరిస్తే చంద్ర దోష పరిహారం కలుగుతుంది.

సీసపు ఉంగరము, వెండి ఉంగరము గాని ధరించుట మంచిది. శుభ తిధి గల సోమవారము నందు **ఓం-శ్రాం-శ్రీం-శ్రౌం-సః చంద్రయ నమః** అను మంత్రమును 40 జపము చేసి చివరి రోజున అంటే.. 41వ రోజున బియ్యం, తెల్లని వస్త్రం నందు పోసి దానం చేస్తే చంద్ర దోష నివారణ కలుగుతుంది.

## కుజ గ్రహ దోష నివారణకు

మారేడు పట్టా, ఎర్ర చందనము, ఎర్ర పువ్వులు, ఇంగిలీకము, మాల్కంగినీ, సమూలంగా పొగడ పువ్వులు.. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి ఆ నీటితో స్నానం ఆచరించాలి. కుజ దోష నివారణకు గాను కుజుని పూజించి సుబ్రహ్మణ్య స్వామిని పూజించడం వల్లగానీ, ఎర్రని పగడమును గాని కందులు, మేకలు, బెల్లము, బంగారము, ఎర్రని వస్త్రము, రాగి వీటి యందేదయిన దానము చేయుటకు కాని కుజదోష నివారణ అవుతుంది. వెండి పాత్రయందు చంద్రకర్ర గంధము, దేవదారుగంధం ఉసిరిక పప్పు కలిపిన నీటితో స్నానం ఆచరిస్తే అంగారకదోష నివారణ కలుగుతుంది.

బంగారు ఉంగరము ధరించు ఆచారము కలదు. శుభ తిధి గల మంగళవారం రోజున **ఓం-క్రాం-క్రీం-క్రౌం-సః భౌమాయ నమః** అను మంత్రమును 7 వేలు 40 రోజులలో పూర్తి చేసిన ఎర్రనిరంగు బట్టలో కందులు వేసి 41 వ రోజున దానం చేయడం మంచిది.

## బుధ గ్రహ దోష నివారణకు

చిన్న సైజులో ఉండే పండ్లు, ఆవు పేడ, గోరోచనము, తేనే, ముత్య ములు బంగారము.. ఈ వస్తువులను నీళ్ళలో వేసికాచి, ఆ నీటితో

స్నానం ఆచరించవలెను. బుధ గ్రహ దోష నివారణకుగాను బుధ గ్రహమునకు పూజ, విష్ణు సహస్రనామ పారాయణ చేయాలి. పెసలు దానము చేయాలి. ఆకు పచ్చ రంగు బట్ట, తగరము, టంకము, పచ్చ పెసలు, మరకతము, లొట్టపిట్ట, గజదండము (అంకుశము), పచ్చని పూవులు... వంటి వానిలో ఒకటి దానం చేసినచో బుధగ్రహం వలన కలుగు దోషం పరిహరించబడును.

నదీసంగమము నందు గల సముద్రపు నీటిని మట్టిపాత్రలో పోసి ఆ నీటిలో గజమదము కలిపి, ఆ నీటిని స్నానం చేస్తే కూడా బుధ దోషం తొలగును. ఇత్తడి లేక కంచు ఉంగరము ధరించుట సంప్ర దాయము. శుభ తిథితో కూడిన బుధవారమునందు **ఓం-బ్రాం-బ్రీం-బ్రౌం-సః బుధాయ నమః** అను మంత్రమును 40 రోజులలో జరిపించి చివరి రోజున అనగా 41 ఆకు పచ్చని వస్త్రములలో పెసలు పోసి దానము చేసినచో బుధగ్రహ దోష నివారన కలుగును.

## గురు గ్రహ దోష నివారణకు

మాలతీ పువ్వులు, తెల్ల ఆవాలు, యష్టి మధుకం, తేనే... వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయాలి. గురు దోష నివారణకు గురుగ్రహమును పూజించుట నమక పారాయణ చేయడం వల్ల దోష నివారణయగును. పుష్యరాగం ఉంగరమున ధరించుట శనగలు, పుష్యరాగం, పసుపు, చక్కెర, ఏనుగు, బంగారు రంగువస్త్రము గాని, బంగారము గాని ఏదొకదానిని దానము చేయుటవలన కూడా గురునకు సంబంధించిన దోషము శాంతించగలదు. బంగారుతో చేసిన పాత్రతో

బ్రహ్మమేడి (బొడ్డ), మారేడు, మర్రి, ఉసిరిక ఫలములను వేసి ఆ నీటితో స్నానం చేస్తే.. గురువునకు సంబంధించిన దోషము తొలగిపోవును.

బంగారముతో చేసిన ఉంగరము సాంప్రదాయము. శుభతిధి గల గురువారము నాడు ఉదయము **ఓం-ప్రాం-ప్రీం-ప్రౌం-సః బృహస్పతయే నమః** అను మంత్రము 40 రోజులలో 16 వేలు జపము పూర్తి చేసి పసుపు పచ్చని బట్టలో సెనగలు దానమిచ్చినచో గురుగ్రహ దోష శాంతి కలుగును.

## శుక్ర గ్రహదోష నివారణకు

కుంకుమ పువ్వు, యాలుకలు, మణిశిల, శౌవర్చ లవణము.. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానం ఆచరించాలి. శుక్ర గ్రహ గ్రహ నివారణకు గాను శుక్ర గ్రహమునకు లక్ష్మీదేవికి పూజ చేయాలి. వజ్రమును ఉంగరంను ధరించుట వలన శుభ వస్త్రము, తెల్లని గుర్రము తెల్లని ఆవు, వజ్రం, వెండి, గంధము, బియ్యం బొబ్బర్లు వీటియందేదొకటి దాన మిచ్చుట వలన గాని శుక్ర గ్రహ దోషం నివారింపబడును. వెండి పాత్రయందలి నీటిలో గోరోచనము గజమదము, శక్తిపుష్పము, శతావరిని కలిపి, ఆ నీటితో స్నానం ఆచరిస్తే శుక్రగ్రహ సంబంధమైన దోషం తొలగును.

వెండితో చేసిన ఉంగరము గాని, ముత్యముతో వెండి ఉంగరము ధరించుట సంప్రదాయము. శుభతిధితో కూడిన శుక్రవారమునందు **ఓం-ద్రాం-ద్రీం-ద్రౌం-సః శుక్రాయ నమః** అను మంత్రము 20,వేలు 40 రోజులలో జపము పూర్తిచేసి ,41 వ రోజున తెల్లని వస్త్రములో బొబ్బరులు పోసి దానము చేసిన శుక్ర సంబంధమైన దోషం నివారింపబడును.

## శని గ్రహ దోష నివారణకు

సాంబ్రాణి, నల్ల నువ్వులు, సుర్మరాయి, సోపు.. వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానం చేయాలి. శని గ్రహ దోష నివారణకు శనిగ్రహ పూజలు,ఈశ్వర పూజ, తైలాభిషేకం, నీలమణి ధరించుట, నువ్వులు దానం చేయడం వల్ల గ్రహ దోష నివారణ కలుగును. నీలం, నూనె, నువ్వులు, గేదె, ఇనుము, నల్లని ఆవులందు ఏదో ఒకటి దానం చేయవలెను. ఇనుప పాత్రయందు గల నీటిలో మినుములు, ప్రియంగు ధాన్యము, నీలగంధ, నీల పుష్పములు వేసి ఆ నీటితో స్నానము చేస్తే శనిగ్రహ దోష నివారణయగును. శుభతిధి గల శనివారము నుండి **ఓం-ఖ్రాం-ఖ్రీం-ఖ్రౌం-సః శనయే నమః** అను మంత్రము 40 రోజులలో 19 వేలు జపము చేసి, 41వ రోజున నువ్వులు నల్లని బట్టలో వేసి శనిగ్రహ దోష నివారణ కలుగుతుంది.

## రాహు గ్రహ దోష నివారణకు

నువ్వు చెట్టు ఆకులు, సాంబ్రాణి, కస్తూరి, ఏనుగు దంతము (ఏనుగు దంతం లభించకపోతే మిగిలినవి).. ఈ వస్తువులను నీళ్ళలో వేసి ఆ నీటితో స్నానం ఆచరించాలి. రాహు గ్రహ దోష నివారణకుగాను రాహు గ్రహమును పూజించుట, దుర్గాదేవిని పూజించుట, గోమేధికమును ధరించుట వలన రాహు గ్రహ దోష నివారణ యగును, గోమేధము, గుర్రము, నీలవస్త్రము, కంబళి నూనె, మినుములు, పంచలోహములు, వీటియందేదైన దానం చేయడం వల్ల కూడా దోష శాంతి కలుగును. గేదె కొమ్ముతో చేసిన పాత్రయందలి ఉదకమున గుగ్గిలము, ఇంగువ, హరిదళము, మనశ్శిలలతో కలిపి ఆ నీటితో స్నానం చేసినచో రాహు

దోషం తొలగును. పంచ లోహములతో చేసిన ఉంగరము ధరించుట సాంప్రదాయం. శుభతిధి గల శనివారము నాడు రాహుమంత్రమగు **ఓం-భ్రాం-భ్రీం-భ్రౌం-సః రాహవే నమః** అను మంత్రమును 40 రోజులలో 18 వేలు జపము పూర్తి చేసి, 41వ రోజున మినుము చల్లని బట్టలో వేసి దానం చేసినచో రాహుగ్రహ సంబంధమైన దోషం తొలగిపోవును.

## కేతు గ్రహ దోష నివారణకు

సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, మేజ మూత్రం, మారేడు పట్ట, ఏనుగు దంతం, (ఏనుగు దంతం లభించకపోతే మిగిలినవి).. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి ఆ నీటితో స్నానం చేయవలెను. కేతు దోష నివారణకుగాను కేతుగ్రహమును పూజించి సూర్యనమస్కారములు చేస్తూ ఉలవలు దానం ఇవ్వాలి. వైఢూర్యం, నూనె, శాలువా, కస్తూరి, ఉలవలు వీటిని దానం చేసినా కూడా కేతుగ్రహ దోష నివారణ కలుగుతుంది.

ఖడ్గమృగము కొమ్ముతో చేయబడిన పాత్రయందు గల నీటిలో పర్వతముల యందు పందికొమ్మతో తవ్వబడిన మట్టి, మేక పాలు కలిపి ఆ నీటితో స్నానం ఆచరిస్తే కేతుగ్రహ దోష నివారణ కలుగును. పంచలోహముల ఉంగరం ధరించుట సాంప్రదాయం. శుభ తిధి గల మంగళవారం నాటి నుంచి **ఓం-ప్రాం-ప్రీం-ప్రౌం-సః కేతవే నమః** అను మంత్రమును 40 రోజులలో 7 వేలు జపము పూర్తి చేసి 41వ రోజున ఎర్రని వస్త్రంలో ఉలవలు పోసి దానమిచ్చిననూ కేతుగ్రహ దోష నివారణ కలుగుతుంది.



# నవగ్రహాల అమరిక ఎలా ఉంటుంది?

నవగ్రహాల మధ్య తేజస్సుతో సూర్యుడు తూర్పు ముఖంగా ఉంటాడు.

సూర్యుని ముందు శుక్రుడు కూడా తూర్పు ముఖముగా ఉంటాడు. సూర్యుడికి కుడివైపు కుజుడు దక్షిణాభిముఖంగా ఉంటాడు.

శుక్రునికి కుడివైపు పడమర ముఖంగా చంద్రుడు ఉండగా, ఎడమ వైపు బుధుడు ఉత్తరాభిముఖంగా ఉంటాడు.

సూర్యునికి వెనుకవైపు శని మహాత్ముడు పశ్చిమాభిముఖంగా వుంటాడు.

శనికి ఎడమవైపు రాహువు ఉత్తరాభిముఖంగానూ, కుడివైపు కేతువు దక్షిణాభిముఖంగానూ, ఒకరిని ఒకరు చూసుకుంటూ ఉంటారు. ఇది ప్రశస్తమైన ప్రతిష్ట అని జ్యోతిష నిపుణులు అంటున్నారు.





# నవగ్రహాలకు ప్రదక్షిణలు ఎలా చేయాలి?



మానవ జీవనం, మానసిక పరిస్థితి ప్రధానంగా వారి వారి గ్రహాల స్థితిపై ఆధారపడి వుంటుందని జ్యోతిష శాస్త్రం చెబుతోంది. గ్రహస్థితిలో మార్పులు వల్లనే ఎవరి జీవితంలో అయినా ఒడిదుడుకులు ఎదురవ్వడం గానీ, లాభాలు, సంతోషాలు కలిసిరావడం గానీ వస్తుంటాయి.

నవగ్రహాలు చాలా శక్తివంతమైనవి. పద్ధతి ప్రకారం నవగ్రహాలకు ప్రదక్షిణలు చేస్తే విశేషమైన ఫలితం ఉంటుంది. నవగ్రహాలకు ప్రదక్షిణలు ఎలా చేయాలి ? ఎన్నిసార్లు చేయాలి ? అనే విషయాలపై కొందరి అంతగా అవగాహన ఉండదు.

నవగ్రహ ప్రదక్షిణలకు ఒక పద్ధతి ఉంది. పద్ధతి ప్రకారం ప్రదక్షిణలు చేస్తే మంచి ఫలితాలుంటాయి అని జ్యోతిష నిపుణులు పేర్కొంటున్నారు.

నవగ్రహ ప్రదక్షిణ మనిషి కష్టనష్టాల్లో ఉన్నప్పుడు ఆదుకుంటుంది. నవగ్రహ ప్రదక్షిణలకు ఒక నిర్దిష్టమైన పద్ధతి వుంది. ఆ పద్ధతి ప్రకారం ప్రదక్షిణలు చేస్తే విశేషమైన ఫలితం ఉంటుంది.

ఏ గుడికి వెళ్ళినా.. గర్భగుడిలోని స్వామిని దర్శించుకోకుండా నవగ్రహాలకు పూజించడం, ప్రదక్షిణలు చేయడం సరికాదు. ముందుగా వినాయకుడిని దర్శించుకుని.. ఆపై గర్భగుడిలోని దేవతను స్తుతించి.. చివరిగానే నవగ్రహాలను ప్రదక్షణ చేయాలి. ఈ విధానం ద్వారానే శుభ ఫలితాలు చేకూరుతాయి. గర్భగుడిని దర్శించుకోకుండా.. నవగ్రహ ప్రదక్షణ చేయడం అశుభ, వ్యతిరేక ఫలితాలను ఇస్తుందని జ్యోతిష్య నిపుణులు అంటున్నారు. కానీ కొందరు ముందుగా ఏ దైవాన్ని దర్శించామ అన్నదానికి అంతగా ప్రాధాన్యం లేదని, దైవాన్ని ఎంత భక్తి శ్రద్ధలతో కొలిచాము అన్నదే ముఖ్యమని చెబుతారు.

కొంతమంది ప్రదక్షిణలు చేస్తున్నప్పుడు నవగ్రహాలను తాకుతూ ప్రదక్షిణ చేస్తుంటారు. సాధ్యమైనంత వరకూ ఇలా తాకకుండానే ప్రదక్షిణలు చేయాలి.

నవగ్రహ ప్రదక్షిణ చేయడానికి మంటపంలోకి వెళ్ళే ముందు, సూర్యుడిని చూస్తూ లోపలికి ప్రవేశించి (చంద్రుని వైపు నుంచి) కుడి వైపునకు తొమ్మిది ప్రదక్షిణలు చేయడం ఉత్తమం.

ప్రదక్షిణలు పూర్తయ్యాక ఎడమవైపు (బుధుడి వైపు నుంచి) రాహువు, కేతువులను స్మరిస్తూ రెండు ప్రదక్షిణలు చేయవచ్చు.

చివరగా నవగ్రహాల్లో ఒక్కొక్క గ్రహం పేరు స్మరించుకుంటూ ఒక ప్రదక్షిణ చేసి, నవగ్రహాలకు వీపు చూపకుండా వెనుకకు రావాలి. ఇలా చేయడం వల్ల కొంత ఫలితం ఉంటుంది.

ఎప్పుడుపడితే అప్పుడు నవగ్రహాల చుట్టూ ప్రదక్షిణలు చేయ కూడదు. శుచిగా స్నానం చేసి పరిశుభ్రమైన దుస్తులు ధరించినప్పుడు మాత్రమే నవగ్రహ ప్రదక్షిణలు చేయాలి.

శివాలయాల్లో నవగ్రహాలుకు ప్రత్యేకమైన సన్నిధి వుంటుంది. మూల విరాట్టును దర్శించుకుని బయటికి వచ్చాక నవగ్రహాలను దర్శించుకోవాలి.

**"ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః"**

అంటూ తొమ్మిది ప్రదక్షిణలు చేయాలి. ప్రదక్షిణాలు చేస్తున్నంత సేపూ నవగ్రహ స్తోత్రాలు చదవాలి. 9 గ్రహాలకూ స్తుతిస్తూ శ్లోకాలు చదివి 9 ప్రదక్షిణలు పూర్తి చేసిన తర్వాత ప్రత్యేకంగా రాహు, కేతువులకు మరో రెండు ప్రదక్షిణలు (అంటే మొత్తం 11) చేస్తే చాలా మంచిదంటారు. అసురులైన రాహుకేతువులను ఈ విధంగా సంతృప్తిపర్చడం వల్ల వారి కారణంగా ఆటంకాలు వుండవని నమ్మకం.

మొదటి ప్రదక్షిణలో జపాకుసుమాల వర్ణం గలవాడా, కాశ్యప గోత్రుడా, నవగ్రహమండలనాయకుడా, **శ్రీసూర్యభగవానుడా, సదా శుభాన్ని అనుగ్రహింతువు గాక!**

రెండో ప్రదక్షిణలో కటకరాశికి అధిపతి అయిన ఓ చంద్రుడా, పెరుగు, శంఖాల వంటి ధవళవర్ణం గలవాడా, ఆత్రేయగోత్రోద్భవుడా, **శ్రీచంద్రభగవానుడా, మమ్మల్ని కరుణించు!**

మూడో ప్రదక్షిణలో బంగారు రంగుతో మెరిసిపోయేవాడా, వృశ్చిక మేషరాశులకు అధిపతి అయినవాడా, భరద్వాజగోత్రుడా, శ్రీ **అంగారకుడా మాకు మంగళాలను ప్రసాదించు** అని స్మరించుకోవాలి.

నాలుగో ప్రదక్షిణలో నల్లని వర్ణం గలవాడా, కన్యా మిథునరాశులకు అధిపతి అయినవాడా, ఉత్తరదిశలో బాణరూపమండలంలో వసించే వాడా, **శ్రీ బుధరాజా మాకు మేలు కలిగింతువు గాక!**

ఐదో ప్రదక్షిణలో అంగీరసగోత్రుడా, ధనుస్సు, మీనరాశులకు అధిపుడా, దేవగురువైన బృహస్పతీ, **శ్రీగురుభగవానుడా, మాపై కరుణను వర్షించు!**

ఆరో ప్రదక్షిణలో భార్గవగోత్రం గలవాడా, స్త్రీ భోగాలను ప్రసాదించే వాడా, దైత్యగురువైన **శుక్రాచార్యుడా, మాపైన కరుణావృష్టిని కురిపించు** అని స్మరించుకోవాలి.

ఏడో ప్రదక్షిణలో కాశ్యపగోత్రుడూ, కుంభ మృగశీర్షాలకు అధిపతి అయినవాడూ, దీర్ఘాయువును ప్రసాదించేవాడూ అయిన **శ్రీశనైశ్చరుడా, మాకు మంగళాలు కలిగేలా చూడు!**

ఎనిమిదో ప్రదక్షిణలో సింహికాగర్భసంభూతుడా, దక్షిణాన దక్షిణ ముఖంగా నక్షత్రమండలంలో వుండేవాడా, **శ్రీరాహుభగవానుడా మాకు సదా మంగళాలు కలిగించు!**

తొమ్మిదో ప్రదక్షిణలో జైమినిగోత్రికుడా, గంగాయాత్రను సంప్రాప్తింపజేసేవాడా, రౌద్రస్వరూపంతో వుంటూ, రుద్రాత్మకుడుగా పేరు పడిన వాడా, **శ్రీకేతుభగవానుడా మాకు మేలు కలుగజేయి!** అంటూ ప్రార్థించు కుంటూ ప్రదక్షిణలు చేయాలి.

గ్రహదోషాల నుండి తప్పుకోవడానికి నవగ్రహప్రదక్షిణ కంటే ఉత్తమ మయిన మార్గం లేదన్నది అందరిచేత ఆమోదయోగ్యం అయిన పద్ధతిగా చెబుతారు.



# నవగ్రహ దోష నివారణకు నవగ్రహ ముద్రలు



వ్యాధులు తగ్గించడానికి మందులు ఎంత బాగా పని చేస్తాయో అంత కంటే ముద్రలు వేసి ధ్యానం చేస్తే వ్యాధులు వేగంగా తగ్గుతాయి అని కొందరి నమ్మకం. కొన్ని సార్లు కేవలం ముద్రలు వల్లే వ్యాధులు తగ్గినట్లు అనుభవాలు వున్నాయి అంటారు. ఆసనాల కంటే ముద్రలు లోతైనవి. ఇవి శరీరాంగాలకు అతీత శక్తులకు సంబంధించినవి. వాటి ద్వారా జ్ఞానేంద్రియాలను ప్రభావితం చేసి లోపాలను సవరించవచ్చును అంటారు.

ఆయా గ్రహాధిపతులను ఉపాసించు సమయమున ఆయా గ్రహ దీపతులకు ఇష్టమైన ముద్రలను ప్రదర్శించాలి. జప పూజాదుల సమయము

నందు ఆయా ముద్రలను ప్రదర్శించి ఆయా గ్రహాధిపతుల కరుణా కటాక్షములను, ప్రసన్నం చేసుకోవడానికి ముద్రలను ప్రదర్శిస్తూ వుంటారు. మన చేతుల్లో శక్తి ప్రవహిస్తూ ఉంటుందని, మన చేతికున్న ఐదు వేళ్ళూ ఐదు తత్వాలకు సంకేతమని అంటారు.

బొటని వేలు అగ్నికి, చూపుడు వేలు వాయువుకు, మధ్యవేలు ఆకాశం, ఉంగరం వేలు పృథ్వి, చిటికెనవేలు జలానికి సంకేతాలుగా చెప్తారు. ఈ ఐదు తత్వాల అసమతుల్యత వల్లనే వ్యాధులు వస్తాయని, వీటిని మందులు, ఆత్మశక్తి, ముద్రల సాయంతో సరిచేయవచ్చని అంటారు. ఈ ముద్రలను రోజూ అరగంట సాధన చేస్తే చాలు.

అష్టోత్తర శాతం ముద్రా బ్రహ్మణా యా ప్రకీర్తితాః ।
తాసాం తు పంచపంచాతదేతా గ్రాహ్యాస్తు పూజనే ॥

బ్రహ్మదేవుడు చెప్పిన 108 ముద్రలలో 55 ముద్రలు మాత్రమే పూజలలో వినియోగించబడతాయి.

ముద్రాం బినాతు యజ్జప్యం ప్రాణాయామః సురార్చనమ్
యోగో ధ్యానాసనే చాపి నిష్ఫలాని చ భైరవ ॥

జపం, ప్రాణాయామం, ధ్యానము, ఆసనాలు అన్నీ ముద్రలు లేకుండా చేసిన పూజ నిష్ఫలమంటారు.

## శిఖరిణీ ముద్ర (సూర్యగ్రహ ముద్ర)

ముష్టిర్దక్షిణ హస్తస్య యదోర్ధాంగుష్టికా భవేత్
సాస్యాచ్ఛికరిణీ ముద్రా,బ్రహ్మీ సూర్య ప్రియాచసా ॥

కుడిచేతిని పిడికిలిగా బిగించి బొటన వ్రేలిని మాత్రం నిటారుగా ఉంచితే శిఖరిణీ ముద్ర అంటారు. ఇది సూర్యునికి ప్రీతికరమైన ముద్ర.

## అర్ధధేను ముద్ర (చంద్రగ్రహ ముద్ర)

**అనామికే కనిష్ఠేచ సంయోజ్య వాయునా పునః మాధ్యమా తర్జనీనాంతు ధేనుముద్రేన బంధనమ్ సార్ధధేనురితిఖ్యాతా చంద్రప్రీతి వివర్ధినీ ॥**

ఎడమ, కుడి చేతుల అనామిక కనిష్ట వ్రేళ్ళు నిటారుగా కలిపి, తర్జనీ మధ్యమాంగుళులను ధేనుముద్రగా వస్తే అర్ధధేను ముద్ర అవుతుంది. ఇది చంద్రునికి ప్రీతికరమైన ముద్ర.

## సమ్మీలిని ముద్ర (కుజగ్రహ ముద్ర)

**కరయోరంగుళీనాంతు, సర్వాగ్రాణ్యేకతః**
**స్థితా నియోజ్య ద్వేతలేచైవ,తదధోపి నియోజ్యచ ।**
**అగ్రైరగ్రై యోజయేతు, ముద్రా సమ్మీలినీతు సా**
**భౌమ భూమి మునీ శానాం, ప్రీతి వివర్ధినీ ॥**

రెండుచేతుల వ్రేళ్ళ కొసలను విడివిడిగా ఉంచి, అరచేతులను, అరచేయి మూలాన్ని ఒకటిగా కలిపితే సమ్మీలినీ ముద్ర అవుతుంది. ఇది కుజునికి ప్రీతికరమైన ముద్ర.

## కుండ ముద్ర (బుధగ్రహ ముద్ర)

**సర్వాంగుళీస్తు సంయోజ్య,దక్షస్య**
**కరస్య చ కియద్భాగం తథానమ్యతలం ।**
**కుర్యాత్ తు కుండవత్ సమాఖ్యాతా**
**కుండముద్రా, బుధ వాణీ శివప్రియా ॥**

కుడిచేతియొక్క అన్నీ వ్రేళ్ళను ఒకటిగా కలిపి కొంచెం లోపలి వైపుకు వంచి, రెండు అరచేతులను కుండ ఆకారంలో కలిపితే కుండ ముద్ర అవుతుంది. కుండ ముద్ర బుధునికి, శివునికి, సరస్వతికి ప్రీతికరమైన ముద్ర.

## చక్రముద్ర (గురుగ్రహ ముద్ర)

సర్వాంగులీనాం మధ్యంటు,వామహస్తృయ
చాంగులీః ప్రసార్యాంగుష్ఠ యుగళం,
సంయోజగ్రేణ భైరవ తదంగుష్ఠ ద్వయం కార్య సమ్ముఖం
వితరమేతతఃచక్రముద్రా సమాఖ్యాతా గురువిష్ణుశ్శివప్రియాః ॥

ఎడమచేతి యొక్క నాలుగు వ్రేళ్ళు బ్రొటన వ్రేలు కాకుండా కుడిచేతి యొక్క నాలుగు వ్రేళ్ళ మధ్యగా పోనిచ్చి, రెండుచేతుల బొటన వ్రేళ్ళ చివరాలు ఒకటిగా కలిపి, రెండు బొటన వ్రేళ్ళను సాధకుని వైపు వ్యాపించినచో అది చక్రముద్ర అవుతుంది. చక్రముద్ర గురునికి, విష్ణువుకి, శివునికి ప్రీతికరమైన ముద్ర.

## శూల ముద్ర (శుక్రగ్రహ ముద్ర)

అంగుష్టం మధ్యమాంచైవ నామయిత్వా
కరస్యతు దక్షణస్య పరాస్త్రస్రో యోజయేదగ్రతఃపునః
శూలముద్రా సమాఖ్యాతా మమ శుక్ర గ్రహప్రియాః

కుడిచేతి యొక్క బొటనవ్రేలుతో మద్యవ్రేలును కొంచెం లోపలివైపుకు వంచి మిగతా మూడు వ్రేళ్ళ చివరలు ఒకటిగా కలిపితే శూలముద్ర అవుతుంది.ఇది శుక్రునికి,శివునికి ప్రీతికరమైన ముద్ర.

## సింహముఖి ముద్ర (శనిగ్రహ ముద్ర)

నిమబ్జీకృత్యతు కరౌ వామాంగూళి గణస్య
తు అగ్రాణీయో జయోన్మాధ్యే , తలస్యా సవ్య
హస్తతః అధః కృత్వా వామహస్తం ముద్రా

సింహముఖీ స్మృతా ఇయం ప్రత్యైటు
దుర్గాయాః సూర్యపుత్రస్య చక్రిణః

రెండు అరచేతులు ఒకటిగా కలిపి ఎడమచేతి 5 వ్రేళ్ళ కొసలు కుడి అరచేతిలో ఉంచి, ఎడమచేతిని కొంచెం క్రిందికి జార్చినచో సింహ ముఖి ముద్ర అవుతుంది. దుర్గాదేవికి, విష్ణువుకు, శనీశ్వరునికి ఇది ప్రీతికరమైన ముద్ర.

## భగముద్రా (రాహుగ్రహ ముద్ర)

భగముద్రా కర్ణమూలే గోముఖాఖ్యం ప్రకీర్తితా
మమ విష్ణో స్తథా రాహుః సర్వదా ప్రీతిదాయినీ ॥

రెండు చేతివ్రేళ్ళను గోముఖాకారంలో చేసి చెవుల దగ్గర ఉంచితే భగ ముద్ర అవుతుంది. ఇది శివునికి, విష్ణువుకు, రాహువునికి ప్రీతికరమైన ముద్ర.

## త్రిముఖ ముద్ర (కేతుగ్రహ ముద్ర)

అంగుష్ఠ తర్జనీ మధ్యా అగ్రభాగం నియోజ్యచ
మధ్యమాంచ కనిష్ఠాంచా ఆకుంత్య దక్షిణేకరే
త్రిమూఖాఖ్యా సమాఖ్యాతా విశ్వదేవ ప్రియాసదా
కేతోతః ప్రియేయం సతతం మాతృణామాపి తుష్టిదా ॥

కుడిచేతి బొటనవ్రేలు, చూపుడువ్రేలు మధ్యవ్రేళ్ళ యొక్క చివరలు ఒకటిగా కలిపి, అనామిక కనిశ్తికాంగుళులను లోపలకుముడిస్తే త్రిముఖ ముద్ర అవుతుంది. ఇది కేతువుకు, విశ్వేదేవతలకు, మాతృగాణాలకు ప్రీతికరమైన ముద్ర.

నవగ్రహ ముద్రలను దైనందిన పూజా కార్యక్రమాల్లో వినియోగించుకొనిన యెడల, నవగ్రహాల అనుగ్రహం కలుగుతుంది అని భావన.



# రాశులు, గ్రహాలరీత్యా శరీర భాగాలు

జాతకుని శరీర భాగములలో ఏభాగము పరిపుష్టి కలిగి ఉండునో, ఏభాగము బలహీనంగా ఉండునో, ఆయా రాశులయందు ఉన్న గ్రహాముల యొక్క శుభాశుభములను బట్టి తెలియును. కాల పురుషుని అవయవ విభాగము మేషాదిగా చూచినట్లుగానే జాతకుని అవయవ విభాగము లగ్నము నుండి చూడవచ్చును.

కాలపురుషుని అంగములు లగ్నము నుండి మొదటి ఆరు రాశులు కుడివైపు భాగమును, ఏడవరాశి నుండి పన్నెండో రాశి వరకు ఎడమ వైపు భాగమును చూడవలెను.

ఆయారాశుల్లో పాపగ్రహాలు కాలపురుషుని ఏశరీరభాగమున్న స్థానంలో స్థితి నొందాయో, లగ్నాదిగా అదే అంగభాగంలో కూడ పాపగ్రహాలు చేరి ఉన్నప్పుడు అట్టి అంగం బలహీనపడి వ్యాధిగ్రస్థ మవుతుంది. ఇందు గ్రహాకారకత్వాదులను కూడ అన్వయించి చూడాలి.

## రాశులరీత్యా శరీరభాగాలు

మేషోశ్శిరోదవదనం వృషబో విధాతః
వక్షోభవేన్మిధునం హృదయం కుళీరం.
సింహస్థదోధరమదో యువతిః కటిశ్చ.
వస్తిస్తు లాభృదదేవమేహ నమష్టమస్యాత్.
దన్వీచస్వాదూరుయుగం నక్రోజానుయుగంత
జంగద్వయంచ కుంభస్యా త్వాత ద్వితీయ మత్స్యభం.



**మేషరాశి:** శిరస్సు, మెదడు.

**వృషభరాశి:** ముఖాన్ని, గొంతు, మెడ, టాన్సిల్స్, కన్నులు, ముక్కు, నాలుక, వేళ్ళగోళ్ళు.

**మిధునరాశి:** ఉదరాన్ని, చేతులు, చెవులు.

**కర్కాటకరాశి:** హృదయం, స్తనాలు, ఊపిరితిత్తులు.

**సింహారాశి:** పొట్ట, గుండె, వెన్నుపూస.

**కన్యారాశి:** నడుం, చిన్నప్రేవులు, ఆహారనాళం.

**తులారాశి:** పొత్తికడుపు, మూత్రపిండాలు.

**వృశ్చికరాశి:** జననాంగాలు(బాహ్య జననేంద్రియాలు).

**ధనస్సు రాశి:** తొడలు, తుంటి.

**మకర రాశి:** మోకాళ్ళు.

**కుంభరాశి:** పిక్కలు,చీలమండలు,

**మీనరాశి:** పాదాలు.

## గ్రహాలు శరీర భాగాలు

**రవి:** శిరస్సు, హృదయం, కుడికన్ను, ఉదరం, ఎముకలు.

**చంద్రుడు:** ఎడమ కన్ను, శరీరంలోని ద్రవాలు, స్త్రీ ల పునరుత్పత్తి అంగాలు.

**కుజుడు:** ఎముకలలో మజ్జ, హిమోగ్లోబిన్, పిత్తం, మెడభాగం.

**బుధుడు:** గొంతు, ముక్కు, ఊపిరితిత్తులు.

**గురువు:** కాలేయం, పిత్తకోశం, చెవి.

**శుక్రుడు:** ముఖం, పురరుత్పత్తి అంగాలు, వీర్యం, ప్రేగులు,

**శని:** కాళ్ళు, పాదాలు.

లగ్నంలో రవి శత్రుక్షేత్రంలో ఉండి పాపగ్రహ సంబంధం ఉంటే తీవ్రమైన తలనొప్పి, బుధ సంబంధం వలన నరాలు దెబ్బతినటం, కుజ సంబంధం వలన ప్రమాదంలో రక్తనాళాలు దెబ్బతినటం జరుగుతుంది అని అంటారు. 

## కళత్ర దోషాలు

కళత్రదోషం అంటె జాతకచక్రంలో సప్తమ భావం వేదసప్తమాధిపతి బలహీనపడుట వలన ఎర్పడేదోషాలు, వివాహం ఆలస్యం, వివాహం జరిగే అవకాశము లేకపోవుట విడిపోవుటద్వారా, ద్వితీయవివాహం, వివాహేతరసంబంధాలు వివాహ భాగస్వామిని కోల్పొవుట, వివాహ సౌఖ్యంలేకపోవుట మొదలయిన విషయాలను కళత్రదోషాలు అంటారు. జాతకచక్రంలో కొన్ని పాపగ్రహాల సంబంధం సప్తమానికి లేదా సప్తమ భావానికి ఉంటె సప్తమభావం బలహీనపడుతుంది.

# నవగ్రహాలు- నవధాన్యాలు



నవధాన్యాలను నవగ్రహాలకు సంకేతంగా భావిస్తుంటారు. సూర్యుడికి గోధుమలు, చంద్రుడికి బియ్యము, కుజ గ్రహానికి కందులు, బుధ గ్రహానికి పెసలు, గురు గ్రహానికి సెనగలు, శుక్ర గ్రహానికి బొబ్బర్లు, శని గ్రహానికి నువ్వులు, రాహుగ్రహానికి మినుములు, కేతు గ్రహానికి ఉలవలు అధీన ధాన్యాలుగా పరిగణిస్తారని జ్యోతిష నిపుణులు అంటు న్నారు.

ఇకపోతే నవధాన్యాలను దైవకార్యాల్లోను ... శుభకార్యాలలోను ఉపయోగిస్తారు. వివాహ సమయంలో ఈ నవధాన్యాలను మట్టి మూకుళ్లలో పోసి ఉంచడమనే ఆచారం వుంది. అవి మొలకెత్తి బాగా పెరిగితే ఆ దాంపత్యం అన్యోన్యంగా ఉంటుందని భావిస్తారు. అంతే కాకుండా నవధాన్యాల, నవగ్రహాల అనుగ్రహం వారిపై బాగానే ఉంటుం దని విశ్వసిస్తారు. నవధాన్యాలు ఎన్నో ఔషధ గుణాలను కలిగి వుండి ఎంతో బలమైన పోషకాలను అందిస్తాయి. ఆ పోషకాలను స్వీకరిస్తూ ఆరోగ్య వంతమైన జీవితాన్ని కొనసాగించమనే అర్థం కూడా ఇందులో వుందని పండితులు అంటున్నారు.



# గ్రహావస్థలు



గ్రహావస్థలు పది రకాలు. (1) స్వస్థము, (2) దీప్తము, (3) ముదితము, (4) శాంతము, (5) శక్తము, (6) పీడితము, (7) దీనము, (8) వికలము, (9) ఖల, (10) భీతము అనేవి ఆ అవస్థలు.

**స్వస్థము:** స్వక్షేత్ర మందున్న గ్రహము స్వస్థావస్తను పొందును.

**దీప్తము:** ఉచ్ఛక్షేత్ర మందున్న గ్రహము దీప్తావస్త నందుండును.

**ముదితము:** మిత్ర క్షేత్ర మందున్న గ్రహము ముదితావస్తను పొందును.

**శాంతము:** సమ క్షేత్ర మందున్న గ్రహము శాంతావస్తను పొందును.

**శక్తము:** వక్రించి యున్న గ్రహము శక్త్యావస్తను పొందును.

**పీడితము:** రాశి అంతమున 9 నక్షత్ర పాదములలో చివరి పాదము నందున్న గ్రహము పీడావస్థను పొందును.

**దీనము:** శత్రు క్షేత్ర మందున్న గ్రహము దీనావస్థను పొందును.

**వికలము:** అస్తంగత మయిన గ్రహము వికలావస్థను పొందును.

**ఖల:** నీచ యందున్న గ్రహము ఖలావస్థను పొందును.

**భీతము:** అతిచారము యందున్న గ్రహము భీత్యావస్థను పొందును.

ఉచ్ఛ స్థానమున ఉన్న దీప్తుడు, స్వక్షేత్రమున ఉన్న స్వస్థుడు, మిత్రక్షేత్రమున ఉన్న ముదితుడు, శుభవర్గమున ఉన్న శాంతుడు, సూర్యునకు దూరమున ఉన్న శక్తుడు, అస్తంగతుడైన వికలుడు, యుద్ధ మున పరాజితుడైన పీడితుడు, పాప వర్గమున ఉన్న ఖలుడు, నీచ అందు ఉన్న భీతుడు అని అంటారు.

సూర్యుడి సామీప్యాన్ని ఆధారంగా చేసుకుని గ్రహగతులను నిర్ణయిస్తారు. సూర్యునితో చేరి ఉన్న గ్రహము అస్తంగత గ్రహం అంటారు. సూర్యునికి రెండవ స్థానంలో ఉన్నశీఘ్రగతిని పొందిన గ్రహం అంటారు. సూర్యుని నాల్గవ స్థానమున ఉన్న గ్రహాన్ని మందుడు అంటారు. సూర్యునికి అయిదు ఆరు రాశులలో ఉన్న గ్రహం వక్రగతిని పొందిన గ్రహం అంటారు. సూర్యునికి ఏడు ఎనిమిది స్థానాలలో ఉన్న గ్రహం అతి వక్రగతిని పొందిన గ్రహం అంటారు. సూర్యునికి తొమ్మిది, పది స్థానాలలో ఉన్న గ్రహం కుటిలగతి పొందిన గ్రహం అంటారు. సూర్యునికి పదకొండు, పన్నెండు స్థానాలలో ఉన్న గ్రహాన్ని అత్యంత శీఘ్రగతిన ఉన్న గ్రహం అంటారు.



# ద్విగ్రహయోగం



జనన కాలమున రెండు గ్రహముల చేరిక ఉన్న జాతకుని గ్రహ చేరికను అనుసరించి మిశ్రమ ఫలితాలు ఉంటాయి. అవి ఒక్కొక్క రాశికి తగినట్లు స్థానానికి తగినట్లు ఫలితాలు మారుతూ ఉంటాయి.

## రవి ఇతరగ్రహ కలయిక

ద్విగ్రహ యోగంలో **రవి, చంద్రులు** కలిసి ఉన్న జాతకుడు, స్త్రీ వశవర్తి , నీతి హీనుడు, కపటమెరిగిన వాడు, ధనికుడు, కార్యములందు నిపుణత కలవాడుగా ఉంటాడు.

**రవి, కుజులు** కలిసి ఉన్న జాతకుడు సాహసము, మూర్ఖత, బలము, సత్వము, అనృతము, పాపబుద్ధి, కోపం మొదలైనవి కలవాడు, వధ అందు ఆసక్తి కలిగి ఉంటాడు.

**రవి, బుధులు** కలసి ఉన్నట్లయితే సేవ, అస్థిరమైన ధనం, యసస్సే ధనంగా కలవాడు, రాజ ప్రియుడు, పూజ్యుడు, సత్పురుషులలో శ్రేష్టుడు, బలము, రూపము, ద్రవ్యము కలవాడవుతాడు.

**రవి, గురులు** కలిసి ఇన్న జాతకుడు ధార్మికుడు, మంత్రి, బుద్ధిమంతుడు, మిత్రుల వలన ధనం ప్రాప్తించినవాడు, ఉపాధ్యాయుడవుతాడు.

**రవి, శుక్రులు** కలిసి ఉన్నచో శస్త్ర విద్యలు మొదలైన వాటి అందు ప్రావిణ్యం కలవాడు, వార్ధక్యములో దృష్టి బలం లేనివాడు, నాట్య క్రియలు తెలిసిన వాడు, వివాహానంతరం ధనం, బంధువులు కలవాడు ఔతాడు.

**రవి, శనులు** కలిసి ఉన్న జాతకుడు స్వధర్మమున ఆసక్తి కలవాడు, భార్యా పుత్రుల అందు ఖేదం కలవాడవుతాడు.

## చంద్రుడు ఇతరగ్రహముల చేరిక

ద్విగ్రహ యోగంలో **చంద్రుడు, కుజుడు** కలసి ఉన్న జాతకుడు శూరుడు, రణరంగమున ప్రతాపం కలవాడు, బాహుయుద్ధం చేయు వాడు, రక్త హీనత కలవాడు, మత్తుడు, కపటం కలవాడు, ధర్మపన్నాలు వల్లించువాడవుతాడు.

**చంద్రుడు, బుధుడు** కలిసి ఉన్న జాతకుడు కావ్య కథలు రచన చేయుటలో నిపుణుడు. ధనికుడు, స్త్రీ జితుడు, ధర్మం అందు ఆసక్తి, చిరునవ్వు ముఖము కలవాడు, సుందరుడవుతాడు.

**చంద్రుడు, గురువు** కలిసి ఉన్న జాతకుడు స్థిరమైన మిత్రులు కలవాడు, ధనికుడు, దేవబ్రాహ్మణ భక్తి కలవాడు, బంధువులను సత్కరించువాడవుతాడు.

**చంద్రుడు, శుక్రుడు** కలిసి ఉన్న జాతకుడు పుష్పమాలికలు, దేవతా వస్త్రాలు, పరిమళ ద్రవ్యములను అనుభవించువాడు, వంశశ్రేష్టుడు, కార్య విధులను తెలిసినవాడు, మిక్కిలి నిర్లక్ష్యము, క్రయ విక్రయముల అందు నేర్పరి కలవాడు అగును.

**చంద్రుడు, శని** కలిసి ఉన్న జాతకుడు వృద్ధాంగానలను ప్రేమించువాడు, గజములు, అశ్వములు కలవాడు, ధనములేని వాడు, పరాజితుడు, జన వశ్యుడవుతాడు.

## కుజుడు ఇతరగ్రహముల కలయిక

ద్విగ్రహ యోగంలో **కుజుడు, బుధుడు** చేరిక ఉన్న జాతకుడు దుష్ట స్త్రీ సాంగత్యం కలవాడు, స్వల్ప ధనికుడు, సువర్ణము మొదలైనవి చేయువాడు, దుష్టులైన విధవ అంగనా సఖుడు, ఔషధం చేయుటలో నేర్పరిఅవుతాడు.

**కుజుడు, గురువు** కలిసి ఉన్న జాతకుడు శిల్ప శాస్త్రం, వేద శాస్త్రం తెలిసిన వాడు, ధారణా శక్తి కలవాడు, బుద్ధిమంతుడు, మాటలలో నేర్పరి, అస్త్ర ప్రయోగంలో నేర్పరి, శ్రేష్టుడు అగును.

**కుజుడు, శుక్రుడు** కలయిక కలిగిన జాతకుడు పూజ్యుడు, సేనా నాయకుడు, గణితజ్ఞుడు, పరస్త్రీ ఆసక్తుడు, కోపం కలవాడు, జూదము, అనృతం తెలిసినవాడవుతాడు.

**కుజుడు శనుల** కలయిక ధాతువులతో ఇంద్రజాలము చేయుటలో ఘటికుడు, ప్రబలుడు, చౌరవిద్యలో నేర్పరి, అనృతుడు, ధర్మహీనుడు, విషము మొదలైన వాటితో మరణమును పొందువాడు అవుతాడు.

## బుధుడు ఇతర గ్రహముల కలయిక

ద్విగ్రహ యోగంలో **బుధుడు, గురువుల** కలయిక ఉన్న జాతకుడు నాట్య విద్య తెలిసినవాడు, ప్రాజ్ఞుడు, సంగీత శాస్త్రం తెలిసినవాడు, బుద్ధిమంతుడు, సౌఖ్యం మొదలైన ఉత్తమ గుణములు కలవాడవుతాడు.

**బుధుడు, శుక్రుడు** కలయిక ఉన్న జాతకుడు గొప్ప ధనికుడు, నీతి తెలిసినవాడు, మాట్లాడటంలో నేర్పరి, నీతి, శిల్పం, వేదాలు తెలిసిన వాడు, గానం, హాస్యం తెలిసినవాడు, సౌఖ్యములను అనుభవించువాడు అవుతాడు.

**బుధుడు, శని** కలిసి ఉన్న జాతకుడు రుణగ్రస్తుడు, డంభం కలవాడు, ఆహారం లేక తిరుగువాడు, విస్తరించువాడు, దేశ దిమ్మరి, అధికంగా తిరిగేస్వభావం కలవాడు, నేర్పరితనం కలవాడవుతాడు.

## గురువు ఇతర గ్రహ కలయిక

ద్విగ్రహ యోగంలో **గురువు శుక్రుడు** చేరిక కలిగిన జాతకుడు విద్యచేత జీవించు వాడు, ధార్మికుడు, ప్రామాణికుడు, ఉన్నతమైన భార్య కలవాడు, బుద్ధి మంతుడు మొదలైన ఉన్నత గుణవంతుడు అవుతాడు.

**గురు శనులు** చేరిక కలిగిన జాతకుడు శూరుడు, నగరాధిపతి, యశస్సు కలవాడు, సభలలో ప్రధానుడు అవుతాడు.

## శుక్రుడు ఇతర గ్రహముల చేరిక

ద్విగ్రహ యోగంలో **శుక్ర శనుల** కలయిక కలిగిన జాతకుడు చెట్లు కొట్టుట, చిత్రిక పట్టుట (కొయ్య శిల్పాలు చెక్కుట), చిత్రమైన రాతి పనియందు సమర్థుడు, బాహు యుద్ధము చేయువాడు, పశువులు కలవాడవుతాడు.



# మానవ శరీరంపై గ్రహాలు చూపే ప్రభావం



జ్యోతిశ్శాస్త్రం ప్రకారం సౌర కుటుంబంలోని అన్ని గ్రహాలు మానవ శరీరంపై ప్రభావం చూపుతాయి. ప్రతి గ్రహానికి శరీరంలోని ఒక్కో ప్రత్యేక ప్రాంతానికి సంబంధం ఉంటుంది. వీటిని స్థితి అనుకూలంగా ఉంటే ఎలాంటి ఆరోగ్య సమస్యలు ఉండవు. అదే వీటి స్థితి బలహీనంగా ఉంటే అనారోగ్యం బారిన పడతారు అంటారు.

సాంకేతికంగా **సూర్యుడు (రవి)** ఒక నక్షత్రం. వెలుగు, వేడి ప్రసాదించడమే సూర్యుడి కర్తవ్యం. సూర్యుని నుంచి గ్రహించే శక్తి భౌతిక, మానసిక చర్యలే కాదు గుండె పనితీరును కూడా సూచిస్తుంది.

సూర్యుడికి **చంద్రుడు** విరుద్ధం. శరీరానికి చల్లదనం, బలం, సమతౌల్యాన్ని చంద్రుడు అందిస్తారు. జీర్ణక్రియ, అధిక ఉష్ణం నుంచి ఉపశమనం, శరీరంలోని రక్త ప్రసరణ అనేవి చంద్రుడి ప్రసాదించే శక్తిపై ఆధారపడి ఉంటాయి.

సౌర కుటుంబంలోని ప్రకాశవంతమైన గ్రహాల్లో **బుధ గ్రహం** కూడా ఒకటి. మెదడు పనితీరు, తెలివితేటలు, నిర్ణయాలు తీసుకునే సామర్థ్యం బుధుడిపై ఆధారపడి ఉంటుంది.

**శుక్రుడు** ప్రేమకు చిహ్నం. ఈ గ్రహ స్థితి సాధారణంగా ఉంటే శరీరంలో చక్కెర నిల్వల్లో సమతౌల్యత ఉంటుంది. బలహీనంగా ఉంటే డయాబెటిస్‌కు దారి తీస్తుంది.

కిడ్నీల పనితీరు, మూత్రాశయం, క్లోమం పనితీరు **అంగారక గ్రహం**పై ఆధారపడి ఉంటుంది. అలాగే రక్త ప్రసరణ పనితీరును కూడా ఇది నియంత్రిస్తుంది. గ్రహ స్థితి బలహీనంగా ఉంటే ఉదర సంబంధ వ్యాధులకు కారణమవుతుంది.

సౌర వ్యవస్థలో అతి పెద్ద గ్రహం **బృహస్పతి.** భౌతిక సామర్థ్యం, బలం, హృదయం పనితీరు కూడా దీనిపై ఆధారపడి ఉంటుంది. జాతకంలో ఈ గ్రహం బలహీనంగా ఉంటే నీరసం, గుండె సంబంధ రోగాలకు దారితీస్తుంది.

శరీరంలోని విటమిన్లు, ఖనిజ లవణాలు సమతౌల్యతకు, **శని గ్రహానికి** సంబంధం ఉంటుంది. ఎముకల గట్టిదనం, శరీరంలో కాల్షియం స్థాయిలను కూడా ప్రభావితం చేస్తుంది. ఈ గ్రహం బలహీనంగా ఉంటే శరీరంలో పగుళ్లు ఏర్పడతాయి.

**రాహువు** తన అనుగ్రహ ప్రభావం చేత నేత్ర సంబంధిత పీడలను తొలగించును.

**కేతువు** తన అనుగ్రహ ప్రభావం చేత మనకు జ్ఞానాన్ని ప్రసాదించును.

గ్రహాల చలనం, స్థాన మార్పిడి వ్యక్తి మీద ప్రభావం చూపుతాయి. ఈ గ్రహాలన్నీ ఆరోగ్యంతోపాటు మానవ శరీరానికి సంబంధించి ఉంటాయి అని అంటారు.



# శుక్రహోరలో చేయతగిన కార్యాలు



శుక్ర హోరకు అధిపతి శుక్రుడు. శుక్రవారము లేదా చంద్రుడు భరణి, పూర్వ ఫల్గుణి, పూర్వాషాఢ నక్షత్రములలో సంచ రిస్తున్నప్పుడు శుక్ర హోరా సమయములో శుక్రుని ప్రభావము చాలా అధికముగా ఉంటుంది.

శుక్రవారం శుక్రహోరలో కఠిన హృద యాలు సైతం కరుణ, ప్రేమతో నిండే సమయము అని చెబుతారు.

పెళ్ళి చూపులకు శుక్రహోర సమయము ఉత్తమమైనది. నగలు, పట్టు చీరలు, రత్నాలు, గంధము, గ్లాసు, సుగంధ ద్రవ్యములు, అలంకరణ వస్తువులు కొనడానికి మంచి సమయము. అలాగే విలాసవంతమైన వస్తువులు, వాహనము కొనడానికి, సినిమా థియేటర్లు, స్టూడియోలు, సంగీత కళాశాలలు, పాఠశాలలు, కళాశాలలు శుక్రవారము శుక్రహోరలో ప్రారంభించుట శుభదాయకము అని పండితుల భావన.

తోళ్ళు, చర్మముతో కూడిన పరిశ్రమలు లేదా సంస్థలు, అనాథ సంక్షేమ గృహాలు మొదలగునవి ప్రారంభించుటకు శనివారం శుక్రహోర చాలా అనుకూలమైన కాలము.

పాడి పరిశ్రమ (మిల్క్ డైరీ) ప్రారంభించుటకు సోమవారం శుక్ర హోర చాలా అనుకూలమైన సమయము.

బియ్యము, ధాన్యము, వ్యాపారానికి మంగళవారం శుక్రహోర శుభ సమయము.

బిస్కట్లు, చాక్లెట్లు, పండ్లు, పూలు, కూరగాయలు, పండ్లు, పూలు, పట్టు, సిల్కుచీరలు, స్త్రీల అలంకరణ సామగ్రి, మందుల వ్యాపారాలు ప్రారంభించుటకు, హనీమూన్‌కు, శృంగార సల్లాపములకు బుధవారం శుక్రహోర చాలా అనుకూలమైన, ఆనందకరమైన సమయము.

తల్లీ పిల్లల హాస్పిటల్, పశువుల ఆసుపత్రి, ఆదాయ పన్నుశాఖ, న్యాయము, కోర్టు వంటి వాటికి సంబంధించిన ఆఫీసులను ప్రారంభించ టానికి లేదా ఆయా శాఖలలో ఉద్యోగములో చేరడానికి గురువారము శుక్రహోర శుభ సమయము.

సంబంధాలు నిశ్చయించడానికి, సంతకాలు పెట్టడానికి, ఔషధ సేవకు, స్త్రీలలో మెలగడానికి, రైలు ప్రయాణానికి, నూతన వస్త్రాలు ధరించడానికి, సమస్త శుభకార్యాలకు, నిశ్చయ తాంబూలాలకు మంచిది.

నువ్వులు, నూనె, మినుములు, ఇనుము, నేతి వస్తువులు మొదలైన వ్యాపారానికి మంచిది.





**వివాహ కారకుడైన చంద్రుడు, శుక్రుడు, సప్తమాధిపతి ఉన్న గ్రహాలతో రాహువు, కేతువు సంబంధం ఉన్నా కులాంతర వివాహం జరిగే అవకాశము కలదు.**

# జన్మ రాశి ఫలము మరియు జన్మ లగ్న ఫలము మధ్య గల తేడా ఏమిటి?

## జన్మ లగ్నము



బ్రహ్మ చేత నిర్ణయించబడినది, కాల నిర్ణయమును నవగ్రహముల ఆధారంగా తెలుసుకోవడానికి ఏర్పరచిన ప్రారంభ కాలము తెలుపునది ఈ జన్మలగ్నము.

బ్రహ్మ చేత జీవి యొక్క జీవనము భూమిపై కలుగు సుఖదుఖఃములను యోగ వియోగములను తెలుసుకొనుటకుగల ప్రారంభము తెలుసుకొనుటకు నిర్ణయించిన ముహూర్తము ఈ జన్మ లగ్నము.

తల్లి గర్భము నుండి శిశువు భూమిపై అడుగు పెట్టు మొదటి క్షణము. ప్రాణి జీవనానికి మొదటి క్షణము.

ఒక మానవుడు తన పూర్వ జన్మల పాప పుణ్య ఫలమును ఏవిధముగా అనుభవిస్తాడో తెలుసుకొనుటకు బ్రహ్మచేత నిర్ణయించిన శాస్త్రము ఈ జ్యోతిష శాస్త్రము.

జ్యోతి అంటేనే వెలుగు అనగా దారిచూపేది అనగా పాప పుణ్యములను తెలుసుకొని ఏ విధముగా అనుభవిస్తాడో తెలుసుకోగలిగే మహోత్తరమయినది ఈ జ్యోతిష్యశాస్త్రము.

లగ్నము అంటే కలయిక అని కూడా ఉన్నది. జీవి ఈ లోకములో కలయికను లగ్నము అంటాము.

ఈ లగ్నము ఆధారముగా నవగ్రహములలో పుణ్య ఫలము ప్రసాదించే శుభ గ్రహము పాప ఫలము ప్రసాదించే పాప గ్రహము యొక్క నిర్ణయము చేయబడుతుంది.

లగ్నము ననుసరించి శుభ పాప గ్రహ నిర్ణయము తెలుసుకొని చెప్పబడే ఫలితము శాస్త్ర ప్రమాణానికి నిలుస్తుంది.

## 2. జన్మ రాశి

ఆకాశములో గ్రహములు సంచరించు కాలచక్రమును 12 భాగములుగా చేసి వాటికి రాశి అని పేరు పెట్టారు.

ఇక జన్మ రాశి అనగా జనన కాలములో గ్రహ సంచారములలో చంద్రుడు ఏ నక్షత్రము పై ఉండునో ఆ నక్షత్రము ఏ రాశిలో ఉండునో దానిని జన్మ రాశి అంటారు.

ఈ జన్మ రాశి వలన ఫలము చెప్పడము ప్రస్తుతము ఉన్నది కాని అది సరియైన పద్ధతి కాదు అని కొందరి భావన.

ఎందుకనగా ఎక్కడ ఒక ప్రశ్న తలెత్తుతుంది. జ్యోతిష శాస్త్రములో ఉన్న తొమ్మిది గ్రహములు 12 రాశులలో ఉన్న 27 నక్షత్రములలో ఏదో ఒక నక్షత్రముపై జాతకుడు పుట్టిన సమయమందు సంచరిస్తుంటాయి.

అలాంటప్పుడు తొమ్మిది గ్రహములను పరిగణలోకి తీసుకోనకుండా ఈ ఒక్క చంద్రుడినే తీసుకొని మిగిలిన 8 గ్రహములను వదిలి ఫలితము చెప్పడము శాస్త్రము కాదు.

అలా చంద్రుడిని అనుసరించి ఫలితము చెప్పిన నవగ్రహ మండలము ఏమి కావాలి? ఈ చంద్రుడికే అంతటి ఫలము చెప్పు బలము ఉన్న మిగిలిన 8 గ్రహముల బలము ఏమి కావాలి?

నవగ్రహ కలయికవలెనే చరాచర జీవులన్నీ పుడుతున్నవి మరణిస్తున్నవని ధర్మశాస్త్రములు చెపుతున్నాయి. అందుకు కారణభూతుడు ఆ భగవంతుడు నిలిచి ఉన్నాడని తెలుపుతున్నాయి. అటువంటప్పుడు నవగ్రహ కలయిక కలిగిన లగ్నము ననుసరించి చెప్పు ఫలము నిలుస్తుంది కాని 8 గ్రహములను విడిచి ఒక్క చంద్రుడి ఉన్న రాశి ననుసరించి తల తోక తెలియక చెప్పు ఫలము నిష్ఫలము అగును. అలా చెప్పువానికి పాపము కూడా కలుగును అని భావన.

## శాస్త్రము శాసించాలి, ప్రమాణమునకు నిలవాలి

జన్మ రాశి ననుసరించి ఫలము చెప్పినప్పుడు ఈ జన్మ లగ్నము ఎందుకు? శాస్త్రమునకు లగ్నమే బలము. ఆ లగ్నము ననుసరించి శుభ పాప గ్రహములను అనుసరించి చెప్పు ఫలము నిలుస్తుంది. కాని జన్మ రాశి ననుసరించి చెప్పు ఫలము నిలువదు.

జన్మరాశి ననుసరించి చెప్పు విధానము పూర్వములో శాస్త్రము తెలియని వారు పాండిత్యబలము చేత రచించిరని పరిశీలనలో తెలియుచున్నది.

పుట్టుక మొదలు తెలుపునది జన్మ లగ్నము.

దశా యోగము తెలుపునది చంద్రుడు ఉన్న నక్షత్రము.

శుభ గ్రహ పాప గ్రహ విభజన తెలుపునది జన్మ లగ్నము. 

# నవ మాసాలు - నవ గ్రహాలు



పిండోత్పత్తి ప్రారంభమయిన దగ్గర నుండి శిశుజననం వరకు తల్లి గర్భములో పిండం ప్రతి మాసం మార్పులు చెందుతూ ఉంటుంది. ఆ మార్పుల ఆధారంగా ప్రతి మాసమునకు ఒక్కొక్క గ్రహం అధిపతిగా ఉంటారు.

**1వ మాసం శుక్ర గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో శుక్ర శోణితాలు ద్రవ రూపంలో ఉంటాయి.

**2వ మాసం కుజ గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో శుక్ర శోణితాలు గట్టిపడుతుంటాయి.

**3వ మాసం గురుగ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో జీవం ప్రారంభమవుతుంది. అవయవాలు ఏర్పడటం ప్రారంభమవుతుంది.

**4వ మాసం రవి గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో ఎముకలు ఏర్పడటం ప్రారంభమవుతుంది.

**5వ మాసం చంద్ర గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో ద్రవ పదార్థాలు ఏర్పడతాయి. చర్మం ఏర్పడటం ఆరంభమవుతుంది.

**6వ మాసం శని గ్రహం** ప్రాదాన్యత వహిస్తూ పిండంలో శిశువుకు కేశాలు ఏర్పడతాయి.

**7వ మాసంలో బుధ గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో శిశువుకు స్పర్శ జ్ఞానం ప్రారంభమవుతుంది.

**8వ మాసంలో** తల్లి లగ్నాధిపతి ప్రాధాన్యత వహిస్తూ ఉంటుంది.

**9వ మాసంలో చంద్ర గ్రహం** ప్రాధాన్యత వహిస్తూ పిండంలో శిశువుకు ఆహారం తీసుకోవటం తెలుస్తాయి.

**10వ మాసంలో రవి గ్రహం** ప్రాదాన్యత వహిస్తూ ఉంటుంది.

పై గ్రహాలు అవి సూచించు మాసాలలో గర్భంలోని శిశువుపై ప్రభావాన్ని సూచిస్తాయి. గర్భవతిగా స్త్రీ కి ఎన్నవ మాసం జరుగుతుందో ఆ మాసాధిపతి ఆ మాసములో గోచారంలో బలహీనపడరాదు. అదే విధంగా ఒక స్త్రీ జాతకంలో ఏదైనా గ్రహం బలహీనంగా ఉంటే ఆ గ్రహం సూచించు మాసములో గర్భములోని శిశువుకు ఇబ్బందులు ఏర్పడటం లేదా గర్భస్రావం జరగటం లేదా గర్భవతికి గర్భ సంబంధమైన ఇబ్బందులు ఏర్పడటం జరుగుతాయి.

ఉదాహరణకు గర్భవతి జాతకంలో రవి బలహీనపడిన నాల్గవ నెలలో ఇబ్బందులు కలగటం లేదా ప్రసవ సమయంలో కష్టాలు కలుగుతాయి. ఈ విధంగా స్త్రీ జాతకంలో ఏ గ్రహం బలహీనంగా ఉన్నదో మరియు గర్భవతిగా ఉన్నప్పుడూ ఏ మాసం జరుగుతుందో ఆ మాసాధిపతి ఆ మాసంలో గోచారంలో బలంగా ఉన్నాడో లేదో ముందుగానే పరిశీలించి ఆ గ్రహానికి శాంతి ప్రక్రియలు చేయించుకున్న గర్భ రక్షణ జరుగును.



# నవగ్రహ దోషముల వలన కలుగు వ్యాధులు - శాంతులు




రవి మొదలైన నవగ్రహములు గోచారరీత్యాగాని లేక జాతక రీత్యాగాని వారియొక్క దశ, అంతర్ధశలయందు దుష్టస్థానములయందు న్నపుడు ఆయా గ్రహములకు ఈ క్రింద తెలిపిన ప్రకారము ఆయా రోగములు సంభవించును. ఆ సమయములో ఈ గ్రహములకు తగిన శాంతులు జరిగించిన ఆరోగ్యము, మనశ్శాంతి కలుగును అని భావన.

**1. రవి :** కంటికి సంబంధించిన వ్యాధులు, తలనొప్పి, సన్నిపాతం, పైత్యవికారములు, క్షయ, పొడిదగ్గు, అతిసారము, శరీర అవయవములలో ఎడమ పార్శ్వమునకు నొప్పులు, గుండెకు సంబంధించిన బాధలు, చర్మ సంబంధమైన వ్యాధులు కలుగును. రవి ప్రీతికి ఒక కిలో గోధుమలు ఆదివారము దానము ఇవ్వవలెను. రవికి 6 వేలు జపము, ఈశ్వరాభిషేకము చేయించవలెను. జాతి కెంపు ఉంగరములో ధరించవలెను.

**2. చంద్రుడు :** శ్వాసకోశసంబంధమైన వ్యాధులు, ఆయాసము, దగ్గు, కంఠము, పొట్ట, కుడి భాగమునందున్న అవయవములు, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు, బొల్లి, పాండు రోగము, క్షయ, బోద, అండ రోగములు, కామెర్ల, మూత్రకోశ సంబంధమైన వ్యాధులు, జలోదరము మొదలగునవి కలుగును. చంద్రప్రీతికి కిలో బియ్యం సోమవారము దానము ఇవ్వవలెను. చంద్రునికి 10 వేలు జపము చేయించవలెను. జాతి ముత్యము ఉంగరములో ధరించవలెను.

**3. కుజుడు :** చర్మ సంబంధమైన వ్యాధులు, దురదలు, కురుపులు, కండ్ల జబ్బులు, నులి పురుగులు, కన్ను ముక్కు చెవి, పన్ను (Teeth) మొదలగు వానివలన బాధలు, మూత్ర సంబంధమైన బాధలు, గిలక, అండములు, వాచుట, శూల, కఫము, ఎముకలకు సంబంధించి బాధలు, నోరు, గొంతుక మొదలగు వానియందు కురుపులు, అరుచి కలుగును. వాహన ప్రమాదములు, ఎముకలు విరుగుట, ఇనుప పనిముట్లవలన గాయములు, శస్త్రభయం, కర్ర, కత్తి మొదలగు వానివలన దెబ్బలు తగులుట, జారిపడుట జరుగును. కుజ ప్రీతికి కిలో కందులుగాని, కందిపప్పుగాని మంగళవారం దానం ఇవ్వవలెను. కుజునకు 7 వేలు జపము, సుబ్రహ్మణ్యేశ్వరునికి అభిషేకము చేయించవలెను. జాతి పగడము ఉంగరములో ధరించవలెను.

**4. బుధుడు :** నపుంసకత్వము, చర్మవ్యాధులు, ఉదర సంబంధమైన వ్యాధులు, పొత్తికడుపు వద్ద బాధలు, మూలశంఖ, పైత్యగ్రహణి, వాతరోగం, శ్లేష్మరోగ సంబంధమైన వ్యాధులు, చర్మరోగములు, మాటలు సరిగా రాకపోవుట, కురుపు, పాండు, నాలుక సంబంధించిన బాధలు, నోరు అరుచిగా యుండును. బుధప్రీతికి కిలో పెసలు బుధవారం దానం యివ్వవలెను. విష్ణు సహస్రనామాలు పారాయణ చెయ్యవలెను. బుధునకు 17వేలు జపం చేయించవలెను. జాతిపచ్చ ఉంగరములో ధరించవలెను.

**5. గురుడు :** బుద్ధికి సంబంధించిన బాధలు, మందత్వము, జ్ఞాపకశక్తి తగ్గుట, మెదడు, ఊపిరి తిత్తులు, పేగులకు సంబంధించిన వ్యాధులు, శ్లేష్మం, పైత్యవికారములు, గుల్మరోగములు, చంచల మనస్సు ఉదర సంబంధమైన బాధలు. గురు ప్రీతికి కేజీ శనగలు గురువారం దానం యివ్వవలెను. గురునకు 16 వేలు జపం చేయించవలెను. నమక పారాయణ చేయించవలెను. కనక పుష్యరాగము లేక పుష్యరాగము ఉంగరములో ధరించవలెను.

**6. శుక్రుడు :** మూత్రసంబంధమైన వ్యాధులు, జననేంద్రియ, గుప్త రోగములు, మధుమేహ రోగములు, ముక్కుకి సంబంధించిన బాధలు, పైత్య వికారములు, కడుపునొప్పి, సుఖవ్యాధులు, అతిమూత్ర రోగములు కలుగును. శుక్ర ప్రీతికి కిలో బొబ్బర్లు శుక్రవారం దానం యివ్వవలెను. శుక్రునకు 20 వేలు జపం చేయించవలెను. ప్రతి శుక్రవారము మహాలక్ష్మి పూజ చేయించుచుండవలెను. జాతివజ్రము ఉంగరములో ధరించవలెను.

**7. శని :** నరముల బలహీనత, కాలేయమునకు సంబంధించిన రోగములు, గుల్మరోగములు, సంధి, ఇంద్రియ నష్టం, మనశ్చాంచల్యము, పిశాచభయం,

పక్షవాతం, కుడి ప్రక్క చెవినొప్పి మొదలైన వాత సంబంధ మైన నొప్పులు కలుగును. శనిప్రీతికి నువ్వులు శనివారం దానం యివ్వవలెను. శనికి 19 వేలు జపము చేయించవలెను. ప్రతినిత్యము శివప్రార్థనలు, శని స్తోత్రములు చదువుచుండవలెను. ఏలిననాటి శని దోషమనగా శని 12, 1, 2 రాశులయందు సంచరించు కాలము. ఈ దోషము 7 సంవత్సరముల 6 నెలలు యుండును. శనిత్రయోదశిరోజున మందవల్లి మొదలైన శని క్షేత్రములలో శనికి తైలాభిషేకము చేయిం చవలెను.

**8. రాహువు :** అపస్మారము, భూత ప్రేత పిశాచ బాధలు, మూలశంఖ, ఉబ్బస వ్యాధులు, శూల, రక్తదోషములు, మతిభ్రమణం, కంటికి సంబంధించిన వ్యాధులు, విష జంతుభయం, విష ప్రయోగములు, పైశాచిక ప్రవర్తన కలిగించును. రాహుప్రీతికి కిలో మినుములు శనివారం దానం యివ్వవలెను. రాహువుకు 18వేలు జపం చేయించవలెను. దుర్గా పూజ (అమ్మవారికి కుంకుమపూజ) చేయించుచుండవలెను. జాతి గోమేధి కము ఉంగరములో ధరించవలెను.

**9.కేతువు :** గజ్జి, కురువులు, నీరసం, కాళ్లకు, చేతులకు దురదలు, తిమ్మెర్లు, విషజంతుభయం, శరీర రుగ్మతలు, నిస్సత్తువ, అనాయాస మరణము, అవమృత్యుభయం కలిగించును. కేతుప్రీతికి కిలో ఉలవలు మంగళవారం దానము యివ్వవలెను. కేతువుకు 7 వేల జపము చేయించ వలెను. సూర్యప్రార్థనలు, సూర్య నమస్కారములు చేయించవలెను. జాతి వైఢూర్యము (పిల్లికన్నురాయి) ఉంగరములో ధరించవలెను.



# గ్రహస్థానాలను పరిశీలించే యోగాలు



జ్యోతిష్యశాస్త్రంలో అనేక యోగాలు సూచింపబడ్డాయి. రాశి, అంశ చక్రాలలో ఉన్న గ్రహస్థానాలను పరిశీలిస్తూ ఈ యోగాలు ఉంటాయి. యోగాలను అనుసరించి ఫలితాలు ఉంటాయి.

## రవి సంబంధిత యోగాలు

జ్యోతిష్యంలో సూర్యుని రవి అంటారు అలా సూర్యునికి సంబంధించిన యోగాలు :

**1. బుధాదిత్య యోగం :** రవి బుధుడు ఏ రాశిలో ఉన్నా దానిని బుధాదిత్య యోగం అంటారు.

**ఫలితం:** సామర్థ్యం సూక్ష్మగ్రాహి, విచక్షణతో కూడిన కార్యాలు, పట్టు వదలని ప్రయత్నం వీరి స్వంతం.

**2. శుభవేశి యోగం :** రవికి 2వ స్థానంలో శుభగ్రహాలు ఉంటే శుభవేశి యోగం అంటారు.

**ఫలితం:** ప్రశాంత జీవితం, కీర్తి, మర్యాద, అదృష్టం వరించుట.

**3. శుభవాశి యోగం :** రవికి 12వ స్థానంలో శుభగ్రహాలు శుభవాశి యోగం అంటారు.

**ఫలితం:** కీర్తి, సంపద, పలుకుబడి, వాక్పటిమ, స్వయంకృషితో అభివృద్ధి.

**4. ఉభయరాశి యోగం :** 2, 12 స్థానాలలో శుభగ్రహాలు ఉంటే ఉభయరాశి యోగం అంటారు.

**ఫలితం:** సంతోషం, సంపద, కీర్తి, మర్యాద, పలుకుబడి, ప్రయత్నంతో ముందుకు రావడం.

## చంద్రుడు సంబంధిత యోగాలు

**5. చంద్రమంగళ యోగం :** చంద్రుడు, కుజుడు ఒకే స్థానంలో ఉన్నా నేక చంద్రునికి కేంద్రంలో అంటే 1, 4, 7, 10 స్థానాలలోఉంటే చంద్రమంగళ యోగం అంటారు.

**ఫలితం:** రసాయన, ఔషధ వ్యాపారంలో విజయం. మనో చంచలం రావడానికి అవకాశం.

**6. వసుమతి లేక లక్ష్మి యోగం :** చంద్రునికి ఉపజయ స్థానాలయిన 3, 6, 10, 11 స్థానాలలో బుధుడు, శుక్రుడు, గురువు ఉంటే వసుమతి లేక లక్ష్మి యోగం అంటారు.

**ఫలితం:** అకస్మాత్తుగా ధనాగమనం. ఎన్ని కష్టాలు ఎదురైనా ఈ యోగ జాతకులకు ధనం కొరత ఉండదని శాస్త్రం చెప్తుంది.

**7. గజ కేసరి యోగం :** చంద్రునికి కేంద్రంలో గురువు ఉంటే గజ కేసరి యోగం అంటారు.

**ఫలితం:** కీర్తి ప్రతిష్టలు, శత్రుజయం, ధనాగమనం, సంపద, దీర్ఘాయువు.

**8. అనపా యోగం :** చంద్రునికి 12 స్థానాలలో రాహువు, కేతువు మనహా మిలిన గ్రహాలు ఉంటే అనపా యోగం అంటారు.

**ఫలితం:** ఆరోగ్యమైన శరీరం.

**9. శునభా యోగం :** చంద్రునికి 2లో రాహువు, కేతువు మనహా మీలిన గ్రహాలు ఉంటే అనపా యోగం అంటారు.

**ఫలితం :** స్వప్రయత్నంతో సంపాదన.

---

**10. కేమాద్రుమ యోగం :** చంద్రునికి 2, 12 స్థానాలలో ఏగ్రహాలు లేకుంటే అనపాయోగం అంటారు. ఈ యోగం పీడ, కీడు కలిగిస్తుంది. అయినా కేంద్రం అంటే 1, 4, 7, 10 స్థానాలలో ఏదైనా గ్రహం ఉంటే నివృత్తి ఉంటుంది. 12 అది యోగం చంద్రుడికి 6, 7, 8 స్థానాలలో శుభగ్రహాలు ఉంటే అది యోగం అంటారు.

**ఫలితం :** కారు, బంగళా లాంటి వసతులు కలిగిన జీవితం.

---

**11. శకటయోగం :** చంద్రునికి, 6, 8, 12వ స్థానంలో గురువు ఉంటే శకట యోగం అంటారు. రాశి చక్రములోని గ్రహములన్ని లగ్నము, సప్తమ స్థానమల మాత్రమే ఉన్న శకట యోగము అంటారు. గురువు లగ్నము తప్ప మిగిలిన స్థానములలో ఉన్న శకట యోగము సంభవిస్తుంది.

**ఫలితం:** నిలకడ లేని జీవితం, అవమానము, ఆబుధికబాధలు, శారీరక కష్టము, మానసిక బాధలు కలిగించును. ధనవంతుల ఇంట పుట్టినా ఈ యోగప్రభావమున పేదరికము అనుభవించ వలసి ఉంటుంది. అర్హతకు తగిన గౌరవము ఉండదు. మరిఏ ఇతర బాధలు ఉండవు. ఈ యోగముకు భంగము ఏర్పడినప్పుడు సమస్యలు ఉన్నా గౌరవ మర్యాదలకు భంగము వాటిల్లదు.

---

**యోగభంగము :** చంద్రుడు బలము కలిగి ఉన్న ఈ యోగము భంగము అవుతుంది. చంద్రుడి మీద కుజుడి దృష్టి ఉన్న ఎడల ఈ యోగము

భంగము అవుతుంది. లగ్నాధిపతి, భాగ్యాధిపతి బలముగా ఉన్న ఈ యోగము భంగము అవుతుంది. గురువు చంద్రుడి కంటే బలముగా ఉన్న ఈ యోగము భంగము అవుతుంది. చంద్రుడు ఉచ్ఛస్థితిలో వృషభములో ఉన్న ఎడల ఈ యోగము భంగము అవుతుంది. చంద్రుడు స్వరాశి అయిన కటకములో ఉన్న ఈ యోగము భంగము అవుతుంది. రాహువు చంద్రుడితో కలసి ఉన్న ఈ యోగము భంగము అవుతుంది. రాహువు దృష్టి గురువు మీద ఉన్నప్పుడు ఈ యోగము భంగము అవుతుంది.

లగ్నములో చంద్రుడు లేక గురువు ఉన్నా, శుక్రుడు చంద్రుడితో కలసి ఉన్నా, ఈ శకత యోగము ధనప్రాప్తి కలిగించును. చంద్రుడు ఇదే యోగము చంద్రుడు మిధున, కన్యా, తులా, వృశ్చికములలో ఉన్న కలుగును. అలాగే కటకములో శుక్రుడు బుధుడితో కలసి ఉన్నా ఈ యోగము కలుగును.

**12. తృతురా యోగం :** చంద్రునికి 2, 12 స్థానాలలో రాహువు, కేతువు కాక మిగిలిన ఏ గ్రహాలు ఉన్నా తృతురా యోగం అంటారు.

**ఫలితం:** ఆదాయాన్ని మించిన ఖర్చులు, దారిద్ర్యం నుండి విమోచనం దొరకడం కష్టం. స్వల్ప సంతానం, అమిత ధైర్యం, కూడబెట్టిన ధనం పరుల స్వంతం.

**రాజయోగం :** 1. విపరీత రాజయోగం 6వ స్థానాధిపతి 8, 12 స్థానాలలో ఉన్నా, 8వ స్థానాధిపతి 6వ, 12వ స్థానాలలో ఉన్నా, 12వ స్థానాధిపతి 6వ, 8వ స్థానాలలో ఉన్నా విపరీత రాజయోగం అంటారు. గ్రహాలు మిత్ర, ఉచ్ఛ, రాజ్య స్థానాలలో ఉంటే చక్కని ఫలితం.

**ఫలితం:** ఆయా స్థానాలలో ఉన్న అధిపతి దశాకాలంలో శుభ ఫలితాలు ఉంటాయని శాస్త్రం చెప్తుంది. పైన చెప్పిన పద్ధతిలో ఉంటే విపరీతమైన ధనాగమనం సంభవం.

**ధర్మకర్మాధిపతి యోగం :** తొమ్మిది పది అధిపతులు కలసి ఏ రాశిలోఉన్నా ఒకరిపై ఒకరు దృష్టి సారించినా పరిమార్పు చెందినా ధర్మకర్మాధిపతి యోగం అంటారు. ఈ యోగం ఉంటే ధన కనక వస్తువాహనాలు జాతకునకు లభిస్తాయని శాస్త్రవివరణ.

**అందగిరి యోగం :** మేషం, కటకం, వృషభం, మకరం రాశులలో మిగిలిన గ్రహాలు ఉభయ రాశులలో ఉంటే అందగిరి యోగం అంటారు. ఈ యోగం ఉన్న జాతకుడు సంపన్నుడౌతాడు.

## గ్రహ ఉచ్ఛం యోగం

**1. ఋశక యోగం :** కుజుడు ఉచ్ఛం అంటే మకర రాశి, లేక రాజ్యం అంటే మేషరాశి, వృశ్చికరాశిలలో ఉండి అవి కేంద్రం అనబడే 1,4,7,10 స్థానాలైతే ఋశక యోగం అంటారు.

**ఫలితం:** హోం, రక్షణ మంత్రి పదవిలాంటి ఉన్నత పదవి. శతృజయం, దేహబలం, గర్వం, మొండి వైఖరి, అకస్మాత్తు అదృష్టం, యోగ కారణంగా లభ్యమైన ధనం తానే విపరీతంగా ఖర్చుచేయుట.

**2. భద్రక యోగం :** బుధుడు ఉచ్ఛం అంటే కన్యారాశి, రాజ్యం అంటే కన్య, మిధున రాశులులలో ఉండి కేంద్రం అనబడే 1, 4, 7, 10 స్థానాలలో ఉంటే భద్రక యోగం అంటారు.

**ఫలితం:** దీర్ఘాయువు, మేధావి, వాక్పటిమ, సూక్ష్మగ్రాహి, ఐశ్వర్యం, ప్రజాకర్షణ రాజ్యపాలన.

**3.హంస యోగం :** గురువు ఉచ్చం అంటే కటకరాశి, రాజ్యం అంటే ధనసు రాశి, మీన రాశులులలో ఉండి కేంద్రం అనబడే 1, 4, 7, 10 స్థానాలలో ఉంటే హంస యోగం అంటారు.

**ఫలితం:** సాధువులను గౌరవించడం, నీతిమంతుడు, అందమైన శరీరం, శుభ్రమైన ఆహారం అంటే ప్రీతి, అకస్మాత్తుగా అదృష్టం కలిగి ధనవంతుడు కావడం, భూ ఆధిపత్యం.

**4.మాళవ యోగం :** శుక్రుడు ఉచ్చం అంటే మీనరాశి, రాజ్యం అంటే వృషభరాశి, తులరాశిలలో ఉండి కేంద్రం అనబడే 1, 4, 7, 10 స్థానాలలో ఉంటే మాళవ యోగం అంటారు.

**ఫలితం:** దృఢ శరీరం, ధైర్యం, స్త్రీ జనాకర్షణ, అదృష్ట జాతకం, విస్తార ధనం ఉత్తమ కళా నైపుణ్యం.

**5.ససక యోగం :** శని ఉచ్చం అంటే తులారాశి, రాజ్యం అంటే మకర రాశి, కుంభరాశిలలో ఉంటే ససక యోగం అంటారు.

**ఫలితం:** లోక జనాకర్షణ, అకస్మాత్తుగా అదృష్టం, ప్రపంచం నలుమూలలా ఆస్థులు, దేశాధిపత్యం.

## నాభాసయోగాలు

నాభాసయోగాలు ముప్పై రెండు. అవి వరుసగా నౌకా, ఛత్ర, కూట, కార్ముక, శృంగాటక, వజ్ర, దామపాళ, వీణ, పద్మ, ముసల, వాసి, హల, శర, సముద్ర, చక్ర, మాల, సర్ప, అర్ధేందు, యవ, కేదార, గద, విహగ, యూప, యుగ, శకట, శూల, దండ, రజ్జు, శక్తి, సల, గోళములు. జాతక చక్రములు అన్ని ఈ యోగాలలో ఏదో ఒక యోగంలో ఇమిడి ఉంటుంది.

నాభాస యోగములు సంఖ్యా యోగము, దళ యోగము, ఆకృతి యోగములని మూడు విధములు.

**నౌకా యోగం :** లగ్నము నుండి సప్తమ స్థానము వరకు ఏడు రాశుల అందు గ్రహములు అన్నీ ఉపస్థితమై ఉన్న నౌకా యోగం అంటారు.

**ఫలితం :** నౌకా యోగమున జన్మించిన జాతకుడు జల ఆధారిత సంపద కలిగి ఉంటాడు. లాభాధిక్యత కలిగి లోభ గుణం కలిగి ఉంటాడు.

**ఛత్ర యోగం :** చతుర్ధ స్థానం నుండి గ్రహములు అన్నీ ఉపస్థితమై ఉన్న ఛత్ర యోగం అంటారు.

**ఫలితం :** ఛత్ర యోగమున జన్మించిన జాతకుడు స్వజనులను ఆశ్రయించి ఉండువాడు, బుద్ధిమంతుడు, దాత, రాజుకు కావలసినవాడు, బాల్యమున వార్ధక్యమునందు సుఖము, భాగ్యము, అఖండ ఐశ్వేర్యం కలిగి ఉంటాడు.

**కూట యోగం :** సప్తమ కేంద్రము మొదలు గ్రహములన్నీ ఉపస్థితమై ఉన్న కూట యోగం అంటారు.

**ఫలితం :** కూట యోగమున జన్మించిన వాడు చెరసాల కాపలా చేయువాడు, అబద్ధము, జూదము, వంచన, క్రూరత్వం, దారిద్యం మొదలైనవి కలిగి దుర్గములందు నివసించు వాడుగా ఉంటాడు.

**కార్ముఖ యోగం :** దశమ స్థానం నుండి గ్రహములు అన్నీ ఉపస్థితమై ఉన్న కార్ముఖ యోగం అంటారు.

**ఫలితం :** కార్ముక యోగమున జన్మించిన వాడు రహస్యంగా చరించు వాడు, అసత్యం చెప్పువాడు, దొంగ, జూదరి, అరణ్య సంచారం, మధ్య వయసులో దరిద్రుడు అయి ఉంటాడు.

**యూప యోగం :** లగ్నము నుండి నాలుగవ స్థానం వరకు గ్రహములన్నీ ఉపస్థితమై ఉన్న యూపయోగం అంటారు.

**ఫలితం :** ఆత్మ రక్షణ, త్యాగము, ధనము, సౌఖ్యవంతుడు, వ్రతయమము, సాము అందు ఆసక్తుడు అవుతాడు.

---

**శర యోగం :** చతుర్థ కేంద్రము మొదలు నాలుగు రాశులలో వరకు గ్రహములన్నీ ఉపస్థితమై ఉన్న శరయోగం అంటారు.

**ఫలితం :** ఆయుధములను చేయుట, దొంగలను బంధించుట, వేటాడుట, ఉన్మత్తత, క్రూరత్వము, కుశ్చితత్వము, శిల్పములందు ఆసక్తి కలవాడు అవుతాడు.

---

**శక్తి యోగం :** సప్తమ స్థానం నుండి గ్రహములన్నీ నాలుగు స్థానముల ఉపస్థితమై ఉన్న శక్తి యోగం అంటారు.

**ఫలితం :** వికలత్వము, ధనహీనత, అలసత్వము, అల్పాయుష్షు, సౌంద ర్యము, యుద్ధ నైపుణ్యము కలవాడు అఔతాడు.

---

**దండ యోగం :** దశమ స్థానం నుండి నాలుగు రాశులందు గ్రహములన్నీ ఉపస్థితమై ఉన్న దండయోగం అంటారు.

**ఫలితం :** దండ యోగమున జన్మించిన వాడు హత ధారా పుత్రులు, సర్వజన ద్వేషం, బంధు విరోధము, దుఃఖము, సేవకము, నీచ గుణము కలవాడు అవుతాడు

---

**అర్ధ చంద్ర యోగం :** రెండవ లేక మూడవ స్థానం నుండి గ్రహములన్ని ఉపస్థితమై ఉన్న అర్ధ చంద్ర యోగం అంటారు.

**ఫలితం :** సేనాధిపతి, రాజాభిమానానికి పాత్రుడు, సౌందర్యవంతుడు, మణిలు సువర్ణములు ఆభరణములు పొందు వాడు, సౌందర్యవంతుడుగా ఉంటాడు.

**గదా యోగం :** గ్రహములన్నీ సమీపముగా ఉన్న రెండు కేంద్రముల ఉపస్థితమై ఉన్న గదా యోగం అంటారు. అనగా లగ్న, చతుర్ధ స్థానము లేక, చతుర్ధ, సప్తమ స్థానం, సప్తమ, దశమ స్థానం, దశమ, లగ్న స్థానం అందు ఉన్న గదా యోగం అంటారు.

**ఫలితం :**గదా యోగమున జన్మించిన వాడు శాస్త్ర పారంగతుడు, యోగ విద్యావంతుడు, యజ్ఞము చేయు వాడు, అభిమానవంతుడు, ధన కనక వస్తు రజ్ఞములు కలవాడు అవుతాడు.

---

**వజ్ర యోగం :** లగ్న, సప్తమ కేంద్రలందు శుభ గ్రహములు చతుర్ధ, దశమ స్థానములందు అశుభ గ్రహములు ఉన్న వజ్ర యోగం అంటారు

**ఫలితం :** శౌర్యము, ఆరోగ్యము, చక్కదనము, స్వజనముతో విరోధము కలవాడు, భాగ్యహాని కలుగుట, బాల్యమున వార్ధక్యమున సుఖము కలవాడు అవుతాడు.

---

**యవ యోగం :** లగ్న, సప్తమ కేంద్రలందు ఆశుభ గ్రహములు చతుర్ధ, దశమ స్థానములందు శుభ గ్రహములు ఉన్న యవ యోగం అంటారు.

**ఫలితం :** యవ యోగమున జన్మించిన వాడు వ్రత నియమ శుభ కార్యముల అందు ఆసక్తుడు, యౌవనమున సుఖవంతుడు, ధనవంతుడు, దాత్రుత్వం, స్థిరమైన ధనం కలవాడుగా ఉంటాడు.

---

**పద్మక యోగం :** నాలుగు కేంద్రములందు మిశ్రమముగా గ్రహములన్నీ ఉన్న పద్మక యోగం అంటారు. అనగా లగ్న సప్తమాలలో ఒక దానిలో శుభ గ్రములు ఒక దానిలో అశుభ గ్రహములు అశుభులు ఉండవలసిన చతుర్ధ, దశమ స్థానాలలో ఒక దానిలో అశుభగ్రహములు మరొక దానిలో శుభ గ్రహములు ఉన్న పద్మక యోగం అంటారు. కాని వజ్ర, యూప, పద్మక యోగములు యోగములు అసంభములని వరాహ మిహిరుని అభిప్రాయం.

**ఫలితం :** పద్మయోగమున జన్మించినవాడు సౌందర్యము, సద్గుణ సంపత్తి, గొప్ప కీర్తి, భూస్వామిత్వము, చిరాయువు కలవాడు.

**వాపీ యోగం :** లగ్నముకు రెండు లేక మూడు స్థానములలో ఒక దానిలో శుభగ్రహములు మరొక దానిలో అశుభగ్రహములు ఉపస్థితమై ఉన్న వాపీ యోగం అంటారు.

**ఫలితం :** వాపీ యోగమున జన్మించిన వాడు సుస్వరూపము, నేత్ర సౌఖ్యము, స్థిరమైన ధన సౌఖ్యములు, ధన నిక్షేపాదుల అందు సమర్థుడుగా ఉంటాడు.

**శకట యోగం :** గ్రహములన్నీ లగ్న సప్తమమున ఉపస్థిమైన శకట యోగం అంటారు.

**ఫలితం :** శకట యోగమున జన్మించిన వాడు రోగ పీడితుడు, మూర్ఖుడు, దుష్టురాలైన భార్య కలిగిన వాడు, దరిద్రుడు, బంధు మిత్ర జనహీనుడు, బండి మీద జీవనం సాగిస్తాడు.

**విహగ యోగం :** గ్రహములన్నీ చతుర్థ దశములందు ఉపస్థిమై ఉన్న విహగయోగం అంటారు.

**ఫలితం :** విహగ యోగమున జన్మించిన వాడు తిరుగట అందు ఆసక్తుడు, దౌత్యము, కలహ ప్రియత్వము, నీచజీవనము, పొగరు, నీచ స్వభావం కలవాడు అవుతాడు.

**వాల యోగం :** గ్రహములన్నీ లగ్న త్రికోణం వదిలి మిగిలిన త్రికోణము లందు ఉపస్థితమై ఉన్న వాలయోగం అంటారు. అంటే రెండవ, ఆరవ, దశమ స్థానాలు లేక మూడవ, ఏడవ, ఏకాదశ స్థానాలు, నాలుగవ, ఎనిమిదవ, పన్నెండవ స్థానముల ఉపస్థితమై ఉండుట.

**శృంగాటక యోగం :** గ్రహములన్ని త్రికోణములందు ఉంటే లగ్నము, పంచమ స్థానము, నవమ స్థానముల ఉన్న శృంగాటక యోగము అంటారు.

**ఫలితం :** శృంగాటక యోగమున జన్మించిన వాడు కలహములందు ఆసక్తుడు, యుద్ధమున తెగింపు కలవాడు, సంపన్నుడు, స్త్రీలచే ద్వేషింపబడు వాడు, సుఖవంతుడు, సౌందర్యవంతుడు, రాజాభిమాన పాత్రుడు అవుతాడు.

**చక్ర యోగం :**గ్రహములన్నీ బేసి రాశులైన ఆరు రాశులలో ఉపస్థితమై ఉన్న చక్రయోగం అంటారు. అంటే లగ్నం, మూడు, అయిదు, ఏడు, తొమ్మిది, పదకొండు స్థానాలలో ఉపస్థితమై ఉన్న చక్రయోగం అంటారు.

**సముద్ర యోగం :** గ్రహములన్నీ రెండవ స్థానం నుండి పన్నెండవ స్థానం వరకు ఉన్న సమరాశులలో ఉపస్థితమై ఉన్న అంటే రెండవ, నాల్గవ, ఆరవ, ఎనిమిదవ, పదవ, పన్నెండ స్థానాలలో ఉపస్థితమై ఉన్న సముద్ర యోగం అంటారు.

**ఫలితం :** సముద్రము అందు పుట్టిన రత్నములు, మణులు వివిధ పదార్థములు కలవాడు, యోగవంతుడు, జనులను ఆకర్షించు వాడు, భూములకు అధిపతి అవుతాడు.

**సల యోగం :** గ్రహములన్నీ ఉభయ చర రాశులందు ఉపస్థితమై ఉన్న సల యోగం అంటారు.

**ఫలితం :** సల యోగమున జన్మించినవాడు తిండి పోతు, దరిద్రుడు, వ్యవసాయము చేత జీవించు వాడు, భయం, భీత స్వభావం కలవాడు, దుఃఖి, బంధు మిత్ర రహితుడు అవుతాడు.

**ముసల యోగం :** గ్రహములన్నీ స్థిర చర రాశులందు ఉన్న మసల యోగం అంటారు.

**రజ్జు యోగం :** గ్రహములన్నీ చర రాశులందు ఉన్న రజ్జు యోగం అంటారు.

**దళాఖ్య మాలా యోగం :** మూడు కేంద్రముల చంద్రుడు కాక మిగిలిన శుభగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య మాలా యోగం అంటారు.

**దళాఖ్య సర్పయోగం :** మూడు కేంద్రములందు చంద్రుడు కాక మిగిలిన పాపగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య సర్ప యోగం అంటారు.

**గోళ యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఒక్క స్థానములోఉపస్థితమై ఉన్న గోళ యోగం అంటారు.

**యుగ యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ రెండు స్థానములలో ఉపస్థితమై ఉన్న యుగ యోగం అంటారు.

**శూల యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ మూడు స్థానములలో ఉపస్థితమై ఉన్న శూలయోగం అంటారు.

**కేదార యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ నాలుగు స్థానాలలోఉపస్థితమై ఉన్న కేదార యోగం అంటారు.

**పాశ యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ అయిదు ఉపస్థితమై ఉన్న పాశ యోగం అంటారు.

**దామినీ యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఆరు స్థానముల ఉపస్థితమై ఉన్న దామినీ యోగం అంటారు.

**వీణా యోగం :** ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఏడు స్థానముల ఉపస్థితమై ఉన్న వీణా యోగం అంటారు.

## పంచ మహాపురుష యోగాలు

లగ్నము నుండిగాని రాశి లేక చంద్ర లగ్నము నుండి గాని కుజ, బుధ, గురు, శుక్ర, శనులు కేంద్రము లందు ఉండి అవి ఆగ్రహములకు ఉచ్ఛ లేక స్వ స్థానములైన వరుసగా రుచక, భద్రక, హంసక, మాళవ, శశ యోగము అంటారు.

గ్రహములు షడ్వర్గాది బల సంపన్నులై ఉండవలెను. ఒక యోగము కలిగిన అదృషవంతుడు. రెండు యోగములు ఉన్న రాజసమానుడు. మూడు యోగములు కలిగిన రాజు. నాలుగు యోగములు కలిగిన చక్రవర్తి. ఐదు యోగములు కలిగిన నృపేంద్రుడు కాగలడు.



# పుట్టిన వారాన్ని బట్టి గ్రహాల ప్రభావం




పుట్టిన రోజు(వారం)ను బట్టి గ్రహాల ప్రభావం ఉండి గ్రహస్థితి మారుతుంది. ఒక్కో రోజు పుట్టినవారు ఒక్కో రకంగా జీవితంలో ముందడుగు వేస్తూ ఉంటారు. అయితే ఒక వ్యక్తి ఏ రోజు పుట్టారో తెలిస్తే ఆ వ్యక్తి జీవితంలో కష్ట సుఖాలు, లాభ నష్టాల గురించి తెలుసుకోవచ్చు అని అంటారు.

## సోమవారం

సోమవారం పుట్టినవారిలో కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. వీరు అనుకున్న పనిని సాధిస్తారు. వీరి స్వభావం కొంచెం సున్నితంగా, మృదువుగా ఉంటుంది. విద్యార్థులు అయితే చదువులో కొంచెం అశ్రద్ధగా ఉంటారు. వారు ఆనందంగా ఉండటమే కాకుండా పక్కన వారిని కూడా సంతోషంగా ఉంచుతారు.

## మంగళవారం

మంగళవారంలో పుట్టినవారు కొంచెం ఆవేశంగా ఉంటారు. వారు ఆవేశంలో ఏదోదో చేసేసి సమస్యల్లో పడతారు. చిన్న చిన్న విషయాలను చాలా పెద్దవిగా చేసి ఇబ్బందుల్లో పడతారు. కొంచెం కోపం తగ్గించుకొంటే వీరు అందరితో కలిసి జీవితం అంతా ఆనందంగా ఉండవచ్చు. కానీ వీరు చాలా నిజాయితీగా ఉంటారు. అందరూ అలాగే ఉండాలని కోరుకుంటారు.

## బుధవారం

బుధవారం జన్మించిన వారిలో కొన్ని విశిష్టమైన లక్షణాలు ఉంటాయి. అలాగే వీరిలో భక్తి ఎక్కువగా ఉండి ఆధ్యాత్మిక విషయాలపై

ఎక్కువ ఆసక్తి కలిగి ఉంటారు. ఏదైనా తప్పు చేస్తే దేవుడు శిక్ష వేస్తాడని నమ్ముతారు. ఏదైనా నిర్ణయం తీసుకొనే ముందు బాగా ఆలోచిస్తారు. వీరు అందరితో చాలా మర్యాదగా ఉంటారు.

## గురువారం

గురువారం జన్మించిన వారిలో తెలివితేటలు ఎక్కువగా ఉంటాయి. వీరు చాలా దైర్యంగా ఉంటారు. అలాగే తీసుకొనే నిర్ణయం చాలా వేగంగా ఉంటుంది. వీరికి కష్టాన్ని ఎదుర్కొనే దైర్యం ఎక్కువ ఉంటుంది. అంతేకాక వీరు హాని చేయరు. వీరి మంచి మనస్సుకి అదృష్టం కలిసి వస్తుంది.

## శుక్రవారం

శుక్రవారం పుట్టినవారు సంతోషంగా ఉండాలని కోరుకుంటారు. వీరి చుట్టూ ఉన్నవారు కూడా సంతోషంగా ఉండాలని కోరు కుంటారు. వీరికి బృహస్పతి ప్రభావం ఉండుట వలన చేసే పనులు విజయవంతం అవుతాయి. ఏదైనా కష్టం వచ్చిన వెంటనే బయట పడిపోయే నేర్పు ఉంటుంది.

## శనివారం

శనివారం పుట్టినవారికి వ్యవసాయం మీద ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. అంతేకాక వ్యాపారం మరియు టెక్నాలజీ రంగాల్లోనే కూడా బాగా రాణిస్తారు. స్నేహితులు వీరిపై ఎక్కువ ప్రేమను చూపిస్తారు. జీవితంలో అప్పుడప్పుడు కొన్ని రకాల ఇబ్బందులను ఎదుర్కొంటారు.

## ఆదివారం

ఆదివారం పుట్టినవారు ఒక ప్రణాళిక బద్ధంగా ముందుకు సాగుతారు. సామాజిక ఆలోచనలు ఎక్కువగా ఉంటాయి. అలాగే అదృష్టం వీరిని వెన్నంటే ఉంటుంది. కుటుంబానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. కుటుంబం కోసం ఏమి చేయటానికి అయినా సిద్ధమౌతారు.



# గ్రహస్థానాన్ని బట్టి ఏ వ్రేలికి రత్నాన్ని ధరించాలి?



అన్ని వ్రేళ్ళకు రత్నములు లేదా ఉంగరములు ధరించరాదు అని చెబుతారు. మన చేతికి ఉన్న 5 వ్రేళ్ళలో బ్రొటనవ్రేలు, చూపుడు వ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరము వ్రేలు, చిటికెన వ్రేలు అని వాటి పేర్లు. హస్త సాముద్రిక శాస్త్రము గ్రహ కారకత్వములు వ్రేళ్ళలో, అరచేతిలో, రేఖలలో చెప్పబడింది.

| | | |
|---|---|---|
| బ్రొటన వ్రేలు | - | శుక్రుడి వ్రేలు |
| చూపుడు వ్రేలు | - | గురుడి వ్రేలు |
| మధ్య వ్రేలు | - | శని వ్రేలు |
| ఉంగరము వ్రేలు | - | రవి వ్రేలు |
| చిటికెన వ్రేలు | - | బుధుడి వ్రేలు |



కుజ చంద్ర రాహు కేతువులకు అరచేయి మరియు మణికట్టు ప్రాంతములు వాటి స్థానములుగా చెప్పబడినవి.

పై వాటిని అనుసరించి ఆయా వ్రేలుకు ఆయా గ్రహరత్నము ధరించాలని కొందరి భావన.

మరికొందరి అభిప్రాయంలో ఇది ముమ్మాటికీ సరియైనది పద్ధతి కాదు. శక్తి కేంద్రములు అరచేతిలో ఉంటాయి. వీటికి సంబందించిన రహస్య విషయములు తెలియక పండితులు రత్నధారణ విషయము చెప్పారు అని అంటారు.

## స్త్రీ, పురుషులలో

పురుషులు మొదట కుడిచేతికి రత్నములు ధరించాలి. ఆ తదుపరి ఎడమ చేతికి ధరించవలెను.




స్త్రీలు మొదలు ఎడమచేతి రత్నములు ధరించాలి ఆ తదుపరి కుడిచేతికి ధరించవలెను.

12 లగ్నజాతకులకు 4 లేదా 5 శుభ గ్రహములు కలవు. ఒకరికి 4 లేదా 5 రత్నములు మాత్రమే ధరించుటకు వీలు కలదు.

నవరత్నములు ఎవరు ధరించకూడదు. ధరించిన కీడు తప్పక కలుగును అని కొందరి భావన.

## ఏ వ్రేలుకు రత్నము ధరించాలి?

మొదటి రత్నము **ఉంగరము వ్రేలుకు** పురుషులు కుడి చేతికి, స్త్రీలు ఎడమ చేతికి ధరించాలి.

రెండవ రత్నము **మధ్య వ్రేలుకు** పురుషులు కుడి చేతికి, స్త్రీలు ఎడమ చేతికి ధరించాలి.

మూడవ రత్నము **ఉంగరము వ్రేలుకు** పురుషులు ఎడమ చేతికి, స్త్రీలు కుడి చేతికి ధరించాలి.

నాల్గవ రత్నము **మధ్య వ్రేలుకు** పురుషులు ఎడమ చేతికి, స్త్రీలు కుడి చేతికి ధరించాలి.

ఐదవ రత్నము రాహువు లేదా కేతువు సంబంధ రత్నము ఉంటుంది. వీటిని ఖంఠము నందు లేదా **మధ్య వ్రేలుకు** ధరించాలి. పురుషులు కుడి చేతికి , స్త్రీలు ఎడమ చేతికి ధరించాలి.

**చూపుడు వ్రేలుకు** ఏ రత్నము లేదా ఉంగరము ధరించకూడదు. గురు వ్రేలుకు రత్నము లేదా ఉంగరము ధరించిన మానసిక ఛిద్రములు కోపము, అవేశము, అహంకారము, గర్వము ఎక్కువ కలుగును.

రత్నము యొక్క పరిమాణము ఎవరి శక్తి కొలది వారు ధరించుట చేయవచ్చు. 2 క్యారెట్లు, 3 క్యారెట్లు, 5 క్యారెట్లు అని ఏమి అవసరము లేదు. ఎవరి శక్తి కొలది వారు ధరించవచ్చు అని నిపుణుల భావన. 

## గ్రహాలు దృష్టులు

రెండు గ్రహముల మధ్య నుండే సంబంధాన్ని దృష్టి (aspect) అందురు. ఏ గ్రహమైన తానున్న స్థానం నుండి సప్తమ స్థానాన్ని చూస్తుంది. ఈ దృష్టితో పాటు గురు, కుజ, శని గ్రహాలకు కొన్ని విశేష దృష్టులు వున్నాయి.

### విశేష దృష్టులు

**గురుడు తానున్న స్థానం నుండి 5, 9 స్థానములను చూస్తాడు.**

**కుజుడు తానున్న స్థానం నుండి 4, 8 స్థానములను చూస్తాడు.**

**శని తానున్న స్థానం నుండి 3, 10 స్థానములను చూస్తాడు.**

# గ్రహముల దృష్టి విషయంలో పరాశర వివరణ

గ్రహములన్ని తామున్న రాశి నుండి ఏడవ రాశిని చూస్తాయి. కాని శని, గురు, కుజుడు, ఆ ఏడవరాశినే కాక, వరుసగా శని, 3వ రాశిని 10 వ రాశిని కూడా చూస్తాడు. గురుడు 5వ, 9వ రాశులను; కుజుడు 4వ, 8వ రాశులను కూడా చూస్తాడు. దీనిని విశేష దృష్టి అంటారు. అనగా ఏడవరాశిని చూచుట సామాన్య దృష్టి అని చెప్పుకోవాలి. ఏ గ్రహమునకు 10వ రాశి వెనుక దృష్టి ఉండదు. సామాన్య దృష్టి కన్నా విశేష దృష్టికి బలమెక్కువ. ఈ గ్రహములను సౌమ్య గ్రహములు, క్రూర గ్రహములగా విభజించిరి. సౌమ్య గ్రహములు, 1, 4, 7, 10 స్థానము లకు అధిపతులైన శుభము నీయరు. క్రూర గ్రహములు కేంద్రాధిపతు లయిన, రవి కన్నా క్షీణచంద్రుడు, అతనికన్నా పాపి అయిన బుధుడు (బుధుడు పాప గ్రహములతో కలిసిన పాపిగా చెప్పవలెను) వారికన్నా కుజుడు, వానికన్నా శనివారికన్నా రాహుకేతువులు మహా క్రూరులు.

శుభగ్రహములకు కేంద్రాది పత్యము మంచిది కాదు. పాపులకు మంచిది. ఈ విషయములు పరాశరుడు చెప్పినవి. లగ్నము, లగ్నము లగాయతు, 4వ, 7వ, 10వ స్థానములు కేంద్రము. 1వ, 5వ, 9వ స్థానములు కోణములు. లగ్నము లగాయతు, 1, 2, 4, 7, 9, 10, 11 శుభస్థానములు. 3, 6, 8, 12 పాపస్థానములు. పాపస్థానముకు అధిపతులయిన గ్రహములు నైసర్గిక శుభులైన ఆధిపత్య పాపులు. అలాగే పాపస్థానములకు అధిపతులైన గ్రహములు, నైసర్గిక పాపులైనను ఆదిపత్య శుభులు అగును. 

# లగ్నాలకు యోగ, శుభ, పాప గ్రహాలు

మనం పుట్టిన సమయంలో ఉన్న నక్షత్రం, గ్రహస్థితిని బట్టి మనం ఏ లగ్నంలో పుట్టామో తెలుస్తుంది. పన్నెండు రాశుల వలెనే పన్నెండు లగ్నాలు ఉన్నాయి. లగ్నాలకు యోగకారక గ్రహాలు, ఆధిపత్యం వల్ల శుభ పాప గ్రహాలుగా పరిగణించబడతాయి.



**1. మేషం :** ఈ జాతకునకు శని, బుధ, శుక్రులు పాపులు. రవి, గురులు శుభులు. శని, గురు సంబంధం కలిసిన గురుడు శుభుడు కానేరడు. అట్లే శని కూడా శుభుడు కాడు. శని మారక గ్రహం.

**2. వృషభం :** ఈ జాతకునకు గురు, శుక్ర, చంద్రులు పాపులు అవుతారు. రవి, శనులు శుభులు. శని రాజయోగకారకుడు. గురునకు మారక లక్షణాలున్నాయి.

**3. మిథునము :** ఈ జాతకునకు కుజ, గురువులు పాపులు. శుక్రుడు శుభుడు. శని, గురులు చేరినచో ఫలితమునివ్వరు.

**4. కర్కాటకము :** ఈ జాతకునకు శుక్ర, శని, బుధ, గురులు పాపులు. కుజుడు రాజయోగకారకుడు, గురు, కుజులు రాజయోగాన్ని ఇస్తారు. శుక్రుడు మారకాన్ని కలిగిస్తాడు.

**5. సింహం :** ఈ జాతకునికి శని, బుధ , శుక్రులు పాపులు. అంగారకుడు రాజయోగాన్నిస్తాడు. గురు, శుక్రులు కూడిన ఫలితమివ్వరు. కుజ, గురులు కూడిన శుభయోగమిస్తారు. ఈ జాతకునకు బుధుడు మారకము నిచ్చును.

**6. కన్య :** ఈ జాతకునకు గురు, రవి, కుజులు పాపులు, శని, బుధులు శుభులు. శని రాజయోగమునిస్తాడు. చంద్ర, బుధులు కూడా యోగాన్నిస్తారు. గురుడు మారకమునకు కారకుడు.

**7. తుల:** ఈ జాతకునకు గురు, రవి, కుజులు పాపులు. శని, బుధులు శుభులు. శని రాజయోగాన్నిస్తాడు. చంద్ర బుధులు కూడా రాజయోగాన్నిస్తారు. గురుడు మారకాన్నిస్తాడు.

**8. వృశ్చికము:** ఈ జాతకునకు బుధ, శుక్ర, శనిలు పాపులు. గురుడు శుభుడు. రవి, చంద్రులు శుభయోగాన్నిస్తారు. బుధుడు ఈ జాతకానికి మారకగ్రహం.

**9. ధనస్సు:** ఈ జాతకులకు రవి, కుజులు శుభులు, శుక్రుడు పాపి, రవి, బుధులు రాజయోగకారకులు, శుక్రుడు మారకం చేయును.

**10. మకరం:** ఈ జాతకులకు కుజ-గురు-చంద్రులు పాపులు. శుక్ర, బుధులు శుభులు. శుక్రుడు రాజయోగకారకుడు. శుక్రుడు, శని, బుధులతో కూడిన విశేష ఫలాన్ని ఇస్తాడు. కుజుడు మారక గ్రహం.

**11. కుంభం:** ఈ జాతకునకు కుజ- గురు- చంద్రులు పాపులు. శుక్రుడు శుభుడు. కుజుడు రాజయోగకారకుడు, మారకుడును కూడా అవుతాడు.

**12. మీనం :** ఈ జాతకునకు రవి, శుక్రులు పాపులు. కుజ-చంద్రులు శుభులు. కుజ, గురులు రాజయోగాన్నిస్తారు. శని మారకగ్రహం. ఈ లగ్న ఫలితాలు, గ్రహములు శుభములైన శుభ ఫలితాన్ని, పాపులు పాప ఫలితాన్ని ఇస్తారు.



# గ్రహాలు వృత్తులు



*జాతకచక్రంలో ఏఏ గ్రహాలు అనుకూలంగా ఉన్నాయో పరిశీలించి ఆయా గ్రహాలకు సంబంధించిన వృత్తులను చేసుకోవటం వలన వ్యాపారాభివృద్ధి, ధనాభివృద్ధి, గౌరవాలు, కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి అని చెప్పబడుతుంది.*

## సూర్యుడు

వైద్యశాస్త్రం, భౌతికశాస్త్రం; కుజునితో కలసిన శస్త్ర చికిత్సకునిగా; గురువుతో కలసిన ఆయుర్వేదం; శనితో కలసిన అనస్తీషియా, ఆర్థోఫిడిక్స్ వైద్యుడు; చంద్ర, శుక్రులతో కలసిన గైనకాలజిస్ట్; బుధునితో కలసిన నరాల నిపుణులు, మరియు కర్ణరోగ వైద్యం సూచించును. రాజ్యాధి కారము, పరిపాలనా విభాగములకు అధికారి, ఆఫీస్ మేనేజ్‌మెంట్,

అధ్యక్ష పదవులు, ధార్మిక సంస్థలు, సంఘములకు గౌరవ అధ్యక్షులు మొదలగు అనేక విధముల యజమాని హోదా పొందగలరు. చట్ట సభలలో అధికారము, శాసన నిర్మాణ కర్తలు, ప్రజా పరిపాలకులు. ఆర్డర్స్ జారీ చేయు అధికారము, హోదా, గౌరవము కలిగిన వృత్తులను ప్రసాదించును.

## చంద్రుడు

చరిత్ర, కవిత్వం, సైకాలజీ, సముద్ర గర్భమును పరిశోధించుట. నీటికి సంబంధించిన శాఖలు, ద్రవ పదార్ధములకు సంబంధించినవి. తెలుపు వర్ణమునకు చెందినవి. అనగా కూల్‌డ్రింక్స్, పాలు, పాల ఉత్పత్తులు, పంచదార, బియ్యము వ్యాపారములు, రైస్ మిల్స్, మీల్స్ హోటల్స్, టిఫిన్ సెంటర్స్, మిల్క్‌పార్లర్స్, నావికుల విద్య. శుక్రునితో కలసిన పాల వ్యాపారం, పెయింట్స్; కుజ శుక్రులతో కలసిన పశువైద్యం; బుధునితో కలసిన టెక్స్‌టైల్స్, వస్త్ర వ్యాపారములు, వాటర్ ప్లాంట్స్, నీరు, చేపల ఉత్పత్తులు, బావులు త్రవ్వడం, బోరింగ్స్, సముద్రపు ఉత్పత్తులు, జలాంతర్గామి, నావికా దళ ఉద్యోగములు, దూది వ్యాపారము, దూది ఉత్పత్తులు, ఫుడ్ ప్రొడక్ట్స్, వెండి వస్తువులు తయారీ మొదలగు వృత్తులను ప్రసాదించును.

## కుజుడు

గృహ నిర్మాణం, సర్వే, సివిల్ ఇంజనీర్, శస్త్ర చికిత్సలు, పశుపోషణ, మెకానికల్ ఇంజనీర్, రసాయన విద్యలు, రక్షణ విధానం, పేలుడు వస్తువులు, ఫైర్ సర్వీస్, తీర్పులు, హైడ్రో ఎలక్ట్రిక్ ఇంజనీర్, విమాన చోదక విద్య, వ్యవసాయము, వ్యవసాయ ఉత్పత్తులు, మాంసపు ఉత్ప త్తులు, కోళ్ల పరిశ్రమలు, యంత్రములు, పనిముట్లు తయారీ, వడ్రంగి పనులు, భవన నిర్మాణములు, కన్‌స్ట్రక్షన్, కంట్రాక్టులు, బిల్డింగ్ మెటీరియల్,

విద్యుత్తు శక్తి శాఖలు, విద్యుత్ ప్లాంట్స్, మిలటరీ, పోలీస్ తదితర రక్షణ శాఖలు, సైన్యమునకు సంబంధించిన ఉద్యోగాలు, మోటార్స్, మెకానికల్, భుగర్భ పరిశోధన, అటవీ ఉత్పత్తులు, అటవీ శాఖకు చెందిన ఉద్యోగాలు ఇలాంటి వృత్తులు కుజుని ఆధీనములో ఉంటాయి.

## బుధుడు

వ్యాపారం, కమర్షియల్ డిగ్రీలు, బ్రోకర్స్, బ్యాంకులు, ఫైనాన్సియల్ సెక్షన్, చిట్ ఫండ్ వ్యాపారములు, ట్రెజరీ డిపార్టమెంట్లు, బడ్జెట్ తయారీ చేయువారు, చిత్ర కళ, డ్రాయింగ్, పెయింటిగ్, నమూనాలు గీయుట, ఎస్టిమేటింగ్, వ్రాత, గణిత విద్య, కన్స్ట్రక్షన్, డిజైన్, జ్యోతిష్యం. శుక్రునితో కలసిన చాయా చిత్రములకు చెందిన వ్యాపారం, రసాయన శాస్త్రం, జీవశాస్త్రం, వృక్షశాస్త్రం, అనువాదకులు, ఉపాధ్యాయులు, పత్రికలు, పత్రికా సంపాదకులు, ముద్రణా రంగములు, పుస్తక పరిశ్రమలు, రచయితలు, చార్టర్డ్ అకౌంటెంట్స్, విలేఖర్లు, జర్నలిజం, గుమస్తా ఉద్యోగాలు, సాఫ్ట్ వేర్, పచ్చళ్ళు పరిశ్రమలు, కంప్యూటర్, టెక్నాలజీ సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు ప్రసాదించును.

## గురుడు

న్యాయవాదులు, ఆర్థిక శాస్త్రం, సంస్కృతంలో పట్టాలు, వేదాంతం, అవధాన విద్యలు, జ్యోతిష్యం, విద్యా సంస్థలు, ఉపాధ్యాయులు, లెక్చరర్స్, భోధనా సంబంధ ఉద్యోగములు, పురోహితులు, పూజార్లు, పూజ గది, పూజా ద్రవ్యములు, దేవాలయ సిబ్బంది, దేవాదాయ శాఖలలో ఉద్యో గాలు, పరిశోధనా రంగములు, విశ్లేషకులు, మత ప్రచారకులు, మేధావి వర్గమునకు చెందినవారు. సంస్కృతి, సంప్రదాయములను వివరించు

స్వామీజీలు వీరందరూ గురు గ్రహానికి సంబంధించిన వారు. గురుడు ఆకాశతత్వమునకు చెందిన వాడు కాబట్టి విమానయాన రంగములు, శాటిలైట్స్ సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు కూడా ప్రసాదించును.

## శుక్రుడు

నాట్య రంగం, చిత్రకళలు, రసాయన శాస్త్రం, కామశాస్త్రం. గురు, బుదులతో కలసిన ఎలక్ట్రానిక్స్, వస్త్రాలు, ఆభరణ తయారీలు ఆర్నమెంట్ నగల వ్యాపారము, బంగారు వ్యాపారము, అలంకరణ సామాగ్రి, ఇంటీరియర్ డిజైనింగ్, ఫాన్సీ దుకాణాలు, హైర్ స్టైయిల్ డిజైనింగ్, కుట్టుపని, ఎంబ్రాయిడరీ ట్రైనింగ్, ఇల్లు, వాహనాలకు పెయింట్స్ వేయటం, మసాజ్ సెంటర్స్, రెడీమేడ్ వస్త్రములు, వస్తువులు, స్త్రీలకు సంబంధించిన వస్తువులు, సుగంధ ద్రవ్యములు, అగరబత్తీ పరిశ్రమలు, నూతన వస్తు వులు, కళలు, సినిమా రంగము, కళాకారులు, ఎలక్ట్రానిక్ మీడియా, గాయకులు, సంగీత సాహిత్య రంగములకు సంబంధిత ఉద్యోగ వ్యాపా రాలు ప్రసాదించును.

## శనిగ్రహము

గనులు, త్రవ్వకాలు, భూగర్భ శాస్త్రం, భూగోళ శాస్త్రం, పురాతన వస్తు సేకరణ, బొగ్గు గనులు, ఆర్థోపెడిక్స్, రాజకీయ నాయకులు, నామి నేటెడ్ పోస్టులు పొందేవారు. న్యాయవాదులు, జడ్జీలు, న్యాయశాఖకు సంబంధించి ఉద్యోగులు, గాలికి సంబంధించిన రంగములు అనగా టెలిఫోన్స్, కమ్యునికేషన్, బట్వాడా కార్మికులు, తపాలాశాఖ, సేవకులు, కూలీలు, వ్యవసాయ కార్మికులు, కష్టముచే జీవించువారు, ఇనుము, ఉక్కు పరిశ్రమలు, ఇనుము ఉత్పత్తులు , బొగ్గు సంబంధిత శాఖలలో

పనిచేయువారు, బరువులు మోయువారు, ఇన్సూరెన్స్ సంబందిత రంగములలో పని చేయువారు, ఇంగ్లీష్ విద్య, ప్రజా ప్రభుత్వ విద్యలు, సంచార జీవులు, నూనె కర్మాగారములు, పెట్రోల్, డీసెల్, గ్యాస్ సంబంధిత పరిశ్రమలలో ఉద్యోగ, వ్యాపారములు, సెకండ్ హ్యాండ్ వస్తువుల వ్యాపారము కంప్యూటర్ హార్డ్‌వేర్, అసెంబ్లింగ్ యూనిట్స్ మొదలగు వృత్తులు వ్యాపారాలు ప్రసాదించును.

## రాహువు

ఈ గ్రహ ప్రభావము వలన డాక్టర్స్, మత్తు పానీయముల వ్యాపారము చేయువారు, మందుల దుకాణములు, రసాయన శాస్త్రవేత్తలు, చెత్త వ్యాపారము, కెమికల్ ఇండస్ట్రీస్ సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు ప్రసాదించును.

## కేతువు

చర్మపు ఉత్పత్తులు, జోళ్ళు, రబ్బరు పరిశ్రమలు, రబ్బరు ఉత్పత్తులు మొదలగు వృత్తులకు సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు ప్రసాదించును.

## ప్రసిద్ధ జ్యోతిషశాస్త్ర గ్రంథాలు

పరాశరుని – 'హోరశాస్త్రం'.
వరాహమిహురుని – 'బృహత్ జాతక'.
కళ్యాణ శర్మ – 'సారావళి'.
జైమినీ మహర్షి – 'జైమినీ సిద్ధాంతం'.
మంత్రేశ్వరుడు – 'ఫలదీపిక'.
భ్రుగు మహర్షి – 'భ్రుగు సంహిత'.

ఆయుర్వేదంలో కూడా 'రోగి' జన్మకుండలిని అనుసరించి వైద్యం చేసే విధానం ఉంది.

# నవగ్రహ పూజ - ఫలితాలు



హిందువుల జీవిత ఆచారాలలోనూ నవగ్రహాలకు ఎంతో ప్రాముఖ్యత ఉంది. మానవుల స్థితిగతులు, భవిష్యత్తు వ్యవహారాలపై నవగ్రహాల ప్రభావం ఉంటుంది. ఈ భూప్రపంచంలో దేవతలతో సమానంగా నవగ్రహాలకి కూడా ప్రాధాన్యం ఇవ్వబడింది. మానవులు చేసిన కర్మలను అనుసరించే వారికి శుభాశుభ ఫలితాల్ని నవగ్రహాలు అందిస్తుంటాయి.

సూర్యుడికి అధిపతి అగ్ని, చంద్రుడికి అధిపతి వరుణుడు, కుజుడికి అధిపతి కుమారస్వామి, బుధుడికి అధిపతి విష్ణువు, గురువుకు అధిపతి ఇంద్రుడు, శుక్రుడికి అధిపతి శచీదేవి, శనికి అధిపతి బ్రహ్మ. సూర్యుడు కారానికి, చంద్రుడు లవణానికి, కుజుడు చేదుకు, బుధుడు షడ్రుచులకు, గురువు తీపికి, శుక్రుడు పులుపుకు, వగరు రుచులకు అధిపతులు. సూర్యుడు ఆయనముకు, చంద్రుడు క్షణానికి, కుజుడు ఋతువుకు, బుధుడు మాసానికి, గురువు పక్షానికి, శుక్రుడు సంవత్సరాలకు అధిపతులు.

నవగ్రహాల ద్వారానే ఈ భూమండలం మొత్తం నడుస్తుంది. స్థావర జంగమములు ఏర్పడినవి ఈ గ్రహాల వల్లే. త్రిమూర్తులు త్రిదేవినులు కొలువైనది ఈ గ్రహాల్లోనే. గ్రహరూపి జనార్దన , గ్రహరూపి మహేశ్వర అనే వచనం ప్రకారం హరిహరులు గ్రహ రూపంలో కొలువై ఉన్నారు. అటువంటి గ్రహాలనురెండు వర్గములుగా సృష్టి ఆదిలోనే విభజించారు.

**గురుపాలితములు :** రవి, చంద్ర, కుజ, గురు, కేతు.

**శనిపాలితములు :** శని, బుధ, శుక్ర, రాహు.

పాపపుణ్యములు వీరిలోనే ఉన్నవి.

# గ్రహశాంతికి ప్రత్యేక పూజలు



నవగ్రహ శాంతికి సంబంధించి పూజాది కార్యక్రమాలు చేసే వారు ఆయా ప్రత్యేక వస్తువులతో పూజని నిర్వహించాలి. పూజలో గ్రహ శాంతికి దోష నివారణకు దానాలు చేయాలి. ఇలా చేసిన వారికి దోష నివారణ జరిగి శుభాలు కలుగుతాయి. కోరిన కోర్కెలు నెరవేరతాయి.

**సూర్యగ్రహ** పూజ చేసేవారు గోధుమలను దానం చేయాలి. చేతికి కెంపు ఉంగరాన్ని ధరించటం వల్ల రోగాదులు, మానసిక బాధలు తొలగి మనశ్శాంతి కలుగుతుంది.

**గురుగ్రహ** పూజను నిర్వహించేవారు శనగలను దానం చేయాలి. అదే విధంగా కనక పుష్యరాగం ఉంగరాన్ని ధరించటం వల్ల అధికారం, ధనయోగంతో పాటు కీర్తివంతులవుతారు.

**చంద్రగ్రహ** పూజకు బియ్యాన్ని దానం చేస్తే సరిపోతుంది. ముత్యాన్ని ధరించటం వల్ల నేత్రాలకు సంబంధించిన బాధలకు నివృత్తి కలుగుతుంది.

**కుజగ్రహ** పూజలో కందులను దానం చేయాలి. పగడపు ఉంగరాన్ని ధరించటం వల్ల రుణ విముక్తి కలిగి శత్రు బాధ తొలగుతుంది.

**బుధగ్రహ** పూజలో పెసలను దానం చేయాలి. పచ్చల ఉంగరాన్ని ధరించటం వల్ల ధనలాభం కలగటమే కాక వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి కలుగుతుంది.

**శుక్రగ్రహ** పూజలో అలచందలు దానం చేయాలి. వజ్రం, పగడము ధరించడం వల్ల కార్యసిద్ధి కలుగుతుంది. వివాహాది శుభకార్యములకు ఉన్న అడ్డంకులు తొలగిపోతాయి.

**రాహుగ్రహ** పూజకు మినుములను దానం చేయాలి. గోమేధిక ఉంగరాన్ని ధరించటం వల్ల భయాందోళనలు తగ్గుతాయి. ధనప్రాప్తి కలుగుతుంది.

**కేతుగ్రహ** పూజలో ఉలవల దానం చేయాలి. వైఢూర్యం ఉంగరాన్ని ధరించాలి. దీనివల్ల సర్పాది భయాలు తొలగటమే కాక.. దైవశక్తి పెరుగుతుంది.

**శనిగ్రహ** పూజలో నువ్వులను దానం చేయాలి. నీలిరంగు రాయి కలిగిన ఉంగరాన్ని ధరించటం వల్ల ఆరోగ్యవంతులవటమే కాక ఇతర కష్టాలు కూడా తొలగిపోతాయి.

నవగ్రహాలు సంతృప్తి చెంది మానవులకు సుఖశాంతుల్ని ప్రసాదించాలంటే వాటిని దేవతల్లా భావించి ఆరాధించి పూజించాలి అని జ్యోతిష నిపుణులు సూచిస్తున్నారు.






నవగ్రహాలలో రాహు కేతువులు మినహా మిగిలిన ఏడూ గ్రహాలూ గడియారంలో ముళ్ళువలె సవ్య దిశలో సంచారంలో ఉంటాయి. కాని రాహు కేతువులు అపసవ్య సంచారంలో ఉంటాయి. రాహువు ఉన్న రాశికి, ఏడవరాశిలో కేతువు ఉంటాడు.

# గ్రహ శాంతికి ఏ రోజు ఏం చేయాలి

## ఆదివారం



జనన మరణాలపై ప్రభావం చూపే గ్రహాలను ప్రసన్నం చేసుకునేందుకు వారంలో అనుకూలమైన రోజు ఏది? గ్రహాలను ప్రసనన్నం చేసుకునేందుకు వారం రోజుల్లో ఏ రోజు ఏ దేవుని పూజించాలి అన్న విషయాలు ఇచ్చట పొందుపర్చబడ్డాయి.

చర్మ, నేత్రవ్యాధుల నిర్మూలనకు, సంతాన క్షేమానికి, వైవాహిక జీవిత అనుకూలతకు ఆదివారంనాడు సూర్యగ్రహారాధన చేయాలి. అందుకోసం ఆదివారంనాడు ఉపవాసం వుండి, సూర్యారాధన లేక సుబ్రహ్మణ్యేశ్వర ఆరాధన చేయడం ద్వారా సత్ఫలితాలను పొందవచ్చు. అయితే దీనిని ఒక వ్రతంలాగా ఆచరించాలి. ఈ వ్రతాన్ని శుక్లపక్ష ఆదివారం నాడు ప్రారంభించి, ఆ సంవత్సరంలో వచ్చే అన్ని ఆదివారాలు ఆచరిం చాలి. అలా ఆచరించలేని వారు కనీసం 12 వారాలైనా చేయాలి.

**వ్రతవిధానం :** ఆదివారం నాడు ఉదయమే మేల్కొని తలారా స్నానం చేసి సూర్యునికి ఎదురుగా నిల్చుని సూర్యమంత్రాన్ని లేదా ఆదిత్య హృద యాన్ని మూడుసార్లు చదవాలి. ఆ పైన గంగాజలాన్ని, లేదా శుద్ధోదకాన్ని, ఎర్ర చందనాన్ని, దర్భలను సూర్యనారాయుణిడికి సమర్పించుకోవాలి.

ప్రతి ఆదివారమూ ఉపవాసం వుంటే మంచిది. లేని పక్షంలో ఉద్యాపన చేసే రోజున మాత్రం తప్పనిసరిగా ఉపవాసం ఉండాలి. పగలు పూజా నంతరం ఎవరైనా దంపతులకు భోజనం పెట్టి దక్షిణ తాంబూలాలు ఇవ్వాలి.

## సోమవారం



అడగగానే వరాలనందించే బోళాశంకరుడిని, మనః కారకుడు అయిన చంద్రుడిని ప్రసన్నం చేసుకునేందుకు సోమవార పూజ శ్రేష్ఠమైనది. శ్రావణ, వైశాఖ, కార్తీక, మార్గశిర మాసాల్లో శుక్లపక్ష సోమవారం నాడు ఈ పూజను ప్రారంభించాలి. 16 వారాలు లేదా కనీసం 5 వారాలపాటు ఈ వ్రతాచరణ చేయాలి.

**వ్రతవిధానం :** చెరువు, నది, సముద్రం, కొలను లేదా బావి నీటిలో ఓం నమఃశ్శివాయ అని స్మరించుకుంటూ స్నానం చేయాలి. శివపార్వతుల అష్టోత్తరం, అర్ధనారీశ్వర స్తోత్రం చేస్తూ తెల్లటి పువ్వులు, శ్వేత గంధం, బియ్యంతో చేసిన పిండి వంటలు, పంచామృతాలు, శ్వేతాక్షతలు, గంగా జలం, బిల్వపత్రాలతో పూజించాలి. ఈ రోజు ఉపవాసం ఉంటే మంచిది. **చంద్రగ్రహ** ప్రతికూల ప్రభావం తొలగేందుకు తెలుపు వస్త్రాలు, ముత్యం పొదిగిన వెండి ఉంగరాన్ని ధరించాలి. పూజా సమయంలో చంద్రాష్టోత్తరాన్ని పఠించాలి. చివరివారంలో దంపతులకు భోజనం పెట్టి, చందన తాంబూలాలతో పాటు పాలు, పెరుగు, పండ్లు, తెలుపురంగు వస్తువులను దానం చేయాలి.

## మంగళవారం



ఆంజనేయుడి అనుగ్రహం పొందడానికి, శ్రీవల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆశీస్సులను అందుకోవడానికి, **కుజగ్రహ** సంబంధమైన దోషాలను తొలగించుకోవడానికి మంగళవార వ్రతం ఆచరించాలి.

**వ్రతవిధానం :** ఏ మాసంలోనైనా శుక్లపక్షంలో వచ్చే మంగళవారం ఈ పూజను ప్రారంభించాలి. కనీసం 21 వారాలపాటు చేయాలి. ఈ వ్రతాచరణ ద్వారా శత్రు జయం సిద్ధిస్తుంది. ఆరోగ్యం కుదుటపడుతుంది. రక్తపోటు తదితర రోగాలు, దీర్ఘవ్యాధులు, రుణబాధలు ఉపశమిస్తాయి. రాగిపాత్ర, ఎరుపు రంగు పూలు, ఎర్రటి వస్త్రాలు, కొబ్బరికాయలు ఈ పూజలో ఉపయోగించాలి. కుజగ్రహ దోష నిర్మూలనకోసం ఈ వ్రతాచరణ చేసేవారు కుజాష్టోత్తరాన్నిలేదా మూలమంత్రం పఠించాలి.

## బుధవారం



స్థితికారకుడు, శిక్షరక్షకుడు అయిన శ్రీ మహావిష్ణువు అనుగ్రహం పొందగోరేవారు, **బుధగ్రహ** వ్యతిరేక ఫలాల కారణంగా విద్య, ఉద్యోగ, వ్యాపారాలలో వెనుకబడుతున్నవారు ఈ వ్రతాచరణ చేయాలి.

**వ్రతవిధానం :** ఏ మాసంలోనైనా శుక్లపక్షంలో వచ్చే మొదటి బుధవారం నాడు ప్రారంభించి, 21 వారాలపాటు ఈ

వ్రతాన్ని ఆచరించాలి. బుధవారం పూజ చేసే వారు వంటకాలలో ఉప్పును ఉపయోగించకూడదు. ఆకుకూరలు, పచ్చ అరటిపండ్లు, పచ్చ ద్రాక్ష మొదలైన ఆకుపచ్చ రంగులో వుండే ఆహార పానీయాలను మాత్రమే సేవించాలి. పచ్చరంగు వస్త్రాలు, పచ్చరంగు కూరలు, పచ్చరంగు వస్తువులు దానం చేయాలి. గోవులకు పచ్చగడ్డి తినిపించడం శ్రేష్ఠం. ముడిపెసలతో చేసిన పదార్థాలను లేదా పిండివంటలను నివేదించి, ప్రసాదంగా స్వీకరించాలి.

## గురువారం



మానసిక ప్రశాంతత, ఆధ్యాత్మిక ఉన్నతి, అపారజ్ఞానం, పాండిత్య అభివృద్ధిని పొందాలనుకునేవారు గురువార వ్రతాచరణ చేయాలి. ఇందుకోసం దక్షిణామూర్తి, రాఘవేంద్రస్వామి, దత్తాత్రేయుడు లేదా తమ గురువును ఆరాధించాలి. గురుగ్రహ వ్యతిరేక ఫలితాలైన విద్యా ఉద్యోగ ప్రతికూలతలు, అవమానాలు, అవహేళనలనుంచి తప్పించుకోవాలనుకునేవారు గురువార వ్రతం చేయాలి. వ్రతవిధానం ఏ నెలలోనైనా శుక్ల పక్షంలోని మొదటి గురువారం నాడు ఆరంభించి కనీసం పదహారు వారాలు లేదా మూడేళ్ళపాటు చేయాలి. స్నానానంతరం పసుపు రంగు వస్త్రాలు, పసుపురంగు కంకణాన్ని ధరించి, కంచు లోహ పాత్రలో పసుపు అక్షతలను, పసుపు పూవులను, పసుపును, పసుపు కలిసిన చందనాన్ని వినియోగించి సంబంధిత స్వామి అష్టోత్తరాలతో పూజించాలి. అనంతరం పసుపు రంగు అరటి, మామిడి లేదా ఆ వర్ణంలో ఉండే ఇతర ఫలాలను నివేదించాలి. గురుగ్రహ అనుకూలతను పొందగోరేవారు గురుగ్రహ

మూలమంత్రాన్ని జపించాలి. ఆహారంలో ఉప్పును వినియోగించకూడదు. ఒకపూట తప్పనిసరిగా ఉపవాసం వుండి, స్వామికి నివేదించిన పదార్థాలను స్వీకరించాలి.

## శుక్రవారం



దుర్గ, లక్ష్మి, సంతోషిమాతా, గాయత్రి తదితర దేవతల అనుగ్రహాన్ని పొందడానికి, శుక్రగ్రహ వ్యతిరేక ఫలాలను తొలగించుకోవడానికి శుక్రవార పూజ శ్రేష్ఠమైనది.

**వ్రతవిధానం :** ఈ పూజను శ్రావణమాసం లేదా ఏ మాసంలోనైనా శుక్లపక్షంలో వచ్చే తొలి శుక్రవారం నాడు ఆరంభించి 16 వారాల పాటు చేయాలి. ప్రశాంతమైన, సుఖవంతమైన వైవాహిక జీవితాన్ని ప్రసాదించే ఆ చల్లని తల్లికి శ్రీసూక్త పారాయణ చేస్తూ, తెలుపు రంగు పూలు, తెల్లని చందనం, తెల్లని అక్షతలతో పూజ చేసి క్షీరాన్నం, చక్కెర నివేదన చేసి ప్రసాదాన్ని స్వీకరించాలి. శుక్రగ్రహ అనుకూలత కోరుకునే వారు మూలమంత్రాన్ని పఠించాలి.



## శనివారం

శ్రీ వెంకటేశ్వర స్వామి అనుగ్రహం పొందగోరేవారు, శని, రాహువు, కేతువు గ్రహ సంబంధమైన వ్యతిరేక ఫలితాలు తొలగి ఆయా గ్రహాలకు సంబంధించిన అనుకూల ఫలితాలను కోరుకునేవారు శనివార వ్రతం చేయాలి.

**వ్రతవిధానం :** శ్రావణమాసం లేదా పుష్యమాసంలో వచ్చే తొలి శనివారం నాడు ఈ వ్రతం ప్రారంభించి కనీసం 19 వారాలపాటు వ్రతాచరణ చేయాలి. వెంకటేశ్వర అష్టోత్తరం లేదా సహస్రనామ పూజ చేయాలి. గ్రహసంబంధమైన అనుకూలతను కోరుకునేవారు ఆముదం, నువ్వుల నూనె, ఆవు నెయ్యి కలిపి, నలుపు, ఎరుపు, నీలిరంగు వత్తులతో దీపారాధన చేయాలి. నీలం రంగు పూలతో పూజ చేయడం శ్రేయస్కరం. ఈ పూజకు మాత్రం ఉపవాసం తప్పనిసరి. పగలు అల్పాహారం తీసుకున్నా, రాత్రి పూర్తిగా పండ్లు, పాలతో, సరిపెట్టుకోవాలి. ఆఖరివారం ఉద్యాపనగా నలుపురంగు వస్త్రాలు, పత్తి, ఇనుము, తైలం మొదలైనవి దానంగా ఇవ్వాలి.



*ఏ పూజ, వ్రతం చేసేటప్పుడైనా ఫలితం కోసం కాకుండా శ్రద్ధా భక్తులతో చేయాలి. అప్పుడే మన కోరిక నెరవేరుతుంది. హంగు, ఆర్భాటాలకు దూరంగా వుండాలి. చన్నీటి స్నానం, మితాహారం, భూశయనం, బ్రహ్మచర్యం, మద్య, మాంసాలకు, అశ్లీల సంభాషణలకు, దృశ్యాలకు దూరంగా వుండాలి.*

## గ్రహపాటు అంటే..?



గ్రహస్థితి బాగులేనపుడు ప్రతికూలత ఎదురవుతున్నప్పుడు బాధపడటం సహజం. విధి మనకు రాసిపెట్టిన విధంగా జరుగుతుందిగాని మనమకొన్నట్లు జరుగదు. దీనిని గ్రహపాటు లేదా గ్రహచారం అని కూడా అంటారు.

# రాజయోగాలను ప్రసాదించే గ్రహాల ఆధిపత్యం



నవగ్రహాల్లో ఐదు, రెండు, తొమ్మిది, పది మొదలైన స్థానాలలో ఏ గ్రహమైనా ఆధిపత్యం వహిస్తే రాజయోగాలను అందిస్తారని శాస్త్రం చెబుతోంది. అందులో రెండో స్థానం కుటుంబాధి పత్యం, ఐదో స్థానం త్రికోణ స్థానంగా వ్యవహరించటంతో పాటు కుటుంబంలో మంచి అభివృద్ధి అవకాశాలు లభిస్తాయి.

పదకొండో స్థానం ధనాధిపత్యం, పదో స్థానంలో లాభాధిపత్యం వహించటంతో.. వృత్తుల్లో మంచి అభివృద్ధిని పొందుతారు. మంచి ఆనందదాయకమైన జీవితాన్నికూడా పొందుతారు. అదేసమయంలో ఈ జాతకుల గ్రహాలు నీచస్థానాలను పొందకూడదు.

రాహు 3, 5, 10, 11 స్థానాల్లో కేంద్ర, కోణాలలో ఆధిపత్యం వహిస్తే మంచి ఫలితాలుంటాయి. రాహు, కేతులు పాప గ్రహాలైన ఒక్కో సమయంలో వాటి ఆధిపత్యం వలన మంచి యోగాలు లభిస్తాయి. కేతు మూడోస్థానంలో ఉంటే మంచి ఫలితాలను ఆశించవచ్చును. అయితే ఐదు,

తొమ్మిది స్థానాల్లో ఉంటే కీడును కలిగిస్తాడు. పదో స్థానంలో తప్ప మిగిలిన కేంద్రస్థానాల్లో రాహు ఆధిపత్యం వహిస్తే మంచి ఫలితాలు ఉండవు.

రాహు, కేతులు 3, 6, 10, 11 స్థానాల్లో ఉంటే మంచి అభివృద్ధి అవకాశాలు లభిస్తాయని గ్రహించాలి. శుక్ర, చంద్రులు మూడో స్థానంలో ఉంటే శుక్రదశా కారణంగా మంచి రాజయోగాలను ప్రసాదిస్తాడు.

ఈ కాలంలో కీర్తి ప్రతిష్టలు చేరుతాయి. పదో స్థానంలో ఆధిపత్యంతో పాటు 3, 11 స్థానాల్లో గ్రహాధిపత్యం ఉంటే సుమారైన ఫలితాలు కలుగుతాయి. సాధారణంగా 9వ స్థానంలో ఆధిపతిగా ఎని మిదో స్థానంలో ఉంటే కీడైన ఫలితాలు కలుగుతాయి. గురు ఎనిమిదో స్థానంలో ఉంటే మంచి యోగాలను అందిస్తాడు. తొమ్మిదో స్థానంలో ఆధిపత్యం వహిస్తూ అష్టమాధిపత్యం కారణంగా లేదా గ్రహాల దృష్టి ప్రభావం చేత దశాకాలంలో మంచి ఫలితాలు అందజేస్తారు.

10,11 స్థానాల్లో అధిపతులుగా ఉన్న గ్రహాలు వేరొక గ్రహ సంయుక్తంతోనూ లేదా దృష్టి ప్రభావంతో లాభాధిపతి దశాకాలంలో మంచి ఫలితాలను అందిస్తారు. పదో స్థానాధిపతి దశాకాలంలో శుభ ఫలాలు, అశుభఫలాలు సంయుక్తంగా కలుగుతాయి. శని గ్రహం 3, 9 స్థానాల్లో ఉంటే మంచి ఫలితాలను అందజేస్తాడు.

అంతేగాక వారి స్థానాల్లో 9వ స్థానంలో ఆధిపత్యం వహించినా మంచి లాభాలు లభిస్తాయి. 5, 10 స్థానాలకు చెందిన అధిపతులు 10వ స్థానంలో ఉంటే కీర్తి, అధికారయుక్తంగా జీవిస్తారు. 9, 10 స్థానాలకు చెందిన అధిపతులు లగ్నంతో పాటు 7వ స్థానంలో ఉంటే ఐశ్వర్యం, కీర్తి ప్రతిష్టలు చేకూరుతాయి. గురు, చంద్రులు కటకంలోనూ, సూర్య, శని, కుజ స్థానాలు ఉచ్ఛస్థానం పొందటం ద్వారా బంగారం, గృహనిర్మాణం, వాహనాలు వంటి నూతన వస్త్రాలను చేర్చటంలో ఆసక్తి వహిస్తారు.



# ఆరోగ్యం, ఆహారంపై గ్రహాల ప్రభావం



మానవులపై గ్రహాల ప్రభావం ఉంటుందని అని అంటారు. అయితే గ్రహాల ద్వారా మన నిత్య జీవనం ఆధారపడి ఉంటుంది. వారం రోజులకు రోజుకో గ్రహం యొక్క ప్రభావం ఉంటుంది. ఆదివారం - సూర్యుడు, సోమవారం- చంద్రుడు, మంగళవారం - కుజుడు, బుధవారం - బుధుడు, గురువారం- బృహస్పతి శుక్రవారం-శుక్రుడు, శని వారం-శని. ఈ విధంగా వుంటుంది. ప్రతిరోజూ ఆ గ్రహ ప్రభావం ఉంటుంది.

## ఆహారం

ఈ నేపథ్యంలో మనం ఆరోగ్యంగా ఉండాలంటే ఏ రోజున ఏ రకమైన ఆహారం తినాలి అనేది ముఖ్యం. మొక్కలు, పండ్లు వంటివి కూడా గ్రహ సంచారంపై ఆధారపడి పెరుగుతాయి.

**ఆదివారం** మన ఆహారంపై సూర్యుడి ప్రభావం వుంటుంది. కనుక మనం ఏ రకమైన ఆహారం తిన్నప్పటికి తేలికగా జీర్ణం అయి శరీరం పీల్చేస్తుంది.

**సోమవారం** చంద్రుడి ప్రభావం వుంటుంది. కనుక చంద్రుడు నీటి సంబంధమైన గ్రహం. కనుక నీరు అధికంగా కలిగి ఉండే.. గుమ్మడి, దోస, పుచ్చ పండు వంటివి తింటే బాగా జీర్ణం అయిపోతాయి.




**మంగళవారం** కుజుడి ప్రభావం వుంటుంది. కుజుడు వేడి గ్రహం. కనుక వేడిపుట్టించే మామిడి పండు, పైన్ ఆపిల్, ఉల్లిపాయ, మిరియం, వెల్లుల్లి, మొదలైనవి బాగా పీల్చబడి త్వరగా జీర్ణం అవుతాయి.

**బుధవారం** బుధుడి ప్రభావం వుంటుంది. ఈ గ్రహం రెండు రకాలు కనుక ఏ ఆహారం ఈ రోజు తీసుకున్నా పరవాలేదు.

**గురువారం** గురుగ్రహ ప్రభావం వుంటుంది. పసుపు లేదా ఆరెంజ్ రంగు ఆహార పదార్థాలు (ఉదా: ఆరెంజ్, నిమ్మ, అరటిపండు, మొదలైనవి..) తినండి.

**శుక్రవారం** శుక్రుడి ప్రభావం వుంటుంది. శుక్రుడు ప్రేమ వ్యవహారా లకు, సంబంధించిన ఆహారాలు, బాదం, పిస్తా, బాదంపప్పు, జింక్ అధికంగా వుండే ఆహారాలైన డార్క్ చాక్లెట్, వేయించిన గుమ్మడి గింజలు, వంటివి తినడం మంచిది.

**శనివారం** శని ప్రభావం వుంటుంది. శని నూనెలపై ఆధిపత్యం కలిగి వుంటాడు. కనుక నూనె ఆహారాలు, జంక్ ఫుడ్ శనివారం బాగా జీర్ణం అవుతుంది.

మన భుజించే ఆహారం భూమి ద్వారా వస్తుంది. భూమిలో అన్ని రకాల ఎనర్జీలు వుంటాయి. మనం తినే ఆహారం భూమి నుంచి నెగెటివ్, పాజిటివ్ శక్తులు కలిగి వుంటుంది. మనం సంతోషంగా వుంటే, సరైన ఆహారం తింటాం. మన దుఖం లేదా విచారంతో వుంటే మనం తినే ఆహారాలు మారుస్తూ సంతోషం కొరకు ప్రయత్నిస్తాం. జీర్ణక్రియ సమస్యలు తరచుగా వస్తూ వుంటే.. మీ జాతకంలోని బలహీన గ్రహాలను బలం చేసేందుకు ప్రయత్నించాలి. మీ జీవన నాణ్యతను మెరుగు పరచు కుంటూ వేగంగా జీర్ణం కలిగించుకోవాలి. కనుక మీ బలహీన గ్రహాలేవో తెలుసుకోండి. ఇందుకు నిపుణులైన జ్యోతిష పండితులను సంప్రదించాలి అంటారు.

## ఆరోగ్యం

గ్రహాల దుష్ట కిరణాల ప్రభావం వల్ల మానవుడిలో ఏర్పడే శారీరక, మానసిక రుగ్మతలకు కారణమవుతాయి. గ్రహాల మంచి కిరణాల ద్వారా వృద్ధి చెందిన వృక్ష జాతులు ఔషధాలవుతాయి అనేది జ్యోతిర్వైద్య సిద్ధాంతం.

## చంద్రుడు

కాల్షియంకు ముత్యపు చిప్పలకు, ముత్యాలకు, మంచి గంధానికి, లవణానికి అధిపతి చంద్రుడు. మనస్సుకు చంద్రుడు ఆదిదేవత. రక్తంలోని తెల్ల రక్తకణాలకు చంద్రుడే అధిపతి. శరీరంలోని కాల్షియం తగ్గినప్పుడు ముత్యపు భస్మం ముందుగా తీసుకోవాలని ఆయుర్వేదం చెబుతోంది. పూర్వపు రాజులు ముత్యపు సున్నం తాంబూలంలో వాడుకున్నారు. శరీరం లోని రక్తవేగం పెంచడానికి లవణం ఉపయోగపడుతుంది. ప్రేమ, కోపం, ఉద్వేగం బొమ్మా బొరుసులు. ఆ ఉద్వేగాన్ని పెంచే లక్షణం లవణంలో ఉంది. ఆ ప్రేమకు కూడా చంద్రుడే అధిపతి. అదే లవణాన్ని సూక్ష్మీకరించి (నేత్రంమూర్) ముందుగా వాడితే ఉద్వేగాన్ని రక్తపోటును తగ్గిస్తుంది. మంచి గంధం రాసుకుంటే చల్లదనం ఇస్తుంది. వెన్నెల ఆ లక్షణం కలదే. ముత్యం ధరిస్తే మనసు ప్రశాంతిని పొందు తుందని శాస్త్రం చెబుతోంది.

## కుజుడు

ఎర్ర రక్త కణాలకు, రక్త చందనానికి, ఎముకలలోని మజ్జకు, తుప్పుగల ఇనుముకు, వ్రణాలకు, దెబ్బ సెప్టిక్ అవ్వడానికి, బెల్లంలోని ఐరన్‌కు అధిపతి కుజుడే. కుజగోళం ఆకాశంలో ఎర్రగా కనుపిస్తుంది. ఆ ఎరుపుకు కారణం ఆ గోళం మీద తుపపు పై సూర్యకాంతి పడటమే. శరీరంలో ఐరన్ అధికంగా ఉంటే దెబ్బలు తొందరగా తగ్గుతాయి. అవి

లోపించిన దెబ్బపై తుప్పు ఇనుము తగిలినా సెప్టిక్ అవుతుంది. బెల్లాన్ని శరీరంలో ఇముడ్చుకునే శక్తి లోపించినపపుడు ఆ బెల్లమే వ్రణాలను తగ్గకుండా చేస్తుంది. ఎములలోని మజ్జలో పగడం కలిసిపోతుందని ఫ్రాన్స్ శాస్త్రవేత్తల అభిప్రాయం. పగడం కుజగ్రహానికి చెందిన రత్నం. కుజుడు శరీర పుష్టికి ప్రాధాన్యం ఇచ్చే గ్రహం. కుజుడికి ధాన్యమైన కంది పప్పు శరీర పుష్టినిస్తోంది. కందుల రంగు ఎరుపే. ఆ ఎముకలలోని లోపాలను పగడం ద్వారా పూరించడం ఫ్రాన్స్ శాస్త్రవేత్తల కృషి ఫలితం.

## బుధుడు

బుధుడు నరాలకు సంబంధించిన గ్రహం. అతని రాశులు మిథున, కన్యలు. ధాన్యం పెసలు. కన్యారాశి ఉత్పత్తికి, అమ్మకానికి సంకేతం. బుధుడు వ్యాపారస్థుడు. అతని రంగు ఆకుపచ్చ. ఆ రంగు ఉత్పత్తికి సంకేతమని ఆధునిక వైజ్ఞానికుల అభిప్రాయం. పెసల రంగూ ఆకు పచ్చేనని, అవి నరాల నిస్సత్తువను తొలగిస్తాయని ఆహార వైద్యుల అభి భాషణం. బుధుడు సమయస్ఫూర్తికి అధిపతి. అది లోపించడం బుద్ధి మాంద్యం. పెసలలోనూ బుధునికి చెందిన వసలోను ఆ బుద్ధి మాంద్యాన్ని తగ్గించే లక్షణం ఉంది.

## గురుడు

గురుడు పసుపుకు, పంచదారకు, షుగర్ వ్యాధికి, శనగలకు సంబంధించిన గ్రహం. పంచదారను జీర్ణించుకుంటే షుగర్ వ్యాధి రాదు. అది జీర్ణించుకోలేనప్పుడు ఏర్పడే పుళ్ళకు వేప, పసుపు మందులైతే పంచదార, శనగలు పుళ్ళు తగ్గకుండా చేస్తాయి. గురుడు మేధావి. మేధావులు ఆలోచనలు చేస్తారు. వ్యాయామం చేయరు. ఆ రెండు లక్షణాలే షుగర్ వ్యాధిని పుట్టిస్తాయి. పసుపు షుగర్ వ్యాధి తగ్గిస్తుందని, వ్యాయామం




షుగర్ రాకుండా చేస్తుందని వైద్యుల అభిప్రాయం. విశేషించి గురునికి చంద్ర, కుజ, శనులను దోషరహితులుగా చేసే ప్రత్యేక లక్షణం ఉంది. చంద్రుడిచ్చే జబ్బులకు శనిచ్చే వాతానికి పసుపు మంచి మందు. టి.బి.కి కూడా చంద్రుడే అధిపతి. దాన్ని నివారించే శక్తి వెన్న కలిపిన పసుపుకున్నది.

## శుక్రుడు

ఇక శుక్ర గ్రహం సౌందర్యానికీ కారణమవుతుంది. శుక్రుడు నిమ్మ పండుకు, తేనెకు, చింతపండుకు, చర్మానికి అధిపతి. సౌందర్యాన్ని చింత పండు, నిమ్మపండు పెంపొందించడం లోకప్రసిద్ధమే. తేనె కూడా ఈ విషయంలో సహకరిస్తుంది. అది పుష్పాల నుంచే వస్తుంది. పుష్ప జాతులు సౌందర్యానికి, సౌకుమార్యానికీ ప్రతీకలు.

## శని

చర్మంలోని మాలిన్యాలను వెలువరించే శక్తికి శని అధిపతి. నువ్వు లకు, ఊపిరితిత్తులకు కూడా అధిపతి. ఊపిరితిత్తులు చేసే పని వాయు వును క్రమబద్ధం చేయడమే. మాలిన్యాలను వెలువరించే లక్షణం, ఊపిరితిత్తుల పనిని క్రమబద్ధం చేసే లక్షణం నువ్వులకు ఉందని ఆయు ర్వేద విజ్ఞానం చెపుతోంది. నువ్వుల నూనె శరీరానికి పట్టించి అభ్యంగనం చేస్తే రోమ కూపాలు శక్తివంతమై చర్మంలోని మాలిన్యాలను తొలగిస్తాయి.

ఇలా గ్రహాలకు చెందిన లేదా పొంత ఉన్న వస్తువులు గ్రహాల వల్ల కలిగే అనారోగ్యాలను తొలగిస్తున్నాయి. విశ్లేషించి ఆయా గ్రహాలు ఉచ్ఛ స్వక్షేత్రాదులలో బలంగా ఉన్నప్పుడు ఆయా పంటలు ఎక్కువగా పండి ప్రజలందరికీ అందుబాటులో ఉంటున్నాయి. సప్త గ్రహాల సామ్రాజ్యాన్ని అర్థం చేసుకుంటే అందం, ఆరోగ్యం మన చెంత ఉన్నట్టే అని ఆయా రంగాలలోని నిపుణులు చెబుతున్నారు.



# నవగ్రహ పూజచేసిన తర్వాత స్నానం చేయాలా?

కర్మసిద్ధాంతం నమ్మే అందరూ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు నవగ్రహారాధన తప్పక చేస్తారు. అదేవిధంగా ఆయా దేవాలయాల సందర్శన, ప్రదక్షణలు చేస్తే స్నానం చేయాలా కాళ్లు కడుగుకోవాలా అనే విషయాలు రకరకాలుగా చెప్తారు.

నవగ్రహ దర్శనం తర్వాత కాళ్లు కడుక్కోవాలా? వద్దా? కడుక్కుంటే ఎందుకు కడుక్కోవాలి? అయితే.. నవగ్రహాల పూజ తర్వాత కాళ్లు కడుక్కోవాలనేది ఏ శాస్త్రంలోనూ లేదు. ఏ ధర్మంలోనూ చెప్పలేదు. నవగ్రహాల పూజ చేసి అక్కడే కాళ్లు కడుక్కుంటే దోషాలన్నీ పోతాయని చాలామంది చెబుతుంటారు. కానీ.. ఇవన్నీ నిజాలు కాదట ఎందుకంటే.. ఏ గుడికి వెళ్లేటప్పుడు కానీ.. ముందే కాళ్లు కడుక్కుంటాం. తర్వాత కడుక్కోం. ఇంటి నుంచి బయలు దేరేటప్పుడే స్నానం చేసి.. మంచి వస్త్రాలను ధరించి గుడికి వెళ్తాం.

నవగ్రహాలకు బయట నుంచి తగలకుండా ప్రదక్షణలు చేస్తే ఎటు వంటి కాళ్లు కడుగుకోవడం అవసరం లేదు. అయితే శనిత్రయోదశి, ఇతర గ్రహబాధలు పోవడానికి రకరకాల పద్ధతులలో పూజలు చేస్తారు. ఆయా సందర్భాలలో సాన్నం చేయాల్సి ఉంటుంది. అయితే అది అక్కడ పండితుల సలహాల ప్రకారం వారు ఏది చెపితే అది పాటించాలి. శనిత్రయోదశికి తైలాభిషేకం, ఉప్పు, నల్ల నువ్వులు ఇతర పదార్థాలతో తీవ్రమైన శనిదోషాలకు చేసినప్పుడు ఆయా పద్ధతుల్లో స్నానం చేయడం లేదా వస్త్రాలు మార్చు కోవడం వంటి రకరకాల పద్ధతులను పాటిస్తారు.



# బ్రహ్మ దేవుడు నవగ్రహాలకు కుష్టురోగం వస్తుందని శపించాడా?



పురాణం ప్రకారం బ్రహ్మ ఒకసారి నవగ్రహాలకి కుష్టురోగం వస్తుందని శపించాడు. అప్పుడు శాపవిమోచనం కోసం సూర్యనార్ కోయిల్ సందర్శించి ఇక్కడ పూజలు చేసిన శాపవిమోచనం పొందారని, అప్పటి నుండి ఇది నవగ్రహ ఆలయంగా ప్రసిద్ధి చెందిందని చెబుతారు.

తమిళనాడు రాష్ట్రం, తంజావూరు జిల్లాలో కుంభకోణం నుండి 15 కి.మీ. దూరంలో గల తిరుమంగళంకుడి అను ప్రాంతంలో సూర్యనార్ కోయిల్‌గా పిలువబడే సూర్యదేవాలయం ఉంది. దీనిని క్రీ.శ. 1075 - 1120 సంవత్సరం మధ్య కాలంలో కుళోత్తుంగ చోళ చక్రవర్తి ఆ ఆలయాన్ని నిర్మించినట్లు చరిత్ర ద్వారా తెలుస్తుంది. ఈ ఆలయం మూడు అంతస్థులతో కళ్ళు చెదిరే శిల్ప కళా సంపదతో వెలుగొందుతుంది.

పురాణానికి వస్తే, పూర్వం కలవుడనే రుషి నేటి కుంభకోణం ప్రాంతంలో ఉండేవాడు. ఆయనను భవిష్యత్తును దర్శించగలిగే శక్తి ఉండేది. ఒకసారి అయన త్వరలో తనకు కుష్టురోగం రాబోతుందని గ్రహించి ఆ వ్యాధి నుండి విముక్తి పొందుటకు తన తపశ్శక్తితో నవ

గ్రహాలను ప్రసన్నం చేసుకున్నాడు. తనకు అనారోగ్యం రాకుండా అను గ్రహించమని వారిని వేడుకొనగా అందుకు వారు అంగీకరించారు.

ఈ విషయం బ్రహ్మదేవుడికి తెలిసి, ఉగ్రుడై సృష్టి నియమాలకు విరుద్ధంగా ప్రవర్తించి తన రాతనే ధిక్కరించిన నవగ్రహాలకు అదే కుష్టు రోగం వస్తుందని శపించాడు. అప్పుడు సూర్యచంద్రాదులు ఆ వ్యాధి బారిన పడ్డారు. అప్పుడు వారు బ్రహ్మదేవుడిని ప్రార్థించి ప్రాయశ్చిత్తం చెప్పుమనగా ఈ ఆలయంలో వెలసిన స్వామివారిని సేవించుకోమని చెప్పాడట. దాంతో వారు భూలోకానికి వచ్చి ఆ ఆలయ ప్రాంగణంలో వినాయకుడిని ప్రతిష్టించి భక్తితో పూజించి ఆవిధంగా వారికి కలిగిన శాపంనుంచి శాపవిమోచనం పొందారని చెబుతారు.



ఇక తనపట్ల చూపిన దయకు కృతజ్ఞతగా కళవ మహాముని తురు మంగళక్కుడి ఆలయానికి సమీపంలో నవగ్రహ దేవతామూర్తులు తపమాచ రించిన చోట వారికోసం ప్రత్యేకంగా ఒక ఆలయం నిర్మించాడు. అందులో ప్రధానమూర్తి సూర్యభగవానుడు. ఈ ఆలయంలో పూజ చాలా నిష్ఠగా ఉంటుంది. పూజానంతరం ఆలయం చుట్టూ 9 సార్లు ప్రదక్షిణం చెయ్య వలసి ఉంటుంది. ఈ నవగ్రహ దేవాలయాల ప్రదక్షిణను భక్తులు పవిత్రంగా భావిస్తారు.



# గ్రహాలు - రుగ్మతలు



గ్రహాలు కూడా కొన్ని రుగ్మతలకు కారణం అవుతాయి. గ్రహాలు కలుగ చేసే రుగ్మతల వివరాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

**సూర్యుడు –** హృదయ, నేత్ర సంబంధ వ్యాధులు, రక్త ప్రసరణ, వెన్నెముక సంబంధిత వ్యాధులు, శరీరంలో శక్తి హీనత, పురుషులకు కుడి కన్ను, మహిళలకు ఎడమకన్ను.

**చంద్రుడు –** ద్రవ సంబంధ మైన రుగ్మతలు, పైత్యం, దగ్గు, రొమ్ము, ఉదర వ్యాధులు, ఆస్తమా, పురుషులకు ఎడమ కన్ను, స్త్రీ లకు కుడి కన్ను, మానసిక రుగ్మతలు.

**బుధుడు –** జీర్ణాశయం, నరాలు, ఊపిరితిత్తులు, మూగ, చేతులు, నాలుక, నోటికి సంబందించిన రుగ్మతలు, మూర్ఛ వంటి మానసిక వ్యాధులు.

**శుక్రుడు –** జననేంద్రియ రుగ్మతలు, గొంతు, మెడ, బుగ్గలు, చర్మ వ్యాధులు.

**కుజుడు –** నుదురు, శిరస్సు, ముక్కు, కండరాలు, పురుష జననేంద్రియాలు, మొలలు, రక్తస్రావం, గాయాలు, ఉష్ణవ్యాధులు, అగ్ని, విద్యుత్ ప్రమాదాలు.

**గురువు –** కాలేయం, మధుమేహం, రక్త నాళాలు, కుడిచెయ్యి, తొడలు, పిరుదులు.

**శని –** దంతాలు, ఎముకలు, మోకాళ్ళు, కీళ్ళ సంబంధిత నొప్పులు, చర్మవ్యాధులు.

**ఇంద్ర–** రక్త ప్రసార నాళాలు, మెదడులోని నరాలు, వెన్నెముక భాగాలకు సంబంధించిన అంతు చిక్కని వ్యాధులు, ఆకస్మిక ప్రమాదాలు.

వరుణ– మానసిక రుగ్మతలు, మూర్ఛ, మతి భ్రమణం, అంటూ వ్యాధులు, కలుషిత ఆహారాలు, తాంత్రిక వ్యాధులు, దృష్టి మాంద్యం.

**యమ –** వంశ పారంపర్య వ్యాధులు, జననేంద్రియ వ్యాధులు, ప్రమాదాలు.

మన శరీర భాగాలలో ఏ భాగం ఏ వ్యాధికి గురవుతుందో లగ్న, సూర్య , చంద్ర రాశులను, వాటి అధిపతులను బట్టి నిర్ధారించుకోవచ్చు. లగ్నరాశి నుంచిగాని, సూర్యరాశి నుంచిగాని, చంద్రరాశి నుంచి గాని 6, 8, 12 స్థానాలు అనారోగ్య స్థానాలు అంటే ఆ రాశులు, ఆ రాశి అధిపతులు, ఆ రాశిలో వున్నా గ్రహాలూ, కారకత్వాలను తెలుసుకుంటే రోగ నిర్ధారణ సాధ్యమవుతుంది.



## కుజ దోషానికి కుంభ వివాహం

**కుజ దోషం ఉన్న వాళ్లకు ప్రధానంగా కుంభ వివాహం చేస్తారు. అంటే అరటి చెట్టుకు లేదా రావి చెట్టుకు లేదా వెండి లేదా బంగారు విష్ణువు ప్రతిమకు కుజ దోషం ఉన్న వ్యక్తితో పెళ్లి జరపడం వల్ల కుజ దోషం తొలగిపోతుందని సూచిస్తారు. కుజ దోషం వల్ల కలిగే అనర్థాలను ఈ పెళ్లి ద్వారా పోగొట్టుకోవచ్చుని నమ్మకం.**

# నవగ్రహాలు, నవరత్న ధారణ



గ్రహాలు సకల జీవకోటికి ఇచ్చే ఫలితాలు కాంతి రూపంలో ఉంటాయి. శారీరక మానసిక తరంగాలైన వేడి.. కాంతికి చెందిన ప్రకంపనాలు, సౌర కిరణాల ప్రభావం వలన ఆయా జీవ రాశులు బలం పొందుతున్నాయి. ఇదే కోవలో మానవులు కూడా ఉన్నారు.

గ్రహ కిరణాల ప్రభావం ప్రతి క్షణానికి మారుతుంటాయి. అందుకు అనుగుణంగా మానవులపై ప్రభావం పడుతుంటుంది. వాటి ఫలితాలు మనకు తెలిసే విధంగానే ఉంటాయంటున్నారు జ్యోతిష్య శాస్త్రవేత్తలు. ఇవే మానసికంగా శారీరకంగా అనేక రుగ్మతలు కలుగజేస్తున్నాయి. వీటన్నిటినీ అధిగమించడానికి నవరత్న ధారణ ఒక్కటే మార్గమని జ్యోతిషశాస్త్రం చెబుతోంది.

రత్నాలు ధరించటం వలన గ్రహాల నుండి వెలువడే చెడు కాంతి కిరణాలను నిలువరించి దుష్ఫలితాలు తగ్గిస్తాయి. దీనికి సంబంధించినవే వర్ణచికిత్స సంబంధించిన చికిత్సలు. రోగాలు, అనేక వ్యాధుల నివారణకు సంబంధిత రత్నాలను ధరించటం వల్ల వాటిని ఎదుర్కొనే అవకాశం ఉంటుంది. అంతేకాదు నేరకాంక్షను తగ్గించగల గుణం కూడా ఈ రత్నాలకు ఉందని జ్యోతిష శాస్త్రం చెబుతోంది.

ప్రతి గ్రహానికి నక్షత్రానికి ఒక్కో రంగు చెప్పబడింది. ఈ రంగులను ఆధారం చేసుకుని నవరత్నాలను ధరించాలి.

**చంద్ర గ్రహ** ప్రభావంతో వచ్చే వ్యాధులు, అనారోగ్య సమస్యలు, వ్యాపారంలో నష్టాలకు ముత్యాన్ని ఆభరణంగా గాని లేదంటే ఉంగరంగా గాని ధరించాలి. ఉంగరం అయినట్లయితే వెండితో చేయించుకోవటం మంచిది.

**కుజగ్రహం** కలుగజేసే ఇబ్బందులకు పగడం పొదిగిన ఆభరణం లేదంటే ఉంగరాన్ని ఆవు నేతితోనూ, తేనెతోనూ శుద్ధి చేసి ధరించాలి. ఈ గోమేధికానికి మారుగా ఇతర రాళ్లను కూడా ధరించవచ్చు. అయితే ఇది జ్యోతిష శాస్త్రంలో నిపుణులైన వారి సలహా మేరకు ధరించాలి.

**రాహుగ్రహ** ప్రభావం వలన కలిగే ఇబ్బందులు అనారోగ్య సమస్యలకు గోమేధికం పొదిగిన ఆభరణం లేదంటే ఉంగరాన్ని పాలతో శుద్ధి చేసి ధరిస్తే ఆరోగ్యం కుదుటపడడమే కాకుండా ఇబ్బందులు తొలగిపోతాయని శాస్త్రం చెబుతోంది.

**బుధ గ్రహం** ప్రభావం వలన కలిగే సమస్యలకు పచ్చను ఆభరణంగా గానీ లేదంటే ఉంగరంగా గానీ చేయించుకోవాలి.

**శుక్ర గ్రహానికి** సంబంధించి దోషాలను నిరోధించటానికి వజ్రాన్ని ధరించాలి.

**శని గ్రహం** వలన వచ్చే ఇబ్బందులు, కష్ట నష్టాలకు నీలమణిని ఆభరణంలో కానీ లేదంటే ఉంగరంగా గానీ ధరించవచ్చు.

**గురు గ్రహం** వల్ల కలిగే అనారోగ్య సమస్యలు, ఇతర కష్ట నష్టాలను ఎదుర్కొనేందుకు పుష్య రాగం పొదిగిన ఆభరణాన్ని లేదంటే ఉంగరాన్ని ధరించాలి. దీనిని కొనలేని వారికి ప్రత్యామ్నాయం లభ్యమవుతున్నాయి.
**కేతువు** కలిగించే దోష నివారణకు వైఢూర్యం ధరించాలి.

అయితే వీటన్నిటినీ ధరించటానికి ముందు కొన్ని ప్రత్యేకమైన నియమాలను పాటించాలి. లేదంటే అది దోష నివారణకు ఎంతమాత్రం పని చేయకపోగా చెడును తెస్తాయి. నవరత్నాలతో సమస్త దోషాలు తొలగుతాయని విజ్ఞుల భావన.



# నవగ్రహ అనుగ్రహానికి చేయాల్సిన పూజలు - వ్రతాలు

భూమిపై ఉండే ప్రతి మానవుని మదిలో వివిధ కోర్కెలు ఉంటాయి. ఇవి నెరవేర్చుకునేందుకు వివిధ రకాల యజ్ఞయాగాదులు, పూజలు పునస్కారాలు చేస్తుంటారు. ముఖ్యంగా ప్రతి ఆలయంలో ఉండే నవగ్రహాలకు ప్రత్యేక పూజలు చేస్తూ, ప్రదక్షిణలు చేస్తుంటారు. అయితే ప్రకృతిలో ఉన్న నవ గ్రహాలను పూజించేందుకు ప్రత్యేక పూజలు ఉన్నాయి. ముఖ్యంగా వీటి అనుగ్రహానికి వివిధ రకాల వ్రతాలను చేస్తే ఫలితం కనిపిస్తుంది. ఆ నవగ్రహాల అనుగ్రహానికి చేయవలసిన కొన్ని వ్రతాలు.

**సూర్యగ్రహ అనుగ్రహముకు** రథసప్తమి, శ్రీరామనవమి, కేదారేశ్వర, సూర్య చంద్ర వ్రతము చేయాలి.

**చంద్ర గ్రహా అనుగ్రహముకు** అమావాస్య సోమతి వ్రతం, కృష్ణాష్టమి వ్రతం, సోమవార వ్రతం చేయాలి.

**కుజ గ్రహ అనుగ్రహముకు** నాగుల చవితి, నాగ పంచమి, అంగారక చవితి, కాత్యాయనీ వ్రతము, కుజగౌరీ వ్రతము చేయాలి.

**బుధ గ్రహ అనుగ్రహముకు** శ్రీ అనంత పద్మనాభ వ్రతము, శ్రీ సత్యనారాయణ వ్రతము, తులసీ వ్రతము చేయాలి.

**గురు గ్రహ అనుగ్రహమునకు** శ్రీ సత్యసాయి వ్రతము, శ్రీ సత్యదత్త వ్రతము, త్రినాథ వ్రతాలను చేయాల్సి ఉంటుంది.



**శుక్ర గ్రహ అనుగ్రహముకు** వరలక్ష్మి వ్రతం, వైభవలక్ష్మి వ్రతం, శ్రీలక్ష్మి కుబేర వ్రతం, సంతోషిమాత, అనఘాదేవి వ్రతాలను చేయాలి.

**శని గ్రహ అనుగ్రహముకు** హనుమద్వ్రతము, శివరాత్రి, శనైశ్చర వ్రతాలు చేయాలి.

**రాహు గ్రహ అనుగ్రహముకు** శ్రీదేవి నవరాత్రి, సావిత్రీ, షోడశగౌరీవ్రతం చేయాలి.

**కేతు గ్రహ అనుగ్రహముకు** వినాయక చవితి, సంకష్టహర చతుర్థి, పుత్ర గణపతి వ్రతాలు చేస్తే ఫలితం వుంటుందని జ్యోతిష నిపుణుల అభిప్రాయం.

# ఏ ఔషధులతో స్నానం చేస్తే గ్రహదోషాలు తొలగుతాయి?



సిద్ధౌషధ సేవలవలన రోగములు, మంత్ర జపము వలన సకల భయము తీరునట్లుగా ఔషధస్నాన విధానమువలన గ్రహదోషములు నశించును అని చెప్పబడుతుంది.

## సూర్య గ్రహ దోషము తొలగుటకు

మణిశిల,ఏలుకలు,దేవదారు,కుంకుమ పువ్వు, వట్టివేళ్ళు, యష్టి మధుకము, ఎర్రపుష్పాలు, ఎర్రగన్నేరు పువ్వులు. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి, ఈ నీటితో స్నానము చేయవలెను.

## చంద్ర గ్రహ దోషము తొలగుటకు

గో మూత్రము, ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు పేడ, ఆవు నెయ్యి, శంఖములు, మంచిగంధములు, స్పటికము. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలెను.

## కుజ గ్రహ దోషము

మారేడు పట్టా, ఎర్ర చందనము, ఎర్రపువ్వులు, ఇంగిలీకము, మాల్కంగినీ, సమూలంగా పొగడ పువ్వులు. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి ఆ నీటితో స్నానము చేయవలయును.

## బుధ గ్రహ దోషము

ఆవుపేడ,తక్కువ పరిమాణములో పండ్లు, గోరోచనము, తేనే, ముత్యములు బంగారము. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి,ఆ నీటితో స్నానము చేయవలయును.

## గురు గ్రహదోషమునకు

మాలతీపువ్వులు, తెల్లఆవాలు, యష్టి మధుకం, తేనే. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

## శుక్ర గ్రహదోషము

యాలుకలు, మణిశిల, శౌవర్చ లవణము, కుంకుమ పువ్వు. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

## శని గ్రహ దోషము

నల్ల నువ్వులు, సుర్మరాయి, సాంబ్రాణి, సోపు. ఈ వస్తువులను నీటిలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

## రాహు గ్రహ దోషము

సాంబ్రాణి, నువ్వు చెట్టు ఆకులు, కస్తూరి, ఏనుగు దంతము (ఏనుగు దంతము లేకపోయినను తతిమ్మా వాటితో). ఈ వస్తువులను నీటిలో వేసి ఆ నీటితో స్నానము చేయవలయును.

## కేతు గ్రహ దోషము

సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, ఏనుగు దంతం (ఏనుగు దంతము లేకపోయినను తతిమ్మా వాటితో), మేజ మూత్రం, మారేడు పట్ట. ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి ఆ నీటితో స్నానం చేయవలెను.

# నాలుగు యుగములకు చెందిన నవగ్రహాలు



*మనకు నాలుగు యుగములు ఉన్నవి, వాటికి చెందిన ధర్మము ఉన్నది. అదే యుగ ధర్మము. నవగ్రహములకు యుగానికి ఇద్దరి వంతున భాగమిచ్చినారు.*

## కృతయుగము

కృతయుగమునకు త్రిమూర్తి స్వరూపుడగు, ధర్మ పరాయణుడు, సుక్షత్రియుడగు సూర్యుడిని రాజుగా, శాపానుగ్రహ శక్తి కలుగు బృహస్పతి (గురువు) మంత్రిగా నియమితులయ్యారు.

వీరు ఇద్దరు మిత్రులు పరమ పవిత్రులు. కృత యుగములో వీధిలోని దుమ్ము కడిగితే అందులో పదవ వంతు బంగారు రజము కలిగి ఉండెను. బంగారమునకు అధిపతి గురువు కావున ఎక్కడ చూచిన బంగారు మయముగా ఉన్నది. ఏ ఏ పనివారు వారి పనులను చక్కగా చేసుకొనిరి. సూర్యుడి వలన సుక్షత్రియులగు ప్రభువులు, గురువు వలన శాపానుగ్రహ శక్తిగలిగిన సద్బ్రాహ్మణులు ప్రబలి, ప్రభువులకు ప్రజలకు ఎటువంటి భావ విరోధములేక అన్యోన్యులై నాలుగు పాదముల ధర్మము నడిచినది. ఇక్కడ రాజుమాట మంత్రికి, మంత్రిమాట రాజుకు చక్కగా సరిపోయినది.

ఎవ్వరేమనినను మాట మాట పెరిగి వివాదము జరిగిన "వీడు రాక్షసుడురా రాక్షసుడయి పుట్టేందుకే ఇట్టి అన్యాయ ప్రవర్తన" అనేవారు. అవి శాపానుగ్రహశక్తిగల బ్రాహ్మనులనుటచే ఆ వాక్కు ఫలించి త్రేతా యుగమున రాక్షస వంశము అధికమై యజ్ఞ యాగాదులను చేయనివ్వక నాశనము చేసి వారినే భాదింపసాగిరి.

కృతయుగమునాటి మాటలు త్రేతాయుగమును నడిపించెను. దైవ బలమును సంపాదించిరే కాని కోపమును పట్టలేక పలికిన పలుకులు త్రేతాయుగములో క్రూరులు, రాక్షస స్వభావులు, రాక్షసులు, కలహములు రేపువారు అధికమగుటకు కారణము అయ్యెను.

## త్రేతాయుగము

త్రేతాయుగమున కుజుడు రాజుగాను శుక్రుడు మంత్రిగాను నియమితులయి వీరి పాలన వచ్చెను. కుజుడు యుద్ధప్రియుడు, సూర్యునికి మిత్రుడు, సత్యవాది, పరాక్రముడు, వీరుడు, శూరుడు, ధీరుడు, సుక్షత్రియుడు, యువకుల కధిపతి.

శుక్రుడు రాక్షస గురుడు, మాయ మంత్రవాది, స్త్రీలకూ కారకుడు, కన్యా కారకుడు.

కుజునికి పరమ శత్రువు, నిరంతర శత్రువు అయిన శుక్రుడు మంత్రిగా నియమితులై పాలనజరుపుతున్నారు. మంత్రి మాట రాజుకు, రాజు మాట మంత్రికి సరిపోకపోవుటచే, మంత్రులు క్రూరస్వభావులై రాజ్యము యొక్క పాలనా విధిని నాశనము చేసి, స్త్రీ లోలులై కలహాలను పెంచి, స్వయం వరములను సృష్టించి, ప్రజలను పీడించి, రూపవతులగు స్త్రీలచే, యువకుల ప్రాణ హానిని కల్పించి, నాలుగు పాదములలో ప్రథమ అంగములయిన దైవకార్యములు (మంత్రము, యజ్ఞయాగాదులు) వీటిని చేయుటకై నియమితులయిన బ్రాహ్మణ వంశముల క్షీణింపచేసెను. దైవ బలము తగ్గెను. రాక్షసులతో, దుర్మార్గులయిన మంత్రులు, సామంత్రులతో త్రేతాయుగము నాలుగింట ఒకభాగము దెబ్బతిన్నది.

కుజుడు ధనుర్విద్యాకారకుడు, యువకులకు అధిపతి కావున విలు విద్య పారంగతులచే ధర్మ రక్షణ, రాక్షస సంహారము చేయించెను. యుద్ధ ప్రియుడు కావున యుద్ధమున తిరుగులేని పరాక్రమవంతులగు యువకులను పుట్టించెను. చంద్రుడు మిత్రుడగుటచే సముద్ర సహకారము, వాయు సహకారము లభించింది. భూకారకుడు, దక్షిణ దిక్కుకు అధిపతి కుజుడే కావున భూమండల నలు దిక్కులనుండి సేనల పిలిచి దక్షిణ దిక్కు ధర్మ యుద్ధమునకు పంపించెను తనదిక్కున తానూ విజయము పొంది లోక రక్షణ చేసెను.

## ద్వాపర యుగము

ద్వాపర యుగమున చంద్రుడు రాజుగాను, బుధుడు మంత్రిగాను నియమితులయిరి. వీరు ఇరువురికి తగని వైరము. బుధుడు మాంత్రికుడు, మోసములకు నెలవు, శంబరీ విద్యా ప్రభావసంపన్నుడు. వ్యవహారములకు

అధిపతి. ద్వాపర యుగమున బుధుడు తన కారకవముల చేతే అనేకమయిన బాధలు కలిగించెను.రాక్షస స్వభావమగు రాజులతో శాంబారీ విద్యా ప్రభావులగు రాక్షసులతో, స్త్రీలతో, సప్తవ్యసనాలోలురతో దుర్మార్గులగు మంత్రి, సామంత్రులతో పీడించెను. ఇక్కడ దేవతా కార్యములు అర్ధ భాగము నశింపచేసేను. రాజులకు, బ్రాహ్మణులకు భావ విభేదములు గల్పించి బ్రాహ్మణులను సేవకులుగా కొంతవరకు మార్చెను. దైవశక్తి తగ్గెను. పాపభీతి లేనివారిని తయారు చేసెను. నాలుగు పాదములలో రెండు పాదములే నిలిచెను.

ద్వాపర యుగాంతమున స్వయముగా భగవానుడే కృష్ణుడుగా పుట్టి దేవతా వర్గమున కొందరిని చేనిడుకొని, కుజుడు చంద్రుడికి మిత్రుడు అగుటచే విలువిద్యా పారంగతులగు యువకులను వెంటపెట్టుకొని ఈ మాంత్రికుల, వామాచారుల, మాయావుల నాశనము చేసి మంత్రయుగంను మటమాయము చేసెను. అప్పుడు వచ్చినది యంత్రయుగము అదే ఈ కలియుగము.

## కలియుగము

ఇక మిగిలిన గ్రహములు శని, రాహు, కేతువులు వీరు పాలింప వలసిన కాలము వచ్చినది. శని రాజుగాను, రాహు-కేతువులు మంత్రులు గానూ నిమితులయిరి. యంత్రయుగము ప్రారంభము అయ్యెను.

మంత్ర శాస్త్రము, అంజనలు, ఓషధీప్రభావము తెలుగు గ్రంధములు, జ్యోతిషశాస్త్రము - ఈ నాలుగు గ్రంధములు ఉండిన ఈ కలియుగము నడవదు. శని పాలన సాగదు, మంత్రయుగము యంత్రయుగముగా మారదు. అడిగే ప్రశ్నలకు చక్కగా జవాబు ఇవ్వగల ఈ నాలుగు సద్గ్రంధములు

మాయమైనవి. కృత్రిమ గ్రంధములు మొదలయినవి. ఇవి ఎప్పుడు మాయమయినవో అప్పుడు కలియుగప్రభావము ముందుకు నడిచెను.

అసత్యము, క్రూరము, కుచ్ఛితము, అప్రమాణము, అధర్మము, అన్యాయములు మొదలయ్యెను, వావి వరుసలు తప్పెను, వర్ణసంకర ములు ప్రబలెను. దొంగలే దొరలైరి, దొరలే దొంగలయిరి. దైవ ప్రార్ధనలు మాని దైవదూషణలు, గురుదూషణలు, మాతృ-పితృదూషణలు చేయువారు పుట్టిరి. దైవ భక్తి మొదలు మాతృపితృ భక్తి కూడా అపురూపమయ్యెను. హింసా సిద్ధాంతము ఎక్కువయ్యెను. పాపభీతి లేనివారు ఎక్కువయిరి. పుణ్యకార్యాచరణ కరువయ్యెను. సిరిని, స్త్రీని సంపాదించినవాడే మొనగాడు అని చెప్పువారు వాటికి పాప ఖర్మ చేయువారు ఎక్కువయ్యిరి. దొంగలకు ఆశ్రమము ఇచ్చెడి ప్రజలు, ప్రభువులు ప్రబలిరి. స్త్రీలు దుష్ప్రవర్తనలై పురుషుల దుఖింపచేయువారు అధికమయిరి. ప్రజలు స్వధర్మము మాని అన్యధర్మము, అన్యమతము లకెగబ్రాకిరి. వర్ణద్వేషములు, మతద్వేషములు పెచ్చుపెరిగెను.

ఆశాపరులు, అతిఆశాపరులు, దురాశాపరులు, స్వార్ధ చింతన గలవారు ఎక్కువయ్యిరి. కట్లు, బొట్లు, జుట్లు, ఎన్నో పుట్టినవి. బుద్ధి మంతులు, ఆచారపరులు, సత్యవాదులు, శీలవంతులు, ధర్మాత్ములు, భాధించపడి దుఖించ వలసిన కాలము వచ్చినది.

ఈ కలియుగ కాలములో ఆనాలుగు గ్రంధములు ఉన్న యెడల శని ఆటలు సాగవు గాన ఈ నాలుగు శాస్త్రములు మరుగు పరచిరి. ఆయా వంశములలో యోగ్యులు పుట్టక ఈ శాస్త్రములు అక్కడితోనే నిలిచిపోయెను.



# గ్రహా అవస్థలు

*గ్రహావస్థలు పది రకాలు. 1) స్వస్థము 2) దీప్తము 3) ముదితము 4) శాంతము 5) శక్తము 6) పీడితము 7) దీనము 8) వికలము 9) ఖల 10) భీతము.*

**1) స్వస్థము:** స్వక్షేత్ర మందున్న గ్రహము స్వస్థావస్తను పొందును

**2) దీప్తము:** ఉచ్ఛక్షేత్ర మందున్న గ్రహము దీప్తావస్త నందుండును.

**3) ముదితము:** మిత్ర క్షేత్ర మందున్న గ్రహము ముదితావస్తను పొందును.

**4) శాంతము:** సమ క్షేత్ర మందున్న గ్రహము శాంతావస్తను పొందును.

**5) శక్తము:** వక్రించి యున్న గ్రహము శక్త్యావస్తను పొందును.

**6) పీడితము:** రాశి అంతమున 9 నక్షత్ర పాదములలో చివరి పాదము నందున్న గ్రహము పీడావస్థను పొందును.

**7) దీనము:** శత్రు క్షేత్ర మందున్న గ్రహము దీనావస్థను పొందును.

**8) వికలము:** అస్తంగత మయిన గ్రహము వికలావస్థను పొందును.

**9) ఖల:** నీచ యందున్న గ్రహము ఖలావస్థను పొందును.

**10) భీతము:** అతిచారము యందున్న గ్రహము భీత్యావస్థను పొందును.

సూర్యునితో చేరి ఉన్న గ్రహము అస్తంగతము పొందిన గ్రహము అంటారు.

సూర్యునికి రెండవ స్థానంలో ఉన్నశీఘ్రగతిని పొందిన గ్రహము అంటారు.

సూర్యుని నాల్గవ స్థానమున ఉన్న గ్రహాన్ని మందుడు అంటారు.

సూర్యునికి అయిదు ఆరు రాశులలో ఉన్న గ్రహం వక్రగతిని పొందిన గ్రహం అంటారు.

సూర్యునికి ఏడు ఎనిమిది స్థానాలలో ఉన్న గ్రహం అతి వక్రగతిని పొందిన గ్రహం అంటారు.

సూర్యునికి తొమ్మిది, పది స్థానాలలో ఉన్న గ్రహం కుటిలగతి పొందిన గ్రహం అంటారు.

సూర్యునికి పదకొండు, పన్నెండు స్థానాలలో ఉన్న గ్రహాన్ని అత్యంత శీఘ్రగతిన ఉన్న గ్రహం అంటారు.

ఈ విధముగా గ్రహ అవస్థలు ఉంటాయి.



## గ్రహములకు చెందిన రత్నములు



| | | |
|---|---|---|
| రవి | – | మాణిక్యము |
| చంద్రుడు | – | ముత్యము |
| కుజుడు | – | పగడము |
| బుధుడు | – | మరకతము(పచ్చ) |
| గురువు | – | పుష్యరాగము |
| శుక్రుడు | – | వజ్రము |
| శని | – | నీలము |
| రాహువు | – | గోమేధుకము |
| కేతువు | – | వైడూర్యము |

ఈ రత్నములలో గురుపాలితులవి శనిపాలితులు, శనిపాలితులవి. గురుపాలితులు ధరించిన తప్పక దుష్ఫలితములను ఇచ్చును.

**గురు వర్గము:** సూర్యుడు, చంద్రుడు, కుజుడు, గురువు, కేతువు.

**శని వర్గము:** శని, శుక్రుడు, బుధుడు, రాహువు.

# గ్రహాల సంచారం



ఒకొక్కరాశి 30 డిగ్రీల నిడివి కలిగి ఉంటుంది. 12 రాశులుంటాయి. రాశి చక్రం మొత్తం 360 డిగ్రీలు ఉంటుంది.

ప్రతి గ్రహం రాశిలో ఉన్న 30 డిగ్రీలలో 27 డిగ్రీలు దాటిన తరువాత రాబోవు రాశిని చూచును.

**రవి :** ఒక్కొక్క రాశిలో నెల రోజులుండును. 5 రోజులు ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. రవి రోజుకు "1"డిగ్రీ చొప్పున సంచారం జరుపును.

**చంద్రుడు :** ఒక్కొక్క రాశిలో రెండున్నర రోజులుండును. 3 ఘడియలు (72 నిమిషాలు) ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. చంద్రుడు "1" డిగ్రీ కదలటానికి 1 గంట 48

నిమిషాలు పట్టును. అంటే రోజుకు 13 డిగ్రీల నుండి 15 డిగ్రీల వరకు సంచారం జరుపును.

**కుజ :** ఒక్కొక్క రాశిలో సుమారు 45 రోజులుండును. 8 రోజులు ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. రోజుకు 30 నిమిషాల నుండి 45 నిమిషాల వరకు సంచారం జరుపును.

**బుధ :** ఒక్కొక్క రాశిలో సుమారు నెల రోజులుండును. 7 రోజులు ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. 30 డిగ్రీలను దాటటానికి 27 రోజులు పట్టును. రోజుకు ఒకటిన్నర డిగ్రీలు సంచారం జరుపును. రవి నుండి 28 డిగ్రీలు దాటి ముందుకు గాని వెనుకకు గాని వెళ్ళడు.

**గురుడు :** ఒక్కొక్క రాశిలో ఒక సంవత్సరం రోజులుండును. 2 నెలల ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. రోజుకి 5 నుండి 15 నిమిషాల వరకు సంచారం జరుపును.

**శుక్రుడు :** ఒక్కొక్క రాశిలో సుమారు నెల రోజులుండును. 7 రోజులు ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. రోజుకి 1 డిగ్రీ (65 నిమిషాల నుండి 85 నిమిషాల వరకు) సంచారం జరుపును. రవి నుండి 47 డిగ్రీలు దాటి ముందుకు గాని వెనుకకు గాని వెళ్ళడు.

**శని :** ఒక్కొక్క రాశిలో రెండున్నర సంవత్సరములుండును. 4 నెలలు ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. నెలకు ఒక డిగ్రీ చొప్పున రోజుకి 2 నిమిషాలు సంచారం జరుపును.

**రాహువు, కేతువు :** ఒక్కొక్క రాశిలో ఒకటిన్నర సంవత్సరములుండును. 3 నెలల ముందుగా రాబోవు రాశిని చూచును. అందుకు తగిన ఫలితమును ఇచ్చును. రోజుకు 3 నిమిషాలు చొప్పున సంచారం జరుపును.

# జన్మకుండలిలో దైవశాపం ఉన్నట్లు ఎలా గుర్తించాలి?



జన్మ కుండలిలో దైవ శాపం ఉన్నట్లు కొన్ని ప్రత్యేక గ్రహస్థితులు వల్లన తెలుస్తుంది.

శత్రు రోగ స్థానమైన ఆరో స్థానం నుంచి పన్నెండవ స్థానంలో పాపగ్రహములు ఉన్నట్లయితే జాతకునికి దైవ శాపం ఉన్నట్లు గుర్తించాలి

జన్మ కుండలిలోని ఆరవ స్థానాధిపతి యొక్క సస్థానాలలో చతుర్ధ స్థానాధిపతి ఉన్నట్లయితే జాతకులకు దైవ శాపం ఉన్నట్లు గుర్తించాలి

జన్మ కుండలిలోని ఆరో స్థానాధిపతి నాల్గో స్థానంలో నాల్గవ స్థానాధి పతి ఆరోస్థానంలో అనగా ఆరవ భావాధిపతి మరియు నాలుగవ భావాధి పతి పరివర్తనం చెందిన జాతకులకు దైవ శాపం ఉన్నట్లు గుర్తించాలి.

జన్మ కుండలిలోని ఆరో స్థానంలో రవి గానీ చంద్రుడు గాని లేదా రవిచంద్రుడు కలిసిగానీ ఉన్నట్లయితే జాతకునికి దైవ శాపం ఉన్నట్లు గుర్తించాలి.

ఈ దైవ శాపం ఉన్న జాతకులు అన్నదానం వస్త్రదానం పేదలకు చేయాలి. దేవాలయాలకు విగ్రహాలను, సాలగ్రామాలు, మంచినీటిని సమర్పించడం, ఆలయ నిర్మాణానికి సహకరించడం, దేవ సంబంధిత గ్రంథ ముద్రణకు సహ కరించడం లాంటివి చేసినట్లయితే దైవానుగ్రహం పొందగలరు. 

# నవగ్రహ దోషాలకు చేయవలసిన పరిహారాలు



మానవుని యొక్క దైనందిన జీవితంలో అనేక సమస్యలు ఎదురవుతూ ఉంటాయి. జ్యోతిష్యం పై నమ్మకం ఉన్నవారు సమస్యకు కారణం తెలిసిన వెంటనే సంబంధిత గ్రహానికి పూజించి ఆ గ్రహానుగ్రహం పొంది తత్సంబంధమైన భాదల నుండి విముక్తి పొందుతుంటారు.

జ్యోతిష్య జ్ఞానం లేనివారు కూడా వారికి కలుగుచున్న కష్టాలకు కారణం అగు గ్రహం తెలుసుకొని ఆ గ్రహానికి శాంతి మార్గములు చేసుకొనిన గ్రహ భాదల నుండి విముక్తి పొందుతారు.

## సూర్యుడు

ఎవరి జాతకంలో అయితే రవి బలహీనంగా ఉంటాడో వారికి అనారోగ్యము, అధికారుల నుండి వేధింపులు, తండ్రి లేదా పుత్రుల నుండి వ్యతిరేకత, నేత్ర, గుండె సంబంధిత వ్యాధులు, తండ్రి తరుపు బంధువులతో పడకపోవుట, ఏదైనా సాధించాలనే పట్టుదల లేకపోవుట, ఆత్మవిశ్వాసం లేకపోవుట వంటి సమస్యలు తమ దైనందిన జీవితంలో ఎదుర్కొంటారు.

సూర్య గ్రహ అనుగ్రహం కొరకు ప్రతిరోజు సూర్య నమస్కారం చేసుకొనుట, ఆదిత్య హృదయం పారాయణం, గోధుమ లేదా గోధు మలతో తయారుచేసిన ఆహారపదార్థములు దానం చేయుట. తండ్రి గారిని లేదా తండ్రితో సమానమైన వారిని గౌరవించుట వలన రవి గ్రహదోషము తొలగిపోయి అభివృద్ధి కలుగుతుంది అని చెబుతారు.

## చంద్రుడు

చంద్రుడు జాతక చక్రంలో బలహీనంగా ఉన్నప్పుడు మనస్సు నిలకడగా లేపోవుట, భయం, అనుమానం, విద్యలో అభివృద్ధి లేకపోవుట, తల్లిగారి యొక్క ఆరోగ్యం సరిగా లేకపోవుట, స్త్రీలతో విరోధము, మానసిక వ్యాధులు, రాత్రులు సరిగా నిద్రపట్టకపోవుట, అధికమైన కోరికలు, శరీరం యొక్క ఎదుగుదల సరిగా లేకపోవుట, బరువు తక్కువగా ఉండుట, స్త్రీలకు గర్భాశయ వ్యాధులు మొదలగు సమస్యలు కలుతున్నప్పుడు చంద్ర గ్రహ దోషంగా గుర్తించాలి.

చంద్ర గ్రహ అనుగ్రహం కొరకు మాతృ సమానమైన స్త్రీలను గౌరవించుట, బియ్యం దానం చేయుట, పాలు, మజ్జిగ వంటివి భక్తులకు చిన్న పిల్లలకు పంపిణీ చేయడం, శివునికి ఆవుపాలతో అభిషేకం జరిపించుకొనుట, పార్వతీదేవి అష్టోత్తరం పారాయణం చేయుట మొదలగు వాటి ద్వారా చంద్రగ్రహ అనుగ్రహానికి పాత్రులు అయి అభివృద్ధి చెందుతారు అని చెప్పబడుతుంది.

## కుజుడు

జాతకచక్రంలో కుజుడు బలహీనంగా ఉండడం వల్ల ధైర్యం లేకపోవుట, అన్నదమ్ములతో సఖ్యత నశించుట, భూమికి సంబంధించిన

వ్యవహారాల్లో నష్టాలు, కోర్టు కేసులు, రౌడీల వలన ఇబ్బందులు, అగ్ని ప్రమాదాలు, వాహన ప్రమాదాలు, పోలీసుల వల్ల వేధింపులు, అప్పులు తీరకపోవుట, ఋణదాతల నుండి ఒత్తిడి, రక్త సంబంధించిన వ్యాధులు, శృంగారంనందు ఆసక్తి లేకపోవడం, కండరాల బలహీనత, రక్తహీనత సమస్యలను ఎదుర్కొనే ధైర్యం లేకపోవుట మొదలగునవి కలుగుచున్నప్పుడు కుజ గ్రహ దోషముగా గుర్తించాలి.

కుజ గ్రహానుగ్రహం కొరకు సుబ్రహ్మణ్యస్వామి, ఆంజనేయ స్వామి వారిని పూజించాలి. అలాగే హనుమాన్ చాలీసా పారాయణం, కందులు దానం చేయడం, పగడం ఉంగరం ధరించడం, మంగళవారం రోజున నియమంగా ఉండడం, అన్నదమ్ములకు సహాయం చేయడం, వారి మాటలకు విలువ ఇవ్వడం, స్త్రీలు ఎర్రని కుంకుమ, ఎరుపు రంగు గాజులు ధరించడం వలన కుజ గ్రహపీడలు తొలిగిపోతాయి అని చెప్పబడుతుంది.

## బుధుడు

జాతక చక్రంలో బుధుడు బలహీనంగా ఉన్నట్లయితే.. నరాల బలహీనత, జ్ఞాపకశక్తి లేకపోవటం, చదువులో అభివృద్ధి లేకపోవడం, నత్తిగా మాట్లాడడం, వ్యాపారాల్లో నష్టాలు, సరైన సమయానికి సరైన నిర్ణయాలు తీసుకోలేకపోవడం, తెలివితేటలు లేకపోవడం, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు, అనుమానం, తరుచూ ధననష్టం మొదలగునవి జరుగుచున్నప్పుడు బుధ గ్రహ దోషంగా గుర్తించాలి.

బుధ గ్రహానుగ్రహం కొరకు విష్ణు సహస్రనామం పారాయణ చేయడం, వేంకటేశ్వరస్వామి వారిని, విఘ్నేశ్వర స్వామి వారిని ప్రార్థించుట, వారికి సంబంధించిన క్షేత్రాలను దర్శించుట, ఆవుకు పచ్చగడ్డి,

తోటకూర లాంటివి ఆహారంగా ఇచ్చుట, పెసలు దానం చేయుట, విద్యార్థులకు పుస్తకాలను దానం చేయటవలన బుధుని యొక్క అనుగ్రహం కలుగుతుంది అని చెప్పబడుతుంది.

## గురువు

జాతకంలో గురువు బలహీనంగా ఉన్నచో జీవితంలో సుఖము, సంతోషం లేకపోవుట, దైవంపై నమ్మకం లేకపోవుట, పెద్దల యందు గౌరవం లేకపోవుట, ఆచారములు పాటించకుండుట, ఉన్నత విద్యకు ఆటంకాలు, నియంతగా ప్రవర్తించుట, ధనమునకు ఇబ్బందులు కలుగుట, ఎన్ని పూజలు, వ్రతాలు చేసినా ఫలితం లేకపోవుట, జీర్ణశక్తి లేకపోవుట, లివర్‌కు సంబంధించిన వ్యాధులు కలుగుచున్నప్పుడు గురుగ్రహ దోషంగా గుర్తించాలి.

గురుగ్రహ అనుగ్రహం కొరకు గురుచరిత్ర పారాయణ చేయడం, గురువులను గౌరవించుట, దైవ క్షేత్రములు సందర్శించుట, శనగలు దానం చేయుట, పంచముఖ రుద్రాక్షను లేదా కనక పుష్యరాగమును ధరించవచ్చును అని చెప్పబడుతుంది.

## శుక్రుడు

జాతకంలో శుక్రుడు బలహీనముగా ఉన్నప్పుడు స్త్రీ లకు అనారోగ్యము కలుగుట. వాహన సౌఖ్యము లేకపోవుట. భార్యాభర్తల మధ్య అన్యోన్యత లేకపోవుట. వ్యసనముల యందు ఆసక్తి, వివాహం ఆలస్యం అగుట, కిడ్నీ వ్యాధులు, వ్యభిచారం, మత్తుపానీయాలు సేవించుట, కుటుంబంలోని స్త్రీలకు అనారోగ్యము సరిగా లేనప్పుడు శుక్ర గ్రహ దోషముగా గుర్తించాలి.

శుక్ర గ్రహ అనుగ్రహం కొరకు లక్ష్మీ అమ్మవారిని పూజించుట, లక్ష్మీ స్తోత్రము పారాయణం చేయుట, బొబ్బర్లు దానం చేయుట, వివాహం కాని స్త్రీలకు వారి వివాహం కొరకు సహకరించుట, స్త్రీలను గౌరవించుట, వజ్రం ఉంగరం ధరించుట, సప్తముఖి రుద్రాక్షను ధరించుట వలన శుక్ర గ్రహ అనుగ్రహము పొందవచ్చును అని చెప్ప బడుతుంది.

## శని

ఆయుష్షు కారకులు అయిన శని జాతక చక్రము నందు బలహీనముగా ఉన్నచో బద్ధకము, అతినిద్ర దీర్ఘకాలిక వ్యాధులు, సరయిన ఉద్యోగము లేకపోవుట, జన సహకారం లేకపోవుట, ఎముకల వ్యాధులు, తల్లిదండ్రులతో విరోధములు, ఇతరుల ఆధీనములో పని చేయుట, సేవకా వృత్తి, నీచ వృత్తులు చేపట్టుట, గౌరవం లేకపోవుట, పాడుపడిన గృహములయందు జీవించుట, ఇతరుల ఇంట్లో జీవనము సాగించుట, భార్యపిల్లలు అవ మానించుట, కుటుంబమును విడిచి అజ్ఞాతముగా జీవించుట, సరయిన భోజనం కూడా లేక పోవుట మొదలగు కష్టములు కలుగుటను శనిగ్రహ దోషంగా గుర్తించాలి.

శనిగ్రహ అనుగ్రహమునకు శివునికి అభిషేకము చేయుట. విష్ణు సహస్రనామాలు పారాయణం చేయుట. శనివారము నియమముగా ఉండుట, ఆంజనేయ స్వామి వారిని ఆరాధించుట, హనుమాన్ చాలిసా పారాయణం చేయుట, హనుమంతునకు తమలపాకు పూజ చేపిస్తే మంచిది. స్వామి అయ్యప్ప మాల ధారణ చేయుట, శని గ్రహానికి శని త్రయోదశి రోజున తైలాభిషేకం చేయుట, నల్ల నువ్వులు దానము చేయుట, నల్ల దుప్పటి వస్తువులు దానం చేయుట, నీలము ఉంగరం

గాని నాలుగు ముఖములు గల రుద్రాక్షను ధరించుట వలన శని గ్రహ అనుగ్రహం కలుగుతుంది అని చెప్పబడుతుంది.

## రాహువు

రాహువు జాతక చక్రంలో బలహీనముగా ఉన్నప్పుడు చట్ట వ్యతిరేక కార్యకలాపాలు చేయుట, నీచస్త్రీలతో సహవాసము, కుష్టులాంటి వ్యాధులు, జైలు శిక్షలు అనుభవించుట, విద్యార్థులు విద్య మధ్యలో మానివేయుట, పాడుపడిన గృహములలో నివసించుట, ఇంట్లో బొద్దింకలు, పంది కొక్కులు, పాములు వంటివి సంచరించుట, శుభకార్యములు వాయిదా పడుట, వాహన ప్రమాదములు జరుగుట, గృహంలో ఎలక్ట్రానిక్ వస్తువులు పాడగుట, విలువైన వస్తువులు దొంగలు ఎత్తుకొనిపోవుట, మొదలగునవి సంభవించుచున్నప్పుడు రాహుగ్రహ దోషముగా గుర్తించాలి.

రాహుగ్రహ దోష నివారణకు కనక దుర్గ అమ్మవారిని పూజించుట, దేవి భాగవతం పారాయణం చేయుట, గోమేధికం గాని ఎనిమిది ముఖములు గల రుద్రాక్షను గాని ధరించవలెను. భవాని మాల ధరించుట, స్త్రీ లను గౌరవించుట వలన రాహు గ్రహ అనుగ్రహం కలుగును. దుర్గా సప్తశ్లోకి పఠించటం మంచిది అని చెప్పబడుతుంది.

## కేతువు

కేతువు జాతకంలో బలహీనంగా ఉన్నపుడు మానసిక బలహీనతలు, అతిభక్తి, జీవితం మీద విరక్తి, ఏకాంతంగా ఉండాలనే కోరిక, లేనివి ఉన్నట్లు ఊహించుకోవడం, తనలో తానే ఊహించుకొనుట, తనని తాను దేవుడు గానే దేవతగానే ఊహించుకోవడం, దేనిని చూసినా భయపడడం, ఉద్యోగమును, భార్యా పిల్లలను వదలివేసి దేశసంచారం చేయుట.

పిచ్చివానివలె ప్రవర్తించుట, విచిత్ర వేషధారణ, సంతానం కలుగకపోవుట, గర్భం వచ్చిపోవుట, చిన్న పిల్లలకు తీవ్ర అనారోగ్యం, అంటువ్యాధులు, వైద్యులు కూడా గుర్తించలేని విచిత్ర వ్యాధులకు కేతువు కారణంగా గుర్తించాలి.

కేతు గ్రహ అనుగ్రహం కొరకు నలుపు తెలుపు రంగులో ఉన్న కంబళిదానం చేయుట. దేవాలయములు కట్టుటకు విరాళములు ఇచ్చుట. పిచ్చి ఆసుపత్రిలో రోగులకు సేవ చేయుట. అనాధ పిల్లలను చేరదీసి వారికి భోజన సదుపాయము కలిగించుట. వైఢూర్యము గాని తొమ్మిది ముఖములు గల రుద్రాక్ష ధరించుట వలన కేతు గ్రహ అనుగ్రహం పొందుతారు.

ప్రతిరోజు సూర్య నమస్కారం చేసుకొని ఇష్టమైన దేవాలయమును సందర్శించినచో ఎటువంటి గ్రహ దోషములు ఉన్నను పరిహారం జరుగును.

**"ఆకృష్ణేన" అను మంత్రముతో సూర్యుని,**

**"ఇమం దేవా' అను మంత్రముతో చంద్రుని,**

**"అగ్నిర్మూర్ధా" అను మంత్రముతో కుజుని,**

**"ఉద్బుధ్యస్వ" అను మంత్రముచే బుధుని,**

**"యదర్య" అను మంత్రముచే గురువును,**

**"అన్నాత్పరిస్రుతః" అను మంత్రముచే శుక్రుని,**

**""శం నో దేవీ" అను మంత్రముచే శనిని,**

**"కాండాత్" అను మంత్రముచే రాహువును,**

**"కేతుం కృణ్వన్న కేతవ"** అను మంత్రముచే కేతువును. ధ్యానించవలయును.

జల్లేడు, మోదుగు, జువ్వి ఉత్తరేణి, రాగి, మేడి, జమ్మి, గరక, దర్భలు, సమిధలు యథాక్రమముగా ఒక్కొక్క గ్రహమునకు 108, కాని 28 సార్లుకాని హోమమును చేయవలయును. అట్లే తేనెతో, నేయితో, పెరుగుతో, పాలతో కాని హోమము చేయవలయును.

# ఋగ్వేద యజుర్వేదములయందలి నవగ్రహ మంత్రములు

## 1. సూర్య మంత్రము :

ఓం ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశ యన్న మృతం మర్త్యంచ హిరణ్యేన సవితా రథేనా దేవోయాతి భువనాని పశ్యన్

(ఋగ్వేదము 1-35..2 యజుర్వేదము 33-43 )

ఓం భూర్భువః స్వః సూర్య ఇహాగచ్ఛ ఇహ సః సూర్యాయ నమః

**బీజ మంత్రము :** ఓం హ్రాం హ్రీం హ్రౌం సః సూర్యాయ నమః

**జపకాలం :** ఉదయము

## 2. చంద్ర మంత్రము :

ఓం హందేవా అసపత్నం సువధ్వం మహతే క్షత్రాయ మహతే జ్యేష్టాయ మహతే జ్ఞాన రాజ్యాయేంద్ర స్యేంద్రియాయ, ఇమమముశ్య పుత్రమముష్యే పుత్ర మస్యై విశా ఎషవో మీరాజా సోమో స్మాకం బ్రాహ్మణానాం రాజా (యజుర్వేదము 9-40)

ఓం భూర్భువః స్వః చంద్ర ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ సోమాయ నమః

**బీజ మంత్రము :** ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రాయ నమః

**జపకాలం :** సంధ్యా కాలము.

## 3. మంగళ మంత్రము :

ఓం అగ్ని ర్మూర్ధా దివః కకుత్పతి: పృథివ్యా అయం, అపాంరే తాంసి జిన్వతి (యజుర్వేదము 8-44-16, యజుర్వేదము 13-14)

ఓం భూర్భువః స్వః భౌమా ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ భౌమాయ నమః

**బీజ మంత్రము :** ఓం క్రాం క్రీం క్రౌం సః భౌమాయ నమః

**జపకాలం :** రెండు గంటల సమయము.

## 4. బుధ మంత్రము :

ఓం ఉద్బుద్య స్వాగ్నే ప్రతిజాగృ హిత్వమిష్టా పూర్తేం
సంసృజేదామయంచ అస్మిస్సదస్థే అధ్యుత్తరస్మిన్
విశ్వేదేవా యజమానశ్చ సీదత (యజుర్వేదము 15-54 )

ఓం భూర్భువః స్వః బుధ ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ బుధాయ నమః

**బీజ మంత్రము :** ఓం బ్రాం బ్రీం బ్రౌంసః బుధాయ నమః

**జపకాలం :** ఐదు గంటల సమయము.

## 5. గురు మంత్రము :

ఓం బృహస్పతే అతియదయోం ఘుమద్ విభాతి క్రతుమజ్జనేషు,
యద్దీదయచ్ఛ వనఋతుప్రజాత తదస్మాసు ద్రవిణం దేహిచిత్రం
(ఋగ్వేదము 2-23-25; యజుర్వేదము 26-3)

ఓం భూర్భువఃస్వః బృహస్పతే ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ బృహస్పతయే నమః

**బీజమంత్రం :** ఓం గ్రాం గ్రీం గ్రౌం సః గురవే నమః

**జపకాలం :** సంధ్యా కాలము.

## 6. శుక్ర మంత్రము :

ఓం అన్నాత్పరిశృతోరసం బ్రహ్మణాన్యపిబత్ క్షం పయః సోమం ప్రజాపతిః
ఋతేన సత్య మింద్రియం విపానాం శుక్ర మందస ఇంద్ర స్యేంద్రియ
మిదం పయో మృతం మధు (యజుర్వేదం 19-65)

**బీజమంత్రం:** ఓం ద్రాం ద్రీం ద్రౌంసః శుక్రాయనమః

**జపకాలం :** సూర్యోదయ సమయం.

## 7. శని మంత్రము :

ఓం శంనో దేవీరభిష్టయ ఆపోవబంతు పీతయే

శంయోరభిస్ర వంతునః (ఋగ్వేదము 10-9-4; యజుర్వేదము 36-12)

ఓం భూర్భువఃస్వః శనై శ్చరః ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ శనైశ్చరాయ నమః

**బీజమంత్రం :** ఓం ప్రాం ప్రీం ప్రౌంసః శనైశ్చరాయ నమః

**జపకాలం :** సంధ్యా కాలము.

## 8. రాహు మంత్రము :

ఓం కయానాశ్చిత్ర ఆభువధూతీ సదావృధాఃసఖా

కాయాశాశ్చిష్ఠయావృతా (ఋగ్వేదం 4-31-1, యజుర్వేదం 26-39)

ఓం భూర్భువః స్వః రాహో ఇహాగచ్ఛ ఇహతిష్ఠ రాహవేనమః

**బీజమంత్రం:** ఓం భ్రాం భ్రీం భ్రౌంసః రాహవేనమః

**జపకాలం :** రాత్రి సమయం.

## 9. కేతు మంత్రము :

ఓం కేతుం కృణ్వన్న కేతవే పేశే మర్యా అపేశసే సముపద్భి రాజాయధాః

(ఋగ్వేదము 1-6-3; యజుర్వేదము 29-37)

**బీజమంత్రం :** ఓం స్త్రాం స్త్రీ ం సౌం సః కేతవేనమః

**జపకాలం :** రాత్రి సమయం.

శనివారం కూర్మావతారాన్ని, రుద్రాది దేవతల ఆరాధన మంచిది. అప మృత్యువు నుంచి తప్పించుకోవాలనుకునేవారు ఆనాడు నువ్వులతో హోమం చేసి నువ్వులను దానం ఇచ్చి నువ్వులు కలిపిన అన్నంతో పండితులకు భోజనం పెట్టాలి. ఇలా చేయటం వల్ల పూజ చేసిన వ్యక్తికి మంచి ఆరోగ్యం చేకూరుతుంది.

# ఆలస్య వివాహానికి గ్రహపర కారణాలు



ఆలస్య వివాహానికి జాతక పరంగా కొన్ని గ్రహాల అనుకూలతలు లేకపోవటం వలన కూడా ఆలస్య వివాహాలు జరుగుతున్నాయి. ఆలస్య వివాహానికి జాతక ప్రభావం ఒక్కటే కాకుండా మనచుట్టూ ఉన్న వాతావరణ పరిస్థితులు అనుకూలించక పోవటం వలన కూడా కొంత మందికి వివాహం ఆలస్యమవుతుంది. ఆలస్య వివాహానికి కొన్ని జ్యోతిష్య సూత్రాలను పరిశీలన.

జాతకంలో వివాహ స్థానం సప్తమ స్థానం. సహజ వివాహా కారకుడు శుక్రుడు, స్త్రీ లకు గురువుని చూడాలి.

సప్తమ భావానికి బావాత్ భావం అయిన లగ్నాన్ని కూడా పరిశీలించాలి.

అపోహలకి కారకుడైన రాహువుని, చంచలత్వానికి కారకుడైన చంద్రగ్రహాన్ని పరిశీలించాలి. పంచమ స్థానం ప్రేమ వివాహనికి కారణం కావున ఆ స్థానాన్ని పరిశీలించాలి. కుజ, శుక్ర గ్రహాలను పరిశీలించాలి.

**లగ్న స్థానం - సప్తమానికి భావాత్ భావం.**

**సప్తమ స్థానం - భార్య, భర్తల గుణగణాల కోసం.**

**చతుర్థ స్థానం - సుఖాల కోసం.**

**వ్యయ స్థానం - శయ్యా సుఖం కోసం.**

**ద్వితీయ స్థానం - కుటుంబ అభివృద్ధి కోసం.**

**పంచమ స్థానం - సంతానం కోసం.**

**నవమ స్థానం - సత్ సంతానం కోసం.**

**లాభస్థానం -** ధర్మ, అర్థ, కామ, మోక్ష స్థానాలలో కామ స్థానం, వివాహానంతర ప్రేమాభిమానాలకు.

**షష్టమ స్థానం -** గొడవలు, కోర్టు సమస్యలు, ఎడబాటు (ఉద్యోగ పరంగా, విద్యాపరంగా దూరంగా ఉండటం కూడా కావచ్చు)

**అష్టమ స్థానం -** కష్ట, నష్టాల కోసం ఆయా స్థానాలను వివాహానికి పరిశీలించాలి.

శని రాహువులు సప్తమభావంలో ఉంటే ఆలస్య వివాహం అవుతుంది. వర్ణాంతర వివాహం జరిగే అవకాశాలు ఉండవచ్చు.

సప్తమ భావంలో నెప్ట్యూన్ ఉన్న ఆలస్య వివాహం అవుతుంది.

శని, శుక్ర సంబంధం వలన ఆలస్య వివాహం అవుతుంది.

లగ్నానికి కుజుడు అష్టమంలో శత్రు రాశిలో ఉన్న, పాపగ్రహ దృష్టి ఉన్న వివాహం ఆలస్యం అవుతుంది.

2,7,11 భావాలపైన శని రాహువుల దృష్టి ఉండటం వలన కూడా వివాహం ఆలస్యం అవుతుంది.

తులా లగ్నం అయి శుక్రుడు సప్తమ భావంలో ఉన్న ఆలస్య వివాహం అవుతుంది.

అష్టమంలో రాహువు ఉన్న కుటుంబ సమస్యల మూలంగా వివాహం ఆలస్యమవుతుంది.

2,7,11 భావ అధిపతులకి 6,8,12 భావాధిపతులతో సంబంధం ఏర్పడిన వివాహం ఆలస్యమవుతుంది.

సప్తమాధిపతి నీచలో ఉన్న, నవాంశలో సప్తమాధిపతి 6,8,12 భావాలలో ఉన్న వివాహం ఆలస్యమవుతుంది.

సప్తమాధిపతి శని,రాహు, కేతువులతో కలసి ఉన్న, షష్టాధిపతి, వ్యయాధిపతి సప్తమాన్ని చూస్తున్న, కుటుంబ స్థానాన్ని చూస్తున్న, సప్తమంలో కుజుడు నీచలో ఉన్న, వివాహం ఆలస్యమవుతుంది.

శని దశమ భావంలో ఉన్న వివాహం ఆలస్యం అవుతుంది. సప్తమంలో ఉన్న గ్రహంగాని, సప్తమాధిపతి గాని వక్రించటం వలన వివాహం ఆలస్యం కావటం కాని, వివాహం పట్ల విముఖత చూపటం కాని చేస్తారు.

కర్కాటక, సింహలగ్నం వాళ్ళకు సప్తమాధిపతి శని కావటం వలన వివాహం ఆలస్యం కావటం లేదా వివాహం అయిన తరువాత చిన్న చిన్న మనస్పర్ధలు రావటం జరుగుతాయి.

గ్రహాలన్నీ రాహుకేతువుల మధ్య ఉన్నాయని, కుజదోషం ఉన్నదని, నాగదోషం ఉన్నదని అపోహలతో మిగతా జాతకాన్ని పరిశీలించక మంచి జాతకం కాదనే ముద్రపడటం వలన కూడా వివాహం ఆలస్యమవుతుంది. ఈ విషయంలో జాగ్రత్త వహించాలి.



# వివాహ ముహూర్తముకు గ్రహబలము



వివాహ ముహూర్త లగ్నమునకు చంద్రుడు ఒక్కడే 2, 3, 4, 5, 9, 10, 11 స్థానములలో ఉన్నయెడల వధూవరులకు పుత్ర సంతానము సకల సౌభాగ్యములు కలుగును.

ఒక శుభ గ్రహము (గురు, బుధ, శుక్ర) స్వ ఉచ్చ మూల త్రికోణ మందుండి 1, 4, 5, 9, 10, స్థానములందున్ననూ, వధూవరులకు శుభము గలిగి సంపూర్ణ ఆయుష్మంతులగు పుత్ర సంతానము కలుగును.

వివాహ ముహూర్తమునకు, లగ్న మందు గురువు, పాపస్థానము లగు 6,3 లలో రవి కుజులు వుండి శుభ గ్రహములు శుక్రుడు చంద్రుడు 10, 11 (రాజ్య భాగ్యములందు) ఉండిరేని సత్సంతానము, వంశవృద్ధి బహుళముగా నుండును.

వివాహ లగ్నమున గురువు, 10వ ఇంట రవి ఉన్నయెడల సకల శుభములు కలుగును. మరియు 3వ ఇంట కుజుడు, 6వ ఇంట రవి, 12వ ఇంట గురు లేక శుక్రుడు ఉన్నయెడల భార్యాభర్తలు అనేక శుభములు పొంది ఆనంద జీవితము గడిపెదరు. సాధారణముగా ఇన్ని బలములు గల ముహూర్త లగ్నము నిర్ణయించుట సాధ్యము కాకపోయినను మంచి బలములు గల ముహూర్తము నిర్ణయించుట ఉత్తమము.

ముహూర్తబలము లోప భూయిష్ఠమైన అంతరాయములు కలిగి ఆదోషము తరువాతి వివాహ జీవితములో కనిపించును.

ముహూర్తదోషములు తొలగించుటకు జపము, దానము, హోమము పరిహారముగా కొందరు చెప్పుదురు.

కానీ ఇవన్నియు నామమాత్రమేనని శాస్త్రసమ్మతముకాని, ఏ పరిహారమైనను ఆమోదయోగ్యము కాదని, అందుచే పరిపూర్ణ జ్ఞానముకల సిద్ధాంతులను సంప్రదించి ముహూర్త నిర్ణయము చేసుకున్న శుభములు చేకూరునని విజ్ఞుల అభిప్రాయము.





కుజ దోషం ప్రభావం నివారించు కోవడానికి నవగ్రహ దేవతలను పూజించడం మరో పరిష్కార మార్గం. ప్రతి మంగళ వారం నవగ్రహాలకు పూజ చేయడం వల్ల కుజ దోషం నుంచి విముక్తి పొందవచ్చు. అలాగే మంగళవారం హనుమాన్‌ని దర్శించుకుని నెయ్యి దీపం వెలిగించినా.. ఈ దోషం తొలగిపోతుంది అని చెబుతారు.

# వివాహ సమస్యలకు కారణమైన కుజ, శుక్ర సమాగమము



జాతకచక్రంలో కుజుడు–శుక్రుడు కలిసినప్పుడు వివాహ సంబంధ ములైన సమస్యలు ఉత్పన్నమగును. అంటే నిశ్చితార్థం ఆక స్మికంగా ఆగిపోవుట, ముహూర్తసమయంలో ఆటంకములు ఏర్పడి వివాహ భంగమగుట, తరచూ వివాహ విఘ్నములు, అభిప్రాయ భేధములు, మనస్పర్థలు, దాంపత్య విరోధములు, ఎడబాట్లు, విడా కులు, హత్యలు, ద్వితీయ వివాహములకు దారితీయుట జరుగును.

కల్యాణకారకుడయిన శుక్రుడు ఒంటరిగా గాని, వేరే గ్రహాలతో కలిసిగాని 11వ ఇంటిలో ఉంటే ద్వి కళత్రా యోగం ఉంటుంది. అంటే ఇద్దరు భార్యలు ఉంటారు.

కుజుడు స్థిరరాశులలో లేక ద్విస్వభావ రాశులలో వున్న దోషము అధికముగా ఉంటుంది.

కల్యాణకారకుడయిన శుక్రుని మీద కుజుని యొక్క వీక్షణ ఉండకూడదు.

కుజుడు 4-7-8 దృష్టులతో శుక్ర గ్రహాన్ని వీక్షించిననూ, మూల నక్షత్రములో (ధనుస్సు రాశి) కుజ లేక శుక్ర గ్రహాల సంచార మున్ననూ సమస్యలుండును.

కర్కాటక రాశిలో నీచస్థితిలో యున్న కుజుడు..శుక్రునితో కలిస్తే ఒక రకంగా ఫలితాలు వుంటే, అదే కుజుడు కన్యా రాశిలో నీచ శుక్రునితో కలిసి వుంటే ఫలితాలు మరోరకంగా ఉంటాయి.

మకర రాశిలో కుజుడు ఉచ్ఛ స్థితిలో ఉండి, శుక్రునితో కలిస్తే దంపతుల మధ్యన సమస్యలు కనబడకుండగా లోలోపల ఉత్పన్న మవుతుంటాయి.

మిగిలిన రాశులలో(మకరం కాకుండా) కూడా కుజ, శుక్రుల కలయిక వాటి ప్రభావాల వల్ల సమస్యలు అనేక రకాలుగా వుంటాయి.

కుజ, శుక్ర సమాగమము వలన వివాహము ఒక్కొక్కసారి 40 సంవత్సరముల వరకు ఆలస్యమగును. ఎక్కడైననూ అనుకూల దాంప త్యమున్నప్పటికి ఆకస్మిక కారణాలచే సమస్యలు ఉత్పన్న మవుతాయని చెబుతారు.

కుజ శుక్ర సమాగమము వలన ప్రథమ వివాహము భంగమైన ప్పటికీ విడాకులు తీసుకొని ద్వితీయ వివాహము చేసుకొన్నప్పటికీ సమస్యలు వెంటాడుతానే ఉంటాయని జ్యోతిషనిపుణుల భావన. 

# గర్భిణీ స్త్రీలపై నవగ్రహాల ప్రభావం



స్త్రీ గర్భం ధరించిన తర్వాత నవమాసాలు శిశువుని తన గర్భమున మోస్తుంది. ఆ శిశువు తన తల్లి గర్భంలో ఏ విధంగా ఏ ఏ గ్రహ ప్రభావం చేత ఎదుగుతుందో అనే అంశం గురించి జ్యోతిష గ్రంధాలు మనకు వివరంగా తెలిపాయి.

ఖగోళంలో అనేక కోట్ల నక్షత్రాలు, గ్రహాలు, పాలపుంతలు మొదలగునవి ఉన్నప్పటికిని, భారతీయ జ్యోతిష సిద్ధాంతపరంగా గ్రహాలను ప్రామాణికంగా పరిగణలోకి తీసుకున్నవి కేవలం ఏడింటిని మాత్రమే.

నవగ్రహాలలో రాహూ కేతువులను ఛాయా గ్రహాలుగా పరిగణిస్తాము. అంటే ప్రధానంగా మనకు ఏడు గ్రహాలు మానవుడిని, భూమిని

ప్రభావితం చేసే శక్తి కలిగి ఉందని మన ఋషులు వారి అనుభవ పరిశోధనల ద్వార వాటిని మాత్రమే ప్రామాణికంగా తీసుకోవడం జరిగింది.

స్త్రీ గర్భం ధరించిన నెల నుండి ప్రసవించే వరకు ప్రతీ నెల ఏ గ్రహ శుభ ప్రభావం చేత శిశువులోని శరీర భాగాలు అభివృద్ధి చెందుతాయో అదే గ్రహం అశుభ దృష్టి వలన ఏమి లోపాలు ఏర్పడతాయో ఇచ్చట వివరించబడింది.

## మొదటి రెండు నెలలు

మొదటి నెలలో శుక్రుడు మాసాధిపత్యం వలన స్త్రీ, పురుషుల కలయికతో శుక్ర శ్రోణి సమ్మిశ్రమం వలన స్త్రీ గర్భం ధరించుటకు శుక్రుడు కారణం అవుతాడు. అదే శుక్రుడు అనుకూలుడు కానిచో గర్భాధారణ జరగదు.

రెండవ నెలలో కుజుడు మాసాధిపతి. కుజడు మరియు శుక్రుడి ప్రభావం వలన పిండము గట్టిపడును. వీరిద్ధరి శుభ దృష్టి లేకపోతే పిండం గట్టిపడదు.

## మూడు, నాల్గు నెలలు

మూడవ నెలలో గురువు ఆధిపత్యం వహించి గట్టిపడిన పిండము నకు అవయవములు (మొలకెత్తును) ఏర్పడును. గురువు అనుకూలుడు కాకపోతే అవయవ భాగాలు ఏర్పడవు.

నాల్గవ నెలలో సూర్యుడు ఆధిపత్యం వహిస్తాడు. ఈ సూర్యుని ప్రభావంచేత ఎముకలు ఏర్పడతాయి. ప్రతికూలమైతే ఏర్పడవు.

## ఐదు, ఆరు నెలల్లో

ఐదవ నెలలో చంద్రుడు ఆధిపత్యం వహించి చర్మాన్ని ఏర్పాటు చేస్తాడు. ప్రతికూలమైతే ఏర్పడదు.

ఆరవ నెలలో శని ఆధిపత్యం వహించి వెంట్రుకలను ఏర్పడుటకు కారణం అవుతాడు. ప్రతికూలుడైన వారికి సరైన జుట్టు ఉండదు.

## ఏడు, ఎనిమిది నెలల్లో

ఏడవ నెలలో బుధుడు ఆధిపత్యం వహించి జ్ఞానేంద్రియములు "ప్రాణం" ప్రసాదించి చేతనత్వం కలిగించును.

ప్రతికూలుడైతే జీవి ప్రాణం పోసుకోలేక మృతజీవిగా మారటం వలన ఆబార్షన్ అవుతుంది.

ఎనిమిదవ నెల యందు ఆ నెలకు సంబంధించిన మాసాధిపతి (ఆధాన లగ్నాదిపతి) లేక వారాధిపతి ఫలమును.. లగ్నధిపతి, చంద్ర, సూర్యుడు అధిపతులై మాస, వార అధిపతుల యొక్క మిత్ర, శత్రు ఫలిత ఆధారంగా వారి కారకత్వ ఫలితాలనిస్తారు. ప్రతికూలులైతే ముందస్తు ప్రసవం జరుగుతుంది

శిశువు ఆరోగ్యంపై, భవిష్యత్తుపై నమ్మకాలు తక్కువగా ఉంటాయి.

## తొమ్మిది, పది నెలల్లో

తొమ్మిదవ నెలలో చంద్రుడు ఆధిపత్యం వహించి గర్భంలోని శిశువుని ముందు, వెనకకు కదలికలను కలిగిస్తాడు. ప్రతికూలుడైతే శిశువులో కదలికలు ఉండవు.

పదవ నెలలో అంటే తొమ్మిది నెలలు పూర్తిగా నిండి పొద్దులు నడుస్తున్న రోజులలో సూర్యనారాయణుడు అధిపత్యం వహించి సుఖ ప్రసవాన్ని కలిగిస్తాడు.

## భర్త చేయకూడని పనులు

ఈ గర్భస్త స్త్రీ 8, 9, 10 నెలల సమయంలో గ్రహ గర్భస్ఫుటత్వము కలిగి శిశువునకు ఆకలి దప్పికలను కలిగించి తల్లి గర్భనాళము ద్వారా ఆహారమును తీసుకొనును. ఈ విధంగా జీవునికి, గర్భవతికి మొదటి నెల నుండి పదవనెల వరకు మనస్సును ప్రశాంతంగా ఉంచుకుని ఎల్లప్పుడు దైవచింతనతో ఉంటూ మాసాధిపతులగు గ్రహములకు జపశాంతి ధానాదులను వరుసననుసరించి చేసినచో సత్సంతానం కలుగుతుంది.

భార్య గర్భవతిగా ఉన్నప్పుడు ఆరు నెలలు నిండిన తర్వాత గృహారంభం, సముద్ర ప్రయాణములు, క్షౌరం చేయించుకొనుట, శార్ధ (సూతకం ఇండ్లలో) భోజనాలు తినుట, శవాలను మోయుట, శవం వెంట నడవడం, నదీ స్నానములు, శృంగారం, ఇతరులతో పోట్లాడుట, వివాహం చేయుట, దూరదేశ ప్రయాణాలు చేయుట మొదలగునవి భర్త చేయకూడదు.

## భర్త చేయవలసినవి

భర్త ప్రేమ ముఖ్యంగా భార్య గర్భవతిగా ఉన్నప్పుడు భర్త తన భార్యను ప్రేమగా చూసుకోవాలి. తనకు ఏ ఆహారపదార్థాలపై ఇష్టం ఉంటుందో వాటిని సమకూర్చవలెను. మంచి పోషక విలువలు కలిగిన పాలు, పండ్లు, ఆకు కూరలు, చిరు ధాన్యాల మొలకలు, క్యారెట్ మొదలగు ఆహార పదార్థాలు తినుటకు ఏర్పాటు చేయాలి. ఇంట్లో ఎల్లప్పుడు శుభ్రత, ప్రశాంత వాతవరణం, ఆధ్యాత్మిక చింతన దాన, ధర్మ గుణం కలిగి ఉండాలి.

ఇలా ఉండ గలిగితే తల్లిదండ్రులకు, సమాజానికి మంచి పేరు తెచ్చే సత్సంతానం కలుగుతుంది అని విజ్ఞుల భావన.

# ఏ గ్రహ దోషానికి ఏ గణపతిని పూజించాలి



**సూర్యదోష నివారణకు** ఎర్రచందనంతో చేసిన గణపతిని పూజించాలి.

**చంద్ర దోష నివారణకు** వెండి లేక పాలరాయితో చేసిన వినాయకుడిని పూజించాలి.

**కుజదోష నివారణకు** రాగితో చేసిన వినాయకుడిని పూజిస్తే ఫలితం ఉంటుంది.

**బుధ దోష నివారణకు** మరకత గణపతిని అర్చించాలి.

**గురు దోష నివారణకు** పసుపు, చందనం లేక బంగారంతో చేసిన గణపతిని కొలవాలి.

**శుక్ర దోష నివారణకు** స్ఫటిక గణపతికి ఆరాధన చేయాలి.

**శని దోష నివారణకు** నల్లరాయిపై చెక్కిన గణపతిని పూజించాలి.

**రాహు గ్రహ దోష నివారణకు** మట్టితో చేసిన గణపతిని పూజించాలి.

**కేతు గ్రహ దోష నివారణకు** తెల్ల జిల్లేడుతో చేసిన గణపతిని పూజించాలి.

**ఎర్రచందనంతో చేసిన గణపతి**ని పూజించడం వల్ల అనారోగ్య సమస్యలు ఉండవు.

**పగడపు గణపతిని** పూజించడం వల్ల అప్పుల బాధలు తొలగిపోతాయి.

**పాలరాయితో చేసిన గణపతి**ని పూజిస్తే మానసిక ప్రశాంతత కలుగుతుంది.

**శ్వేతార్క గణపతి**ని పూజిస్తే మనకు ఎదురవుతున్న సమస్యలు తొలగిపోతాయి.

**స్ఫటిక గణపతి**ని పూజిస్తే సుఖశాంతులను ప్రసాదిస్తాడు.



# గ్రహాలు - షడ్బలములు



బలం కలిగి ఉండడం అనే విషయంలో 'బలవాన్ షడ్బల యుక్తస్సన్' అని చెప్పారు. స్థానంలో షడ్బలయుక్తుడయి ఉండడం ప్రధానం అని చెప్పారు.

జాతక చక్రంలో గ్రహాలు షడ్బలములలో ఏదో ఒక బలమును కలిగి ఉండాలి. అప్పుడే ఆ గ్రహం బలం కలిగి ఉంటుంది. జాతకంలో యోగ కారక గ్రహాలు షడ్బలములలో ఏదో ఒక బలము ఖచ్చితంగా కలిగి ఉండాలి.

## షడ్బలములు ఆరు రకములు

స్థానబలం, దిగ్బలం, దృగ్బలం, కాలబలం, చేష్టాబలం, నైసర్గిక బలం అనేవి షడ్బలములుగా చెప్పబడుతున్నవి.

షడ్బలములు జాతకపరిశీలనలో ఆయుర్ధాయం, గ్రహ, భావ బలముల, బలహీనతల విషయంలో ఉపయోగపడతాయి.

ఉదాహరణకు జాతక చక్రంలో లగ్నం బలంగా ఉంటే లగ్నం నుండి ఫలితాలు బాగుంటాయి.

చంద్రలగ్నం బలంగా ఉంటే చంద్రలగ్నం నుండి ఫలితాలు బాగుంటాయి.

సూర్య లగ్నం బలంగా ఉంటే సూర్య లగ్నం నుండి ఫలితాలు బాగుంటాయి.

అదేవిధంగా దశ అంతర్ధశలలోను సూర్యుడి మహాదశలో చంద్ర అంతర్ధశ జరుగుతున్నప్పుడు ఏ గ్రహం బలంగా ఉంటే ఆ గ్రహ ఫలితాలు వస్తాయి.

స్థానబలం గ్రహానికి ఉంటే ఉన్న ప్రదేశంలో రాణిస్తాడు. దిగ్బలం గ్రహానికి ఉంటే సమస్య పరిష్కారం తొందరగా అవుతుంది.

చేష్టా బలం గ్రహానికి ఉంటే జాతకుడు చేసే ప్రతి పని మేలు చేస్తుంది. అతని చేష్టలు (పనులు) ఇతరులు మెచ్చుకుంటారు.

కాలబలం గ్రహానికి ఉంటే సమయం వృధా కాకుండా ఉంటుంది. దృగ్బలం గ్రహానికి ఉంటే ఇతరుల దృష్టిలో మంచివాడవుతాడు. నరదృష్టి ఉండదు.

నైసర్గిక బలం గ్రహానికి ఉంటే ప్రత్యేకమైన ఫలితాలు ఏమి ఉండవు.

### 1. స్థానబలం

జాతకచక్రంలో ఏ గ్రహమైన ఉచ్ఛ, మూలత్రికోణం, స్వస్థాన, మిత్ర స్థానాలలో ఉన్నప్పుడు స్థాన బలం కలిగి ఉంటుంది.

## 2. దిగ్బలము

లగ్నం తూర్పును, దశమం దక్షిణాన్ని, సప్తమం పడమర, చతుర్థం ఉత్తర దిక్కులను తెలియజేస్తాయి.

గురువు, బుధులు లగ్నములో (తూర్పు) ఉన్నప్పుడు, రవి, కుజులు దశమంలో (దక్షిణం) ఉన్నప్పుడు, శని సప్తమంలో (పడమర) ఉన్నప్పుడు, శుక్ర, చంద్రులు చతుర్థంలో (ఉత్తరం) లో ఉన్నప్పుడు బలం కలిగి దిగ్బలం కలిగి ఉంటారు.

వ్యతిరేక దిశలలో ఉంటే దిగ్బలాన్ని కోల్పోతారు.

ఉదాహరణకు సూర్యుడు దశమంలో ఉంటే దిగ్బలం కలిగి ఉంటుంది. అదే చతుర్థంలో ఉంటే దిగ్భాలాన్ని కోల్పోయి నిర్బలము పొందును.

## 3. చేష్టాబలం

రవి, చంద్రులు ఉత్తరాయణంలో ప్రయాణిస్తున్నప్పుడు, కుజ, గురు, బుధ, శుక్ర, శనులు వక్రము పొంది ఉన్నప్పుడు బలాన్ని కలిగి ఉంటారు. శుభగ్రహాలు శుక్ల పక్షం నందు, పాపగ్రహాలు బహుళపక్షము నందు బలవంతులు.

## 4. కాలబలం

చంద్ర, కుజ, శనులు రాత్రి సమయములందు, రవి, గురు, శుక్రులు పగటి సమయమందు, బుధుడు అన్ని సమయములందు బలము కలిగి ఉంటాడు.

పాపగ్రహములు కృష్ణపక్షమునందు, శుభగ్రహములు శుక్లపక్షము నందు బలము కలిగి ఉంటారు. ఆయా గ్రహాలకు సంబందించిన వారము, మాసములలోనూ బలము కలిగి ఉంటారు.

## 5. దృగ్బలం

గ్రహములు శుభగ్రహములచే చూడబడుతున్నప్పుడు శుభ గ్రహముల దృష్టి దృగ్బలాన్ని, పాపగ్రహముల దృష్టి వ్యతిరేఖ ఫలితాలను కలిగిస్తాయి.

## 6. నైసర్గిక బలం

రవి, చంద్ర, శుక్ర, గురు, బుధ, కుజ మరియు శనులు వరసగా బలం కలిగి ఉంటారు.

శని కంటే కుజుడు, కుజుని కంటే బుధుడు, బుధుని కంటే గురువు, గురువు కంటే శుక్రుడు, శుక్రుని కంటే చంద్రుడు, చంద్రుని కంటే రవి బలవంతులు.

సరియైన గణిత సాధన చేయకుండా ఫలితాలను చెప్పలేమన్నది నిజం. హిందూ ఖగోళ శాస్త్రజ్ఞుడైన భాస్కరాచార్యుడు ఇంకా ముందుకు వెళ్లి గ్రహ గణితానికి సంబంధించిన ఖగోళశాస్త్ర విషయాలన్నింటినీ జ్యోతిష్యుడు కాదలచిన వ్యక్తి నేర్చుకుతీరాలని స్పష్టం చేసాడు. అందుచేత గణితంలో నిష్ణాతులైన జ్యోతిషశాస్త్రవేత్తలను సంప్రదించటం ముఖ్యమని సారాంశం. 

## సూర్యభగవానుడి కిరణాలు ఏడింటి పేర్లు

| | | |
|---|---|---|
| మొదటి కిరణం | సుషుమ్నం | violet నాడి ఊదా రంగు. |
| రెండవ కిరణం | హరి కేశు | indigo హరి (ఇంద్ర) ఇంద్రనీలం. |
| మూడవ కిరణం | విశ్వ కర్మ | blue విశ్వ కర్మ (శిల్పము) నీలం. |
| నాల్గవ కిరణం | విశ్వ వ్యచ | green విశ్వ వ్యచ (దృష్టి) ఆకుపచ్చ. |
| ఐదవ కిరణం | సంపద్వసు | yellow సంపదల వసు (రత్నము) పసుపు పచ్చ. |
| ఆరవ కిరణం | అర్వాదము | orange పడమటి సముద్రము నందలి వరుణుని తోట, రేలపూఛాయ. |
| ఏడవ కిరణం | స్వరాడ్వసు. | red స్వ (స్వయంసిద్ధమైన వసు అగ్ని) రంగు ఎరుపు. |

# గ్రహ గతుల పరిశీలన



భూమి పైన ఉండి గ్రహాలను పరిశీలించినప్పుడు కొన్ని గ్రహాలకు ప్రత్యేకమైన గతులు (చలనాలు) ఉన్నట్లు తెలుస్తుంది. ఈ చలనాలు అన్నీ తారాగ్రహాలకు మాత్రమే ఉంటాయి.

తారాగ్రహాలంటే తారల్లాగా కనబడే..బుధుడు, శుక్రుడు, కుజుడు, గురువు, శనిగ్రహాలు.

రవి, చంద్ర గ్రహాలు బింబగ్రహాలు. వీటికి ఋజుగతి మాత్రమే ఉంటుంది.

రాహు, కేతువులు ఛాయాగ్రహాలు ఇవి ఎప్పుడూ వక్రగతిలోనే ఉంటాయి.

మిగిలిన ఐదు తారాగ్రహాలకు మాత్రమే ప్రత్యేకమైన గతులు ఉంటాయి.

ప్రతి గ్రహం సూర్యుని చుట్టూ వాటి వాటి కక్ష్యల్లో తిరుగుతుంటాయి. భూమి కూడా తన కక్ష్యలో సూర్యుని చుట్టూ తిరుగుతుంటుంది. కాబట్టి వాస్తవంలో ఏ గ్రహానికి వక్రగతి గాని, ఇతర గతులు గాని ఉండవు.

కానీ భూమి మీద ఉన్న పరిశీలకుడు ఒక గ్రహాన్ని పరిశీలిస్తున్నప్పుడు

ఒకొొక్కసారి ఆ గ్రహం ముందుకు వెళ్ళినట్లు, ఒకొొక్కసారి వెనుకకు వెళ్ళినట్లు, ఒకొొక్కసారి కదలకుండా ఉన్నట్లు కనిపిస్తుంది.

ఒక గ్రహం ముందుకు వెళ్ళినట్లు కనపడే స్థితిని ఋజుగతి అంటారు.

ఒక గ్రహం వెనుకకు వెళ్ళినట్లు కనపడే స్థితిని వక్రం లేదా వక్రగతి అంటారు.

ఒక గ్రహం వక్రగతిలో ఉన్నదంటే అది భూమికంటే వెనుక ప్రయాణిస్తుందన్న మాట.

గ్రహం తానున్న రాశి నుండి గాని, నక్షత్ర పాదం నుండి వెనుకకు పోవటాన్ని వక్రం అంటారు.

పాపగ్రహాలకు వక్రగమనం కలిగినచో మిక్కిలి పాప ఫలితాన్ని, శుభగ్రహాలకు వక్రగమనం కలిగినచో సకల శుభ ఫలితాన్ని ఇస్తారు.

గురువు వక్రించినప్పుడు అదే రాశి ఫలితాన్ని, మిగతా గ్రహాలు వక్రించినప్పుడు వెనుక రాశి ఫలితాన్ని ఇస్తాయి.

బుధుడు..రవిని దాటి 28° ముందుకు వెళ్ళి క్రమంగా వేగం తగ్గి 22° దూరంలో వక్రిస్తాడు.

ఆయా రాశులను బట్టి 14° దూరంలో కూడా వక్రించును. వక్రించి నప్పుడు బుధుడు గరిష్టంగా 16° 30 నిమిషాలు వెనుకకు వెళ్తుంది.

శుక్రుడు..రవిని దాటి 48° ముందుకు వెళ్ళి క్రమంగా వేగం తగ్గి 29° దూరంలో వక్రిస్తాడు. వక్రించినప్పుడు శుక్రుడు గరిష్టంగా 16° 30 నిమిషాలు వెనుకకు వెళ్తుంది.

కుజుడిని దాటి రవి 4 రాశుల 11° ముందుకు వెళ్ళగానే కుజుడు వక్రిస్తాడు. వక్రించినప్పుడు కుజుడు గరిష్టంగా 10° 30 నిమిషాలు వెనుకకు వెళ్తుంది.

గురువుని దాటి రవి 3 రాశుల 24° ముందుకు వెళ్ళగానే గురువు వక్రిస్తాడు. వక్రించినప్పుడు గురువు గరిష్టంగా 10° 00 నిమిషాలు వెనుకకు వెళ్తుంది.

శనిని దాటి రవి 3 రాశుల 19° ముందుకు వెళ్ళగానే శని వక్రిస్తాడు. వక్రించినప్పుడు శని గరిష్టంగా 06° 58 నిమిషాలు వెనుకకు వెళ్తుంది.

## గ్రహ అతిచారం

గ్రహాలు ఒక రాశి యందు నియమిత కాలం ఉండక ముందు రాశికి పోవుట అతిచారం అంటారు.

అట్టి అతిచారం మిగిలిన గ్రహాల కంటే గురువుకు తరచుగా కలుగుచుండును.

అతిచారం నందున్న గ్రహం బలహీనంగా ఉండును. అందుచేత అది శుభ ఫలమును ఇవ్వలేదు. రాహు కేతువులకు అతిచారం ఉండదు.

## గ్రహ స్తంభనం

ఒక గ్రహం ఒక రాశి యందు తన నియమిత కాలం కంటే అధిక కాలం అదే రాశి యందు ఉన్నచో అది స్తంభనమని అనబడును.

అట్టి స్తంభన కుజునకు తరచుగా కలుగును. స్తంబించిన గ్రహం శుభఫలమును ఇవ్వలేవు.

## సమాగమం

చంద్రునితో ఒకేరాశిలో ఉండు గ్రహమునకు సమాగమం అని అందురు. సమాగమం పొందిన గ్రహం అధిక బలమును పొందును. కాని చంద్రుడు ఉన్న నక్షత్రం నందు మాత్రం ఏ గ్రహం ఉండకూడదు. చంద్రస గ్రహ దోషం అనబడును. ఒకే పాదం నందు ఉండరాదు.

## గ్రహయుద్ధం

కుజుడున్న నక్షత్రమునకు వెనుక నక్షత్రం నందు గల గ్రహం పరాజిత గ్రహం. గ్రహయుద్ధం నందు ఓడిన గ్రహం అనబడును.

కుజుడున్న నక్షత్రమునకు ముందున్న నక్షత్రమందు గల గ్రహం జయ గ్రహం అనబడును.

కుజునితో సమాన భాగములందు కలసిన గ్రహములకు గ్రహ యుద్ధం కలుగును.

గ్రహ యుద్ధం బుధ, గురు, శుక్ర, శని గ్రహములకు సంభవించును.

## ఆచ్ఛాదనం

పూర్ణచంద్రుడు, శని, కేతువు, గురువు వీరికి మాత్రమే ఆచ్ఛాదనం ఉండును.

పూర్ణ చంద్రుడు, శని, కేతువు తామున్న రాశికి ద్వితీయాన్ని, ద్వాదశ స్థానమును ఆచ్ఛాదించుదురు. ఆచ్ఛాధన అంటే కప్పివేయుట అని అర్థం.

గురువు తానున్న రాశికి తృతీయ, ఏకాదశ స్థానములను ఆచ్ఛా దించును. మతాంతరంలో గురువు పాపగ్రహములతో కలసి ఉన్నప్పుడు వ్యయస్థానమును ఆచ్ఛాదించును అని అర్థము.

రవి, కుజ, బుధ, శుక్ర, రాహువులు తామున్న రాశి లగాయతు ముందున్న ద్వితీయ స్థానమును ఆచ్ఛాదనం చూపెదరు.

## అస్తంగత్వం

ప్రతి గ్రహం రవికి 12 డిగ్రీల దగ్గరకు వచ్చినప్పుడు గ్రహాలు అస్తంగత్వం చెందుతాయి. ఆ గ్రహం తన కారకత్వాలను కోల్పోవుతుంది. ఆ గ్రహం కోల్పోయిన బలాన్ని రవి స్వీకరిస్తాడు.

ఆ గ్రహం యొక్క కారకత్వాలను రవి తన మహాదశలలో ఇస్తాడు. ఏగ్రహం అయితే అస్తంగత్వం చెందుతుందో ఆగ్రహం ఏకారకత్వాలను తెలియజేస్తాయో ఆ కార్యక్రమాలను చేయకూడదు అని అర్థము.

చంద్రుడు తప్ప మిగిలిన 5 గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగు చున్నవి. ఇందులో బుధుడు, శుక్రుడు భూ కక్ష్యకు లోపల ఉండి తమతమ కక్ష్యలలో సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయి.

అదే విధంగా కుజ, గురు, శనులు భూ కక్ష్యకు బయట కక్ష్యలలో ఉండి సూర్యుని చుట్టూ తిరుగుచున్నవి. ఇలా సూర్యుని చుట్టూ తిరుగుతున్నప్పుడు బుధ, శుక్రులు భూమి కంటే వేగంగా తిరుగుతూ స్యూర్యునికి అవతలి వైపునకు వెళ్ళినప్పుడు భూమి పైన ఉన్న మనకు ఆ గ్రహాలు కనిపించవు. దీనినే అస్తంగత్వం అంటారు.

భూ కక్ష్యకు బయట కక్ష్యలలో ఉన్న కుజ, గురు, శని గ్రహాలకంటే భూమి వేగం ఎక్కువ కనుక భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూ ఈ గ్రహాలను దాటి వెళ్ళి సూర్యునికి అవతలి వైపునకు వెళ్ళినప్పుడు భూమి పైన ఉన్న మనకు ఆయా గ్రహాలు కన్పించక పోవటాన్ని అస్తంగత్వం అంటారు.

గురు, శుక్రులు అస్తంగత్వం అయినప్పుడు శుభకార్యాలు చేయరాదు. గ్రహాలు వక్రించినప్పుడు కంటే అస్తంగత్వం అయినప్పుడు బలహీనం చెందుతారు. కుజుడు సూర్యునికి ముందు, వెనుక 17 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు అస్తంగత్వం అవుతారు.

బుధుడు సూర్యునికి ముందు, వెనుక 14 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు అస్తంగత్వం అవుతారు.

గురువు సూర్యునికి ముందు, వెనుక 11 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు అస్తంగత్వం అవుతారు.

శుక్రుడు సూర్యునికి ముందు, వెనుక 10 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు అస్తంగత్వం అవుతారు.

శని సూర్యునికి ముందు, వెనుక 15 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు అస్తంగత్వం అవుతారు.

## ఊర్ధ్వముఖ, అధోముఖ గ్రహాలు

సూర్యునితో కలసి ఉన్న గ్రహాలు అస్తంగత్వం పొందుతాయి. సూర్యునికి రెండవ రాశిలో ఉన్న గ్రహాలు శీఘ్ర గమనం పొందుతాయి.

సూర్యునికి మూడవ రాశిలో ఉన్న గ్రహాలు సమాన గమనం పొందుతాయి.

సూర్యునికి నాల్గవ రాశిలో ఉన్న గ్రహాలు మంద గమనం పొందుతాయి.

సూర్యునికి ఐదు, ఆరు రాశులలో ఉన్న గ్రహాలు వక్రగమనం పొందుతాయి.

సూర్యునికి ఏడు, ఎనిమిది రాశులలో ఉన్న గ్రహాలు అతి వక్ర గమనం పొందుతాయి.

సూర్యునికి తొమ్మిది, పది రాశులలో ఉన్న గ్రహాలు కుటిల గమనం పొందుతాయి.

సూర్యునికి పదకొండు, పండెండు రాశులలో ఉన్న గ్రహాలు అత్యంత శీఘ్ర గమనం పొందుతాయి.



# నవగ్రహాములు - అవస్థలు



శాస్త్రమున నవ గ్రహములకు పది (10) అవస్థలు చెప్పినారు. అవి వరుసగా స్వస్థావస్థ, ప్రదీప్తావస్థ, ముదితావస్థ, శంతావస్థ, హీనావస్థ, దుఃఖావస్థ, వికలావస్థ, బలావస్థ, క్రోధావస్థ, పీడితావస్థ.

ఈ పది అవస్థలకు మరల స్వరూపము చెప్పారు. అవి వరుసగా,

స్వక్షేత్రమందున్నవాడు స్వస్థుడు.

ఉచ్ఛ క్షేత్రమందున్నవాడు దీప్తుడు.

ఎక్కువ మిత్ర క్షేత్రమయిన ముదితుడు.

మిత్రక్షేత్రమయిన శాంతుడు.

ప్రబలమైన మరియు శుభగ్రహములతో కలిసిన హీనుడు.

శత్రు ఇంటనున్న దు:ఖితుడు.

ఎక్కువ శత్రువు ఇంటనయిన వికలుడు అగును.

## ఈ అవస్థలకు ఉండు ఫలములు

**స్వస్థానమైన** సుఖము, విద్య సంపద, పుత్రులు, అధికారము మొదలగు అనేక శుభములుండును.

**ప్రదీప్తా వస్థ** యందున్నను, ఈ ఫలములతోపాటు బంధుపూజ్యము, వాహనములు, ఆయుష్షు అధికారము, మొదలగు ఇతల ఫలములు చెప్పవలెను.

**ముదితావస్థ** యందున్న, సంతృప్తికరమగు భోజనము, తాంబూలము, అభరణములు, పుత్ర సంతోషము, నూతన వస్త్రములు సమ కూరును.

**శాంతావస్థ** యందున్న, విద్యా వినయము సిరి, కీర్తి, సదాచారము, సౌమ్యగుణము, నైపుణ్యము మొదలైన శుభఫలములుండును.

**హీనావస్థ** యందున్న, దైన్య జీవనము, స్థానచలనము బంధువులతో తగవులు, విరోధము, కష్ట నష్టములు కలుగును.

**దు:ఖావస్థ** యందున్న దొంగలవలన, రాజులవలన అగ్నివాన భయ ము భంధువుల మరణము, అందుమూలముగ ప్రయాణములు కలుగును.

**వికలావస్థ** యందున్న, రోగములు, సంసారమందు విముఖత, ప్రేత కర్మలు చేయుట శత్రువులు పెరుగుట మొదలైన దుష్ఫలములు చెప్పవలెను.

**బలావస్థ** యందున్న ధనహాని స్త్రీ జనములతో కలహము, పితృ వర్గము వారితో కలహము, విరోధము, ఇతరులను నిరతరమూ దూషిం చుట మొదలైన ఫలములుండును.

**క్రోధావస్థ** యందున్న గ్రహములు కూడా, దొషకారులే. కోపము, మూఢులగుట, రోగము రాజులవలన, శత్రువుల వలన, జంతువుల వలన భయము ధననష్టము మొదలైన ఫలములు ఉండును.

**పీడితావస్థ** యందున్న గ్రహముల వలన, దీనత్యము, చరసాల పాలగుట, బంధింపబడుట, అవమానము, ఇతరులపై ఆధారపడి జీవ నము చేయుట మొదలైన ఫలములుండును.

## శక్తావస్థ

గ్రహములకు ఇతరమైన సకల బలములు (స్థానబలము, దిక్బలము, షడ్బలము మొదలైన) కలిగినయడల వేరొక వ్యవస్థ చెప్పబడినది అదియే **శక్తావస్థ.**

ఈ అవస్థ పొందియున్నప్పుడు పైన చెప్పిన దుష్ఫలములు కొంత తగ్గి శుభములు కలుగును.

ఈ విధముగా గ్రహముల స్థితియే కాక, బలములను కూడా పరిగణ లోనికి తీసుకుని ఫలము చెప్పవలెను.

ఈ బలములు నిర్ణయించుటకు శాస్త్ర పరిజ్ఞానము, అనుభము మొదలైన ప్రజ్ఞలు ముఖ్యము. ఎన్నో విషయములు తెలిసినగాని సరి అయిన ఫలము చెప్పలేరు అని విజ్ఞుల అభిప్రాయము.

## నవ గ్రహాలు అవి కొలువున్న గృహ భాగాలు

1. రవి - సింహ ద్వారం.
2. చంద్రుడు - స్నాన శాల....నీటితొట్టి.
3. కుజుడు - వంటిల్లు,..బొగ్గులు..కట్టె.
4. బుధుడు - పఠన మందిరం.
5. శుక్రుడు - ఆహార పదార్థాల గది. శయన మందిరము గృహ అలంకరణం.. ఉద్యానవనం.
6. శని - పాత సామాను..గొడుగు..చెప్పులు పెట్టే గది సేవకుల గది..మరుగుదొడ్లు.
7. గురువు - ధనాగారం..పూజ మందిరం.
8. రాహు - అవసరం లేని వస్తువులు దాచే చోటు.
9. కేతువు - ధ్యాన మందిరము..ఏకాంత మందిరం.

# భార్యవైపు నుంచి ధనం వచ్చే వారి గ్రహస్థితి ఇలా ఉంటుందట!!

ఈ యోగమున జన్మించినవారికి భార్యమూలమున అనగా అత్తవారి ఆస్థి కలియుట లేక భార్య స్వతహా సంపాదించుట వంటివి జరుగును. ఈ యోగమునకు గ్రహస్థితి ధనాధిపతి బలవంతుడై శుక్రునితో గాని, సప్తమాధిపతితో గాని కలసి ఉండి లగ్నాధిపతి కూడా బలము గలిగి ఉండవలెను అంటారు.

## ఆమరణాంత ధనయోగము

ఈ యోగము కలవారు, జన్మతః సంపదలు కలిగి జీవితాంతము ఆ ఐశ్వర్యము కలిగి ఉందురు. ధన స్థానమున (రెండవ ఇల్లు) ఎక్కువ గ్రహములుండి వారు శుభ గ్రహములై, ధనయోగకారకులు గావలెను. ఆ స్థానము వారికి స్వ, ఉచ్చక్షేత్రము కావలెను. ధనకారకుడయిన గురువు అక్కడ ఉన్నయెడల ఆ దశలో బాగుగా యోగించును అని అంటారు.

## ఆయాంత ధనలాభయోగము

ఏ ప్రయత్నము ఎక్కువ చెయ్యకుండా అమిత సంపదలు ధనము వాహనములు, సమకూరుయోగమిది. ఈ జాతకులు సామాన్య ప్రయత్నముచే అధిక ఫలము పొందుదురు. వీరి గ్రహస్థితి ఇలా ఉండును. లగ్నాధిపతి ద్వితీయాధిపతి పరివర్తన (ఒకరి ఇంట్లో ఒకరు) ఉన్నయడల ఈ యోగము కలుగును. ఇదీ శుభయోగమే. కష్టము తక్కువ ఫలమెక్కువ అని చెబుతారు. 

# గ్రహదోషాలకు వివిధరకాల పాత్రలలోని నీటితో స్నానం



నవగ్రహాలలో ఒక్కో గ్రహం, దాని తాలూక దోషం, ఆయా వ్యక్తులకు మనఃశాంతి లేకుండా చేస్తుంటాయి. అందువల్ల గ్రహదోషం అనగానే వాటికి శాంతి చేయించడానికి ప్రయత్నింస్తారు. అయితే ఈ గ్రహదోషాలు తొలగిపోవడానికి నియమబద్ధమైన పూజలే కాదు, వివిధ రకాల స్నానాలు ఎటువంటి పాత్రలలో చేయాలో కూడా శాస్త్రాలు చెబుతున్నాయి.

కుంకుమ - ఎర్ర చందనం కలిపిన **'రాగిపాత్ర'**లోని నీటితో స్నానం చేయడం వలన సూర్య గ్రహ దోషాలు తొలగిపోతాయి.

కుంకుమ - గంధం కలిపిన నీటిని **'శంఖం'**తో పోసుకుంటే చంద్రగ్రహ దోషాలు దూరమవుతాయి.

గంధం – తిలలు కలిపిన **'రజిత పాత్ర'**లోని నీటితో స్నానమాచరించడం వలన కుజదోషాల బారినుంచి బయటపడవచ్చు.

నదీ సాగర సంగమంలోని నీటిని **'మట్టిపాత్ర'**లో పోసి స్నానం చేసినట్లయితే బుధగ్రహ దోషాలు వదలిపోతాయి.

మర్రి – మారేడు కాయలను **'బంగారుపాత్ర'** లోని నీటిలో వేసి స్నానం చేస్తే గురుగ్రహ దోషాలు తొలగిపోతాయి.

శుక్రుడిని ధ్యానిస్తూ **'రజిత పాత్ర'** లోని నీటితో స్నానం చేయడం వలన శుక్ర గ్రహదోషాల నుంచి విముక్తి లభిస్తుంది.

నువ్వులు, మినువులు కలిపిన **'లోహపాత్ర'**లోని నీటితో స్నానం చేయడం వలన శనిగ్రహ ప్రభావం నుంచి తప్పించుకోవచ్చు.

**గేదె కొమ్ము (డొల్ల)**తో స్నానం చేయడం వలన రాహు గ్రహ దోషాలనుండి ఉపశనం లభిస్తుందని అంటారు.

**పవిత్రమైన మట్టిని** కలుపుకుని స్నానం చేయడం వలన కేతు గ్రహ దోషాలు తొలగిపోతాయని శాస్త్రం చెబుతోంది.

ఈ నియమాలను పాటించి ఆయా పాత్రలలోని నీటితో స్నానం చేయడం వలన ఆయా గ్రహ దోషాల నుంచి ఉపశమనం లభిస్తుంది అని కొందరి భావన.

## కనుమలు

**మరణం, శవదహనం, సపిండీకరణం, జాతర, సంక్రమణం, గ్రహణం**

**ఇవి జరిగిన మరుసటి రోజును కనుమ అంటారు.**

# గ్రహాల శాంతులకు ఉపయోగించాల్సిన వత్తులు, ప్రమిదలు, నూనెలు



గ్రహాల శాంతులకు వివిధ విధాలుగా దీపారాధన చేయడం ద్వారా జాతకులు సుఖసంతోషాలతో జీవిస్తారని జ్యోతిష్య నిపుణలు అంటున్నారు.

జాతకపరంగా నవగ్రహ పరివర్తనను అనుసరించి శుభ, అశుభ ఫలితాలుంటాయని జ్యోతిష్య శాస్త్రం చెబుతోంది. గ్రహాధిపత్యంతో కలిగే అశుభ ఫలితాలను తప్పించేందుకు నవగ్రహ ఆరాధన చేయడం మంచిదని జ్యోతిష్కులు సూచిస్తున్నారు.

ఇందులో బాగంగా నవగ్రహ పూజలో దీపారాధనకు వాడాల్సిన వత్తులు, దీపారాధనలో ఉపయోగించాల్సిన నూనెలు గురించి శాస్త్రాలు వివరించాయి.

సూర్యారాధనలో కుంకుమ వర్ణపు ఏకవత్తిని ఎర్రరంగు ప్రమిదెలో వెలిగించి పూజచేయాలి. దీపారాధనలో ఆవునేతిని ఉపయోగించాలి.

చంద్ర గ్రహ పూజలో ఏకిన దూదితో తయారు చేయబడిన రెండు వత్తులను వెండి ప్రమిదెలో వెలిగించాలి. దీపారాధనలో నేతిని వాడాలి.

కుజ గ్రహ పూజలో కుంకుమ రంగు వర్ణంలో ఉన్న మూడు వత్తులను ఎర్రటి ప్రమిదెలలో వెలిగించాలి. దీపారాధనలో నువ్వుల నూనెను వాడాలి.

బుధ గ్రహ పూజలో తెల్లజిల్లేడు నాలుగు వత్తులను ఎర్రటి ప్రమిదెలో తమలపాకు వేసి వెలిగించాలి. ఇందులో దీపారాధనకు గాను కొబ్బరి నూనెను వాడాల్సి ఉంటుంది.

గురుగ్రహ పూజచేయటానికి తామర వత్తులతో తయారు కాబడిన ఐదు వత్తులను కంచు ప్రమిదెలలో వేసి వెలిగించాలి. దీపారాధనలో నేయిని ఉపయోగించాలి.

శుక్ర గ్రహ పూజలో కూడా తామర వత్తులతో తయారు చేసిన ఆరు వత్తులను వేసి వెలిగించాలి. దీపారాధనకు ఆవునేతిని వినియోగించాలి.

శని గ్రహ పూజకు నల్లని ఏడు వత్తులను స్టీలు ప్రమిదెలో వెలిగించాలి. దీపారాధనకు నువ్వుల నూనెను వినియోగించాలి.

రాహు గ్రహ పూజకు నలుపు వర్ణం కలిగిన ఎనిమిది వత్తులను నిమ్మకాయ డొప్పలో వెలిగించాలి. దీపారాధనలో అష్టమూలికా తైలాన్ని వినియోగించాలి.

కేతు గ్రహ పూజలో తెల్లజిల్లేడుతో తయారు కాబడిన తొమ్మిది వత్తులను ఉపయోగించాలి. దీపారాధనలో కొబ్బరి నూనెను ఉపయోగించాలి.

ఇలా ఆయా గ్రహాల శాంతులకు పైవిధంగా దీపారాధన చేయడం ద్వారా జాతకులకు తమ జీవితంలో గ్రహదోషం తొలగి, సుఖసంతోషాలతో జీవించగలరని జ్యోతిష్య నిపుణులు అంటున్నారు.



# విదేశీయానానికి, విదేశీ ధనానికి గ్రహాలు అనుకూలించాలా?



విదేశీయానానికి పాస్‌పోర్టులు, వీసాలు మొదలైనవి అవసరమౌతాయి. కానీ కొన్ని గ్రహాలు కూడా అనుకూలిస్తేనే విదేశీయానం దానితోపాటే విదేశీధన సంపాదన సాధ్యమౌతుందట.

దూర ప్రాంతాలకు ప్రయాణించే వారు పూర్వకాలంలో జలయానం చేసేవారు. అంటే నౌకల ద్వారా తమ గమ్యం చేరుకునేవాళ్లు. అప్పటి కాలంలో విమానయానం లేదు కాబట్టి. జలయానం చేయాలంటే జల రాశులైన కర్కాటకం, మీనం, వృశ్చిక రాశులతో పాటు చంద్రబలం కూడా ఉండితీరాలి.

ఇప్పుడు విమాన ప్రయాణాలు పెరిగాయి. దీనికి వాయుతత్వ రాశులైన మిధున, కుంభ, తుల రాశుల యొక్క ప్రభావం అధికమని

చెప్పవచ్చును. దీనితో పాటు ఆకాశతత్వ ప్రభావాన్ని కలిగి ఉండే గురుగ్రహాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి అని చెబుతారు.

రాశులు తమ తమ స్వభావాలను బట్టి విదేశీ యాత్రలను చేసే అవకాశాలను కలిగిస్తాయి అని చెబుతారు.

వాటి వాటి స్వభావాల ప్రకారం రాశులు చర, స్థిర, ద్విస్వభావ రాశులనే మూడు రకాలుగా ఉంటాయి.

**చరరాశులు:** మేషం, కర్కాటకం, తుల, మకరం

**స్థిర రాశులు:** వృషభం, సింహాం, వృశ్చికం, కుంభం

**ద్విస్వభావ రాశులు:** మిధునం, కన్య, ధనస్సు, మీనం

చరరాశులు వాటి స్వభావరీత్యా చలన గుణ సంపన్నమై ఉంటాయి. దాని వలన ఈ రాశిలోని వారు ఎప్పుడు యాత్రలు చేయాలనే అభిలాష కలిగి ఉంటారు. ముఖ్యంగా జలారాసులైన కర్కాటకం, మకర రాశులైతే మరింత యాత్రలు చేయాలనే అభిలాష కలిగి ఉంటారు.

ద్వి స్వభావ రాశులలో ధనస్సు, మీనరాశులు సైతం ఇలాంటి విదేశీయాత్ర స్వభావాన్నే కలిగి ఉంటాయి.

స్దిర రాశులకు ఇలాంటి విదేశీ ఆకాంక్షలు తక్కువనే చెప్పాలి.

కొన్ని నక్షత్ర స్వభావాలు కూడా విదేశీ ప్రయాణాల వైపుకు మొగ్గు చూపుతున్నాయి. అవి...

శనిగ్రహ నక్షత్రాలైన పుష్యమి, అనురాధ, ఉత్తరాభాద్ర

రాహుగ్రహ నక్షత్రాలైన ఆరుద్ర, స్వాతి, శతభిషం.

గురుగ్రహ నక్షత్రాలైన పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర.

చంద్రగ్రహ నక్షత్రాలైన రోహిణి, హస్త, శ్రవణం.

ఇంకా చర నక్షత్రాలైన స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ట, శతభిషం మొదలగు నక్షత్రాలు విదేశాలకు వెళ్ళాలనే కోరికను ప్రేరేపిస్తాయి.

జాతకచక్రంలో ఒక వ్యక్తికి విదేశీ గమన ఆకాంక్షను లగ్నం, తృతీయం, పంచమం, సప్తమం, అష్టమం, నవమం, ద్వాదశ భావాలు కలిగిస్తాయి.

చరలగ్న జాతకుడు తన భ్రమణ కారక ప్రవృత్తి వలన జన్మస్థలానికి దూరంగా వెళ్ళిపోయే అవకాశాలు ఉంటాయి.

స్థిరలగ్న జాతకులు తమ జన్మ స్థలంలోనే ఉండిపోతారు.

ద్విస్వభావ లగ్న జాతకులు అప్పుడప్పుడు విదేశీ యాత్రలు చేసిన అధికంగా వారు స్వస్థలానికే వచ్చేస్తుంటారు.

తృతీయ స్థాన ప్రభావం వలన దేశ సరిహద్దులకు మించి విదేశాలకు వెళ్ళలేరు.

సప్తమ స్థానాన్ని అనుసరించి విదేశాలలోనే స్థిర నివాసం ఉంటుందా లేదా స్వదేశానికి తిరిగి వస్తారా అన్నది తెలుసుకోవచ్చు.

పంచమం, నవమ స్థానాల వలన విదేశాలకు వెళ్ళాలనే కోరికలు పుడుతుంటాయి.

అష్టమ భావం వలన వ్యక్తి విదేశాలలోనే ఉండిపోయే అవకాశాలను నవమ, ద్వాదశాల ప్రభావం కూడా ఉంటే తెలుసుకోవచ్చును.

అష్టమ భావం వృశ్చికం అయితే విదేశాలలో ఉండిపోయే అవకాశాలు ఎక్కువ.

అష్టమ భావం ధనస్సు నుండి మీనం వరకు ఉన్న రాశులలో ఉంటే విదేశీ అవకాశాలు ఎక్కువ.

నవమ భావం గమనాన్ని, పరివర్తనను, తీర్థ యాత్రలను, దేశాంతర యానాన్ని తెలియజేస్తుంది.

విదేశీయాత్రకు అవసరమైన భూమికను తయారుచేస్తుంది.

నవమభావం ఆదిపత్యం లేకుండా విదేశీ ప్రయాణం చేయలేము.

ద్వాదశభావం దూరం అవటం, ఎడబాటు కలగటం తెలియ జేస్తుంది.

కుటుంబ సభ్యులకు, బంధు మిత్రులకు దూరం కావటం. కుటుంబ సభ్యులకు ఎడబాటు కలగటం అంటే విదేశాలకు వెళ్ళటం.

విదేశాలలో స్థిర నివాసం గురించి లగ్నం, లగ్నాధిపతి, చతుర్థం, చతుర్థాధిపతికి సంభంధం ఉంటే విదేశీ యోగం ఉంటుంది కానీ స్థిర నివాసానికి అవకాశాలు తక్కువ.

చతుర్థభావం, చతుర్థభావాధిపతికి ద్వాదశ భావ ప్రభావం ఉంటే అతడు విదేశాలకు వెళ్తాడు గాని స్దిర నివాస అవకాశాలు తక్కువ.

'సర్వేశ్చరే స్థితౌ రజ్జుః' అనే శ్లోకం ఆధారంగా రజ్జుయోగం ఉంటేనే విదేశీ యోగం ఉంటుందని అర్థం.

గ్రహాలన్నీ చరరాశిలో ఉన్న రజ్జుయోగం అంటారు.

సప్తమ భావం రాహువు కలసి విదేశాలకు వెళ్ళే కారకాలు అవుతాయి. సప్తమం, రాహువు నిర్వాసనా స్దితిని తెలియజేస్తుంది. పూర్వకాలంలో నిర్వాసనా స్థితి రాజదండన వలన కలిగేది ఇప్పుడు విదేశీ యానంగా మారింది.

రాహువు వ్యయంలో ఉండటం వలన బంధనయోగం ఎర్పడి శుభగ్రహ ద్రుష్టి ఉంటే కుటుంబ సభ్యులను వదలి దూరంగా విదేశాలకు వెళ్తాడు.

అష్టమ, నవమాధిపతుల యుతి ఉంటే విదేశీగమన యానం ఉంటుంది.

చతుర్థభావంలో పాపగ్రహం ఉండి, చతుర్థాధిపతి పాపగ్రహ యుతి కలిగి చంద్రుడు కూడా పాపగ్రహంతో కలసి ఉన్న, పాపగ్రహ దృష్టి ఉన్న చదువు కోసం విదేశాలకు వెళ్ళే అవకాశాలు ఎక్కువ.

దీనికి తోడు దశమాధిపతికి, షష్టమాధిపతికి సంబంధం ఉన్నా లేదా దశమభావం పైన షష్టమాధిపతి ప్రభావం ఉన్న ఆ వ్యక్తి విదేశాలలో ఉద్యోగం చేసే అవకాశాలు ఎక్కువ.

వ్యయాధిపతి వ్యయంలోగాని, కోణంలో గాని ఉన్న ధనార్జన కొరకు విదేశాలకు వెళ్ళే అవకాశాలు ఎక్కువ. దశమాధిపతి సంబంధం ఉంటే ఉద్యోగరీత్యా ధనార్జన ఉంటుంది.

సప్తమ భావాధిపతి, లగ్నాధిపతి ద్వాదశ భావంలో కలసి ఉన్న లేదా, సప్తమాధిపతికి, లగ్నాధిపతికి, ద్వాదశాధిపతికి సంభంధం ఉన్న విదేశాలలో వివాహం చేసుకుంటాడు.

సప్తమాధిపతికి, దశమాధిపతికి సంభంధం ఉన్న, సప్తమాధిపతి దశమంలో ఉన్న, దశమాధిపతి సప్తమంలో ఉన్న, సప్తమభావ, దశమభావ గ్రహాధిపతుల మధ్య పరివర్తన ఉన్న విదేశాలలో ఉద్యోగం లభిస్తుంది.

నవమస్థానం పైన గాని, నవమాధిపతి పైన గాని శని ప్రభావం ఉంటే వ్యాపార నిమిత్తం విదేశాలకు వెళ్ళే అవకాశాలు ఎక్కువ.

నవమస్థానంపైన గాని, నవమాధిపతి పైన గాని గురుగ్రహ ప్రభావం ఉంటే విద్య కొరకు, దేవాలయ దర్శనం కొరకు విదేశాలకు వెళ్ళే అవకాశాలు ఎక్కువ.

షష్ఠమాధిపతి నవమంలో ఉన్న, నవమాధిపతి షష్ఠంలో ఉన్న నవమ, షష్ఠ భావ గ్రహాధిపతుల మధ్య పరివర్తన జరిగిన ఆరోగ్య సమస్యలరీత్యా విదేశీయానం చేయవలసి ఉంటుంది.

నవమస్థానం, నవమాధిపతులపైన, ద్వాదశ స్థానం, ద్వాదశాధిపతుల పైన శుక్రగ్రహ ప్రభావం ఉంటే టూరిస్ట్‌లుగా విదేశీ అందాలను తిలకించటానికి విదేశీయాత్ర చేసే అవకాశాలు ఉంటాయి.

నవమస్థానం పైన, నవమాధిపతికి గురుగ్రహ, శని గ్రహ సంబంధం ఉంటే స్వాములు, అవధూతలు, మత ప్రచారకులు, మతబోధకులు, ప్రవచనాలు చేసే ఆధ్యాత్మిక కార్యకలాపాల కోసం విదేశాలకు వెళ్తుంటారు.

నవమ స్థానంలో రవి ఉన్న చంద్రుడు ఉన్న కాళ్ళకు చక్రాలు పెట్టుకున్నట్లుగా భ్రమణ కాంక్షగా విదేశాలకు తరచుగా వెళ్తుంటారు.

చరలగ్నం, లగ్నాధిపతి చరలగ్నంలో ఉండి, నవాంశ కూడా చర లగ్నం అయితే ఆ జాతకుడు విదేశీ యాత్రలద్వారానే ధనార్జన చేస్తాడు.

నవమస్థానంలో గురువు ఉండి శని, చంద్రుల దృష్టి ఉంటే వారు విదేశాలకు వెళ్ళటమే కాకుండా అక్కడ స్థిర నివాసాన్ని ఏర్పరచుకుంటారు.

జాతకములో గురువుని జీవకారకుడిగాను (మగవారు), శుక్రుడు జీవకారకుడు(స్త్రీలు), కర్మకారకుడైన శనికి ప్రయాణ కారకుడైన చంద్రుడు, విదేశీ కారకుడు రాహువు దృష్టి కలిగిన జాతకుడు వీదేశి యానం చేయును అని చెప్పవచ్చును.

ఈ గ్రహము కలయిక జాతకములో చరరాశిలో జరిగిన జాతకుడు పలుదేశములలో ఉండుట, స్థిర రాశిలో జరిగిన జన్మస్థానము వదలి ఏదైన విదేశములలో స్థిరపడుట, ద్విస్వభావస్థానములో జరిగిన జాతకుడు తన వృత్తి రీత్యా ప్రయాణము చేయుట మనము గమనింపవచ్చును.

నవమస్థానంలో శుక్రుడు, గురువు, బుధుడు, శని గ్రహాలు ఉంటే ఆ వ్యక్తి అశేషమైన విదేశీ ధనాన్ని సముపార్జిస్తారు.

జాతకచక్రంలో గ్రహాల పొందికను బట్టి విదేశీయాన అవకాశం ఉన్నా, ఆ వ్యక్తి యొక్క కుటుంబం, ఆర్థిక పరిస్థితులు పరిగణనలోకి తీసుకోవాలి. నక్షత్రాలు, గ్రహాలు, రాశులు అన్నీ కలసిన కుటుంబంలో ధనలక్ష్మి లేకున్నా, దైవానుగ్రహం, పూర్వపుణ్య బలం లేకున్నా నక్షత్రాలు, గ్రహాలు, రాశులు ఏవి మనకు సహాయపడలేవని గుర్తించాలి.



# ప్రమిదలో దీపం వెలిగిస్తే నవగ్రహ దోషాలు హరిస్తాయా?



ప్రమిదలో దీపం వెలిగించడం ద్వారా నవ గ్రహాలను కొలిచి ఆయా గ్రహప్రభావ దోషాలను తొలగిస్తుంది అని చెబుతారు. ఏ దేవునికైనా ప్రమిదలో దీపమెలిగించడం ద్వారా శుభ ఫలితాలను పొందవచ్చు! ప్రమిద, అందులోని నూనె, వత్తులు, కాంతికి, నవగ్రహాలకు సంబంధం వుంది అని అంటారు. ప్రమిదల్లో నేతిని నింపి దీప ప్రజ్వలన చేయడం ద్వారా లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొందవచ్చు. ప్రమిదల్లోని జ్వాలలో మహాలక్ష్మి నివసిస్తుందని శాస్త్ర వచనం. **ప్రమిద దీపం - సూర్యుడు. నెయ్యి, నూనె ద్రవపదార్థం - చంద్రుడు. వత్తులు - బుధుడు.**

ప్రమిదను వెలిగించడం ద్వారా ఏర్పడే జ్వాల .. అంగారకుడు.

ఈ జ్వాల నీడ భూమిపై పడుతుంది- ఇది భూమికి సంకేతమైన రాహువును సూచిస్తుంది.

జ్వాలలో కాంతినిచ్చే పసుపు రంగు- గురువు.

దీప ప్రజ్వలన ద్వారా ఏర్పడే మసిలాంటి నల్లటి రంగు- శనికి సంకేతం.

దీప ప్రజ్వలన ద్వారా ఏర్పడే కాంతి- ఇది జ్ఞానం .. కేతువుకు సంకేతం

ప్రమిదలోని వత్తులు తరుగుతూ రావడానికి శుక్రుడు సంకేతం. శుక్రుడు ఆశకు కారకుడని జ్యోతిష్య శాస్త్రం చెబుతుంది. కాబట్టి ప్రమిదలో దీపం వెలిగించడం ద్వారా నవగ్రహాలను సంతుష్టపరచి తద్వారా నవగ్రహ అనుగ్రహం పొందవచ్చునని భావన.



# గ్రహాలు - అవస్థలు - ఫలితాలు

- గ్రహము ఉచ్చ పొందటాన్ని **దీప్తావస్థ** అంటారు. ఇది వెలుగును, దారిని ఇస్తుంది.
- గ్రహము నీచ పొందటాన్ని **దీనావస్థ** అంటారు. కష్టాలను కలుగచేస్తుంది.
- గ్రహము స్వంత క్షేత్రంలో ఉండటాన్ని **స్వస్థ అవస్థ** అంటారు. ఇది కార్యాలకు అనుకూలంగా ఉంటుంది.
- గ్రహము మిత్రక్షేత్రంలో ఉండటాన్ని **ముదిత అవస్థ** అంటారు. సంతోషం కలుగ చేస్తుంది.
- గ్రహము శత్రు క్షేత్రంలో ఉన్న **సుప్తావస్థ** అంటారు. నిద్ర పోవడము. ఏశక్తి ఇవ్వలేదు.
- గ్రహము యుద్ధములో గెలవడం దీనిని **ప్రపీడిత అవస్థ** అంటారు. కష్టాలను సూచిస్తుంది.
- గ్రహము శత్రు గ్రహముచే చూడబడిన, **ముషిత అవస్థ** అంటారు. ఇది దొంగతనం జరగడాన్ని సూచిస్తుంది.
- గ్రహము నీచ స్థానాన్ని చేరుకునే దాన్ని **పరిహీయమన అవస్థ** అంటారు. దీనివల్ల శక్తి తగ్గిపోతుంది.
- గ్రహము ఉచ్ఛ స్థానాన్ని చేరుకునే స్థితిని **పరిధి వీర్య స్థితి** అంటారు. దీనివలన శక్తి పెరుగుతుంది.
- వర్గాలలో మంచి క్షేత్రాలలో ఉంటే దాన్ని **అధిక వీర్య** అంటారు. దీనివలన అమిత శక్తి వస్తుంది. పదవి కూడా వస్తుంది.

# గ్రహాల మహర్ధశ అంతర్ధశలు (సంవత్సరం-నెలలు-రోజులు)

| గ్రహం | రవి | చంద్రుడు | కుజుడు | రాహువు | గురువు | శని | బుధుడు | కేతువు | శుక్రుడు | మహర్దశాకాలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1.రవి | 0–3–18 | 0–6–0 | 0–4–6 | 0–10–24 | 0–9–18 | 0–11–12 | 0–0–6 | 0–4–6 | 1–0–0 | 6 సంవత్సరాలు |
| 2.చంద్రుడు | 0–6–0 | 0–10–0 | 0–7–0 | 1–6–0 | 1–4–0 | 1–7–0 | 1–5–0 | 0–7–0 | 1–8–0 | 10 సంవత్సరాలు |
| 3.కుజుడు | 0–4–6 | 0–7–0 | 0–4–27 | 1–0–18 | 0–11–6 | 1–1–9 | 0–11–27 | 0–4–27 | 1–2–0 | 7 సంవత్సరాలు |
| 4.రాహువు | 0–10–24 | 1–6–0 | 1–0–18 | 2–8–12 | 2–4–24 | 2–10–6 | 2–6–18 | 1–0–18 | 3–0–0 | 18 సంవత్సరాలు |
| 5.గురువు | 0–9–18 | 1–4–0 | 0–11–6 | 2–4–24 | 2–1–18 | 2–6–12 | 2–3–6 | 0–11–6 | 2–8–0 | 16 సంవత్సరాలు |
| 6.శని | 0–11–12 | 1–7–0 | 1–1–9 | 2–10–6 | 2–6–12 | 3–0–3 | 2–8–9 | 1–1–9 | 3–2–0 | 19 సంవత్సరాలు |
| 7.బుధుడు | 0–10–6 | 1–5–6 | 0–11–27 | 2–6–18 | 2–3–6 | 2–8–9 | 2–4–27 | 0–11–27 | 2–10–0 | 17 సంవత్సరాలు |
| 8.కేతువు | 0–4–6 | 0–7–0 | 0–4–27 | 1–0–18 | 0–11–6 | 1–1–9 | 0–11–27 | 0–4–27 | 1–2–0 | 7 సంవత్సరాలు |
| 9.శుక్రుడు | 1–0–0 | 1–8–0 | 1–2–0 | 3–0–0 | 2–8–0 | 3–2–0 | 2–10–0 | 1–2–0 | 3–4–0 | 20 సంవత్సరాలు |

# నవగ్రహాల పటములు ఇంటిలో పెట్టుకోవచ్చా?



ప్రతీ ఒక్కరూ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒకరకంగా ఇబ్బందిపడి ఉంటారు. కర్మ సిద్ధాంతం నమ్మినవారు తప్పక దీనిని గ్రహ ప్రభావమని భావిస్తారు. దీనికోసం భక్తులలో చాలా వరకు ఏదో ఒక సందర్భంలో నవగ్రహారాధన చేస్తారు. నవగ్రహాల అనుగ్రహం ఉంటే బాధలు పోతాయి అనేది కర్మ సిద్ధాంతం. కాబట్టి వ్యతిరేకంగా ఉన్న గ్రహాలకు ఆయా మార్గాలలో శాంతి చేసుకుంటారు. అయితే ప్రధానంగా ఇంట్లో ఈ నవగ్రహాల ఫొటోలను పెట్టుకుని ఆరాధన చేస్తే మంచిదా? నవగ్రహాల పటములను పెట్టుకుని నిత్యారాధన చేస్తే మంచిదని భావిస్తుంటారు. అయితే అలా చేయవచ్చా అనేది పండితుల దృష్టిలో పరిశీలిస్తే..

శనీశ్వరుణ్ణి, నవగ్రహాలను ఇంటిలో పూజగదిలో పెట్టి అసలు పూజ చేయకూడదని పండితులు చెబుతున్నారు. అసలు శనితో పాటుగా ఏ నవగ్రహాలను ఇంటిలో పూజించే సంప్రదాయం పూర్వకాలం నుండి కూడా లేదు. కొన్ని పురాతన దేవాలయాలలో నవగ్రహాలు ఉండవు. దాదాపుగా 200 సంవత్సరాల నాటి గుడిలో నుంచి మాత్రమే నవగ్రహాలు ఉంటున్నాయి. నవగ్రహాలు ఆ దేవదేవుడు ఆదేశించే పనులను మాత్రమే చేయటానికి ఆదేశం ఉంది. కాబట్టి నవగ్రహాల కారణంగా వచ్చే ఇబ్బందులను తొలగించుకోవడానికి ఆ దేవదేవుని పూజించాలి. అంతే కాని నవగ్రహాలను పూజించకూడదు. అయినా సరే మన పండితులు ఆయా గ్రహాల దోష నివారణకు పరిహారాలు, పూజలు, ప్రదక్షిణలు చేయిస్తూ ఉన్నారు.

కాబట్టి ప్రత్యేకంగా ఇంటిలో నవగ్రహాలకు పూజ చేయవలసిన అవసరం లేదు. ఒకవేళ చేయాలని అనుకుంటే మాత్రం ఆగమశాస్త్రం ప్రకారం హోమాలు చేశాకే. దీపారాధన చేసి దీపజ్యోతిలో నవగ్రహాలను ఆవాహన చేసుకుని ఆ తరువాత మాత్రమే పూజించాలి. పండితులతో వేదమార్గంలో చెప్పిన పూజలు, జపాలు చేసుకుంటే చాలు. వీలైనంత వరకు దేవాలయాలలో నవగ్రహాలకు పూజలు, పరిహారాలు చేసుకుంటే మంచిది. అంతేకాని నవగ్రహాల ఫోటోలు (పటములను) విగ్రహాలను ఇంట్లో పెట్టుకోకూడదు అని పండితుల భావన.



## గ్రహాలు శత్రువులు, మిత్రులు, సములు



| గ్రహం | మిత్రులు | శత్రువు | సముడు |
|---|---|---|---|
| రవి | చంద్రుడు, కుజుడు, గురువు | శని, శుక్రుడు | బుధుడు |
| చంద్రుడు | రవి, బుధుడు | శత్రువులు లేరు | మిగిలినవారు సములు |
| కుజుడు | గురువు, చంద్రుడు, రవి | బుధుడు | శుక్రుడు, శని |
| బుధుడు | శుక్రుడు, రవి | చంద్రుడు | కుజుడు, గురువు, శని |
| గురువు | కుజుడు, చంద్రుడు | బుధ, శుక్రుడు | రవి, శని |
| శుక్రుడు | శని, బుధుడు | రవి, చంద్రుడు | కుజుడు, గురువు |
| శని | శుక్రుడు, బుధుడు | రవి, చంద్రుడు, కుజుడు | గురువు |
| రాహువు | శని, శుక్రుడు | రవి, చంద్రుడు, కుజుడు | గురువు, బుధుడు |
| కేతువు | రవి, చంద్రుడు, కుజుడు | శని, శుక్రుడు | బుధుడు, గురువు |

# రాశి తత్వము, రాశి స్వభావము, రాశ్యాధిపతులు

ఈ క్రింది రాశి చక్రంలో రాశి తత్వాలను, రాశి స్వభావాలను మరియు రాశ్యాధిపతులను చూడవచ్చు.

| | | | |
|---|---|---|---|
| మీనం<br>గురుడు<br>జలతత్వం<br>ద్విస్వభావం | మేషం<br>కుజుడు<br>అగ్నితత్వం<br>చరభావం | వృషభం<br>శుక్రుడు<br>భూతత్వం<br>స్థిరస్వభావం | మిథునం<br>బుధుడు<br>వాయుతత్వం<br>ద్విస్వభావం |
| కుంభం<br>శని<br>వాయుతత్వం<br>స్థిరస్వభావం | | | కర్కాటకం<br>చంద్రుడు<br>జలతత్వం<br>చరస్వభావం |
| మకరం<br>శని<br>భూతత్వం<br>చరస్వభావం | | | సింహం<br>రవి<br>అగ్నితత్వం<br>స్థిరస్వభావం |
| ధనస్సు<br>గురుడు<br>అగ్నితత్వం<br>ద్విస్వభావం | వృశ్చికం<br>కుజుడు<br>జలతత్వం<br>స్థిరస్వభావం | తుల<br>శుక్రుడు<br>వాయుతత్వం<br>చరస్వభావం | కన్య<br>బుధుడు<br>భూతత్వం<br>ద్విస్వభావం |

## రాశ్యాధిపతులు

మేషం, వృశ్చిక రాశులకు కుజుడు.
వృషభం, తుల రాశులకు శుక్రుడు.
మిథునం, కన్య రాశులకు బుధుడు.
ధనస్సు, మీన రాశులకు గురుడు.
మకరం, కుంభ రాశులకు శని.
కర్కటక రాశికి చంద్రుడు.
సింహారాశికి రవి.



## రాశి తత్వాలు

ఇవి మూడు రకాలు అగ్ని తత్వం, భూతత్వం ఇంకా వాయు తత్వం. రాశి చక్రంలో చూపిన విధంగా మేషం, సింహం, ధనుస్సు అగ్నితత్వరాశులు. వృషభం, కన్య, మకరం భూతత్వ రాశులు. మిధునం, తుల, కుంభం వాయుతత్వ రాశులు.

## రాశి స్వభావాలు

మేషం, కర్కాటకం, తుల, మకర రాశులు చరస్వభావం.
వృషభం, సింహం, వృశ్చికం, కుంభరాశులు స్థిర స్వభావం.
మిథునం, కన్య, ధనుస్సు, మీన రాశులు ద్విస్వభావం.

## గోచారంలో గ్రహములు శుభఫలితములు ఇచ్చు స్థానములు

ప్రస్తుత గ్రహ స్థితిగతులను బట్టి జరిగే శుభ అశుభ ఫలితముల గురించి తెలిపేది గోచరం.

| గ్రహాలు | గోచారంలో గ్రహములు శుభఫలితములు ఇచ్చు స్థానములు |
|---|---|
| రవి | 3, 6, 10, 11 |
| చంద్రుడు | 1,3,6,7,10,11 |
| కుజుడు | 3,6,11 |
| బుధుడు | 2,4,6,8,10,11 |
| గురుడు | 2,5,7,9,11 |
| శుక్రుడు | 1,2,3,4,5,7,8,9,10,12 |
| శని | 3,6,11 |
| రాహువు | 3,6,10,11 |
| కేతువు | 3,6,11 |

# గ్రహముల ఉచ్ఛ, నీచ, మూలత్రికోణాలు

శుక్రుడు మీనంలో 27°
రవి మేషంలో 10°
చంద్రుడు వృషభంలో 3°
గురుడు కర్కాటకంలో 5°
బుధుడు కన్యలో 15°
శని తులలో 20°
కుజుడు మకరంలో 28°

| | | | |
|---|---|---|---|
| మీనం శుక్రుడు 27° | మేషం రవి 10° | వృషభం చంద్రుడు 3° | మిథునం |
| కుంభం | గ్రహాల ఉచ్ఛ స్థానాలు | | కర్కాటకం గురుడు 5° |
| మకరం కుజుడు 28° | | | సింహం |
| ధనస్సు | వృశ్చికం | తుల శని 20° | కన్య బుధుడు 15° |

| | | | |
|---|---|---|---|
| మీనం బుధుడు 15° | మేషం శని 20° | వృషభం | మిథునం |
| కుంభం | గ్రహాల నీచ స్థానాలు | | కర్కాటకం కుజుడు 28° |
| మకరం గురుడు 5° | | | సింహం |
| ధనస్సు | వృశ్చికం చంద్రుడు 3° | తుల రవి 10° | కన్య శుక్రుడు 27° |

బుధుడు మీనంలో 15°
శని మేషంలో 20°
కుజుడు కర్కాటకంలో28°
శుక్రుడు కన్యలో 27°
రవి తులలో 10°
గురుడు మకరంలో 5°
చంద్రుడు వృశ్చికంలో 3°

కుజుడు మేషంలో 0° - 12°
చంద్రుడు వృషభంలో 3°- 30°
రవి సింహంలో 0° - 20°
బుధుడు కన్యలో 15° - 20°
శుక్రుడు తులలో 0° - 15°
గురుడు ధనుస్సులో 0° - 10°
శని కుంభంలో 0° - 20°

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం కుజుడు 0°-12° | వృషభం చంద్రుడు 3°-30° | మిథునం |
| కుంభం శని 0-20° | గ్రహాల మూల త్రికోణాలు | | కర్కాటకం |
| మకరం | | | సింహం రవి 0-20° |
| ధనస్సు గురుడు 0-10° | వృశ్చికం | తుల శుక్రుడు 0-15° | కన్య బుధుడు 15-20° |

# నవ గ్రహముల మూలమంత్రములు



## సూర్యుడు - మూల మంత్రము

ఓం ఆ సత్యేన కృష్ణేన రాజసా వర్తమానో నివేశయన్న మృతం మర్త్యంచ హిరణ్యయేన సవితా రాదేనా దేవోయాటి భువనాని పశ్యన్

## చంద్రుడు - మూల మంత్రము

ఓం ఆప్యాయస్య సమేతుటే విశ్వ తసోమ వృష్టియమ్, భవా వాజస్య సంగదే

## కుజుడు - మూల మంత్రము

ఓం అగ్నిర్మూర్ధా దివః కకుత్పతి; పృధివ్యా అయం అపాగ్మ్ రేతాంగ్మ్ సి జస్వతి

## బుధుడు - మూల మంత్రము

ఓం ఉద్భుధ్యస్వాగ్నే ప్రతిజా గృహ్యేన మిష్టా పూర్తేసగమ్ సృజే దామయంచ పునః క్రుణగ్న్వా పితరం యునానమ న్వాతాగం సీత్వయి తంతు మేతం

## గురుడు - మూల మంత్రము

ఓం బృహస్పతే అతి యదర్యో అర్హాద్ద్యు మద్విభాతి క్రతు మజ్జనేషు యద్దీయచ్ఛవసర్త ప్రజాత తదస్మాస్తు ద్రవిణం ధేహి చిత్రంమ్

## శుక్రుడు - మూల మంత్రము

ఓం శుక్రంతే అన్యద్య జతంతే అన్యదిషు రూపే అహనీ ద్యోరిహాసి విశ్వా హిమాయా అవసి స్వధావో భద్రాతే పూషన్నిహ రాతిరస్తు

## శని - మూల మంత్రము

ఓం శమరగ్నిరగ్ని భిస్కర శ్చన్నస్తపతు సూర్యః శంవాతో వాత్వరపా అపస్రిదః

## రాహువు - మూల మంత్రము

ఓం క్రయా నశ్చిత్ర ఆభువ దూతీ సదా వృధ స్సఖా కయాష చిష్టయా వృతా

## కేతువు - మూల మంత్రము

ఓం కేతుం కృన్ణ్ వన్న కేతవే పెశో మర్యా ఆపెశసే సముషద్భి రాజాయుధః

నిత్యమూ పైన తెలిపిన శ్లోకములను పఠించుట వలన ఆయు రారోగ్య, ఐశ్వర్యములు కలుగును అని పెద్దల మాట.

కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, నక్షత్ర జాతకములో 1, 10, 19, 28 తేదీలలో జన్మించిన వారు కెంపును ధరిస్తారు. నవ రత్నాలలో సూర్యున్ని సూచించే రత్నం కెంపు అని, రాశిఫలాల్లో సూర్యునిది సింహ రాశిగా పరిగణించబడుతోంది. ఇక సింహలగ్నంలో, సింహ రాశిలో జన్మించిన వారు కెంపును ధరించవచ్చునని రత్నశాస్త్రం చెబుతోంది. సూర్యుడు శత్రు స్థానాలలో ఉన్నవారునూ లేదా దుర్భల రాశులలో ఉన్నవారునూ, సూర్యదశ జరుగుతున్నవారు కూడా ఈ కెంపును ధరించవచ్చు.

# నవగ్రహముల అనుగ్రహం కోసం ఉపవాసం



**ఆదివారానికి** అధిపతి సూర్యుడు. సూర్యగ్రహ అనుగ్రహం పొందాలనుకునేవారు ఆదివారం ఉపవాసముంటారు. కంటి సమస్యలు, చర్మ, హృదయ సంబంధ వ్యాధులతో బాధపడేవారు సూర్యుని ఆరాధిస్తే మంచిది. సూర్యగ్రహ ఆరాధనవల్ల గౌరవం, కీర్తిప్రతిష్టలు లభించడంతో పాటు శత్రువుల పీడ నివారణ అవుతుంది. సూర్యునికోసం ఉపవాసముండేవారు సూర్యాస్తమయం లోపల రోజుకి ఒకసారి మాత్రమే భోజనం చేస్తారు. సూర్యాస్తమయం తరువాత ఏమీ తీసుకోరు. తినే ఆహారంలో ఉప్పు, నూనె ఉండకూడదు. తామసిక ఆహారం ఉపవాసమున్నవారు తినరు. సూర్యుడికి అరుణం పారాయణ చేసిన తరువాత ఆహారం తీసుకుంటారు. సూర్యుని అనుగ్రహం పొందాలనుకునేవారు కెంపును

ధరించాలి. గోధుమలు, ఎర్రధాన్యం, బెల్లం, బంగారం, రాగి ఆభరణాల్లో కెంపు దానమివ్వాల్సి ఉంటుంది. దానం ఇవ్వడానికి సూర్యాస్తమయం ఉత్తమమైన సమయం. ఉపవాసంతో దానమిచ్చుట శుభము.

**సోమవారానికి** అధిపతి చంద్రుడు. సోమవారం శివపార్వతులకు పూజలు చేయుట మంచిది. అన్యోన్య దాయకమైన వివాహజీవితం కావాలనుకునేవారు సోమవారం నాడు శివపార్వతులకు ప్రత్యేకమైన పూజ, అభిషేకములు నిర్వహించాలి. పెళ్ళి కావల్సినవారు సరైన జీవితభాగ స్వామి కోసం శివపార్వతులకు పూజ చేసి ఉపవాసం ఉండటం శుభము. సోమవారం మూడురకాల ఉపవాసాలుంటారు. ఈరోజు ఉండే ఉపవాసాన్ని సౌమ్యప్రదోష మంటారు. ఏదైనా పొరపాటు జరిగితే, ఆ తప్పును ఒప్పుకుంటూ 16 సోమవారాలు ఉపవాసదీక్ష వహిస్తారు. ఉపవాసం చేసేవిధానం ఒకటే కానీ ఆరోజు చదువుకోవాల్సిన కథలు మాత్రం వేరుగా ఉంటాయి. భోజనం రోజుకి ఒకసారే చేస్తారు. తృణ ధాన్యాలు తీసుకోవచ్చు. శివపార్వతులకు ప్రార్థనలు చేసిన తర్వాత తగిన కథ చదువుకోవాలి. చంద్రుడి అనుగ్రహం కోసం ముత్యాలు, వెండి ధరించాలి. బియ్యం తెల్లటిదుస్తులు, శంఖం, వెండి, ముత్యాలాంటి వాటిని దానమివ్వాలి. చంద్రహోరలో దానము శుభము.

**మంగళవారానికి** అధిపతి కుజుడు. జాతకంలో కుజగ్రహం సరిగా లేనివారు ఆ దోషనివారణకు పన్నెండు మంగళవారాల ఉపవాసముండటం శుభప్రదం. మంగళవారం హనుమంతుడికి ప్రత్యేకంగా తమలపాకు మరియు సింధూర పూజ చేయాలి. దుస్తులు, పూలు ఎర్రటివి ధరించడం శ్రేయస్కరం. గోధుమలు, బెల్లంతో చేసిన ఆహారం రోజుకి ఒకసారి మాత్రమే తినాలి. హనుమకు పూజ చేసిన పిదప కథ చదువుకోవాలి. కందులు దానం.

**బుధవారానికి** అధిపతి బుధుడు. బుధవారం ఉపవాసం ఉండదల్చుకున్నవారు రోజుకి ఒకసారి ఆకుపచ్చటి ఆహార పదార్థాలు తినాలి. విష్ణుమూర్తికి పూజచేసుకుని కథ చదువుకోవాలి. బుధగ్రహం అనుగ్రహం పొందాలనుకునేవారు బంగారంతో పొదిగిన పచ్చని (ఎమరాల్డ్) ధరించాలి. పెసలు, కస్తూరి, నీలపు దుస్తులు, బంగారం, రాగి వంటి వాటిని దానమివ్వాలి.

**గురువారానికి** అధిపతి బృహస్పతి. జ్ఞానసముపార్జనకు, సంపదకు గురుగ్రహం అనుగ్రహం ముఖ్యం. పసుపు పచ్చని దుస్తులు ధరించి గురువుకు ప్రార్థనలు చేసి కథ చదువుకోవాలి. రోజుకి ఒకసారే భోజనం చేయాలి. బంగారంలో పొదిగిన కనక పుష్యరాగాన్ని ధరించాలి. పసుపు, ఉప్పు, పసుపచ్చని దుస్తులు, శనగలు వంటివాటిని దానమివ్వాలి.

**శుక్రవారానికి** అధిపతి శుక్రుడు. రోజుకి ఒకపూటే భోజనం చేయాలి. భోజనంలో పాయసం ఉండాలి. శుక్రుడి అనుగ్రహం పొందాలనుకునేవారు వజ్రాన్ని ధరించాలి. బియ్యం, తెల్లటి దుస్తులు, ఆవు, నెయ్యి, వజ్రాలు, బంగారం దానమివ్వలి. శుక్రవారం సంతోషిమాతకు పూజ చేసుకుని కథ చదువుకోవాలి. అమ్మవారికి హారతివ్వాలి. కటిక ఉపవాసముండాలి. పుల్లటి పదార్థాలు తినకపోవడమేకాదు, ఇలా 16 శుక్రవారాలు ఉపవాసముండాలి. చివరి శుక్రవారం మగపిల్లలకు భోజనం పెట్టాలి.

**శనివారానికి** అధిపతి శని. శనికి నల్లటి వస్తువులు, నల్లని దుస్తులు, నల్లని నువ్వులు, ఇనుము, నూనె లాంటి పదార్థలు ఇష్టం. శనిదేవతకు పూజ చేసుకుని కథ చదువుకొని హారతి ఇవ్వాలి. శని ప్రీతికోసం నీలం రాయిని ధరించాలి. నూనేతో నిండిన ఇనుపపాత్ర, నల్ల గొడుగు, నల్లటి చెప్పులు, నల్లటి దుస్తులు, నల్లనువ్వులు మొదలైన వాటిని దానమివ్వాలి. 

# హోరసమయం అంటే ఏమిటి, ఆ సమయాన్ని ఎలా నిర్ణయిస్తారు?



మనం రోజును ఏ పేరుతో పిలుస్తామో దాన్ని ఆ వారంగా పరిగణిస్తాం. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని వారాల పేర్లతో 7 భాగాలుగా విభజింపబడుతుంది. వారం ఏర్పడడానికి హోరాక్రమం ఉంటుంది. ఆకాశంలో గ్రహాల వరుసల్లాగా ఉంటాయి. శని, గురు, కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్ర హోరలు. వరుసగా ప్రతిరోజూ అవే మళ్ళీ మళ్ళీ పునరావృత్తమౌతాయి.

## హోర కాలము

సాధారణంగా మనం ఏ పని చేసినా నిర్విఘ్నంగా జరగాలని కోరుకుంటాం కానీ ప్రతి చిన్న విషయానికి ముహూర్తాలు పెట్టుకోలేము

కాబట్టి మన శాస్త్రాలు దీనికి చక్కని మార్గాన్ని సూచించారు. అదే హోరాకాలం. మనకు రోజుకి ఇరవై నాలుగు హోరలు ఉంటాయి. పగలు 12 హోరాలు రాత్రి 12 హోరాలు. హోరా సమయము ఒక గంట ఉంటుంది. హోరా సూర్యోదయాన్ని అనుసరించి ఉంటుంది. ప్రతిరోజు హోరా ఆ రోజు యొక్క దినాధిపతితో మొదలవుతుంది. అంటే ఆదివారము రవిహోరతో మొదలవుతుంది అన్నమాట. హోరా ఈ క్రమంలో వస్తుంది. రవి, శుక్ర బుధ, చంద్ర, శని, గురు, కుజ. ఈ క్రమము పూర్తి అయిన తరువాత మళ్ళీ మొదటి నుంచి ప్రారంభం అవుతుంది.

రాత్రిహోర ఆ వారాధిపతి గ్రహం నుండి ఆరవ స్థానంలో ఉన్న గ్రహం నుండి ప్రారంభం అవుతుంది. ఉదాహరణకు ఆదివారం రవి హోరతో మొదలవుతుంది రాత్రి హోర రవి నుండి ఆరవదైన గురువు నుండి ప్రారంభం అవుతుంది.

## Day Hora

| | |
|---|---|
| బృహస్పతి | 05.54 AM. 06.57AM |
| కుజుడు | 06.57 AM. 08.01AM |
| సూర్యుడు | 08.01 AM. 09.01AM |
| శుక్రుడు | 09.01 AM. 10.08AM |
| బుధుడు | 10:08 AM :. 11:11AM |
| చంద్రుడు | 11.11 AM 12:14PM |
| శని | 12:14 PM 13:18PM |
| బృహస్పతి | 13: 18 PM 14:21PM |
| కుజుడు | 14:921 PM 15:25PM |
| సూర్యుడు | 15:25 PM. 16:28PM |
| శుక్రుడు | 16:28 PM: 17:32PM |
| బుధుడు | 17:32 PM 18:35PM |

## Night Hora

| | |
|---|---|
| చంద్రుడు | 18:35 PM 19:32PM |
| శని | 19:32 PM 20:28PM |
| బృహస్పతి | 20:28 PM 21:25PM |
| కుజుడు | 21:25 PM 22:21PM |
| సూర్యుడు | 22:21 PM 23:18PM |
| శుక్రుడు | 23:18 PM 00.15AM |
| బుధుడు | 00.15 AM 01:11AM |
| చంద్రుడు | 01:11 AM : 02:08AM |
| శని | 2:08 AM 03:04AM |
| బృహస్పతి | 03:04 AM 04:01AM |
| కుజుడు | 04:01 AM 04.57AM |
| సూర్యుడు | 04.57 AM 05.54AM |

సోమవారం సూర్యోదయం చంద్రహోరతో ప్రారంభం అవుతుంది. సూర్యోదయం తర్వాత ఒక గంట తరువాత చంద్రహోర అయిపోతుంది. తరువాత శని హోర వస్తుంది. క్రమంగా గురు, కుజ, రవి, శుక్ర, బుధ, మళ్ళీ చంద్ర హోర మధ్యాహ్నం 1-2 వరకు ఉంటుంది. తిరిగి రాత్రి 8-9 వరకు మళ్ళీ చంద్ర హోర ఉదయం 3-4 వరకు ఉంటుంది. ఈ విధానం మూడు సార్లు తిరగడం వల్ల సూర్యోదయం నుండి 21 గంటలు పూర్తి అవుతాయి. తెల్లవారు ఉదయం 4-5 శనిహోర, 5-6 గురుహోర అయిపోయి మంగళవారం ఉదయం సూర్యోదయానికి కుజహోరతో వారం ప్రారంభం అవుతుంది. అందుకే ఆరోజును మంగళవారం అని

పిలుస్తారు. ఈ విధంగానే వారాల క్రమం కూడా ఏర్పడుతుంది. ఈ కుజ హోరలో శస్త్రచికిత్సలకు చేసుకోవానికి తప్ప ఇతర ఏ శుభకార్యాలకు పనికిరాదు అంటారు. శస్త్ర చికిత్సలు కూడా తప్పనిసరి అయితే మాత్రమే. మరి కొందరి అభిప్రాయంలో మాంసపు దుకాణాలు, ఎలక్ట్రానిక్ వస్తువులు మొదలగునవి కుజ హోరలోనే వాడాలి అంటారు. అయితే చంద్ర, బుధ, గురు, శుక్ర హోరలు అన్ని శుభకార్యాలకు శ్రేష్ఠమైనవి.

రోజులో గంట గంటకూ మారే హోరలను జాగ్రత్తగా చూసుకుంటూ నూతన కార్యక్రమాలను ప్రారంభించే సమయంలో, ఎవర్నైనా కలిసే సమయంలో, శుభ హోరలలో కార్యక్రమాలను ప్రారంభించడం వల్ల శుభ ఫలితాలు కలిగి కార్యవిజయం సిద్ధిస్తుంది అంటారు.



## గ్రహాలు - నైవేద్యం

ఆదివారం రోజున సూర్యుడికి నెయ్యితో కలిపిన గోధుమ పిండి

సోమవారం రోజున చంద్రుడికి పెరుగు

మంగళవారం రోజున కుజుడికి కందిపప్పు

బుధవారం రోజున బుధుడికి పెసర పప్పు, నల్ల ఉలవలు

గురువారం రోజున గురుడికి కొమ్ము శనగపప్పు, మినప పప్పు

శుక్రవారం రోజున శుక్రుడికి బొబ్బర్ల పప్పు

శనివారం రోజున శనికి నువ్వులు

రాహువుకి పూర్ణాలు

కేతువుకి పచ్చి కూరగాయలతో కలిసిన భోజనాన్ని

నైవేద్యంగా సమర్పించాలని శాస్త్రం చెబుతోంది

# హోరలలో చేసే కార్యక్రమాలు

## రవి

దానాలు, అప్పీళ్ళు చేయడానికి, ఉత్తరాలు, దస్తావేజులకు, నోట్లు వ్రాయడానికి, సన్మానాలు కోరడానికి, కొనుటకు, తిరుగుటకు, ఉద్యోగం కొరకు అప్లికేషన్ పెట్టడానికి మంచిది. న్యాయమైన పనులకు, రాజకీయ వ్యవహారాలు, అధికారులను కలుసుకోవడానికి, ఉద్యోగ ప్రయత్నాలు వ్యవహారాలకు మంచిది.

## చంద్ర

గృహారంభం, గృహప్రవేశం, నగలు ధరించడం, నూతన ఉద్యోగ ప్రవేశాలకు, వ్యవసాయారంభం, తోటలు పాతడానికి, స్త్రీ సౌఖ్యం పొందడానికి, గొప్పవారిని దర్శించడానికి, నీటి ప్రయాణం చేయడానికి, క్రొత్త పాత్రల్లో భుజించడానికి మంచిది. నౌకాయానం, వ్యాపారులు, ఉప్పు, పత్తి, వెండి, కంచు, పశువులు, బెల్లం, పంచదార, మొదలైన తెల్లరంగు వస్తువులతో పాటు మిగతా వస్తువులు కొనుటకు మంచిది.

## కుజ

పాపగ్రహం, కష్టనష్టాలు, చిక్కులు కలుగుతుంటాయి. ఏ మంచి పని ఆరంభించకూడదు. విఘాతం, రక్తదర్శనం అవుతుంది. యుద్ధాలకు, సాహస కృత్యాలకు, భూ సంబంధమైన విషయాలు మాట్లాడుకోవడానికి, సువర్ణ, తామ్ర, కంబళ, రస మొదలైన వస్తువులు కొనడానికి మంచిది. ఇందుకు సంబంధించిన వ్యాపారాలకు మంచిది.

## బుధ

నూతన వర్తకం, దానికి సంబంధించిన వ్యాపారాలకు, విద్యకు సంబంధించిన పనులకు, సమస్త శుభ కార్యాలకు, దస్తావేజులు మొదలైన వ్రాత పనులకు మంచిది. నూతన వ్యాపారం, ఆటలు అప్పు తీర్చడం, ముద్రలు, సువర్ణ, వస్త్రాలు, ప్రతి, నూలు, చర్మం మొదలైన వ్యాపారాలకు మంచిది.

## గురు

పిల్లలకు సంబంధించిన విషయాలు, ఉయ్యాలలో పెట్టడం, ముక్కు చెవులు కుట్టడానికి, అన్ని శుభాలకు, గొప్ప వారిని, పెద్దలను దర్శించి బహుమతులు పొందడానికి, అందించడానికి, ఉద్యోగ సంబంధమైన విషయాలు, బాకీలు వసూలు చేయడానికి, ఏ వస్తువైనా కొనడానికి, లాటరీ పజిల్స్ వేయడానికి, నూతన వస్త్రాలు ధరించడానికి విద్యాసంబంధమైన  సర్వ కార్యాలకు మంచిది. వివాహం, ఉపనయనం, అప్పు తేవడం, తీర్చడం, గ్రంథరచన, ఉద్యోగంలో చేరడానికి మంచిది.

## శుక్ర

సంబంధాలు నిశ్చయించడానికి, సంతకాలు పెట్టడానికి, ఔషధ సేవకు, స్త్రీ లతో మెలగడానికి, ప్రయాణాదులకు, నూతన వస్త్రాలు ధరించడానికి, సమస్త శుభకార్యాలకు, నిశ్చయ తాంబూలాలకు మంచిది. ఈ హోరలో ఏవైనా కొనడం కంటే అమ్మడం మంచిది. నువ్వులు, నూనె, మినుములు, ఇనుము, నేతి వస్తువుల వ్యాపారానికి మంచిది.

## శని

భూమి అమ్మడానికి చాలా మంచిది. తైల సంబంధ వ్యాపారాలకు శుభం. మిగతా ఏ వ్యాపారాలకు పనికి రాదు. మద్యశాలారంభం, చౌర్యం,

పొగాకు, దున్నలకు కాడిగట్టడం, తైల వ్యాపారాలు, గానుగ వేయడం నీచ వృత్తికి మంచిది.

వేరు వేరు కార్యక్రమాలకు వేరు వేరు హోరలు వేరు వేరు వారాలు శుభాశుభాలుగా ఉంటుంటాయి. పైన చెప్పిన విధంగా తాము ప్రారంభించే మంచి పనులకు ఎవరికి వారు ఆ రోజు ప్రారంభించే సమయం మంచిది అవునా కాదా చూసుకొని శుభహోర ఉన్న సమయంలో ఆ గంటలో ప్రారంభించి తరువాత దానిని కొనసాగించుకోవచ్చు. ప్రయాణాలు చేసే సమయంలో కూడా ఈ హోరలను చూసుకొని ప్రయాణం చేయడం వల్ల గమ్యస్థానానికి సులువుగా ఏ ఆటంకాలు రాకుండా చేరుకోవచ్చు అని అంటారు. 



## శని జయంతి రోజు ఏం చేయాలి?

వైశాఖ మాసంలోని అమావాస్య తిథినాడు శని జయంతి వస్తుంది. జ్యోతిష శాస్త్రం ప్రకారం మానవుల జీవితంపై శని తీవ్ర ప్రభావం చూపిస్తాడు అంతే కాకుండా ఈయన శని గ్రహానికి రాజు. ఈ రోజు ఉపవాసం ఉండి శనిని ప్రార్థించడం వల్ల భక్తులు కష్టాలు, బాధల నుండి విముక్తులవుతారు. అంతేకాకుండా దుష్ట, చెడు ప్రభావాల నుంచి ఉపశమనం కూడా కలుగుతుంది. నలుపు రంగు వస్తువులను దానం చేస్తే మంచి జరుగు తుంది. అంటే నలుపు వస్త్రాలు, ఆవ నూనె లాంటివి దానం చేయాలి. ఎవరివద్దనుండి ఇనుము, ఉప్పు, నువ్వులు, నువ్వులనూనె మొదలైన వాటిని చేతితో తీసుకోకుండా ఉండటం చేయాలి అని అంటారు.

# నవగ్రహ శాంతికి చేయవలసిన పారాయణాలు, దానమునకు పుణ్యతిథులు



నవగ్రహాల శాంతికి ఆ గ్రహానికి సంబంధిత గ్రంథాల పారాయణము, ఆయా పుణ్యతిథుల్లో స్తుతిస్తూ, సూచించిన దానాలు నిర్వర్తిస్తే ఆ గ్రహ ప్రభావములచే ఏర్పడే ఈతిబాధలు, సమస్యలు తొలగిపోతాయని జ్యోతిష్య నిపుణులు చెబుతున్నారు.

## నవ గ్రహ శాంతికి పఠించవలసిన గ్రంథాలు

**సూర్యునికి** రామాయణము, భవిష్య కల్కి పురాణము, సూర్య పురాణం.
**చంద్రునికి** శ్రీమద్భాగవతము, భవిష్య కల్కి పురాణము, వాయు పురాణము.

**కుజునికి** అగ్నిపురాణము, స్కాంధ పురాణము, బ్రహ్మవైవర్తన పురాణాల్లో కుమారస్వామి చరిత్ర.

**బుధునికి** లింగపురాణంలో నరసింహావతారము, విష్ణు పురా ణము, నారద పురాణము.

**గురునికి** బ్రహ్మాణపురాణము, వామనపురాణం, లింగపురాణం.

**శుక్రునికి** బ్రహ్మాండపురాణం, భవిష్యపురాణమునందు శ్రీమద్భాగవతంలోని పరశురామావతారం.

**శనీశ్వరునికి** మార్కండేయపురాణం, కూర్మపురాణం, భవిష్య పురాణం.

**రాహువు** దేవీభాగవతం, వరాహపురాణం, గరుడపురాణం.

**కేతువుకు** బ్రహ్మవైవర్తన పురాణం, మత్స్యపురాణం వంటివి పఠించాలి.

## నవగ్రహ శాంతికై పుణ్యతిథులలో చేయవలసిన దానాలు

**సూర్యునికి** కార్తిక శుద్ధ పూర్ణిమ-కార్తిక మాసంలో రవిజపము ఆరువేల సార్లు చేసి గోధుమలు దానం చేయాలి.

**చంద్రునికి** శ్రావణ పూర్ణిమ-శ్రావణ మాసంలో చంద్ర జప మును పదివేలసార్లు చేసి తెల్లని వస్త్రాలతో బియ్యాన్ని దానం చేయాలి.

**కుజునికి** చైత్రశుద్ధ పూర్ణిమ చైత్రమాసంలో అంగారక జపము ఏడువేల సార్లు చేసి కందులు, ఎర్రని వస్త్రాలు దానం చేయాలి.

మార్గశిర శుద్ధ షష్టి- మార్గశిర మాసంలో అంగారక జపమును ఏడువేల సార్లు చేసి కందులు ఎర్రని వస్త్రాలు దానం చేయాలి.

**బుధునికి** జ్యేష్ఠ పూర్ణిమ-జ్యేష్ఠ మాసంలో బుధజపాన్ని 17 వేల సార్లు చేసి పెసలు ఆకుపచ్చని వస్త్రాలను దానం చేయాలి.

**గురువు** వైశాఖ తదియ– భాద్రపదమాసంలో బృహస్పతి జపాన్ని 16 వేలసార్లు చేసి శెనగలు దానం చేయాలి.

**శుక్రునికి** ఆషాఢశుద్ధ దశమి– ఆషాఢమాసంలో శుక్రజపమును 20వేల సార్లు చేసి అలచందలు, తెల్లని వస్త్రాలు దానం చేయాలి.

ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ – ఫాల్గుణమాసంలో శుక్రజపమును 20 వేల సార్లు చేసి తెల్లని వస్త్రాలు దానం చేయాలి.

**శని భగవానునికి** శ్రావణ బహుళ అష్టమి– శ్రావణ మాసంలో శనిజపము చేసి నల్లనువ్వులు, నల్లని వస్త్రాలు దానం చేయాలి.

**రాహువుకు** ఆశ్వీజ బహుళ చతుర్దశి –ఆశ్వీజమాసంలో రాహు జపం 18 వేలసార్లు చేసి మినుములు కాఫీపొడి రంగుకు చెందిన వస్త్రాలను దానం చేయాలి.

**కేతువుకు** ఆశ్వీజశుద్ధ పాడ్యమి– ఆశ్వీజమాసంలో కేతుజపాన్ని ఏడువేల సార్లు చేసి ఉలవలు నలుపు వస్త్రాలను దానం చేయాలి.

మాఘశుద్ధ అష్టమి – మాఘమాసంలో ఏడువేల సార్లు కేతు జపాన్ని చేసి ఉలవలు నలుపు వస్త్రాలను దానం చేయడం ద్వారా నవగ్రహాల ప్రభావంచే కలిగే అశుభ ఫలితాలు దరిచేరవని పురోహితులు, పండితులు సూచిస్తున్నారు.



**గోధూళికా ముహూర్తం :** సూర్యుడున్న ముహూర్తం నుండి 7వది గోధూళిక అనబడును. మేతకు వెళ్ళిన గోవులు మరలి వచ్చే-సూర్యాస్తమయ పూర్వవేళ అన్ని ప్రయాణాలకు మంచివి.



# సూర్యుడు





జ్యోతిషశాస్త్రంలో సూర్యుడు మొదటి గ్రహం. సూర్యుడిని జ్యోతిష శాస్త్రంలో అధికంగా రవి అని వ్యవహరిస్తారు.

**లింగం :** సూర్యుడు పురుష గ్రహం.

**స్వభావం :** సూర్యుని స్వభావం పాప స్వభావం.

**రాశి చక్రంలో స్థితి :** సూర్యుడు రాశి చక్రంలో సింహంలో రాజ్యాధికారంలోను, మేషంలో ఉచ్ఛ స్థితిలోను, తులలో నీచ స్థితిలోనూ ఉంటాడు.

**ఇతర నామాలు :** సూర్యుడికి ఉన్న ఇతరనామాలలో కొన్ని అర్కుడు, ఆదిత్యుడు, అరుణుడు, తపసుడు, పూష, హేళీ, భానుడు, దినకరుడు, మార్తడుడు.

**జాతి :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని జాతి క్షత్రియ.

**తత్వం :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని తత్వం అగ్ని.

**వర్ణం :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని వర్ణం రక్తవర్ణం.

**గుణం :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని గుణం రజోగుణం.

**గ్రహతత్వం :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని స్వభావం పాప స్వభావం, స్థిర స్వభావం.

**రుచి :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుడు కారకత్వం వహించే రుచి కారం.

**గ్రహ స్థానం :** జ్యోతిష శాస్త్రంలోసూర్యుని స్థానం దేవాలయం.

**జీవులు :** జ్యోతిష శాస్త్రంలో సూర్యుడు కారకత్వం వహించే జీవులు పక్షులు.

**గ్రహోదయం :** పృష్టోదయం. **ఆధిపత్య దిక్కు :** తూర్పు.

**జలభాగం :** నిర్జల. **లోహం :** రాగి.

**పాలనా :** శక్తి రాజు. **ఆత్మాధికారం :** ఆత్మ, శరీర.

**ధాతువు :** ఎముక. **కుటుంబ సభ్యుడు :** తండ్రి.

**గ్రహవర్ణం :** శ్యాల వర్ణం. **గ్రహ పీడ :** శిరోవేదన, శరీర తాపం.

**గృహంలో భాగములు :** ముఖ ద్వారం, పూజా మందిరం.

**గ్రహ వర్గం :** గురువు. **కాల బలం :** పగటి సమయం.

**దిక్బలం :** దశమ స్థానం. **ఆధిపత్య కాలం :** ఆయనం.

**శత్రు క్షేత్రం :** మకరం, కుంభం.

**విషమ క్షేత్రం :** వృశ్చికం, ధనస్సు, మకరం.

**మిత్రక్షేత్రం :** మీనము. **సమ క్షేత్రం :** మిధునం, కన్య.

సూర్యుడు సింహ రాశిలో 20 డిగ్రీలలో మూల త్రికోణంలోనూ, మేష రాశిలో 10 డిగ్రీలలో పరమోచ్ఛలోను, తులా రాశిలో 10 డిగ్రీలలో పరమ నీచను పొందుతుంది.

**మిత్రగ్రహాలు :** కుజుడు, చంద్రుడు, గురువు.

**శత్రు గ్రహాలు :** శుక్రుడు, శని.

**సమ గ్రహం :** బుధుడు. **నైసర్గిక బల గ్రహం :** శుక్రుడు.

**వృధా గ్రహం :** శుక్రుడు. **దిన చలనం :** 1 డిగ్రీ.

**ఒక్కొక్క రాశిలో ఉండే సమయం :** 30 రోజులు.

**రాశిలో ఫలమిచ్చే భాగం :** మొదటి భాగం.

**ఋతువు :** గ్రీష్మ ఋతువు.

**గ్రహ ప్రకృతి :** పిత్తము.

**దిక్బలం :** దక్షిణ దిక్కు.

**పరిమాణం :** పొడుగు.

## సూర్య గ్రహ గుణగణాలు

సూర్యుడు జ్యోతిష శాస్త్రంలో ఇలా వర్ణించబడ్డాడు. గుండ్రని ముఖం, రక్తవర్ణం, పొడగరి, గోధుమ వర్ణం కలిగిన జుట్టు కలిగినవాడుగా వర్ణించ బడ్డాడు. గుణత్రయాలలో సూర్యుని స్వభావం రజోగుణం. రుచులలో సూర్యుడు కారం రుచికి కారకత్వం వహిస్తాడు. చాతుర్వర్ణములలో సూర్యుడు క్షత్రియ జాతికి కారకత్వం వహిస్తాడు. తత్వం అగ్నితత్వం, ప్రకృతి పిత్త ప్రకృతి. దిక్కు తూర్పు దిక్కు, లోహము రాగి, రత్నము మాణిక్యము, దిక్బలం దశమ స్థానం, రాశి సంఖ్య 1, కృత్తిక, ఉత్తరఫల్గుణి, ఉత్తర ఆషాఢ నక్షత్రాలకు నక్షత్రాధిపత్యం వహిస్తాడు. శరీరావయవాలలో గుండె, పురుషులకు కుడి కన్ను, స్త్రీ లకు ఎడమ కన్ను, రాశ్యాధిపత్యం సింహరాశి, మేషరాశిలో 10 డిగ్రీలలో పరమోచ్ఛ స్థితిని, సింహరాశిలో 20 డిగ్రీలలో రాజ్యాన్ని, తులా రాశి 10 డిగ్రీలలో నీచను పొందుతాడు.

## సూర్యుని ప్రభావం

సూర్యుని ప్రభావం ఉన్నవారు ఆత్మాభిమానం, చురుకుతనం కలిగి ఉంటారు. సంఘంలో పలుకుబడి ఉంటుంది. దుబారావ్యయం, పొగడ్తలకు లొంగుట, ఆవేశపడుట, సమయస్ఫూర్తి కలిగి ఉంటారు. చక్కని సంపాదన ఉంటుంది. కంటి జబ్బులు, గుండె జబ్బులు, వడదెబ్బకు గురి అగుట వంటి శారీరక అవస్థలకు గురి అవుతుంటారు. పిత్త ప్రకృతి కలిగి ఉంటారు.

## కారకత్వములు

సూర్యుడు ఆత్మకు, తండ్రికి, శక్తికి, అగ్నికి, ప్రతాపానికి, ఆకాశము, దిక్కు తూర్పు, దేశాధిపత్యములకు కారకత్వము వహిస్తాడు. ముళ్ళ చెట్లకు, పంటలలో మిరియాలు, మిరపకాయలు, కొబ్బరి, వాము, బియ్యం మొదలైన వాటికి కారకత్వం వహిస్తాడు. శివభక్తులు, శివపూజ, శివాలయాలకు కారకత్వం వహిస్తాడు, జంతువులలో సింహం, ఎలుగుబంటి, గుర్రము, సర్పములకు కారకత్వం వహిస్తాడు. పక్షులలో కాకి కోకిల, కోడి, హంసలకు కారకత్వం వహిస్తాడు. వృత్తులలో ప్రభుత్వ కార్యాలయాలు, హృదయ సంబంధిత మందులు, వైద్యులు, రిజర్వ్ బ్యాంక్ సంబంధిత వృత్తులకు కారకత్వం వహిస్తాడు. ఆకాశ సంబంధిత విమానాలు, విమానాశ్రయము, ఖగోళము, వాతావరణము, విమాన చోదకులు, విద్యుత్ సంబంధిత బ్యాటరీలు, విద్యుత్తు ఉత్పత్తి, భూకంపాలు, ఆకాశవాణి, దూరదర్శన్వంటి ప్రసార సంబంధిత మాధ్యమ వృత్తులు, విద్యుత్తు ఉపకరణ సంబంధిత వృత్తులకు కారకత్వం వహిస్తాడు.

## రాశులు సూర్యుడు

సూర్యుడు మేష రాశి 10 డిగ్రీలలో ఉచ్ఛస్థితిని పొందుతాడు. సింహ రాశిలో 20 డిగ్రీల వద్ద రాజ్యస్థితిని పొందుతాడు. సింహం సూర్యునికి స్వక్షేత్రం, మూల త్రికోణ క్షేత్రం. సూర్యుడికి కుంభరాశి, మకర రాశి శత్రు క్షేత్రాలు, కాగా కన్యా రాశి, మిథున రాశి సమక్షేత్రాలు. మీనం మిత్ర క్షేత్రం. వృశ్చిక, ధనస్సు, మకరాలు విషమ క్షేత్రాలు.

## సూర్యుడు గ్రహాలు

సూర్యుడికి గురువు, చంద్రుడు, కుజుడు మిత్ర గ్రహాలు. శుక్రుడు, శని శత్రు గ్రహాలు. బుధుడు నైసర్గిక బలం కలిగిన గ్రహం. వృథా గ్రహం శుక్రుడే.

# సూర్య ఆరాధన



సూర్యుడు తెలుగు సంవత్సరం ప్రభవ మాఘ శుద్ధ సప్తమి ఆదివారం నాడు విశాఖ నక్షత్రంలో అతిథి, కశ్యపులకు జన్మించాడు. కనుక సూర్యునికి రథసప్తమి నాడు విశేష పూజలు జరుపుతారు. సూర్యుడి పూజార్ధం రాగి విహగ్రహం ప్రతిష్ఠిస్తారు. గోధుమలు, బెల్లంతో వండిన పాయసం నైవేద్యంగా పెడతారు. గ్రహ ప్రీత్యర్ధం బెల్లం కలిపిన అన్నం సమర్పిస్తారు. సూర్యుడికి పళ్ళు లేవని అందువలన పాయసం అతడికి ప్రీతి కలిగిస్తుందని పురాణాలు చెప్తున్నాయి. సూర్యుడు సప్త వర్ణాలకు ప్రతీకగా సప్త అశ్వములు పూన్చిన రథం మీద ఆరూఢుడై ఉంటాడు. వినతా పుత్రుడైన అనూరుడు సూర్యుడికి సారథి. అనూరుడు గరుత్మంతుని అన్న. శ్రీరామ నవమి సూర్య గ్రహ ప్రీత్యర్ధం చేయబడే మరి ఒక పండుగ. సూర్యుడికి ప్రీతికరమైన తిథి జ్యేష్ట శుక్ల ద్వాదశి, కార్తిక శుక్ల సప్తమి. సూర్యుడి ప్రీత్యర్ధం ఆదివారవ్రతం చేస్తారు. సూర్యుడిని వివిధ రకాలుగా స్తోత్రం చేస్తారు. వాటిలో కొన్ని ఆదిత్య హృదయం, సూర్యాష్టకం, సూర్య అష్టోత్తర శతనామావళి మొదలైనవి. సూర్యుని ప్రీత్యర్ధం విష్ణు సహస్ర నామ పారాయణ, హరి వంశ పురాణం పారాయణ చేస్తారు. గాయత్రీ మంత్రోపాసన, దీక్ష. జపం సూర్యునికి ప్రీతి కలిగిస్తుంది. సూర్యునికి ప్రతిరోజు త్రిసంధ్యలలో సంధ్యావందనం చేయడం హిందూ సంప్రదాయాలలో ఒకటి.

## ద్వాదశభావాల్లో సూర్యుడు



**మేషం :** సూర్యుడు మేషరాశిలో ఉన్న వ్యక్తి కార్యకుశలత కలిగి ఉంటాడు. వీరికి పట్టుదల అధికం. కష్టసాధ్యమైన పని అయినా శ్రమపడి సాధిస్తారు. తమ మీద విశ్వాసం ఎక్కువ ఇతరుల సామర్థ్యం మీద విశ్వాసం తక్కువ కనుక ఇతరులు వీరిని గర్వము కలిగిన వారుగా భావిస్తారు. కాని వీరు నిష్కపటులు అని సన్నిహితులు గ్రహిస్తారు. పొగడ్తలకు లొంగే గుణము కలిగి ఉంటారు. ధైర్యసాహసాలు కలిగి ఉంటారు.

**వృషభం :** సూర్యుడు వృషభంలో ఉన్నవారు స్థిరమైన స్వభావము కలిగి ఉంటారు. అలంకార ప్రియులు. తమకు వీలైంతగా తామున్న ప్రదేశాలను అలంకరిస్తారు. అలంకరణ సామాగ్రికి అధికంగా వెచ్చిస్తారు.

**మిధునం :** సూర్యుడు మిధున రాశిలో ఉన్నవారు వాక్చాతుర్యం కలిగి ఉంటారు. సమయానుకూలంగా అభిప్రాయాలు మార్చుకుంటారు. ఇతరుల అభిప్రాయాలు సరి అయిన వాదనతో మార్చగలిగిన చతురత ప్రదర్శిస్తారు. వీరు తమ వాహనాదులను తరచూ మారుస్తుంటారు. తమ నేర్పు సమయ స్ఫూర్తి వాకచాతుర్యంతో తామున్న చోటుకంటే ఉన్నత స్థితికి చేరుకుంటారు.

**కటకం :** సూర్యుడు కటకరాశిలో ఉన్న వ్యక్తి హాస్యసంభాషణా ప్రియులు. బంధువులను ఆదరించే గుణము. పొదుపు పాటించడము. భూతభవిష్యత్తు వర్తమాన కాలములను భేరీజు వేస్తూ పొదుపు చేసి కచ్చితమైన నిప్రణాళిక వేస్తుంటారు. మనసులోని విషయాలు ఒక పట్టాన బయటపెట్టరు.

హృదయ పూర్వకంగా మాట్లాడుతారు. జరిగిన విషయాలను జీవితకాలం మరువరు కనుక ఇతరుల మనస్తత్వాన్ని ఖేరీజు వేసి జాగరూకతగా మెలుగుతుంటారు. ఎవరితోను పేచీలకు దిగరు, ద్వేషము పెంచుకోరు, అనేక విషయాలలో ఇతరులతో సర్దుకుపోయినా అవసరమైన ప్రదేశాలలో కోపం ప్రదర్శిస్తారు. అతిథులను ఆదరించి సత్కరిస్తారు.

**సింహము :** సూర్యుడు సింహరాశిలో ఉన్న వ్యక్తి ధైర్యసాహసాలు కలిగి ఉంటాడు. రాశ్యధిపతి సూర్యుడు కనుక సూర్యుడు ఈ రాశిలో అధిక ప్రభావవంతుడై ఉండడం వలన త్వరగా కోపానికి లోనయ్యే గుణం ఉంటుంది. దురుసుగా మాట్లాడే గుణం ఉంటుంది. ఈ కారణంగా బంధుమిత్రులు దూరం అవుతారు కనుక జాగ్రత్తగా వ్యవహరించవలసి ఉంటుంది. పొగడ్తలకు లొంగే గుణము ఉంటుంది. ఎంతటి కష్టతరమైన కార్యమైనా సాధించగలుగుతారు. ఎవ్వరికి తలవంచ లేరు. స్వతంత్రంగా వ్యవహరించడానికి మొగ్గు చూపుతారు. గొడవలకు త్వరగా స్పందించి ధైర్యంగా ఎదిర్కొని చిక్కులలో పడతారు కనుక గొడవలకు దూరంగా ఉండడానికి ప్రయత్నించడం మంచిది. అధికార దృక్పదం మితభాషిత్వం ప్రదర్శిస్తారు.

**కన్య :** కన్యారాశ్యాధిపతి బుధుడు కనుక కన్యారాశిలో సూర్యుడు ఉన్నందు వలన బుద్ధి కుశలత ఎక్కువగా ఉంటుంది. వీరు సున్నిత మనస్కులు. వీరిని అప్పుడప్పుడూ ప్రోత్సహించడం వలన కార్యములను విజయవంతంగా ముగించగలుగుతారు. ధైర్యము, చాతుర్యము కలిగి ఉంటారు కనుక బుధుని ప్రభావంతో వ్యహారాలను చక్కగా పరిష్కరిస్తారు. ధైర్యసాహసాలతో వృత్తి, వ్యాపారాలలో విజయం సాధిస్తారు.

**తులారాశి :** తులారాశిలో సూర్యుడు నీచ స్థితిలో ఉంటాడు కనుక వీరు ఏ పని చేయడానికి అయినా ముందూ వెనుకా ఆలోచిస్తారు. ఆరంభించిన పనిలో నష్టాలు ఎదురైనప్పుడు ఆ పనిని సగంలో ఆపేస్తారు. సదా ఇతరులు

ఏమనుకుంటారోనన్న భయము వీరిని వేధిస్తుంటుంది. న్యాయంగా వ్యవహరిస్తారు. ఇతరుల పట్ల దయ కలిగి ఉంటారు. ఇతరులకు మన స్ఫూర్తిగా సాయపడతారు. మనసులో ఒకటి బయటకు ఒకటి మాట్లాడరు. ఏదనుకుంటే అది వెంటనే దాచకుండా అనేస్తారు. బంధు మిత్రుల ఎడ సఖ్యతతో వ్యవహరిస్తారు.

**వృశ్చిక రాశి :** వృశ్చిక రాశిలో సూర్యుడు రాశ్యధిపతి కుజుడితో కలవడం వలన ఏకార్యమైనా ధైర్యంతో ఎదుర్కొంటారు. వీరు అసత్యము చెప్పారు. అసత్యము చెప్పడం సహించరు. వీరు కార్యసాధకులు. వీరు స్థిరమైన అభిప్రాయములు కలిగి ఉంటారు. అందరి భిప్రాయాలకు విలువ ఇస్తూనే తమ అభిప్రాయానుసారమే పని చేస్తారు. వ్యాపార ఉద్యోగాలలో ఉన్నత స్థితికి పోతారు. వారి వారి వృత్తులను అంకిత భావంతో చేస్తారు కనుక ఉన్నత స్థితికి చేరుకుంటారు. అన్ని విషయములలో అవగాహన కలిగి ఉంటారు. అతిశయము ప్రదర్శించరు.

**ధనస్సు :** ధనస్సు రాశిలో ఉన్న సూర్యుడు శుభుడు కనుక శుభ ఫలితాలను ఇస్తాడు. ధనస్సులో సూర్యుడు ఉన్నవ్యక్తి ధైర్యంగా అనుకున్నది మెప్పించేలా చెప్పగడు కనుక వీరు మధ్యవర్తులుగా చక్కగా పనికి వస్తారు. శాశ్వతమైన స్నేహ సంబంధాలను కలిగి ఉంటారు. చక్కని సలహాలను ఇవ్వగలరు. ఏ విషయాన్ని గుడ్డిగా నమ్మక లోతుగా అధ్యయనం చేసిన తరువాతనే నమ్ముతారు. నమ్మిన దానిని ఆచరణలో పెట్టి ఇతరులకు చెప్తారు. గొడవలలో తల దూర్చడం ఇష్టము ఉండదు కనుక గొడవలకు దూరంగా ఉంటారు.

**మకరం :** మకరరాశిలో సూర్యుడు ఉన్న సంకోచ స్వభావము కలిగి ఉంటారు. అత్మీయులతో సంబంధాలు జీవితకాలం కొనసాగిస్తారు. బంధుప్రీతి కలిగి ఉంటారు. విషయజ్ఞానము కలిగి ఉంటారు. ఆలోచనలు

అమలులో పెట్టలేరు. సరి అయిన పథకంతో పని చేయరు. ఎన్ని తెలిసినా తమకుగా తాము ఏమీ చేసుకునే సామర్ధ్యము ఉండదు.

**కుంభము :** కుంభరాశిలో సూర్యుడు ఉన్న స్థిరమైన అభిప్రాయం కలిగి ఉంటారు. అప్పగించిన పనిని చక్కగా పూర్తి చేస్తారు కనుక వీరిని వెనుక నుండి త్వరపెట్టిన కార్యభంగము అవుతుంది కనుక వారి సామర్ధ్యానికి వదలడము మంచింది. బందు ప్రీతి కలిగి ఉంటారు. స్నేహ సంబంధాలను జీవిత కాలం కొనసాగిస్తారు. అనేక మంది శత్రువులు జీవితకాలం శత్రుత్వము వహిస్తూ ఉంటారు అయినా శత్రువులకు వెరువక ధైర్యంగా ఎదుర్కొంటారు. అలాగే శాశ్వత మిత్రులు ఎక్కువగా ఉంటారు.

## ద్వాదశస్థానాలలో రవి



లగ్నంలో సూర్యుడు ఉన్న అల్ప కేశములు కలిగి ఉంటాడు. పొడగరి, గర్వి, అల్పదృష్టి, ఉద్రేకి, క్రూరహృదయుడు, నిర్గుణుడు, చిన్నమాటకే రోషం కలిగినవాడు, ప్రచండస్వభావి అవుతాడు. కటక లగ్నజాతకులకు లగ్నంలో రవి ఉంటే కన్నులలో పూవు పూయువాడు, మేషలగ్న జ్ఞాతకులకు లగ్నంలో రవి ఉంటే నేత్రవ్యాధిపీడితుడు, సింహ లగ్నజాతకులకు లగ్నంలో రవి ఉన్న రేచీకటి కలిగినవాడు, తులాలగ్న జాతకులకు లగ్నంలో రవి ఉంటే దారిద్ర్యపీడితుడు, సంతాన నష్టం కలిగిస్తాడు. ద్వితీయంలో రవి ఉన్న జాతకుడు నిర్ధనుడు, విద్యావినయం లేని వాడు, దుర్వచనాలు పలికేవాడు ఔతాడు.

తృతీయంలో రవి ఉన్న జాతకుడు బలవంతుడు, ధనవంతుడు, ధైర్య వంతుడు ఉదారుడు అవుతాడు. అప్తుల ఎడల ద్వేషం కలిగి ఉంటాడు.

చతుర్థ స్థానంలో రవి ఉన్న ఎడల బంధుహీనుడు, సుఖహీనుడు, క్షేత్ర హీనుడు అంటే భూసంబంధిత సంపదలేనివాడు, స్నేహనుడు, గృహ హీనుడు అవుతాడు. పిత్రార్జితం ఖర్చు చేయవాడు. ప్రభుత్వం ఉద్యోగి అవుతాడు.

పంచమస్థానంలో రవి ఉన్న జాతకుడు సుఖపుత్రహీనుడు, అల్పా యుష్మంతుడు, జ్ఞాని, అరణ్యప్రదేశములందు తిరుగువాడు అవుతాడు.

షష్టమ స్థానమున రవి ఉన్న జాతకుడు రాజు, ఖ్యాతివంతుడు, ధనవంతుడు, విజయవంతుడు అవుతాడు.

సప్తమ స్థానమున రవి ఉన్న జాతకుడు ఆధిక్యభావము కలిగిన కళత్రం కలిగినవాడు అవుతాడు. భాగస్వాముల ఆధిక్యత కలిగి ఉంటాడు.

అష్టమ స్థానమున రవి ఉన్న జాతకుడు ఆస్తిని పోగొట్టుకొనుట, అల్పాయుషు కలిగి ఉండుట, దృష్టి లోపం కలిగి ఉన్నవాడు అవుతాడు.

నవమ స్థానమున రవి ఉన్న జాతకుడు తండ్రి లేనివాడు, బంధువులు, మిత్రులు, పుత్రులు కలవాడు అవుతాడు.

దశమస్థానంలో రవి ఉన్న జాతకుడు పుత్రులు కలవాడు, వాహనము కలవాడు, భాగ్యవంతుడు, కీర్తి యశస్సు కలవాడు, ప్రభువు కాగలడు. రవి లాభస్థానమున ఉన్న జాతకుడు బహుధనవంతుడు, శోకములు లేనివాడు అవుతాడు.

ద్వాదశమున రవి ఉన్న జాతకుడు పితృద్వేషి, నిర్ధనుడు, దోషదృష్టి కలవాడు, పుత్రులు లేనివాడు అవుతాడు.

## ఆధ్యాత్మిక రంగంలో సూర్యుడు

**సప్తాశ్వ రథమారూఢం ప్రచండ కశ్యపాత్మజమ్**
**శ్వేతపద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం**

## సూర్య దేవాలయాలు

ప్రసిద్ధి చెందిన కొన్ని సూర్య దేవాలయాలు భారతదేశంలో ఈ క్రింది ప్రాంతాలలో ఉన్నాయి.

కోణార్క్, ఒడిషా, శ్రీ సూర్యనారాయణస్వామి దేవస్థానం, అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా, ఆంధ్రప్రదేశ్; అకరం, నల్గొండ జిల్లా, తెలంగాణ; శ్రీ సూర్యనారాయణ స్వామి వారి దేవస్థానం, గొల్లల మామిడాడ, తూర్పు గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్; శ్రీ సూర్యనారాయణ స్వామి వారి దేవస్థానం, వేకనూరు (అవనిగడ్డ, నాగాయలంక మార్గం), కృష్ణా జిల్లా, ఆంధ్రప్రదేశ్.

## సూర్య నమస్కారాలు

యోగాసనం, ప్రాణాయామం, మంత్రము మరియూ చక్ర ధ్యానం కూడుకుని చేసే సంపూర్ణ సాధనే సూర్య నమస్కారాలు. బ్రహ్మ మూహూర్తంలో చేస్తే చాలా ఫలితాన్ని ఇస్తాయి. వేద పురాణాలలో సూర్యనమస్కారాల ప్రస్తావన ఉంది. రావణాసురుడితో యుద్ధానికి ముందు రాముడికి అగస్త్య మహాముని సూర్య నమస్కారాలను వాల్మీకి రామాయణం యుద్ధకాండలో ఉన్నాయి.



# సూర్యుడు - రాశులలో ప్రవేశము



సూర్యుడు తండ్రికి కారకత్వం వహిస్తాడు. అదేకాక అనేక కారకత్వాలకు సూర్యుడు ఆధిపత్యం వహిస్తాడు. సూర్యునకు మిత్రులు చంద్రుడు, కుజుడు, గురువు, శత్రువులు శుక్రుడు, శని. బుధుడు సముడు. సూర్యుడు మేషరాశిలో ఉచ్ఛస్థితిని, తులారాశిలో నీచస్థితిని, సింహరాశిలో రాజ్యాన్ని పొందుతాడు. సింహరాశికి సూర్యుడు అధిపతి. కృత్తిక, ఉత్తర ఫల్గుణి, ఉత్తరాషాఢ నక్షత్రాలకు సూర్యుడు ఆధిపత్యం వహిస్తాడు. చైత్రమాసంలో సూర్యమానం ఆరంభమున మేషరాశిలో ప్రవేశిస్తాడు. వైశాఖమాస ఆరంభమున వృషభరాశిలో ప్రవేశిస్తాడు. జ్యేష్ట మాస ఆరంభమున మిధున రాశిలో ప్రవేశిస్తాడు. ఆషాఢ మాస ఆరంభమున కటక రాశిలో ప్రవేశిస్తాడు. శ్రావణ మాస ఆరంభమున సింహరాశిలో ప్రవేశిస్తాడు. బాద్రపద మాస ఆరంభమున కన్యారాశిలో ప్రవేశిస్తాడు. ఆశ్వీజమాస ఆరంభమున తులారాశిలో ప్రవేశిస్తాడు. కార్తీకమాస ఆరంభమున వృశ్చికరాశిలో ప్రవేశిస్తాడు. మార్గశిరమాస ఆరంభమున ధనసు రాశిలో ప్రవేశిస్తాడు. పుష్యమాస ఆరంభమున మకరాశిలో ప్రవేశిస్తాడు. మార్గశిరమాస ఆరంభమున కుంభరాశిలో ప్రవేశిస్తాడు. ఫాల్గుణమాస ఆరంభమున మీనరాశిలో ప్రవేశిస్తాడు. ఇలా జాతక చక్రంలో సూర్యుడు ఒక సంవత్సర కాలంలో పన్నెండు రాశులందు సంచరిస్తాడు. పిత్రు దేవతలకు సూర్యుడు, కుజుడు ఆధిపత్యం వహిస్తారు.

# ఆరోగ్య ప్రదాత సూర్య గ్రహం



'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అనే సంప్రదాయం ప్రసిద్ధమైనది. వాస్తు శాస్త్ర విద్య ఈశాన్యాన ఉన్న నుయ్యి, తూర్పున ఉన్న స్నానగృహం, ఇంట్లో ఈశాన్యాన ఉన్న పూజాగృహం, ఆగ్నేయాన ఉన్న వంటిల్లు బాలభానుని లేతకిరణాల వల్ల ఆరోగ్యాన్ని పెంచుతాయి. ఉదయకాంతి శరీర ఆరోగ్యానికి చాలా మంచిదని కొత్త వైద్య ప్రక్రియ కూడా రూపొందు తున్నది. ఉదయాన సంధ్యావందనం, సూర్య నమస్కారాలు, ఉదయ కాలపు నడక ఆరోగ్యవంతుల మంచి అలవాట్లు. వేర్వేరు రోగాలకు వేర్వేరు రంగుటద్దాల ద్వారా సూర్యకాంతిని ప్రసరింపజేసి అనారోగ్యాలను నివారింపచేసే కలర్ థెరపీ ప్రసిద్ధి చెందుతోంది. రవికి సంబంధించిన రాగి జావ, క్యారెట్, ధాన్యం, గోధుమలు, గోధుమ పాలు, గోధుమ గడ్డి రసం పలువిధాలైన అనారోగ్యాలను నివారిస్తున్నట్టుగా శాస్త్రవేత్తలు వక్కాణించారు. ఎముకలకు అధిపతి రవి. కంటి సమస్యలు ఉన్నవారు క్యారెట్ తినటం మంచిది. ఇలా రవి లక్షణాలు గల పదార్థలు రవి ప్రభావం వలన జనించిన రోగాలన్నీ నయం చేస్తున్నాయి.



# కీర్తి ప్రతిష్ఠలకు కారకుడు రవి

జాతక చక్రంలోని గ్రహాల ప్రభావం నిత్య కర్మలు, దైనందిన జీవితం లోని ఫలితాలపై ఉంటుందని నమ్ముతారు. జ్యోతిషంలో నవగ్రహాలకు అత్యంత ప్రాధాన్యత ఉంది. జ్యోతిషశాస్త్రంలో సూర్యుని రవిగా వ్యవహరించారు. దీనినే సూర్యగ్రహం అని కూడా అంటారు. ఈ గ్రహానికి అధిపతి సూర్య భగవానుడు. ఆదివారం లేదా భానువారం సూర్యునికి అత్యంత ప్రీతికరమైన రోజు. నవగ్రహాలలలో సూర్యగ్రహం మొట్టమొదటిది.

జాతక రీత్యా సూర్యగ్రహం బలంగా ఉంటే కీర్తి ప్రతిష్ఠలు, బుద్ధి, ఆరోగ్యం, మనోశక్తి, గౌరవ ప్రదమైన పదవులు, బిరుదులు, అభివృద్ధి, రాజకీయాలు, పాలనాధికారాలు దక్కుతాయి. గ్రహ ప్రభావం బలహీనంగా ఉన్నా, దోషంతో బాధపడుతున్నా అనారోగ్య సమస్యలు, చికాకులు ఏర్పడటం, చేపట్టిన పనులు సకాలంలో పూర్తి కాకపోవడం, సంతానం వల్ల ఇబ్బందులు, అనవసర ఖర్చులు పెరుగుతాయి.

## దోష నివారణ

గోధుమగడ్డి పెంచి పశువులకు ఆహారంగా పెట్టాలి. గోధుమ పిండి, పాలతో చేసిన హల్వాను సూర్యభగవానుడికి నివేదన చేయాలి.

చపాతీలు లేదా అప్పాలను పంచిపెట్టడం, ఆవులకు తినిపించడం.

సూర్యభగవానుడికి తెల్ల జిల్లేడు పువ్వులతో పూజించడం వల్ల గ్రహదోషం పరిహారమై ఆయుష్షు, ఆరోగ్యం, ఐశ్వర్యం లభిస్తుంది.

సూర్యగ్రహ శాంతికి జపం చేయించి తత్తతు తర్పణం, హోమం చేసి, గోధుమలు దానం ఇవ్వాలి. సూర్యగ్రహ స్తోత్రం 11 సార్లు ప్రతినిత్యం పారాయణ చేయడం వల్ల కూడా మంచి ఫలితం ఉంటుంది.



# రవి గ్రహ దోష నివారణకు ఆదిత్య హృదయ స్తోత్రము



ఆదిత్య హృదయాన్ని ఎవరైతే నిష్టగా ప్రతిరోజూ పఠిస్తారో వారికి ఎటువంటి రుగ్మతలు కలగవు. సమస్త గ్రహ దోష నివారణార్థం ఆదిత్య హృదయం చదవాలి. ఆదిత్య హృదయ పారాయణం చేయడం వల్ల జాతకంలో సూర్య సంబంధిత దోషాలు నివారించుకోవచ్చు. రోగములు నిదానించి సంపూర్ణ ఆరోగ్యం పొందవచ్చునని నమ్మకం.

## జాతకంలో రవి బలహీనంగా ఉంటే?

ఎవరి జాతకంలో అయితే రవి బలహీనంగా ఉంటాడో వారికి అనారోగ్యము, అధికారుల నుండి వేధింపులు, తండ్రి లేదా పుత్రుల నుండి వ్యతిరేకత, నేత్ర, గుండె సంబంధిత వ్యాధులు, తండ్రి తరుపు బంధువులతో పడకపోవుట, ఏదైనా సాధించాలనే పట్టుదల లేకపోవుట,

ఆత్మ విశ్వాసం లేకపోవుట వంటి సమస్యలు తమ దైనందిన జీవితంలో ఎదుర్కొనేవారు సూర్యగ్రహ అనుగ్రహం కొరకు ప్రతిరోజు సూర్య నమస్కారం చేసుకొనుట, ఆదిత్య హృదయం పారాయణం, గోధుమ లేదా గోధుమలతో తయారుచేసిన ఆహారప దార్థములు దానం చేయుట. తండ్రి గారిని లేదా తండ్రితో సమానమైన వారిని గౌరవించుట వలన రవి గ్రహదోషము తొలగిపోయి అభివృద్ధి కలుగుతుంది.

పాపాలను, శాపాలను పోగొట్టి కష్టాలను తీర్చి ఆయుషును పెంచే అమోఘమైన అక్షర సాధనం అదిత్య హృదయం. ఈ అమోఘమైన స్తోత్ర రాజాన్ని శ్రీ రామ చంద్రునికి ఆగస్త్యమహర్షి మంత్రాల వంటి మాటలతో వివరించాడు. అదిత్య హృదయము మహాపవిత్రమైన గ్రంధము. శ్రీమద్రా మాయణ మహాకావ్యమందలి యుద్ధకాండలో 105వ సర్గలో సూర్య భగవానుని స్తుతికి "ఆదిత్య హృదయం" అని నామకరణం చేశారు.

## ఆదిత్య హృదయం ఎవరు పఠించాలి?

సంతానం లేనివారు "ఆదిత్య హృదయము"ను నిత్యము పారా యణము చేసినచో వారికి సంతానము కలుగునని, న్యాయ వివాదాలలో చిక్కుకొని కోర్టు చుట్టు తిరుగుతూ సతమతం అయేవారు ఆదిత్య హృదయాన్ని పారాయణము చేసినచో వారికి విజయం కలుగుతుందని, కఠిక దారిద్రంచే భాదపడుచున్నవారు అనునిత్యం పారాయణం చేస్తే సకల అష్ట ఐశ్వర్య సంపదలు కలుగుతాయని, ఆనారోగ్య రుగ్మతలతో భాదపడుచున్నివారు అదిత్య హృదయమును పారాయణము చేసినచో వారి రోగాలు మాయమవ్వగవని, వ్యాపారస్తులు పారాయణము చేసినచో వారివ్యాపారం అభివృద్ధిచెంది ధనం సమకూరగలదని, నిరుద్యోగులు పారాయణము

చేస్తే వారికి మంచి ఉద్యోగం లభించగలదని, విద్యార్థులు పారాయణము చేసినచో పరీక్షలలో మంచి మార్కులతో ఉత్తీర్ణులు కాగలరని, కుటుంబ కలహాలతో బాదపడేవాడు పారాయణము చేసినచో వారికి మేలు జరుగ గలదని ఒక అభిప్రాయము.

ఆదిత్య హృదయం రామ, రావణ సంగ్రామములో వెలువడింది. ఆమోఘమైన తపశ్శక్తి కలిగిన రావణసురున్ని వధించడానికి శ్రీరామునికి శక్యము కాలేదు. రావణుడు మరణం లేకుండునట్లు అనేక వరములు పొందడం వల్ల శ్రీరామునకు రావణాసుర వధ వీలు కాలేదు. శ్రీరాముడు ఎన్ని అస్త్ర శస్త్రములను ప్రయోగించినను రావణుడు మరణించ లేదు. దీనితో శ్రీరాముడు చింతాకాంతుడై ఉండగా, రామరావణ యుద్ధమును చూచుటకై దేవతలతో కలిసి ఆగస్త్య మహాముని శ్రీరాముని చేరుకొని ఈ విధంగా చెప్పెను.

ఓరామ! నీకు పవిత్రమైన రహస్యమును చెప్పెదను వినుము. మహా పుణ్యప్రదము, జయప్రదము, మంగళకరము, శుభకరము, సమస్త పాపాలను నశింపజేయు, దీర్ఘ ఆయుషును కులుగజేయు అదిత్య హృదయమును నీకు ఉపదేశించెదను. దీని వల్ల నీవు యుద్ధమును, రావణున్ని సులభంగా జయించగలవు అనగా..శ్రీరాముడు భక్తితో ఆదిత్య హృదయమును మూడు సార్లు పఠించగా ఆ పరమాత్ముడు అనందించిన వాడై దేవతలతో కలిసి వచ్చి ఆదిత్యుడు పులకాంకిత శరీరుడై శ్రీరాముని జూచి "ఓ రామా! రావణునకు అంత్యకాలము సంప్రాప్తించినది." అలస్యం చేయక త్వరపడుము అని ఆశీర్వదించాడు. త్వర అనే మాట ఆదిత్యుని నోట వెలువడిన వెంటనే రావణ సంహారము జరిగి లోక కళ్యాణము జరుగుతుంది.

బయటి శత్రువులనే కాక అంతశ్శత్రువులను కూడా అవలీలగా జయించేందుకు ఆదిత్య హృదయము ఆమోఘమైన అక్షర సాధనం అని ఉపదేశించాడు. తాను వెలుగుతూ ప్రపంచానికి వెలుగును ఇచ్చే భాస్కరుని నమ్ముకుంటే ఎవరికి ఏమి లోటు ఉండదనెను.

1. తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితం
   రావణంచాగ్రతో దృష్ట్వా - యుద్ధాయ సముపస్థితమ్ ॥

**అర్థము :** యుద్ధము చేసి చేసి మిక్కిలి అలసియున్న శ్రీరాముడు సమర రంగమున చింతా క్రాంతుడైయుండెను. పిమ్మట రావణుడు యుద్ధ సన్నద్ధుడై ఆ స్వామి యెదుట నిలిచి యుండెను.

2. దైవతైశ్చ సమాగమ్య - ద్రుష్టు మభ్యాగతో రణం ।
   ఉపగమ్యాబ్రవీ ద్రామ - మగస్త్యో భగవాన్ ఋషి: ॥

**అర్థము :** యుద్ధమును చూచుటకై దేవతలతో కూడి అచ్చటికి విచ్చేసిన పూజ్యుడైన అగస్త్య మహర్షి శ్రీరాముని సమీపించి, ఆ ప్రభువుతో ఇట్లు పల్కెను.

3. రామ రామ మహాబాహో - శృణుగుహ్యం సనాతనం ।
   యేనసర్వా నరీ న్వత్స - సమరే విజయిష్యసి ॥

**అర్థము :** ఓరామా! మహాబాహో! నాయనా! సనాతనము మిగుల గోప్యము ఐన ఈ స్తోత్రమును గూర్చి తెలిపెదను వినుము. దీనిని జపించినచో సమరమున నీవు శత్రువులపై విజయము సాధించగలవు.

4. ఆదిత్యహృదయంపుణ్యం - సర్వశత్రువినాశనం ।
   జయావహం జపేన్నిత్యం - మక్షయ్యం పరమం శుభమ్ ॥

**అర్థము :** ఈ ఆదిత్యహృదయం అను స్తోత్రము పరమ పవిత్రమైనది. సమస్త శత్రువులను నశింపజేయునది. నిత్యము దీనిని జపించినచో సర్వత్ర జయములభించుట తథ్యము. ఇది సత్ఫలములను అక్షయముగ ప్రసాదించునది.

5. సర్వమంగళమాంగల్యం - సర్వపాపప్రణాశనం ।
చిన్తాశోకప్రశమన - మాయుర్వర్ధన ముత్తమమ్ ॥

**అర్థము :** ఇది పరమపావనమైనది. సకల శ్రేయస్సులను సమకూర్చి సమస్త పాపములను నశింపజేయును. ఆధివ్యాధులను తొలగించి ఆయుస్సును వృద్ధిపరుచును. సర్వ జపములలో శ్రేష్ఠమైనది. కావున దీనిని జపించుట ఎంతేని ఆవశ్యము.

6. రశ్మిమన్తం సముద్యన్తం - దేవాసురనమస్కృతం ।
పూజయస్వ వివస్వన్తం - భాస్కరం భువనేశ్వరమ్ ॥

**అర్థము :** అనంతమైన బంగారు కిరణములతో శోభిల్లుచు, జాతికి జాగృతి కూర్చును. దేవాసురులు ఈయనకు ప్రణమిల్లుదురు. మిక్కిలి తేజస్సు గలవాడు, సమస్త భువనములన నియంత్రించువాడు, లోకములకు వెలుగునిచ్చు ఆదిత్యుని పూజింపుము.

7. సర్వదేవాత్మకో హ్యేష - తేషస్వీ రశ్మిభావన: ।
ఏష దేవాసురగణాన్ -లోకా న్పాతి గభ స్తిభి: ॥

**అర్థము :** ఇతడు సమస్త దేవతలకు ఆత్మయైనవాడు. తేజో రాశి. తన కిరణములచే లోకమునకు శక్తిని, స్ఫూర్తిని ప్రసాదించువాడు. దేవాసుర గణములతో గూడి సమస్త లోకములను తన కిరణములచే రక్షించు చుండువాడు.

8. ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ - శివ స్స్కన్ధ: ప్రజాపతి: ।
మహేన్ద్రో ధనద: కాలో - యమ స్సోమో హ్యాపాంపతి: ॥

**అర్థము :** బ్రహ్మ, విష్ణువు, శివుడు, కుమారస్వామి, ప్రజాపతి, దేవేంద్రుడు, కుబేరుడు, కాలస్వరూపుడు, యముడు, చంద్రుడు, వరుణుడు మరియు

9. పితరో వసస్సాధ్యా - హ్యశ్వినౌ మరుతో మను: ।
వాయు ర్వహ్ని: ప్రజా: ప్రాణా - ఋతుకర్తా ప్రభాకర: ॥

**అర్థము :** పితృదేవతలు, వసువులు, సాధ్యులు, అశ్వినీదేవతలు, మరుత్తులు, మనువు, వాయువు, అగ్ని, ప్రజలు మొదలగువారి స్వరూపములు అన్నియు ఇతనివే. షడృతువులకు కారకుడు ఈ ప్రభాకరుడే.

10. ఆదిత్య స్సవితా సూర్య: - ఖగ: పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భాను: - స్వర్ణరేతా దివాకర: ॥

**అర్థము :** ఆదిత్యుడు జగత్సృష్టికి కారకుడు. జనులు తమ విధులు నిర్వర్తించుటకు ప్రేరణయిచ్చును. లోకోపకారం కొరకు ఆకాశమున సంచరించి వర్షములద్వారా జగత్తును పోషించి తన కిరణములను ప్రకాశింపజేయును. బంగారు వన్నెతో తేజరిల్లుచు అద్భుతముగా ప్రకాశించువాడు. బ్రహ్మాండములు ఉత్పత్తికి బీజమైనవాడు. చీకట్లను తొలగించుచు దివాసమయమున ప్రాణులను కార్యనిమగ్నులను గావించువాడు.

11. హరిదశ్వ స్సహస్రార్చి - స్సప్తసప్తి ర్మరీచిమాన్ ।
తిమిరోన్మథన శ్శంభు - స్త్వష్టా మార్తాణ్డ అంశుమాన్ ॥

**అర్థము :** శ్యామవర్ణముగల రథాశ్వములు గలవాడు. అసంఖ్యాకములైన కిరణములు గలవాడు. సప్త అను పేరుగల రథాశ్వముగలవాడు. రథమునకు ఏడు గుఱ్ఱములుగలవాడు. తేజో నిధానములైన కిరణములు గలవాడు. సర్వసంహారకుడు. జగత్ప్రళయమునకు పిమ్మట దానిని మరల సృజించుటకై ఆవిర్భవించెడివాడు. నిరంతరము తన కిరణములచే ప్రకాశించుచుండువాడు.

12. హిరణ్య గర్భ శ్శిశిర - స్తపనో భాస్కరో రవి: ।
అగ్ని గర్భో దితే:పుత్ర - శ్శంఖ శ్శిశిరనాశన: ॥

**అర్థము :** బ్రహ్మాండములను తన ఉదరమునందు ధరించువాడు. తాపత్రయములతో బాధపడువారికి ఆశ్రయమై వాటిని తొలగించుటకు శాంతిని ప్రసాదించువాడు, తపింపజేయువాడు. దివ్యములైన వెలుగులను గూర్చువాడు. సకల లోకములకు స్తుతిపాత్రుడు. దివాసమయమున అగ్నిని గర్భము నందు ధరించువాడు. అదితి దేవికి పుత్రుడుగా అవతరించినవాడు. సాయంకాలమున స్వయముగా శాంతించువాడు. మంచును తొలగించువాడు.

13. వ్యోమనాథ స్తమోభేదీ - ఋగ్యజుస్సామపారగ: ।
ఘనవృష్టి రపాంమిత్రో - విన్ధ్యవీథీప్లవ్గమ: ॥

**అర్థము :** ఆకాశమునకు అధిపతియైనవాడు. రాహువును ఛేదించు లక్షణముగలవాడు. పూర్వాహ్ణమున ఋగ్వేదరూపము, మధ్యాహ్న సమయమున యజుర్వేదరూపమును, సాయంసమయమున సామవేదరూపమునను అలరారుచుండెడివాడు. ఘనముగా వర్షములను కురిపించుచుండువాడు. అందువలననే జలములను వర్షింపజేయువాడు అని ఖ్యాతి వహించెను. వింధ్యగిరి మార్గమున అతివేగముగా సంచరించువాడు.

14. ఆతపీ మణ్డలీ మృత్యు: - పింగల స్సర్వతాపన: ।
కవిర్విశ్వోమహాతేజా - రక్త స్సర్వభవోద్భవ: ॥

**అర్థము :** వేడిని కలిగియుండువాడు. వృత్తాకారమైన బింబము గలవాడు. విరోధులను రూపుమాపువాడు. ప్రభాత సమయమున పింగళవర్ణము కలిగియుండువాడు. మధ్యాహ్న సమయమున సర్వప్రాణులను తపింపజేయువాడు. వ్యాకరణాది సమస్త శాస్త్రముల యందును పండితుడు.

విశ్వమును నిర్వహించువాడు. గొప్ప తేజస్సు గలవాడు. సకల ప్రాణుల యందును అనురక్తి గలిగి యుండువాడు. సమస్త ప్రాణుల ఉత్పత్తికి కారణమైనవాడు.

15. నక్షత్రగ్రహతారాణా – మధిపో విశ్వభావన: ।
తేజసా మపితేజస్వీ – ద్వాదశాత్మ న్నమోస్తుతే ॥

**అర్థము :** నక్షత్రములకు, గ్రహములకు, తారలకును అధిపతియైనవాడు. విశ్వస్థితికి హేతువు. అగ్న్యాది తేజస్సులకు మించిన తేజస్సు గలవాడు. పన్నెండు రూపములతో విలసిల్లువాడు. ఈ నామములతో ప్రసిద్ధికెక్కిన సూర్యభగవానుడా నీకు నమస్కారం.

16. నమ: పూర్వాయ గిరయే – పశ్చిమే గిరయే నమ: ।
జ్యోతిర్గణానాం పతయే – దినాధిపతయే నమ: ॥

**అర్థము :** స్వామీ! నీవు పూర్వగిరియందును, పశ్చిమగిరి యందును విలసిల్లు చుండువాడు. గ్రహములకు, నక్షత్రములకు, దివారాత్రములకు అధిపతివి. ఉపాసకులకు జయము అనుగ్రహించునట్టి ఓ సూర్య భగవానుడా నీకు నమస్కారము.

17. జయాయ జయభద్రాయ – హర్యశ్వాయ నమో నమ: ।
నమో నమ స్సహస్రాంశో – ఆదిత్యాయ నమో నమ: ॥

**అర్థము :** జయములను, శుభములను చేకూర్చువాడవు. శ్యామవర్ణముగల రథాశ్వములుగలవాడవు. వేలకొలది కిరణములు గలవాడవు. అదితి పుత్రుడవైన ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

18. నమ ఉగ్రాయ వీరాయ – సార్గయ నమో నమ: ।
నమ: పద్మప్రబోధాయ – మార్తాణ్డాయ నమో నమ:॥

**అర్థము :** నిన్ను ఉపాసించని వారికి నీవు భయంకరుడవు. ప్రాణులకు శక్తిని ప్రసాదించువాడవు. శీఘ్రముగ ప్రయాణించువాడవు. పద్మములను వికసింపజేయువాడవు. జగత్ప్రళయమునకు పిమ్మట మరల సృజించుటకై ఆవిర్భవించునట్టి ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**19.** బ్రహ్మేశానాచ్యుతేశాయ - సూర్యా యాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ - రౌద్రాయ వపుషే నమః ॥

**అర్థము :** బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ప్రతీకవు. దివ్య తేజస్సంపన్నుడవు. కాంతికి నిధియైనవాడవు. ప్రళయకాలమున లయకారకుడవు. అందువలన రుద్రస్వరూపుడవైన ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**20.** తమోఘ్నాయ హిమఘ్నాయ - శత్రుఘ్నా యామితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ - జ్యోతిషాం పతయే నమః॥

**అర్థము :** తమస్సును రూపుమాపువాడవు. జడత్వమును, శీతలత్వమును నశింపజేయువాడవు. నిన్ను ఆశ్రయించి నవారి శత్రువులను సంహరించువాడవు. పరమాత్మ స్వరూపుడవు. కృతఘ్నులను నశింపజేయుచు, దివ్యతేజస్సు విరజిమ్ముచు, జ్యోతులకు అధిపతివైన నీకు నమస్కారము.

**21.** తప్తచామీకరాభాయ - వహ్నయే విశ్వకర్మణే ।
నమస్తమోభినిఘ్నాయ - రుచయే లోకసాక్షిణే ॥

**అర్థము :** బంగారమువంటి వన్నెగలవాడవు. ఆహుతులను గ్రహించువాడవు. సర్వజగత్కర్తవు. తమస్సులను పారద్రోలువాడవు. ప్రకాశ స్వరూపుడవు. జగత్తున జరిగెడి సర్వజనుల కర్మలకు సాక్షియైన వాడవు. కనుక ఓ భాస్కరుడా నీకు నమస్కారము.

**22.** నాశయ త్యేష వైభూతం - త దేవ సృజతిప్రభుః
పాయత్యేష తపత్యేష - వర్ష త్యేష గభస్తిభిః ॥

**అర్థము :** రఘునందనా! ఈ ప్రభువే సమస్త ప్రాణులను లయమొనర్చును. పిదప సృష్టించి పాలించుచుండును. ఇతడు తన కిరణముల చేత జగత్తును తపింపజేయును. వర్షములను ప్రసాదించుచుండును.

23. ఏష సుప్తేషు జాగర్తి - భూతేషు పరినిష్ఠిత: ।
ఏష చైవాగ్నిహోత్రం - ఫలంచై వాగ్ని హోత్రిణామ్. ॥

**అర్థము :** ఇతడు సకల ప్రాణులలో అంతర్యామిగా నుండును. వారు నిద్రించుచున్నను తాను మేల్కొనియే యుండును. హవిస్సు యొక్క స్వరూపము ఇతడే. తత్ఫలస్వరూపమూ ఇతడే.

24. వేదాశ్చక్రతవశ్చైవ - క్రతూనాం ఫల మేవ చ ।
యాని కృత్యానిలోకేషు - స ర్వ ఏషరవి: ప్రభు: ॥

**అర్థము :** ఇతడు వేదవేద్యుడు. యజ్ఞఫలస్వరూపుడు. లోకములో జరిగెడి సమస్త కార్యములకు ఈ సూర్యభగవానుడే ప్రభువు.

25. ఏనమాపత్సుకృచ్ఛ్రేషు - కాన్తారేషు భయేషు చ ।
కీర్తయ న్పురుష: కశ్చి - న్నావసీదతి రాఘవ ॥

**అర్థము :** రఘురామా! ఆపదలయందును, కష్టముల యందును, దుర్గమ మార్గముల యందును, భయస్థితులయందును ఈ స్వామిని కీర్తించిన వారికి నాశము ఉండదు.

26. పూజాయ స్వైన మేకాగ్రో - దేవదేవం జగత్పతిత్ ।
ఏత త్రిగుణితం జప్త్వా - యుద్ధేషు విజయిష్యసి ॥

**అర్థము :** దేవదేవుడు, జగత్పతియైన ఈ సూర్యభగవానుని ఏకాగ్రతతో పూజింపుము. ఈ ఆదిత్యహృదయమును ముమ్మారు జపించినచో నీవు ఈ మహా సంగ్రామము నందు విజయము పొందగలవు.

27. అస్మిన్ క్షణే మహాబాహో - రావణం త్వం వధిష్యసి ।
ఏవముక్త్వాతదా గస్త్యో - జగామ చ యథాగతమ్ ॥

**అర్థము :** మహాబాహో! రామా! ఈ క్షణముననే నీవు రావణుని వధింప గలవు అని పలిగి అగస్త్య మహర్షి తన స్థానమునకు చేరెను.

**28. ఏత చ్ఛ్రుత్వా మహాతేజా - నష్టోశోకో భవ త్తదా ।**

**ధారయామాస సుప్రీతో - రాఘవ: ప్రయతాత్మవాన్ ॥**

**అర్థము :** మహాతేజస్వియైన శ్రీరాముడు అగస్త్యమహాముని ద్వారా ఈ ఆదిత్య హృదయ మహిమను గ్రహించి చింతారహితుడయ్యెను. అతడు మిక్కిలి సంతృప్తి పొంది ఏకాగ్రతతో ఆదిత్య హృదయ మంత్రమును మనస్సు నందు నిలుపుకొనెను.

**29. ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు - పరంహర్ష మవాప్తవాన్ ।**

**త్రిరాచమ్య శుచిర్భూత్వా - ధను రాదాయ వీర్యావాన్ ॥**

**అర్థము :** పిదప ముమ్మారు ఆచమించి శుచియై సూర్యభగవానుని జూచుచు ఈ మంత్రమును జపించి పరమ సంతుష్టుడాయెను. పిమ్మట ఆ రఘువీరుడు తన ధనువును చేబూనెను.

**30. రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।**

**సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోభవత్ ॥**

**అర్థము :** మిక్కిలి సంతుష్టుడైయున్న ఆ రాముడు రావణుని జూచి యుద్ధమునకై పురోగమించెను. అన్ని విధములుగా గట్టి పూనికతో ఆ నిశాచరుని వధించుటకు కృతనిశ్చయుడయ్యెను.

**31. అథ రవి రవద న్నిరీక్ష్య రామం ముదితమానా: పరమం ప్రహృష్యమాణ:।**

**నిశచరపతి సంక్షయం విదిత్వా సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥**

**అర్థము :** పిమ్మట దేవతలమధ్యనున్న సూర్యభగవానుడు రావణుడు నశించుట తథ్యము అని ఎరింగి మానసోల్లాసమును పొందినవాడై, పరమ సంతోషముతో శ్రీరాముని జూచి రామా! త్వరపడుము అని పలికెను. 

# సూర్యారాధన వలన సంపద వృద్ధి చెందుతుంది



సూర్యుని వల్లన సంపద కలుగుతోందనడానికి ఎన్నో పురాణకథలు ప్రచారంలో ఉన్నాయి. అరణ్యవాస సమయంలో తమవెంట వచ్చిన పౌరులకు, మునులకు ఆహారం కల్పించడం ఎలాగో తెలియక ధర్మరాజు సూర్యుని ప్రార్థిస్తాడు. అప్పుడు సూర్యుడు ప్రసన్నుడై ఆయనకు ఒక అక్షయపాత్రను ప్రసాదిస్తాడు. ఆ అక్షయపాత్ర అక్షయంగా ఆహార పదార్థాలను అందిస్తుంది. అలాగే సత్రాజిత్తు అనేరాజు సూర్యుని ప్రార్థించి శమంతకమనే మణిని పొందుతాడు. ఆ మణి రోజూ పుష్కలంగా బంగారాన్ని ప్రసాదిస్తుంది.

సూర్యుని దగ్గరే ఆంజనేయుడు వేద శాస్త్రాలను అభ్యసిస్తాడు. బుద్ధిని ప్రేరేపించే వాడు సూర్యుడేనని చెబుతుంది గాయత్రీమంత్రం. ఇహానికీ, పరానికీ కావలసినవన్నీ మనకు సూర్యునినుంచి అందుతున్నాయి. మన కర్మలను మనస్సు నియంత్రిస్తే. ఆ మనుస్సును నియంత్రించేవాడు చంద్రుడు. చంద్రునికి ప్రకాశాన్ని అందించేవాడు సూర్యుడు. ఆధ్యాత్మిక సాధనలో ప్రధాన సాధనం మనస్సే అంతటికీ, అన్నింటికి కారకుడైన సూర్యుని ఆరాధించి ఎందరో ఋషులు, యోగులు అద్భుత ఫలితాలను పొందారు.

సూర్యయోగం పేరుతో ఆధ్యాత్మిక ప్రక్రియ నొకదానిని రూప కల్పన చేసి అందించారు.

సూర్యనమస్కారాలు, ఆసనాలవల్ల సూర్య శక్తిని నేరుగా స్వీకరించి నప్పుడు ఆ సూర్యశక్తి మనలోని శక్తులకు అనూహ్యామైన పరివర్తన కలిస్తుంది. శరీర, ప్రాణ, మనస్సులను మూడింటినీ విశ్వ చైతన్యంలోకి ప్రవేశపెడుతుంది. మనలో అంతర్గతంగా ఉన్న శక్తి కేంద్రాలు తెరచు కున్నప్పుడు శరీరం నిలుపుకోవడానికి బాహ్యామైన ఆహారపదార్థాల అవ సరం తగ్గుతుంది. అంటే భోగశరీరం యోగ శరీరంగా మారిపోతుంది. అప్పుడు అపారమైన శాంతి, సమస్థితి కలుగుతాయి.

సూర్యకిరణాలు ఏడు రంగులలో ఉంటాయని మనకు తెలుసు. ఈ రంగుల ఆధారంగా ఒక చికిత్సా పద్ధతిని ప్రవేశపెట్టారు. నారింజ రంగు వేడిని కలిగించి శైత్యసంబంధమైన రుగ్మతలను నివారిస్తుంది. జీర్ణ ప్రక్రియను బాగు చేస్తుంది. శీతల స్వభావం కలిగిన ఆకుపచ్చ రంగు కండపుష్టిని కలిగించి మెదడును పటిష్ఠపరుస్తుంది. కీళ్ళ నొప్పులవంటి రుగ్మతలను పోగొడుతుంది. నీలిరంగు కూడా శీతల స్వభావం కలిగి ఉండి పిత్తదోషం వల్ల కలిగే రోగాలను నివారిస్తుంది. ఈ మూడు రంగులను ప్రధాన వర్ణాలుగా స్వీకరించి మిగిలిన రంగుల సమ్మేళనంతో మూడు వర్గాలుగా విభజించి చికిత్సకు ఉపయో గిస్తారు. సూర్య నమస్కారాలు మొదలైన వాటివల్ల సూర్య కిరణాలుమన ఆలోచనా ప్రక్రియను శుద్ధి చేసి తగువిధంగా నియంత్రిస్తూ ఉంటాయి. సాధారణ మానవ చైతన్యంతో నియంత్రణకు లొంగని మనస్సు సౌరవ్యవస్థ నుంచి వచ్చే ఫోటాన్ల సహాయంతో తేలికగా నియంత్రితమవుతుంది అంటారు.



#  చంద్రుడు 



చంద్రుడు జ్యోతిషశాస్త్రంలో మనస్సుకు కారకుడు. చంద్రుడు స్త్రీ గ్రహం, వైశ్య జాతి, శ్వేత వర్ణం, పరిమాణం పొట్టి, వయస్సు డెబ్బై సంవత్సరాలను సూచించును. దిక్కు వాయవ్యం, తత్వం జలతత్వం, ప్రకృతి వాత, శ్లేష్మములు. ఋతువులలో వర్ష ఋతువును, లోహములలో వెండిని, రత్నములలో ముత్యమును సూచించును. చంద్రుడు చతుర్ధ భావంలో దిక్బలం కలిగి ఉంటాడు. గ్రహములలో చంద్రుడు ఏడవవాడు. సత్వగుణ సంపన్నుడైన చంద్రుడు కృష్ణ పక్ష దశమి నుండి శుక్ల పక్ష పంచమి వరకు పూర్ణ చంద్రుడు. శుక్ల పంచమి నుండి అమావాస్య వరకు క్షీణ చంద్రుడు, అమావాస్య నుండి కృష్ణ పక్ష దశమి వరకు మధ్యమ చంద్రుడు అని శాస్త్రం చెప్తుంది. చంద్రుడు రోహిణి, హస్త, శ్రావణ నక్షత్రాలకు అధిపతి. శరీరావయవములలో మగవారి ఎడమ కన్ను, స్త్రీల కుడి కన్ను శరీర

మధ్య భాగమును సూచించును. చంద్రుడు కర్కాటక రాశికి ఆధిపత్యం వహిస్తాడు. చంద్రుడు వృషభంలో మూడు డిగ్రీలలో పరమోచ్ఛ స్థితిలో ఉంటాడు. వృషభంలో మూడు నుండి ఇరవై ఏడు డిగ్రీల వరకు మూల త్రికోణంలో ఉంటాడు. వృశ్చికంలో మూడు డిగ్రీల వరకు పరమ నీచ స్థితిలో ఉంటాడు. బుధుడు, సూర్యుడు మిత్రులు. చంద్రుడికి శత్రువులు లేరు.

## చంద్రకళలు

చాలామందికి ఈ విషయంలో గందరగోళం ఉంది. సూర్యుని కాంతి చంద్రుని ఉపరితలం (Lunar Surface) మీద పడడం వల్లే వెన్నెల వస్తుందని, వెన్నెల ద్వారానే చంద్రుడు కనిపిస్తాడని అందరూ ఏకీభవిస్తారు. కానీ చంద్రునిపై పడే కాంతిని సరిగా పడనీయకుండా భూమి అడ్డు రావడం వల్లే చంద్రకళలు ఏర్పడతాయని కొందరి భావం.

అసలు విషయం ఏమిటంటే చంద్రుడు నెలకు ఓ మారు భూమి చుట్టూ తిరగడం, తన చుట్టూ తాను తిరగడం చేస్తాడు. కాబట్టి చంద్రుని ఓ అర్ధభాగమే దాదాపు లక్షలాది సంవత్సరాలుగా భూమివైపు ఉంటోంది. భూమి చంద్రుని సాపేక్షస్థితిలో సూర్యుని పరంగా వివిధ భంగిమల్లో ఉండడం వల్ల సౌరకాంతి చంద్రుని ఓ అర్ధభాగం మీద పడినా మన వైపున్న అర్ధభాగంలో అమావాస్య తర్వాత పెరిగే క్రమంలోనూ, పౌర్ణమి తర్వాత క్రమంలోనూ కనబడుతుంది. మిగిలిన భాగం మనకు కనిపించని భాగంలో ఉంది.

## చంద్రుని ప్రభావం

చంద్ర ప్రభావిత వ్యక్తులు శ్లేష్మ వ్యాధి పీడితులుగా ఉంటారు. వీరు కొంత సమయం ఉత్సాహంతోనూ మరికొంత సమయం నిరుత్సాహం గానూ ఉంటారు. కొంతకాలం ధైర్యము మరి కొంతకాలం భయం కలిగి

ఉంటారు. కొంతకాలం ధనవంతులుగా మరి కొంతకాలం ధనహీనులుగా ఉంటారు. స్థూలంగా మానసిక స్థితి, సందలు అస్థిరంగా ఉంటాయి. అభిప్రాయాలూ తరచూ మార్చుకుంటారు. మిత్రులనూ తరచూ మార్చుకుంటారు. భోజన ప్రియులుగా ఉంటారు. ఆ కారణంగా యుక్త వయసు దాటే సమయానికి పొట్ట పెద్దది అయ్యే అవకాశం ఎక్కువ. స్వతంత్రించి ఏకార్యం చెయ్యలేరు. నీటి పారుదల, జల విద్యుత్, ప్రజా ప్రాతినిధ్యం, బియ్యము, వస్త్రములకు సంబంధించిన వృత్తులలో రాణిస్తారు. పాండు రోగం, క్షయ, మధుమేహం, శ్వాసకోశ వ్యాధులు వచ్చే అవకాశం ఎక్కువ.

## చంద్రుని కారకత్వాలు

చంద్రుడు తల్లికి, జలరాంతాలు, జలం, పూలు, సముద్రం, నదులు, ముఖము, ఉదరం, మహిళా సంఘాలకు, స్త్రీ సంక్షేమ సంఘాలకు చంద్రుడు కాకత్వం వహిస్తాడు. వృత్తి సంబంధంగా నౌకా వ్యాపారం, ఓడరేవులు, వంతెనలు, ఆనకట్టలు, చేపల పెంపకం, వెండి, ముత్యములకు కారకత్వం వహిస్తాడు. వ్యాధులలో రక్త హీనత, అతిమూత్రం, గర్భ సంబంధిత వ్యాధులు, వరబీజము, బేదులు, మానసిక వ్యాధులు, ఉదర సంబంధిత వ్యాధులు, కేన్సర్ (రాచపుండు) మొదలైన వాటికి కారకుడు. ఆహార సంబంధంగా చెరకు, తేనె, పాలు, పెరుగు, భోజనము, గోధుమలు, జొన్నలు, రొట్టెలు, గోధుమలు, చేపలు, పంచదార, అరటి పండు, నెయ్యి, దోసకాయలు, తమలపాకులు, గుమ్మడి, క్యాబేజి, కర్బూజా ఫలం, కుక్కగొడుగులు, ఆవులు, గుడ్లు తాబేలు, గుడ్లగూబ, బాతు, గబ్బిలం, పిల్లి, నీటి గుర్రం, సొర చేపల వంటి ప్రాణులకు కారకత్వం వహిస్తాడు. తిమింగలం మొదలైన ప్రాణులకు కారకత్వం వహిస్తాడు. గుడ్లు, కర్పూరం, నికెల్, జర్మన్ సిల్వర్ లాంటి వస్తువులకు కారకత్వం వహిస్తాడు.

సంగీతం, నాటం, కవిత్వం లాంటి లలిత కళలకు కారకత్వం వహిస్తాడు. మనస్తత్వ శాస్త్రము పఠనం, వ్యవసాయం, విద్యా సంబంధిత వృత్తులు, జలవనరుల వంటి వృత్తులకు కారకత్వం వహిస్తాడు. మూలికలు, స్త్రీలు, జీర్ణ వ్యవస్థ, జున్ను చంద్రుడు కారకత్వం వహించే ఇతరములు.

## రూపురేఖలు

పురాణ కథనం అనుసరించి చంద్రుడు గౌరవర్ణం కలిగిన వాడు. శ్వేతవస్త్ర ధారణ చేయువాడు. శ్వేత వర్ణ ఆభరణములతో అలంకరించ బడిన వాడు. రెండు భుజములతో, శిరస్సున బంగారు కిరీటము ధరించి మెడలో ముత్యాలమాలను ధరించి ఒక చేత గద, ఒకచేత వరద ముద్రతో దర్శనం ఇస్తాడు. దశాశ్వములను పూన్చిన రథమును అధిరోహించి సంచరిస్తాడు.

## చంద్రుడు రాశులు

చంద్రుడు కర్కాటకంలో స్వక్షేత్రంలోనూ వృషభంలో మూడు డిగ్రీల వద్ద ఉచ్ఛ స్థితిలోనూ, వృశ్చికంలోని మూడు డిగ్రీల వద్ద నీచస్థితిలోనూ ఉంటాడు. చంద్రుడికి శత్రువులు లేరు అలాగే శత్రు క్షేత్రం లేదు. చంద్రుడికి మిధునం, కన్య, సింహములు మిత్ర క్షేత్రములు. వృషభం త్రికోణ స్థానం. శుక్ర, శనులు సములు. కుంభం, మకరం, తులా రాశులు సమ రాశులు.

## ద్వాదశస్థానములు, చంద్రుడు

లగ్నంలో చంద్రుడు ఉన్న జాతకుడు దృఢశరీరము కలిగిన వాడు, చిరంజీవి, నిర్భయుడు, ధనవంతుడు అవుతాడు. క్షీణచంద్రుడు ఉన్నప్పుడు ఫలితాలు తారుమారుగా ఉంటాయి.

చంద్రుడు ద్వితీయంలో ఉన్నవాడు ధనవంతుడు, విద్యావంతుడు, మృదుభాషి, అంగలోపం కలవాడుగా ఉంటాడు.

తృతీయ స్థానంలో చంద్రుడు కలిగి ఉన్న జాతకుడు సోదరులు కలవాడు, బలవంతుడు, శౌర్యవంతుడు, స్త్రీలను ఆకర్షించువాడు అవుతాడు. బహుకష్టములను పొందుతాడు.

చతుర్ధస్థానమున ఉన్న జాతకుడు సుఖజీవి, భోగముల యందు ఆసక్తుడు, మిత్రులు కలవాడు, వాహనములు కలవాడు, కీర్తివంతుడు అవుతాడు.

పంచమ స్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు మేధాసంపద, సుపుత్రులు కలవాడు, ఠీవి కలవాడు, మంత్రిపదవి అలంకరించువాడు అవుతాడు.

షష్టమ స్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు అల్పజీవి, అమాయకుడు, ఉదరశూల (కడుపు నొప్పి) కలిగిన వాడు, దీనుడు ఔతాడు.

సప్తమ స్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు సౌమ్యవంతుడు, అందమైన యువతుల హృదయమున స్థానము కలిగినవాడు, సుందరుడు అయి సుందర కళత్రము కలిగి ఉంటాడు.

అష్టమ స్థానమున చంద్రుడు కలిగిన జాతకుడు రోగపీడితుడు, అల్పాయుష్మంతుడు అవుతాడు. క్షీణ చంద్రుడు అయిన ఫలితములలో మార్పులు ఉంటాయి.

నవమ భావమున చంద్రుడు ఉన్న జాతకుడు అభివృద్ధి, పవిత్రుడు, పుత్ర సంతానం కలిగినవాడు, విజయము, కార్యం ఆరంభించగానే శుభ ఫలితములను కలిగి ఉంటాడు. విశాల హృదయము, సహాయ గుణము కలిగి ఉంటాడు.

దశమస్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు ఔషధ సంబంధిత వృత్తి వ్యాపారాలు కలిగినవాడు అవుతాడు.

ఏకాదశ స్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు విశాలహృదయం, చిరంజీవి, ధనవంతుడు అవుతాడు.

ద్వాదశ స్థానమున చంద్రుడు ఉన్న జాతకుడు ద్వేషము కలవాడు, దుఃఖములు, క్లేశం, అవమానం, నిరుత్సాహం పొందుతూ ఉంటాడు. 

# చంద్రగ్రహ దోష నివారణకు ముత్యపు శంఖం



ముత్యపు శంఖం శ్రీ మహాలక్ష్మి స్వరూపంగా పూజిస్తారు. ముత్యపు శంఖం తెల్లగా మెరుస్తూ ఉంటుంది. ముత్యపుకాంతితో గుండ్రంగా ఉండే శంఖం ఇది. ముత్యపు శంఖం మేరువు ఆకారంలో పైన సన్నగా ఉండి కిందవైపు ఉదరం ఉంటుంది. ముత్యపు శంఖాలు కొన్ని పైన కోన తేలి ఉంటాయి. మరికొన్ని రంధ్రంతో ఉంటాయి. రంధ్రంతో ఉన్న ముత్యపు శంఖాలతోటి ధ్వని(ఊద) చేయవచ్చు.

ముత్యపు శంఖాలకు సోమవారం రోజు గాని, శుక్రవారం రోజు గాని, దీపావళి, అక్షయతృతీయ రోజున పూజలు చేస్తారు. ముత్యపు శంఖాలు జ్యోతిష్యంలో చంద్రగ్రహానికి సంబందించినది కాబట్టి సోమవారం ప్రశస్తమైనది.

## పూజా విధానం

ముత్యపు శంఖాన్ని ముందుగా గంగాజలంతోగాని, పసుపు నీళ్ళతో గాని శుద్ధి చేసుకోవాలి. ముత్యపు శంఖాన్ని తెల్లటి వస్త్రంపైన గాని, బియ్యంపైన గాని, అష్టలక్ష్మి పీటం పైనగాని ఉంచి పూజచేయాలి. గంధం, కుంకుమ, పసుపు, అక్షితలు సమర్పించి అష్టోత్తర శతనామావళి పూజాచేయాలి. ధూప, దీప నైవేద్యాలు, తాంబూలం సమర్పించి బియ్యపు గింజలను శంఖం లోపల వేయాలి.

ఓం శ్రీం హ్రీం దారిద్ర్య వినాశిన్యై
ధనధాన్య సమృద్ధిం దేహిదేహి నమః

అనే మంత్రాన్ని 108 సార్లు ఉచ్చరిస్తూ పూజించాలి.

శంఖ భస్మము వల్ల అనేక రోగాలు కూడా నయము అగుచున్నవి. శంఖాన్ని పూరించుట వల్ల శ్వాసకోశ రోగాలు నశిస్తాయి, బాగా గాలి ప్రసరణ జరిగి చురుకుగా కూడా ఉంటాము. కొన్ని శంఖాలు చెవి దగ్గర పెట్టుకుంటే ఓంకార నాదం వినిపిస్తుంది.

జాతక చక్రంలో చంద్రుడు 8 వ స్థానంలో ఉన్న వారికి బాలారిష్ట దోషం ఉంటుంది. ఇలాంటి వారు చంద్రుడు జాతకచక్రంలో సరిగా లేనివారు తప్పకుండా ముత్యపు శంఖాన్ని పూజించుకోవటం చాలా మంచిది. జాతకచక్రంలో చంద్రుడు నీచలో వున్నవారికి, శత్రుక్షేత్రాలలో వున్నవారికి, అమావాస్య, పౌర్ణమి, రాహువుతో కలసిన చంద్రుడు ఉన్నవారు ముత్యపు శంఖాన్ని పూజించాలి.

ముత్యపు శంఖంలో నీటిని పోసి రోజు తాగిన వారికి చంద్రగ్రహ దోషాలవలన కలిగే అనారోగ్యాలు తగ్గుతాయి అని అంటారు.

పూజచేసిన శంఖాన్ని బీరువాలో ధనం, బంగారం ఉండే చోట ఉంచితే ధనాభివృద్ధి ఉంటుంది.

ప్రతి సోమవారం భార్యాభర్తలు ముత్యపు శంఖాన్ని పూజాచేసి శంఖంలో పోసిన నీటిని తీర్థ ప్రసాదంగా స్వీకరిస్తే పార్వతి పరమేశ్వరుల అనుగ్రహాన్ని పొందటమే కాకుండా అన్యోన్నతని పొందుతారు.

వ్యాపారస్థలంలో ముత్యపు శంఖాన్ని తప్పకుండా పూజించుకున్న వారికి వ్యాపారాభివృద్ధి కలుగుతుంది.

బియ్యం వ్యాపారస్తులు, వాటర్ ప్లాంట్స్ ఉన్న వారు, హోటల్స్, మహిళా వృత్తులు చేసేవారు, ప్రజలకు ఉపయోగపడే వృత్తులు చేసే వారు ముత్యపు శంఖాన్ని పూజించాలి.

కొంతమంది జాతకచక్రంలో చంద్రుడు బాగా లేనివారు చిన్న విషయాలకు అలగటం, భాదపడటం, ప్రతి చిన్న విషయాలకు మౌనవ్రతం చేస్తుంటారు. వీరు తప్పకుండా ముత్యపు శంఖాన్ని పూజించాలి.

కవిత్వం వ్రాసేవారు, పాలు, నీటికి సంబందించిన వ్యాపారులు, ముత్యపు శంఖాన్ని పూజించటం మంచిది. మతిమరుపు ఉన్నవారు ముత్యపు శంఖంలో నీటిని పోసి తాగటం మంచిది.

మూర్ఛ వ్యాధిగ్రస్తులు, పూనకం సమస్యలు ఉన్నవారు ముత్యపు శంఖాన్ని పూజించిన, శంఖలో నీటిని తాగిన వ్యాధి సమస్యలు నిదానముగా దూరమవును. స్త్రీల ఋతుసమస్యలు, ప్రసవ సమస్యలు ఉన్నవారికి ముత్యపు శంఖాన్ని పూజించిన మంచి ఫలితాలు వస్తాయి. హోటల్స్, పాలవ్యాపారం చేసేవారు, లలితకళలు, కవులు, గాయకులు ముత్యపు శంఖాన్ని పూజించాలి.

## చంద్ర గ్రహ దోషాలను దూరం చేసుకోవాలంటే?

నవగ్రహాలను ఇష్టమైన పూలతో పూజిస్తే వారి అనుగ్రహంతో కష్టాలను తగ్గించుకోవచ్చునని పంచాంగ నిపుణులు అంటున్నారు. నవగ్రహాలలో ఒక్కో గ్రహానికి ఒక్కో వర్ణంలో గల పూలు ప్రీతికరమైనవిగా పేర్కొనబడ్డాయి. ఈ నేపథ్యంలో చంద్రగ్రహానికి 'తెల్లని వర్ణం'లో గల పూలు ప్రీతికరమైనవి. చంద్రగ్రహ సంబంధమైన దోషాలతో ఇబ్బందులు పడుతున్నవాళ్లు, ఆయనని తెల్లని వర్ణంలో గల పూలతో పూజించడం మంచిది. ఈ విధంగా చేయడం వలన చంద్రుడు సంతోషపడిపోతాడు... సంతృప్తి చెందుతాడు. ఫలితంగా చంద్రగ్రహ సంబంధమైన దోషాలతో బాధలుపడుతున్నవాళ్లని కరుణిస్తాడు. తద్వారా ఈతిబాధలు ఉండవని, సుఖసంతోషాలుంటాయని ఆధ్యాత్మిక పండితులు అంటున్నారు.

# చంద్రగ్రహ శాంతికి చేయవలసిన విధులు



చంద్రుడు గౌరవర్ణం కలవాడు. చంద్రుని వస్త్రము, అశ్వము, రథము శ్వేత వర్ణములే. స్వర్ణ మకుటము, ముత్యాలహారము ధరిస్తాడు. హస్త గధాయుధుడు. మరో హస్తమున వరముద్రను కలిగియుండును. ఇతనిని అన్నమయుడు, మనో మయుడు, పురుషస్వరూపుడని అందురు.

శ్రీ కృష్ణభగవానుడు జన్మించకముందే జన్మించినవాడు. అందువల్ల ఇతనిని షోడశ కళాపరిపూర్ణుడందురు. చంద్రుడు సమస్త ప్రదేశాల్లో వ్యాపించియుంటాడు. అత్రి మహర్షి, అనసూయలపుత్రుడు. సర్వ మయుడు. బీజ, ఓషధి జలపూరుడు. అశ్విని, భరణి మొదలైన 27 మందిని వివాహ మాడెను. వీరు నక్షత్రాలుగా తిరుగుతూ పతివ్రతా ధర్మములను పాలిస్తూ... వర్షములను, మాసములను విభజించుచూ ఉంటారు.

పూర్ణిమనాడు చంద్రోదయ సమయమున రాగి పాత్రయందు తేనె కలిపిన పాయసమును వండి, చంద్రునికి సమర్పించిన యెడల శుభపద్రములు జరుగును అని చెబుతారు.

చంద్రుని వాహనమైన రథములో మూడు చక్రములు మాత్రమే ఉండును. పది అశ్వములు ఇతని రథమున చోటుచేసుకుని వుంటుంది. ఆ అశ్వములు దివ్యమైనవి. అశ్వముల నేత్రములు కూడా శ్వేత వర్ణమును

కలిగియుండును. మత్స్యపురాణమును పోలిన కంఠమును చంద్రుడు కలిగియుంటాడు.

చంద్రునికి బుధుడు అనేపుత్రుడు కలడు. ఇతడు తారకకు జన్మించిన వాడు. చంద్రునికి అధిదేవత, ప్రత్యధిదేవత గౌరీదేవి. చంద్రుని మహాదశ కాలము పది సంవత్సరాలు. చంద్రుడు కర్కాటక రాశి నాథుడు. నక్షత్రము లకు స్వామి నాథుడు. నవగ్రహములలో రెండవస్థానానికి చెందిన వాడు. చంద్రశాంతికి సోమవార వ్రతము చేయటం మంచిది.

ఇంకా శివోపాసనం, శివస్తుతి చేయవలెను. వెండి, శంఖము, వంశ పాత్ర, తెల్లని చందనము, శెనగలు, శ్వేతపుష్పములు పెరుగు, ముత్యాలు ఎద్దులకు దానమివ్వాలి. ఎద్దును బ్రాహ్మణునికి దానమివ్వడం ద్వారా చంద్రగ్రహ ప్రభావంతో కలిగే దుష్ఫలితాలు దరి చేరవని శాస్త్రం చెబుతోంది.



**శనివారం మినహా, మిగిలిన రోజుల్లో అనవసరంగా నవ గ్రహాల చుట్టూ తిరుగుతున్న ప్రజల పైన శని గ్రహం యొక్క ప్రతికూల ప్రభావాలు అధికంగా ఉంటాయని చెప్పబడింది. శనివారం మినహా మిగిలిన రోజులలో నవ గ్రహాలను పూజించేటప్పుడు, 9 మార్లు కాకుండా ఒకసారి మాత్రమే వాటి చుట్టూ తిరగడం ఉత్తమంగా చెప్పడమైనది.**

# చంద్రుని 16 కళలు, దక్షశాపం



షోడశకళా ప్రపూర్ణుడు చంద్రుడు. ఆ 16 కళలు. 1. అమృత. 2. మానద. 3. పూష. 4. తుష్టి. 5. సృష్టి. 6. రతి. 7. ధృతి. 8. శశిని. 9. చంద్రిక. 10. కాంతి. 11. జ్యోత్స్న. 12. శ్రీ. 13. ప్రీతి. 14. అంగద. 15. పూర్ణ. 16. పూర్ణామృత.

చంద్రుడు దేవతలందరిలోకీ అందగాడు. చల్లనివాడు. పదునాలుగు లోకాల వారికీ ఇష్టుడు. అశ్విని మొదలైన ఇరవై ఏడుగురు నక్షత్ర కన్యలు దక్షప్రజాపతి కుమార్తెలు. వాళ్లందరూ అందగత్తెలే. వాళ్లందరినీ దక్షుడు చంద్రుడికిచ్చి వివాహం కావించాడు. చంద్రుడు వాళ్లందరినీ అనురాగం తోనే చూశాడు. కానీ, రోహిణిపైన మాత్రం కొంచెం ఎక్కువ స్నేహం కనబరిచాడు. అదిచూసి మిగతా వారు అసూయ చెంది, లోలోపల కుమల సాగారు. వారందరూ కలిసి పుట్టింటికి వెళ్లి తమ దౌర్భాగ్యాన్ని తండ్రితో చెప్పుకొని కంటనీరు పెట్టుకున్నారు. దక్షుడు వారి పట్ల జాలిపడి, చంద్రుణ్ని తన ఇంటికి పిలిచి తన కుమార్తెలందరిపట్ల సమానమైన ఆదరం కనబరచవలసిందని హితవు చెప్పి పంపాడు. కానీ చంద్రుడు తన పక్షపాతాన్ని మానుకోలేకపోయాడు.

దక్షుడు ఆగ్రహం చెంది, అల్లుడని కూడా ఆలోచించక, చంద్రుడికి క్షయవ్యాధి కలగాలని శపించాడు. ఆ కారణంగా చంద్రుడు నానాటికీ



క్షీణించిపోసాగాడు. అతని నుండి వెన్నెల వర్షించటం ఆగిపోయింది. లతలు, వృక్షాలు వాడిపోయాయి. రాత్రులు గాఢాంధకారంతో నిండి, భయంకరంగా మారాయి. ఆ చీకటిలో రాత్రించరులైన రాక్షసులు విచ్చలవిడిగా సంచరించటం ప్రారంభించారు.

లోకాలకు ఉల్లాసం కలిగించే చంద్రుడు అలా నానాటికీ కృశించిపోవటం చూసి ఇంద్రాది దేవతలు, వశిష్ఠాది మహర్షులు దుఃఖించి, చంద్రుణ్ని పిలుచుకొని బ్రహ్మ వద్దకు వెళ్లి, చంద్రుడికి రోగ విముక్తి కలిగించమని ప్రార్థించారు. బ్రహ్మ చంద్రుడితో, 'సుధాకరా! నువ్వు ప్రభాస క్షేత్రానికి వెళ్లి మృత్యుంజయుడైన పరమ శివుణ్ని గూర్చి తపస్సు చెయ్యి. దానివల్ల నీ క్షయవ్యాధి పోయి విశ్వశాంతి ఏర్పడగలదు' అన్నాడు.

చంద్రుడు బ్రహ్మ చెప్పిన విధంగా ఆరు మాసాలపాటు తపస్సు చేశాక, ఈశ్వరుడు భవానీ సమేతంగా ప్రత్యక్షమై, 'వత్సా! దక్షశాపం వల్ల కృశించిపోతున్నానని విచారపడకు. నీకు కృష్ణ పక్షంలో ప్రతిరోజూ ఒక్కొక్క కళ క్షీణిస్తుంది. ఈ విధంగా నువ్వు నెలకొకసారి పూర్ణ చంద్రుడివై ప్రకాశిస్తావు' అని వరమిచ్చాడు. ఈశ్వరుడి అనుగ్రహం వల్ల చంద్రుడికి పదహారు కళలు లభించాయి. సకల ప్రాణులకూ సంతోషం కలిగింది.





# కుజుడు (అంగారకుడు)



అంగారకుడు ఉగ్ర స్వభావుడు. అధిపతి కుమారస్వామి. పురుష గ్రహం, రుచి చేదు, జాతి క్షత్రియ, అధిదేవత పృధ్వి, దిక్కు దక్షిణం, తత్వం అగ్ని, ప్రకృతి పిత్తము, ఋతువు గ్రీష్మం, లోహములలో ఇనుము, ఉక్కు రత్నము పగడము, గ్రహ సంఖ్య ఆరు, భావరీత్యా దశమస్థానంలో స్థానబలం కలిగి ఉంటాడు. గుణం తమో గుణం, ప్రదేశం కృష్ణానది మొదలు లంక వరకు. అంగారకుడు మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాలకు అధిపతి. శరీరావయావలలో ఎముకలో మజ్జ, కండరాలు, బాహ్యంలో జ్ఞానేంద్రియాలు. అంగారకునికి సూర్యుడు, చంద్రుడు, గురువు మిత్రులు, శత్రువు బుధుడు, సములు శుక్రుడు, శని.

## అంగారకుడి ప్రభావం

అంగారక ప్రభావితులు పొడుగుగా దృఢంగా ఉంటారు. బంధువులంటే అపార ప్రేమ కలిగి ఉంటారు. అదుపు చేయలేని ఆవేశ పరులు. విపరీత బంధు ప్రీతి కలిగి ఉంటారు. అధికారం, పదవి, సేవకులను కలిగి ఉంటారు. యంత్రములు, ఆయుధములు మొదలైన వాటిలో శిక్షణ పొందుటలో ఆసక్తుడు. అధిక దానధర్మములు కలిగి ఉంటారు.

## అంగారకుడి రూపు రేఖలు

అంగారకుడు ఎర్రని మేనిఛాయ కలవాడు. సన్నని నడుము, కండలు తిరిగిన శరీరం, వంకీల జుట్టు కలవాడు. వయసు పదహారు. ఎర్రని వస్త్రధారణ, శంఖం వంటి మెడ, వాహనం పొట్టేలు, ఆయుధం శూలం, మంగళప్రధమైన రూపము.

## కుజదోష నివారణకు పరిహారం

కుజ దశ ఏడు సంవత్సరాలు కనుక కుజుడికి అధిపతి అయిన కుమారస్వామి అష్టకం ఏడుసార్లు పారాయణం చేయాలి. సుబ్రహ్మణ్య ఆలయ స్తుతి దర్శనం చేయాలి. షష్ఠి, సుబ్రహ్మణ్య షష్ఠి, సుబ్రహ్మణ్య జననం జరిగిన కృత్తికా నక్షత్రం రోజున సుబ్రహ్మణ్య స్వామికి ఆవుపాలతో అభిషేకం చేయాలి. సంతానం లేని దంపతులు ఏడు ఆదివారాలు కుమార స్వామి ఆలయానికి ప్రదక్షిణ చేయాలి. ఎర్రని పుష్పాలమాలతో సుబ్రహ్మణ్య స్వామిని పూజించాలి. కుజుని అధిపతి అయిన సుబ్రహ్మణ్య స్వామికి ఉపవాసం ఉండి కందిపప్పు, బెల్లంతో చేసిన పదార్థాలను నైవేద్యం పెట్టాలి. కార్యాలయాల్లో సుబ్రహ్మణ్య స్వామిపటం ఉంచి ధూప దీప నైవేద్యములు సమర్పించి కార్యక్రమాలు ప్రారంభించాలి. మంగళవారాలు సుబ్రహ్మణ్య

స్వామి ఆలయాలను దర్శించుట చేయాలి. ఎర్రని వస్త్రాలను, ఎర్రని పండ్లను సుబ్రహ్మణ్య స్వామి ఆలయంలో దానం చేయాలి. స్త్రీలు ఎర్రని వస్త్రధారణ, పగడపు ఆభరణాలు ధరించి చేసి దుర్గాదేవిని పూజించుట, అమ్మవారికి ఎర్రని పూలను మాలలను సమర్పించి కుంకుమపూజ చేయాలి. దుర్గా దేవిని స్తుతించాలి. మంగళ వారాలు దుర్గాదేవి ఆలయదర్శనం చేసి ప్రదిక్షిణం చేసి స్తుతించి పూజించాలి. గణపతి స్తోత్రం చేయాలి. ఆంజనేయ స్వామి దండకం స్తుతి చేయాలి. బలరామ ప్రతిష్ఠిత నాగావళీ నదీతీర పంచ లింగాలను దర్శించాలి. మంగళ వారాలాలలో సింధూరవర్ణ ఆంజనేయ స్వామి దర్శనం, ప్రదిక్షిణం, స్తుతి చేయాలి. మంగళవారం లేక కృత్తికా నక్షత్రం రోజున కుజుడికి శివాలయం లేక సుబ్రహ్మణ్యస్వామి ఆలయంలో ఏడు వేల కుజ జపం చేయించి ఎర్రని వస్త్రంలో కందిపప్పు మూట కట్టి దక్షిణ తాంబూలాదులతో బ్రాహ్మణులకు దానం ఇవ్వాలి. ఏడు మంగళ వారాలు కుజుడికి ఉపవాసం ఉండి కుజ శ్లోకం డెబ్భై మార్లు పారాయణం చేసి ఏడవవారం కందులు దానం ఇవ్వాలి. నానవేసిన కందులను బెల్లంతో కలిపి ఆవుకు తినిపించాలి. కోతులకు తీపి పదార్ధములు పెట్టాలి, ఎర్రమి కుక్కకు ఆహారం పెట్టాలి. మంగళ వారం రాగిపళ్ళెంలో కందిపప్పు పోసి దక్షిణ తాంబూలాలతో యువకుడికి దానం ఇవ్వాలి.

## భావాలు పరిహారం

కుజుడు కటకంలో నీచ స్థితి పొందుతాడు. కటకం లగ్నం నుండి పన్నెండు భావాలలో ఉన్నప్పుడు ఆయాభావాలకు సంబంధించిన సమస్యలు ఉంటాయి కనుక వాటికి తగిన పరిహారాలు కింద ఇవ్వబడ్డాయి.

మొదటి భావం లేక లగ్నం కుజుడికి నీచ స్థానమైన కటకం అయి అందులో కుజుడు ఉంటే అబద్ధములు చెప్పకూడదు, దంతంతో చేసిన వస్తువులు వాడరాదు. దానం తీసుకోరాదు.

కుజుడు రెండవ స్థానంలో ఉండి అది కుజుడికి నీచ స్థానమైన కటకం అయిన ఎడల కంఠ సమస్యలు ఉంటాయి కనుక కృత్తికా నక్షత్రం రోజున సుబ్రహ్మణ్యస్వామిని సేవించి గంట, దీపం దానం చేయాలి. రెండవ స్థానం కటకం అయి అందు కుజుడు ఉన్న అది కుజుడికి నీచ స్థితి కనుక ధన సమస్యలు ఉంటాయి. పరిహారంగా ఎర్రటి చేతి గుడ్డను ఎప్పుడూ వాడుతుండాలి. ఏడు మంగళ వారాలు చిన్న పిల్లలకు బెల్లం గోధుమలతో చేసిన ఆహారం తినిపించాలి.

## కుజుడు అన్నదమ్ములకు చిహ్నం

మూడవ ఇంట కుజుడు ఉన్న సోదరులతో చిక్కులు ఉంటాయి కనుక పరిహారం కొరకు ఏనుగు దంతంతో చేసిన వస్తువును ఇంటికి దక్షిణంలో ఉంచి కుజుడిని ఆరాధించాలి. ప్రయాణాలలో జాగ్రత్త వహించాలి. ఇరుగు పొరుగుతో వివాదాలకు దూరంగా ఉండాలి. వెండి ఉంగరంలో పొదిగిన పగడపు ఉంగరం ఎడమ చేతికి ధరించవచ్చు.

నాగవ స్థానంలో కుజుడు ఉన్నప్పుడు కోతులకు, తల్లికి భోజనం పెట్టాలి. పంచదార వంటి తీపి పదార్థాల సంబంధిత వ్యాపారం చేయాలి.

పంచమ స్థానంలో కుజుడు ఉన్నప్పుడు రాగి పాత్రలో రాత్రి అంతా ఉంచిన నీటిని తెల్లవారిన తరువాత పచ్చని చెట్టుకు పోయాలి. ఇంటికి దక్షిణంలో వేప చెట్టు నాటాలి.

ఆరవ స్థానం రోగ, శత్రు స్థానం కనుక కుజ స్తోత్రం చదువుకోవాలి. తుప్పు పట్టిన ఇనుప వస్తువులను ఇంట్లో ఉంచరాదు.

ఏడు స్థానంలో కుజుడు ఉన్న భార్యాభర్తల మధ్య వివాదాలు ఉంటాయి కనుక పరిహారంగా శిరః స్నానమాచరించి ఇంటికి దక్షిణ

భాగంలో మూడు వత్తులతో దీపం వెలిగించి కుజుడి స్తోత్రం, సుబ్రహ్మణ్య అష్టకం పారాయణం చేయాలి. కంది పప్పుతో చేసిన ఆహారం తీసుకుంటే ధన సమస్యలు తీరి భార్యాభర్తల మధ్య అనుకూలత కుదురుతుంది.

ఎనిమిదవ స్థానం ఆయుషు స్థానం స్త్రీలకు మాంగల్య స్థానం కనుక సుబ్రహ్మణ్య, దుర్గ, ఆంజనేయ, గణపతి, శివులకు విశేష పూజలు చేయాలి.

తొమ్మిదవ స్థానం అందు కుజుడు నీచమైనందున, పెద్దవారిని గౌరవించడం, వెండితో పొదిగిన పగడపు ఉంగరం ధరించడం చెయ్యాలి.

పదవ స్థానం అందు కుజుడు నీచమైనందున కార్యాలల్లో సుబ్రహ్మణ్య స్వామిని ఉంచి ధూపదీప నైవేద్యాలు సమర్పించి కార్యాలు మొదలు పెట్టాలి.

పదకొండవ స్థానం లాభస్థానం, అన్నతో పేచీలు ఉంటాయి. మట్టి పాత్రలో సింధూరం లేక తేనె ఉంచిన దోష పరిహారం అవుతుంది.

వ్యయ స్థానం కుజుడు నీచమైనందున తేనె త్రాగుట, సుబ్రహ్మణ్య ఆరాధన చెయ్యాలి.

## ద్వాదశ రాశులలో కుజుడు

**మేషరాశి :** కుజుడు మేషరాశిలో ఉన్నప్పుడు కార్యోత్సాహము, ధైర్యము, దుడుకుతనము, సున్నిత మనస్కులై ఉంటారు. అధికారులుగా వీరు రాణిస్తారు. వీరు ఏ కార్యమైనా కొంచము ఆలోచించి ప్రారంభించాలి.

**వృషభరాశి :** కుజుడు వృషభరాశిలో ఉన్నప్పుడు దుబారా ఖర్చులు చేసే మనస్తత్వము, విలాసముల అందు ఆసక్తి కలిగి ఉంటారు. వీరు పొదుపు విషయంలో అత్యధిక ప్రాధ్యానత ఇవ్వాలి.

**మిధునరాశి :** మిధునరాశిలో కుజుడున్న బుద్ధిమంతులైన సంతానం కలుగుతుంది, ఇతరులలోని లోపాలను ఎంచుతారు, వాదోపవాదాలకు

ముందు ఉంటారు, ఇతరులు అన్న ప్రతిమాటను వ్యతిరేకిస్తారు, ఉద్రేక పూరిత మనస్కులై ఉంటారు. వాదోపవాదాలను అదుపులో ఉంచుకుని ప్రవర్తిస్తే అధికారులుగా రాణించగలను.

**కటకరాశి :** కుజుడు కటకరాశిలో ఉన్న వ్యక్తి అస్థిర మనస్తత్వము కలిగి ఉంటాడు. మానసిక ఆవేదనకు లోనౌతూ ఉంటాడు. ఉద్రేక పూరితుడుగా ఉంటాడు.

**సింహరాశి :** సింహరాశిలో కుజుడున్న భూదేవికి ఉన్నంత ఓర్పు వహిస్తారు. ఓర్పు హద్దులుదాటిన సమయాన అమీ తుమీ తేల్చుకుంటారు. చక్కగా ఓర్పుతో శ్రమించి కార్యాచరణ చేస్తారు.

**కన్యా రాశి :** అత్యధిక ఆత్మవిశ్వాసం కలిగి ఉంటారు. ఇతరులను ఒక పక్షాన నమ్మరు. ఇతరుల చిన్న లోపాలను అధికంగా చూస్తారు. ఉద్రేకపూరిత మనత్వం కలిగి ఉంటారు. ఇతరుల సలహాలను పెడచెవిన పెడతారు.

**తులారాశి :** తులారాశిలో కుజుడున్న వ్యక్తి భాగస్వామిని ప్రేమిస్తారు. భాగస్వామి మీద ఆధిపత్యం వహిస్తారు.

**వృశ్చికరాశి :** వృశ్చికరాశిలో కుజుడున్న వ్యక్తి కార్యసాఫల్యత ఎలాగైనా సాధిస్తారు. కార్యాలలో కొంత గందరగోళం సృష్టించుకుంటారు కనుక కార్యాలను క్రమపద్ధతిలో ఏర్పరచుకుని చేసిన సత్ఫలితాలను పొందవచ్చు. మొదలు పెట్టిన కార్యాలు ముగిసే వరకు ఆందోళన పడతారు. కనుక మనసును కుదుట పరచుకోవడము అలవాటు చేసుకుంటే ఆందోళన తగ్గించుకోవచ్చు. గుండె బలము కండబలము ఎక్కువగా ఉంటుంది. కనుక అన్నిటా ధైర్యసాహసాలు ప్రదర్శించి దూకుడు చూపుతారు కనుక వెనుకా ముందు ఆలోచించి వ్యవహారలలో తల దూర్చాలి.

**ధనస్సు రాశి :** ధనస్సు రాశిలో కుజుడున్న వారికి ఆత్మవిశ్వాసం ఎక్కువ. ఇతరుల నైపుణ్యాల మీద విశ్వాసం తక్కువ కనుక ఇతరుల నైపుణ్యాలను

గుర్తించడం అలవాటు చేసుకోవాలి. వ్యవహారలను చక్కదిద్దటంలో వీరు సామర్థ్యం కలిగి ఉంటారు.ఎటువంటి సమస్యలకైనా అందరికీ ఆమోద యోగ్యమైన సూచనలను ఇవ్వకలిగిన సామర్థ్యం వీరికి ఎక్కువ. కుల పెద్దలుగా, సంఘాలకు మొదలైన వాటికి అధ్యక్షులుగా వీరు రాణిస్తారు. అనాథల మీద జాలి కలిగి ఆదరించడంలో వీరు ముందు ఉంటారు. ఆధ్యాత్మిక విశ్వాసం భక్తి ఎక్కువ దైవకార్యాలు గుడులను కట్టడం లాంటి కార్యాల మీద మక్కువ కలిగి ఉంటారు. మాతృదేశం, మాతృభాష లాంటి విషయాల మీద మక్కువ ఎక్కువ. పాత సంప్రదాయం అంటే మక్కువ ఉంటుంది. ఆధునిక భావాలకు దూరంగా ఉంటారు. వారి అభిప్రాయాల పట్ల దృఢమైన విశ్వాసం కలిగి ఉండి ఎటువటి పరిస్థితిలో కూడా త్వరగా వారి అభిప్రాయాలను మార్చుకోరు. ఉద్రేకపూరితులై ఉంటారు. ఎంతటి వారినైనా ధైర్యంగా ఎదుర్కొంటారు, ఎవరికి తలవంచరు.



**మకరరాశి:** మకరరాశిలో కుజుడున్న వారు అధిక జనప్రియులై ఉంటారు. వీరికి నాయకత్వ లక్షణాలు ఎక్కువ. ఇతరుల పనులను ఎంతటి శ్రమకు ఓర్చి అయినా సాధించడంలో విజయం సాధిస్తారు. ఏ మార్గంలోనైనా కార్యాలను సాధిస్తారు. ధైర్యసాహసాలు ఎక్కువ. నాయకత్వ లక్షణాలు ఎక్కువ. వ్యసనాలు అలవడితే వీరు ఒకంతట వదుల్చుకోలేరు కనుక వ్యసనాలకు దూరంగా ఉండడానికి ప్రయత్నం బాగా చేయాలి. సమాజంలో పేరు ప్రతిష్ఠలు అధికంగా ఉంటాయి. వీరు ఇతరుల పనులను అత్యంత చాకచక్యంగా సాధించి పెట్టడమే కాక పారితోషికము కూడా తగినంత తీసుకుంటారు.

## ద్వాదశ స్థానములలో కుజుడు

లగ్నములో కుజుడు ఉన్న జాతకుడు క్షతగాత్రుడు, క్రూరుడు, అల్పాయుష్మంతుడు, సాహసిగా ఉంటాడు.

ద్వితీయస్థానములో కుజుడు ఉన్న జాతకుడు కురూపి, ధనహీనుడు, దుష్టుల మీద అధారపడి జీవించేవాడు అవుతాడు.

తృతీయస్థానమున ఉన్న జాతకుడు ధనవంతుడు, ధైర్యశాలి, సుఖవంతుడు, సోదరులు లేనివాడు, జయించశఖ్యం కాని వాడు అవుతాడు.

చతుర్ధస్థానమున కుజుడు ఉన్న జాతకుడు మిత్రులు లేనివాడు, మాతృహీనుడు, గృహము లేనివాడు, సుఖము లేనివాడు, వాహన లేనివాడు అవుతాడు.

పంచమ స్థానములో కుజుడు ఉన్న జాతకుడు సుఖము లేని వాడు, సంతానం లేనివాడు, అల్పమేధావి, సంపద పోగొట్టుకున్న వాడు ఔతాడు.

షష్టమ స్థానమున కుజుడు ఉన్న జాతకుడు ధనవంతుడు, కీర్తికలవాడు, విజయుడు అవుతాడు.

సప్తమ భావములో కుజుడు ఉన్న జాతకుడు దుశ్చరిత్రుడు, వ్యాధి పీడితుడు, వృధాగా తిరుగువాడు, కళత్రహీనుడు అవుతాడు.

అష్టమ భావములో కుజుడు ఉన్న జాతకుడు అంగవైకల్యం కలవాడు, నిర్ధనుడు, అల్పజీవి, ప్రజల చేత నిదించబడువాడు అవుతాడు.

నవమ స్థానమున కుజుడు ఉన్న జాతకుడు రాజమిత్రుడు, పితృహీనుడు, ప్రజల చేత ద్వేషించబడువాడు, జనఘాతకుడు అవుతాడు.

దశమ స్థానమున కుజుడు ఉన్న జాతకుడు క్రూరుడైన రాజు అవుతాడు.

ఏకాదశమున కుజుడు ఉన్న జాతకుడు విశాలహృదయుడు, ప్రజల చేత మన్ననలు అందుకొనువాడు అవుతాడు.

ద్వాదశమున కుజుడు ఉన్న జాతకుడు ధనవంతుడు, ధైర్యశాలి, సచ్చరిత్రుడు, శోకహీనుడు అవుతాడు.

# కుజ దోషము-నివారణ



కుజుడు ఉష్ణ ప్రకృతి గల గ్రహము. దీనిని పాపగ్రహముగా చెప్ప బడును. వివాహము మరియు వైవాహిక జీవితములో కుజుని యొక్క అశుభ ప్రభావము అధికముగా కనిపించును. కుజ దోషము కలవారిని మాంగలీకునిగా చెప్పబడును. ఈ గ్రహ దోషము కారణముగా అనేక మంది స్త్రీ పురుషులు జీవితాంతము అవివాహితులుగా వుండిపోయెదరు. ఈ దోషము వలన గల భయమును తొలగించుటుకొనుటకు దీని గురించి పూర్తిగా తెలుసుకొనుట అవసరము.

మన పురాణాలలో కుజ గ్రహంను,అంగారకుడు అని, మంగళుడు అనే నామాలు ఉన్నాయి. అలాగే కుజుడు భూమి పుత్రుడు అని కూడా అంటారు. ఒకసారి కుజుడు తన తల్లితండ్రుల అనుమతి తీసుకొని

వినాయకుడి గురించి తపస్సు చేయడానికి నర్మదా నది తీరంలో ఒక ప్రదేశంను ఎంచుకొని నిరాహారంగా 1000 సంవత్సరాలు గణపతి గురించి తపస్సు చేసినాడు. అలా 1000 సంవత్సరాలు కుజుడు తపస్సు చేసిన తరువాత మాఘ బహుళ చవితి చంద్రోదయం నాడు వినాయకుడు ప్రతక్ష్యమయ్యాడు. అలా ప్రత్యక్ష్యమైన వినాయకుడు ఎలా ఉన్నాడు అంటే దశా భుజాలు కలిగి బాలుడిగా ఉన్నాడు. అదే విధంగా వినాయకుడి తలమీద ఒక చంద్ర వంక కూడా ఉన్నది .

వినాయకుడు, అంగారకుడుతో ఇలా అన్నాడు. “నీ తపస్సుకు మెచ్చితిని నీకు ఏమి వరం కావాలో కోరుకో”మన్నాడు. అప్పుడు అంగారకుడు ఎంతో సంతోషించి ఆ వినాయకుడిని ఎన్నో విధములుగా స్తుతించాడు. అలా ప్రతక్ష్యమైన వినాయకుడ్ని అంగారకుడు తనకు “అమృతం” కావాలని, అదే విధంగా నేను ఎప్పుడు నీనామ స్మరణ చేస్తుండాలని అని వరమియమని అంగారకుడు కోరుకొన్నాడు. అప్పుడు వినాయకుడు తథాస్తు అని దీవించి, నీవు ఎర్రని రంగులో ఉన్నావు ఎర్రని వస్త్రం కట్టుకొన్నావు, ఈ రోజు మంగళవారం. కనుక ఇక నుంచి నీవు మంగళుడు అని ఆపి పిలువబడతావు అని వరం ఇస్తున్నాను అని వినాయకుడు అంతర్ధానం అయ్యాడు. ఆ తర్వాత అంగారకునకు (మంగళుడు) అమృతం ప్రాప్తిస్తుంది. అమృతం సేవించిన తరువాత కుజుడు (మంగళుడు) ఒక ఆలయం కట్టించి అందులో వినాయకుడిని ప్రతిష్టించి, ఆ వినాయకునికి శ్రీ మంగళమూర్తి అని పేరు పెట్టాడు. ఈ ఆలయం ఇప్పటికి మన భారత దేశంలో ఉంది అంటారు. అదేవిధంగా వినాయ కుడు ఇంకొక వరం కుజుడికి ప్రసాదించాడు. ఎవరైతే అంగారక చతుర్ధి



రోజు (బహుళ చతుర్ధి, కృష్ణ పక్షంలో వచ్చే చతుర్ధి లేదా పౌర్ణమి తర్వాత వచ్చే చతుర్ధిరోజు) మంగళవారం రోజున ఉపవాసం ఉండి వినాయకుడికి భక్తి శ్రద్ధలతో పూజచేస్తారో వారికి ఉన్న అన్ని కుజగ్రహ దోషాలు తొలగి పోతాయి అని వరం ప్రసాదించాడు. అలాగే వినాయకుడి అనుగ్రహం కూడా కలుగుతుంది. ఈ పూజా ఫలం ఎటువంటిది అంటే ఒక సంవత్సరం సంకష్టి వ్రతం అంటే ఒక్క నెలలో ఒక చతుర్ధి వస్తుంది..అలా 12 నెలలు ఎవరు వ్రతం చేస్తారో? అలా చేయడం వల్ల ఎలాంటి పుణ్యఫలం వస్తుందో ఈ ఒక్క అంగారక చతుర్ధి రోజున చేసిన వినాయకుడి వ్రతంవల్ల కలేగే ఫలితం సమానం..అలాగే అన్ని దోషాలు,ముఖ్యంగా కుజ దోషాలు సంపూర్ణంగా నివారించబడతాయి.

'ఇంత వయసు వచ్చినా ఆ అమ్మాయికి ఇంకా పెళ్లి కాలేదా" ? అనే ప్రశ్న వినిపించిన వెంటనే, "ఆ అమ్మాయికి కుజ దోషం ఉందట" అనే సమాధానం వినిపిస్తూ వుంటుంది. ఇక ఈ మాట విన్న వాళ్లంతా కుజ దోషం అంత భయంకరమైనదా? అని అనుకోవడం సహజం. అయితే కుజదోషం గురించి అంతగా భయపడవలసిన పనిలేదు. అది పరిహారం లేనంత పెద్ద సమస్యకూడా కాదు. కొన్ని గ్రహాలతో కలిసి వున్నప్పుడు కుజుడు కూడా మేలు చేస్తాడనే విషయం చాలా మందికి తెలియదు.

## కుజ పుట్టుక

భరద్వాజ మహర్షి ఓ సౌందర్యవతిని చూడటం వలన ఆయన మనసు అదుపు తప్పి 'రేతస్సు' భూమిపై పడింది. 'మంగళుడు' అనే పేరుతో ఆ శిశువు భూదేవి ఆలనా పాలనలో పెరిగాడు. అగ్నికి సమానమైన తేజస్సు కలిగినవాడు కాబట్టి అంగారకుడిగా ప్రసిద్ధి చెందాడు. విపరీతమైన కోపం, అనుకున్నది సాధించేంత వరకూ నిద్రపోని పట్టుదల కుజుడి లక్షణాలుగా చెప్పబడ్డాయి.

ఇక జాతకంలో కుజుడు శుభస్థానంలో వున్నాడా? లేక దోష స్థానంలో ఉన్నాడా? అనేది ముందుగా చూసుకోవాలి. కుజదోషం వుంటే అది ఏ స్థాయిలో ఉందో ... అది తన ప్రభావాన్ని ఎప్పుడు చూపిస్తుందనే విషయాన్ని కూడా అడిగి తెలుసుకోవాలి. ఇక కుజ దోషం వుందని చెప్పినా విచారంలో మునిగిపోవలసిన అవసరం లేదు. ఎందుకంటే ఈ దోషం ప్రభావం అందరికీ ఒకేలా వుండదు. అది ఉన్న స్థానాన్ని బట్టి తీవ్రత ... ఫలితం మారుతూ వుంటుంది. ఇక మేషం – వృశ్చిక రాశులలో పుట్టిన వారికి కుజదోషం వర్తించదని 'జ్యోతిష్ గ్రంధ్' అనే ప్రాచీన కాలంనాటి గ్రంథం చెబుతోంది. కుజ దోషం వున్నవారు భూమాతను, సుబ్రహ్మణ్య స్వామిని కొలవడం వలన, అంగారకుడి అనుగ్రహం లభిస్తుందని తెలుస్తోంది. అలాగే మంగళవారాల్లో దేవాలయాల్లో దీపారాధన చేయడం, పగడాన్ని ధరించడం పరిష్కార మార్గాలుగా చెప్పబడుతున్నాయి. ఇక దోషం ఎంత బలంగా ఉన్నా డీలాపడి పోవలసిన పనిలేదు. ఎందుకంటే అన్ని దోషాలకు విరుగుడు ఆ సర్వేశ్వరుడి అనుగ్రహమే అనడంలో ఎలాంటి సందేహం లేదు.

ఆంజనేయస్వామి ఉపాసన వల్ల జాతకంలోని దోషాలు కూడా చాలా వరకు తొలగిపోతాయి. మంగళ, శనివారములు 'మారుతి' కి పరమ ప్రీతికరమైన దినములు అని చెబుతారు. విశేషించి కుజ దోషం గల ఆడపిల్లలు, వివాహంకాని వారు, భర్తచే అనాదరణకు గురైన స్త్రీలు, భర్తతో తగవు, ఎడబాటు కలవారు తమలపాకులతో హనుమంతుని పూజించి, అప్పాలు నివేదించి 'సిందూరం' నొసట ధరించడం వల్ల మేలు కలుగుతుంది.

## కుజ దోషం పరిహారాలు

ఎరుపుకి, ఇనుములోని శక్తికి అధిపతి అయిన కుజుడు గ్రహ రాజ్యంలో సైన్యాధ్యక్షుడు అని జ్యోతిషంలో శాస్త్రజ్ఞులు చెప్పారు. వినయంగా నమస్కరించే వారికి కోరికలు తీర్చే కల్ప వృక్షం కుజుడు. మంగళవారము కుజునకు చెందినది. ఎరుపు వర్ణము కలిగి, ఎరుపు వస్త్రములు ధరించి, శంఖంలాంటి మెడ, సుందరమైన పాదాలు, పొట్టేలు వాహనము, చేతిలో శులాయుధం కల మంగళుడు నిజంగా మంగళ ప్రదాయుడే. కేవలం గ్రహాల మంచివి అయినా, చేదు అయినా వాని పేరు బట్టి నిర్ణయించకూడదు. కొన్ని అంశములు, వాటి స్థితి గతుల



బట్టి నిర్ణయించాలి. కేవలం కుజుడే కాదు, ఏ గ్రహము అయినా శుభ, అశుభ ఫలితములు కలిగి ఉంటాయి.

మరి వివాహ విషయములో కుజగ్రహ దోషము గురించి ప్రత్యేకంగా ఎందుకు చెప్తారు అంటే... స్త్రీల జాతకములో కుజుని స్థానం బట్టి వరుని పరిగణిస్తారు. మాంగల్యం అనే సౌభాగ్యము స్త్రీలకు సంబంధించినది కావటంవల్ల కుజదోషం వివాహాల విషయంలో చూడటం సంభవిస్తున్నది. మరి ఈదోషం పురుషులకు కూడా ఉంటుంది. కుజదోషం కల స్త్రీకి కుజదోషం కల పురుషునికి వివాహం చేస్తే సరిపోతుందని అనుకుంటున్నారు, జాతక పొంతనాలు చూడకుండ చేసిన సరికాదు. ఇక్కడ వివాహ కారకుడు అయిన శుక్రుడు కుజునికి శత్రువు. శాస్త్రరీత్యా వివాహ కారకుడు అయిన శుక్రుడు ప్రమాద రహిత స్థానాలలో ఉండుట ఉత్తమం.

## కుజ దోషంగా చెప్పబడే స్థానాలు

రెండవ ఇంట, నాలుగవ ఇంట, ఏడవ ఇంట, ఎనిమిదవ ఇంట, పన్నెండవ ఇంట కుజుడు ఉండకూడదని. కాని కుజనక్షత్రాలలోగాని, రాశులలోగాని, ఉచ్ఛ రాశులలోగాని, కుజ దోషం ఉండదు. అలాగే బుధ, రవి, గురు దృష్టులు (చూపు) ఉంటె దోషము ఉండదు. అవి పరిశీలించి, జాతక పొంతనలు చూసి వివాహము చేయాలి. అలా చేయనిచో భార్య, భర్తల అన్యోన్యత లోపించుట, తరచుగా కలహాలు, భర్తకు నీచ సంబంధములుండుట, దాంపత్య సుఖము లోపించుట, భర్త నిర్వహించాల్సిన బాధ్యతలకు దూరంగా సన్యాసి మనస్తత్వము కలిగి ఉండుట, సంతాన హీనత , దుర్వ్యసనం, సంసారంలో అనేక లోపాలు ఉంటాయి కాబట్టి కుజ దోషం గురించి వివాహాలలో తరచి చూడటం

జరుగుతుంది. ఏయే గ్రహాలతో ఉంటె ఏయే ఫలితాలోకూడా చెప్ప బడింది. వీటి గురించి అనేక పరిహారాలు శాస్త్రం నందు చెప్పబడినాయి కావున భయపడవలసిన అవసరం లేదు. ఈ పరిహారక క్రియలు సమస్య యొక్క స్వరూపం బట్టి, జాతక పరిశీలన చేసిన తరువాత చేయవలసి ఉంటుంది. ఈ పరిహారాలు అందరికి ఒకేవిధంగా ఉండవు. ఈ పరిహారాలు ఎవరికీ వారు ఆచరిస్తేనే మంచిది. ఆ వ్యక్తి చేయలేని పరిస్థితిలో ఇంకా ఎవరైనా వారి బదులు చేయవచ్చు. పరిహరక క్రియ ఏదైనా మనస్సు కేంద్రీకరించటం, నమ్మకము, విశ్వాము, భగవంతునికి సంపూర్ణ సమర్పణ ఉండాలి. భగవంతుడే ఈ క్రియలు జరుపుతున్నాడన్న భావన రావాలి. ఎవరికీ ఏది వీలు అయితే దాని ఆచరించవచ్చు.

## వివిధ భావాలలో కుజదోషం ఉంటే తీసుకోవలసిన జాగ్రతలు

**భావము 1 :** వీరు అబద్ధములు ఆడకూడదు, దంతముతో చేసిన వస్తు వులు ఇంటిలో ఉంచరాదు, ఏ వస్తువైనా దానంగా తీసుకొరాదు.

**భావము 2 :** వీరు ఆర్థిక బాధలతో బాధలు పడుతుంటే (కుజుడు బల హీనుడు అయితే) ఒక ఎర్రరుమాలు జేబులో ఉంచుకోవాలి, ఆరు మంగళ వారాల పాటు చిన్నపిల్లలకు బెల్లము, గోధుమతో చేసిన తీపి పదార్థములు తినిపించాలి.

**భావము 3 :** వీరు ప్రయాణాలలో జాగ్రతలు పడాలి, పొరుగు వారితో గొడవలు పెట్టుకోరాదు, వెండి ఉంగరంలో పగడం వేసి ఎడమ చేతికి ధరించాలి.

**భావము 4 :** వీరు పంచదార, తీపి వ్యాపారము చేయాలి, కోతులకు, సాధువులకు, తల్లిగారికి భోజనములు పెట్టాలి.

**భావము 5 :** వీరు రాగి చెంబులో నీరు పోసి నిద్రిచే ముందు తల వైపు పెట్టుకుని, ఉదయమే అనీరు పచ్చని చెట్టులో పోయాలి. వేప చెట్టు దక్షిణం వైపు నాటాలి.

**భావము 6 :** అంగారక మంత్రము జపించాలి. ఇనుప వస్తువులు ఇంట్లో పెట్టుకోకూడదు, పడిన వస్తువులు ఇంట్లో ఉంచరాదు.

**భావము 7 :** మరదలు, పిన్ని, అక్క, చెల్లెలు, అత్తా వీరిని గౌరవించాలి, తీపి తినిపిస్తూ ఉండాలి, వారిచే తిట్టించుకో కూడదు.

**భావము 8 :** నాలుగు, ఆరు భావాల్లోని రెమిడీలు చేసుకోవాలి, విధవ స్త్రీల ఆశీర్వాదం తీసుకోవాలి.

**భావము 9 :** కుడిచేతి ఉంగరం వేలికి వెండి పగడపు ఉంగరము ధరించాలి, వదినగారిని గౌరవించాలి, ఎర్రగుడ్డ జేబునందు పెట్టుకోవాలి, అన్నగారు చెప్పినవి చేయాలి.

**భావము 10 :** ఆఫీసులో కాని, వ్యాపార స్థలమునందు కాని సుబ్రహ్మణ్య స్వామీ ఫోటో తగిలించండి. పగడము ఉంచండి, పాలు పొంగి పొయ్యిలో పడనీకండి.

**భావము 11:** చిన్న మట్టి పాత్రలో తేనె కాని, సిందూరంకాని వేసి ఉంచండి.

**భావము 12 :** ఉదయము పరగడుపున తేనె తాగండి, సుబ్రహ్మణ్య స్వామీ ఫోటోకు ధూప, దీప, నైవేద్యములు సమర్పించండి.

## అన్ని రోజులు పాటించవలసిన నియమములు

విధి విధానంగా చేయించుకున్న అంగారక యంత్రాన్ని ఇంట్లో పూజగదిలో ఉంచుకొని ఎర్రని పూలతో పూజిస్తూ "కుంకుజాయ నమః" లేదా "ధరణి ఘర్భ సంభూతం విద్యుత్ కాంతి సమప్రభం కుమారమ శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యాహం" లను గాని జపించు కోవాలి. అన్ని రకాల కుజ సంబంధ దోషాలు నివారించ బడతాయి. అసలు కుజదోషం అంటే ఏంటో తెలుసుకుందామా?

ఒకరి జాతకంలో మాత్రమే కుజదోషం ఉంటే కష్టనష్టాలు కలుగు తాయి. ఇందులో భాగంగా... పురుషులకు 2, 12 స్థానాల్లోనూ, స్త్రీ

లకు 4, 7 స్థానాల్లోనూ... ఒకవేళ ఇద్దరికీ ఎనిమిదో స్థానంలో కుజుడు ఆధిపత్యం వహించినట్లైతే కుజదోషం తప్పకుండా ఉంటుందని జ్యోతిష్కులు అంటున్నారు.

వధూవరులకు కుజదోషం లగ్నం నుండి, చంద్రుని నుండి, శుక్రుని నుండి 1, 2, 4, 7, 8 మరియు 12 స్థానాలలో అంగారకుడు ఉన్నట్లైతే... అలాంటి దంపతులు దీర్ఘకాలం సుఖసంతోషాలతో జీవిస్తారు. సంతాన సంపత్తి కూడా కలుగుతుంది.

అయితే ఒకరి జాతకంలో కుజదోషం ఉండి, మరొకటి జాతకంలో లేనివారికి వివాహం జరిపిస్తే ఆ దాంపత్యం చిరకాలం వర్ధిల్లదు. పుత్ర నాశనం, మరణ భయం కలుగుతుంది. వధూవరులిద్దరికీ కుజదోషం అనేది ఉంటే మంచిదే. దీనివల్ల శుభాలు కలుగుతాయని జ్యోతిష్కులు అంటున్నారు.

ప్రధానంగా వరుని జాతకంలోని కుజదోషం వధువుకి, వధువు జాతకంలోని కుజదోషం వరునికి కీడు కలుగుతుందని అభిప్రాయం. అయితే వధూ వరులు ఇద్దరికీ కుజదోషం ఉన్నట్లైతే దోష పరిహారం జరిగి శుభం చేకూరుతుంది. ఈ విషయంలో వధూవరులిద్దరికీ జాతకంలో సమపాళ్లలో దోషమున్నట్లైతేనే వివాహం చెసుకోవచ్చునన్న అభిప్రాయం ఉంది. ఈ దోషం స్త్రీలకు మాత్రమే ఉన్నట్లైతే దాంపత్య కలహం వంటి అనేక దుష్పరిణామాలు చోటు చేసుకోగలవని జ్యోతిష శాస్త్రవేత్తల అభిప్రాయం.

అష్టమ స్థాన కుజదోషం వున్నవారు ..... ధను, మీన రాశులలో లేక లగ్నాలలో జన్మించి వుంటే.... వారికి అష్టమ స్థాన కుజదోషం వర్తించదు. ఈ కుజదోషమనేది జన్మ లగ్నం నుంచే వుంటుంది. జన్మ లగ్నం నుంచే లెక్కించాలి. చంద్రుడు ఉన్న రాశి నుంచి, శుక్రుడు ఉన్న రాశి నుంచి, కుజ దోష స్థానాన్ని చూడవలసిన అవసరం లేదు. ఆ విధంగా చూస్తే ప్రపంచంలో ఉన్న ప్రతి ఒక్కరికి జన్మలగ్నం నుంచి, చంద్రుడి నుంచి శుక్రుడి నుంచి కుజదోషం వుండి తీరుతుంది. ఇది సరియిన సక్రమమైన

వివరం కాదు అని కొందరి అభిప్రాయం. కేవలం జన్మ లగ్నం నుంచి మాత్రమే కుజదోషాన్ని లెక్కించాలి. ఇరవై ఏడు నక్షత్రాలలో జన్మించిన ఏ ఒక్కరూ కుజదోషం గురించి బెంగపడాల్సిన అవసరం లేనేలేదు.

కుజదోషం ఉంటే... పగడం, శని (ఏలినాటి శని) దోషానికి... నీలం, ఇలా ఎప్పుడు కూడా ధరించకూడదు. మీ జాతకానికి పగడం సరిపడకపోతే కొత్త సమస్యలు ఎదురవుతాయి. పగడం అనే రత్నం ఏ రకంగానూ కుజ దోషాన్ని తగ్గించదు. ఇక కుజగ్రహ కారకత్వములను పరిశీలిస్తే... కుజుడు శౌర్యము, యుద్ధ ప్రియుడుగా ఉంటాడని వారు చెబుతున్నారు.

కుజ, కుజునిగా పరిగణించబడే కుజాధిపత్య జాతకంలో జన్మించిన జాతకులు కఠిన కష్టాలను ఎదుర్కొన్నా... అంగారకుడిగా దోషం నుంచి శాంతి కలగాలంటే... రాగిని నైవేద్యం చేయడం ద్వారా తృప్తి పరుచ వచ్చునని జ్యోతిష్కులు అంటున్నారు. ఈ కుజగ్రహాధిపత్య జాతకులు విద్యుత్, వ్యవసాయం, మిలటరీ, పోలీసు రంగాల్లో రాణిస్తారు. గణితం కఠినమైన శిక్షలు ఇతరుల అంత సులభంగా నమ్మబోరు. వారితో స్నేహం అయిన చాలారోజులకే నమ్మటం చేస్తారు. తర్కశాస్త్రం, శస్త్రవిద్యలను అభ్యసించేవారుగా ఉంటారు. కుజదోషమున్న జాతకులు ఎరుపు వస్త్రంతో పాటు రాగి గింజలను నైవేద్యం చేసి తృప్తి పరచడం ద్వారా బలోపేతమైన సమస్యల నుంచి కాస్త విశ్రమించవచ్చునని జ్యోతిష్కులు వివరిస్తున్నారు.

కుజుడు ఉష్ణ ప్రకృతిగల గ్రహము. దీనిని పాప గ్రహముగా చెప్పబడును. వివాహము మరియు వైవాహిక జీవితములో కుజుని యొక్క అశుభ ప్రభావము అధికముగా కనిపించును. కుజ దోషము కలవారిని మాంగలీకునిగా చెప్పబడును. గ్రహదోషము కారణముగా అనేక మంది స్త్రీ పురుషులు జీవితాంతము అవివాహితులుగా వుండిపోయెదరు. 

# కుజగ్రహ దోష శాంతి విధానాలు



సుబ్రమణ్యస్వామి కుజుని అధిపతి కావున అయన షష్టి నాడు సుబ్రమణ్యాష్టకం ఏడు సార్లు పారాయణ చేయాలి. ఏడు మంగళ వారాలు ఉపవాసం ఉండి కుజ గాయత్రి డెభై సార్లు పారాయణం చేసి ఆఖరి వారము కందులు దానం ఇవ్వాలి.

కుజ శ్లోకం ప్రతి రోజు డెభై మార్లు పారాయణం చేయాలి. కుజ జపం చేయించి కందులు ఒకటింపావు కేజీలు ఎర్రని వస్త్రములో మూట కట్టి దక్షిణ, తాంబూలాలతో దాన మివ్వాలి.

స్త్రీలు పగడపు మాల, ఎర్రని వస్త్రాలు, ఎర్రగాజులు, కుంకుమ ధరించి ఎర్రని పూలతో పూజించాలి. ఎర్రని పండ్లు, ఎర్రని వస్త్రాలు దానం చేయటం అదియును సుబ్రహ్మణ్య స్వామి ఆలయంలో ఇచ్చిన మంచి ఫలితము కలుగుతుంది.

ఎడమ చేతి ఉంగరం వేలికి వెండిలో పొదిగిన పగడపు ఉంగరము ధరించాలి. సుబ్రహ్మణ్య ఆలయాలు స్తుతి, అష్టకాలు నిరంతరం చేయాలి.

ప్రతి రోజు సుబ్రహ్మణ్య, దుర్గ, గణపతి స్తోత్రాలు చేయచ్చు.

పిల్లలు లేని దంపతులు ఏడు ఆదివారాలు డెభై ప్రదక్షిణాలు చొప్పున చేయాలి.

షష్టి, సుబ్రహ్మణ్య షష్టి, కృత్తిక నక్షత్రం వచ్చిన రోజున ఏడు మంగళవారాలు ఆవు పాలతో అభిషేకం చేయాలి.

కుజ దోషం పరిహారార్థం బలరామ ప్రతిష్ఠిత పంచలింగాల క్షేత్ర దర్శనం (నాగావళి నదీ తీరంనందు).

కుజ కవచం, మంత్రం, స్తోత్రం, అష్టకం, అష్టోత్తరం, కుజ మంగలాష్టకం మొదలైనవి చేయాలి.

రామాయణంలో కుజ దశ అంతర్దశలకు పారాయణ ఘట్టాలు చెప్పబడినాయి.

**కుజదోషము నివారించుటకు రామాయణములో చేయదగు పారాయణ క్రమములు:** కుజదశలో కుజుని అంతర్దశకు....ఉత్తరకాండ ఇరవై ఆరవ సర్గ పారాయణ, కందిపప్పు, పొంగలి, బెల్లం నైవేద్యము.

కుజ దశలో రాహు అంతర్దశకు యుద్ధకాండ యాభై ఎనిమిదవసర్గ పారాయణతో తేనే, ఎండుద్రాక్ష నైవేద్యము సమర్పించాలి.

కుజ దశలో కేతు అంతర్దశకు యుద్ధకాండ నూట పదహారో సర్గ పారాయణము, ఖర్జూరం, కొబ్బరికాయ నైవేద్యము సమర్పించాలి.

కుజ దశలో శని అంతర్దశకు అరణ్యకాండ డెబ్బదవ సర్గ పారామయణతోపాటు నేరేడు, నల్లద్రాక్ష నైవేద్యము సమర్పించాలి.

కుజుదశలో బుధ అంతర్దశకు బాలకాండ పదహారవసర్గ పారాయణం, ఆకుపచ్చ ద్రాక్ష, తాంబూలం నైవేద్యంగా సమర్పించాలి.

కుజు దశలో గురు అంతర్దశకు సుందర కాండ యాభై ఒకటి సర్గ పారాయణం, అరటిపండ్లు నైవేద్యముగా సమర్పించాలి.

కుజ దశలో శుక్ర అంతర్దశకు సుందరాకాండ యాభై మూడు సర్గ పారాయణం, పటిక బెల్లం, కారెట్‌ను నైవేద్యంగా సమర్పించాలి.

కుజ దశలో రవి అంతర్దశకు బాలకాండ ఇరవై మూడవసర్గ పారాయణం, చామదుంప, కారెట్ నైవేద్యముగా సమర్పించాలి.

కుజదశలో రవి అంతర్దశకు బాలకాండ పదిహేడవ సర్గ పారాయణం, పాలు, పాయసం నైవేద్యముగా సమర్పించాలి.

## కుజ గ్రహ దోషానికి మామూలు పరిహారములు

సింధూరవర్ణ ఆంజనేయ స్వామికి ఏడు మంగళవారములు ప్రదక్షిణాలు చేయాలి.

ఎర్రని పుష్పాలమాల సుబ్రహ్మణ్య, ఆంజనేయ స్వామి గుడిలో స్వామివార్లకు అలంకరించాలి.

బెల్లం కలిపిన ఎర్రని కందిపప్పు గోవుకు తినిపించాలి.

మంగళవారము రోజున ఎర్రని కుక్కకు ఆహారం సమర్పించాలి.

స్త్రీలు ఏడు మంగళవారాలు ఏడుగురు ముత్తైదువులకు ఎర్రని పూలు, ఎర్ర జాకెట్, ఎర్ర గాజులు, ఎర్ర కుంకుమ, దానం చేయాలి.

ఎర్ర చందనం, కందులు, ఎర్ర మేక, దానిమ్మ పండ్లు ఎర్రని వస్త్రాలలో కట్టి వీలు అయితే సుబ్రహ్మణ్య స్వామి గుడిలో లేదా ఇంటి వద్ద అయిన సరే దానం ఇవ్వాలి.

కోతులకు తీపి పదార్థములు తినిపించాలి.

రాగి పాత్రలో నీరు తాగటం, రాగి పాత్రలు వాడటం మంచిది.

పొట్లకాయలు తరగటం, మంచిది కాదు.

రక్త దానము చేయుట చాల మంచిది.

అమ్మవారికి (దుర్గ) ఎర్ర చీర సమర్పించటం, నవగ్రహ గుడిలో కుజ విగ్రహం వద్ద ఎర్రపులతో పూజ, పగడ దానం, ఎర్ర రవికలగుడ్డ దానం మంచిది.

కుజుని అధిష్టాన దేవుడు సుబ్రహ్మణ్య స్వామికి ఉపవాసం ఉండి, కందిపప్పుతో చేసిన పదార్థాలు తినాలి.

రాగిపళ్ళెంలో కందులు, కందిపప్పు పోసి దక్షిణ తాంబూలంతో మంగళవారం మధ్యాహ్నాం ఒక యువకుడికి దానం చేయాలి.

కుజగ్రహం వల్ల కలిగే రోగములకు ఎర్రటి కుండలో అన్నం వండి, ఎర్రవస్త్రంలో మూట కట్టి, దాని మీద దీపం వెలిగించి రోగికి దిష్టి తీసి కుక్కలకు అన్నం పెట్టుట ద్వార రోగం నిదానిస్తుందని అంటారు. కానీ డాక్టర్ సూచనల మేరకు మందులు వాడుతూనే ఉండాలి.

కుజుడు అన్నదమ్ములకు కారకుడుగా చెప్తారు, మూడవ ఇంట్లో ఉంటె ఎన్నో చిక్కులు వస్తాయి. ఏనుగు దంతం వస్తువు ఇంట్లో దక్షిణం పక్క ఉంచి కుజుని ఆరాధించాలి.

ఏడు, ఎనిమిది స్థానాలలో కుజుడు ఉంటె డబ్బు ఉన్న సుఖము ఉండదు, అందుకని ఏడు మంగళవారాలు తలస్నానం చేసి దక్షిణ దిశలో మూడు వత్తుల దీపం వెలిగించి సాయంకాలాలు కుజ స్తోత్రము, సుబ్రహ్మణ్య పారాయణం చేయాలి. ఉపవాసం ఉండి కందిపప్పుతో తయారు చేసిన ఆహారము తీసుకుంటే భార్య భర్తలు కూడా సంతోషంగా ఉంటారు, సమయానికి డబ్బు అందుతుంది.

కుజుని వలన స్వర పేటికకు సంబంధించిన వ్యాధులు వస్తే మంగళ వారం, కృత్తిక నక్షత్రం రోజున సుబ్రహ్మణ్య స్వామిని పూజించి గంట, దీప దానము చేసిన సమస్య తొలగును.





చంద్ర గ్రహ ప్రభావంతో వచ్చే వ్యాధులు, అనారోగ్య సమస్యలు, వ్యాపారంలో నష్టాలకు ముత్యాన్ని ఆభరణంగా గాని లేదంటే ఉంగరంగా గాని ధరించాలి. ఉంగరం అయినట్లయితే వెండితో చేయించు కోవటం మంచిది.



# కుజ దోషములో పంచ భావములు

జన్మ కుండలిలో పంచ భావములు కుజునితో పాటు ఎంత క్రూరమైన గ్రహములుగా కూర్చొని వున్నవో కుజుడు అంతే దోష పూరితముగా వుండును. అనగా రెండవ భావము క్రూరముగా వుండిన రెండింతలు, నాల్గవ భావము క్రూరముగా వుండిన నాల్గింతలు. కుజుని పాప ప్రభావములు వేరు వేరు విధములుగా ఐదు భావములలో దృష్టి కలిగి వుండును.

**లగ్న భావములో కుజుడు** లగ్న భావము నుండి వ్యక్తి యొక్క శరీరము, ఆరోగ్యము, వ్యక్తిత్వము యొక్క విచారణ చేయబడును. లగ్న భావములో కుజుడు వున్న ఎడల వ్యక్తి క్రోధము మరియు ఉగ్ర స్వభావము కలవారై వుండును. ఈ కుజుడు వ్యక్తిని మొండిగాను మరియు ఎప్పుడూ గొడవపడే స్వభావము గలవాడుగా చేయును.

ఈ భావములో ఉపస్థితిలో వున్న కుజుని దృష్టి చతుర్ధ బావ దృష్టి సుఖ స్థానములో వుండిన ఎడల గృహస్థ సుఖములలో లోపము ఏర్పడ గలదు. **అష్టమ భావముపై** కుజుని యొక్క పూర్ణ దృష్టి జీవిత బాగస్వామికి సంఘటములను కలిగించును. ద్వితీయ భావములో కుజుడు భావదీపిక నామక గ్రహములో ద్వితీయ భావస్థ కుజుడు కూడా కుజదోషము వలన పీడించబడగలడు. ఈ భావము కుటంబము మరియు ధనమునకు స్థానముగా వుండును. ఈ కుజుడు కుటుంబము మరియు బంధుమిత్రులతో విరోధములను సృష్టించును. కుటుంబములో కలతలను ఏర్పరచి దాని కారణముగా భార్యాభర్తలలో అశాంతిని కలిగించును. ఈ భావము యొక్క

కుజుడు పంచమ భావము, అష్టమ భావము మరియు నవమ భావమును చూస్తున్నాడు. కుజుని ఈ భావములలో దృష్టి కారణముగా సంతాన పక్షములో విపరీత ప్రభావము కలుగును. భాగ్యము యొక్క ఫలితములు బలహీనపడును.

**చతుర్ధ స్థానములో** కూర్చొని వున్న కుజుడు సప్తమ, దశమ మరియు ఏకాదశ భావములను చూస్తున్నాడు. ఈ కుజుడు మంచి స్థాయి, సంపత్తిని ప్రధానించును కాని గృహస్థ జీవితమును కష్టమయముగా చేయును. కుజుని యొక్క జీవిత బాగస్వామి యొక్క గృహముపై వుండిన వైచారికమైన మతభేదములు కలిగి వుండెదరు. మతబేధములు మరియు ఇరువురి మధ్య అశాంతి కలిగి వుండుట వలన జీవిత భాగస్వామి యొక్క సుఖములలో లోపము ఏర్పడును. కుజ దోషము కారణముగా భార్యభర్తల మధ్య ఒడి దుడుకులు పెరిగి దూరముగా వుండవలసి వచ్చును. ఈ కుజుడు జీవిత భాగస్వామికి సమస్యలను కలిగించడు.

**సప్తమ భావములో కుజుడు** జీవిత భాగస్వామి యొక్క గృహముగా వుండును. భావములో కూర్చొని వున్న కుజుడు వైవాహిక జీవితము కొరకు అధికముగా దోషపూరితముగా వుండును. ఈ భావములో కుజ దోషము వుండుట కారణముగా జీవిత భాగస్వామి యొక్క ఆరోగ్యములో వొడిదుడుకులు వుండగలవు. జీవిత భాగస్వామి ఉగ్రముగాను మరియు క్రోధస్వభావము కలవారై వుండును.

ఈ కుజుడు లగ్న స్థానము, ధన స్థానము మరియు కర్మ స్థానముపై పూర్ణ దృష్టిని ప్రధానించును. కుజుని యొక్క దృష్టి కారణముగా ఆర్ధిక సంఘటము, వర్తక వ్యాపారములలో హాని లేదా దుర్గటనలు కలుగుట అవకాశములు వుండును. ఈ కుజగ్రహము చరిత్రపై కూడా కళంకములను తీసురావచ్చును. సంతానము యొక్క సందర్భములో కూడా ఇది కష్టకారిగా వుండును. కుజుని అశుభ ప్రభావము కారణముగా భార్యాభర్తల మధ్య ఒడి దుడుకులు ఏర్పడి వారు ఇరువురు విడిపోయే అవకాశములు ఏర్పడవచ్చును.

**అష్టమ భావములో కుజుడు** దు:ఖము, సంఘటము, ఆయువు యొక్క గృహముగా చెప్పబడుతున్నది. ఈ భావములో కుజుడు వైవాహిక జీవితము లోని సుఖములను నాశనము చేయును. అష్టమస్థ కుజుడు మానసిక పీడ మరియు కష్టములను ప్రదానించువాడగును. జీవిత భాగస్వామి యొక్క సుఖములో బాధలను కలిగించును. ధన భావములో దీని దృష్టి వుండుట కారణముగా ధనహాని మరియు ఆర్థిక కష్టము కలుగును. రోగముల కారణముగా దాంపత్య సుఖము బాధించబడును. జ్యోతిష్య విధానమునకు అనుసారముగా ఈ భావములో కూర్చొని వున్న అమంగళకారుడైన కుజుడు శుభగ్రహములను కూడా శుభకరమును ప్రదానించుటలో సమస్యలను కలిగించును.

ఈ భావములో కుజుడు యది వృషభము, కన్యా లేదా మకర రాశిలో వుండిన ఎడల దీని అశుభత కొంతవరకు తగ్గవచ్చును. మకర రాశిలో కుజుడు వుండిన ఎడల సంతాన సంబంధమైన కష్టములు కలుగును.

**ద్వాదశ భావములో కుజుడు** ద్వాదశ భావము కుండలిలో సుఖము, బోగము, నిద్రా, యాత్ర మరియు వ్యయమును నిర్దేశించును. ఈ భావములలో కుజుని ఉపస్థితిలో వుండిన ఎడల కుజ దోషము కలుగును. ఈ దోషము కారణముగా బార్యా భర్తల మధ్యగల సంబంధములలో ఒడిదుడుకులు ఏర్పడగలవు. వ్యక్తిలో కామప్రదమైన కోరికలు అధికముగా వుండును. గ్రహముల శుభ ప్రభావము లేని ఎడల వ్యక్తి నడవడికలో దోషము కూడా కలుగవచ్చును. ఆవేశం వచ్చి జీవిత భాగస్వామికి నష్టములను కూడా కలిగించవచ్చును. వీరిలో గుప్త రోగ ములు మరియు రక్త సంబంధ దోషములకు అవకాశములు వుండును.



# కుజగ్రహం గురించి కొన్ని విషయాలు

కుజుడు సామాన్యునిలో ఉత్తేజాన్ని, హంతకునిలో హింసను, బాలునిలో భయాన్ని, ప్రేమికునిలో రక్తిని, కార్మికునిలో శ్రమశక్తిని ఉత్తేజపరుస్తాడు.

కుజదోషాన్ని పూర్వం ఆడవారికి మాత్రమే చూసేవారు. కుజుడు ప్రథమ భావంలో జలరాశిలో ఉంటే స్త్రీ లోలుడు, మద్యపాన ఆసక్తి కలవాడు అవుతాడు.

కుజుడు షష్ఠంలో ఉంటే తొందరగా, హడావుడిగా మాట్లాడతారు. జాతకంలో కుజుడు దోషి అయినప్పుడే అతనికి దోషం అవుతుంది. యోగ కారకుడైన కుజదృష్టి గుణప్రదమే అవుతుంది.

మకరరాశిలో సూర్య, చంద్రులు ఉండి కుజ ప్రభావం ఉంటే మోకాలు సమీపంలో అనారోగ్యాలు గాని దెబ్బలు గాని తగిలే అవకాశాలు ఉన్నాయి.

శిరస్సుకు కారకుడైన కుజుడు పాపగ్రహ ప్రభావానికి లోనయితే శిరస్సుపై దెబ్బలుంటాయి. కుజుడు లగ్నం నుండి ఏ భావంలో ఉన్నాడో చూసి ఆ భావానికి సంబంధించిన శరీర స్థానంలో కాని అతడున్నరాశికి చెందిన శరీరభాగంలో గాని చిహ్నం ఉంటుంది. శరీరంలో దక్షిణ భాగంలో పుట్టుమచ్చ లేదా చిహ్నమునకు కుజుడు కారకుడు.

కుజుడు వెనుక నుండి ఉదయిస్తాడు కావున కుజగ్రహ ప్రధానుడైన వ్యక్తి ఎదుటి వారి మాటలను మరోకోణంలో ఆలోచిస్తాడు.

కుజుడు శని లగ్నంలో ఉండగా ఈస్థానం పై గోచార రవి సంచారం చేస్తున్నప్పుడు దుర్ఘటనలు కలిగే అవకాశాలు ఉంటాయి.

కుజుడు, శుక్రులు కలసి ద్వితీయంలో ఉంటే యుక్త వయస్సులోనే పళ్ళు ఊడిపోవటం, పుచ్చిపోవటం జరుగుతుంది. కుజుడు వ్యయంలో ఉంటే ఋణాను బంధాలను తీర్చుకోవటానికి మళ్ళీ మానవ జన్మ ఎత్తుతారు.

**చంద్రాత్ కేంద్రగతే భౌమే యోగో మంగళ కారకః**

**మంగళాఖ్యే సరోజాతః నిత్య శ్రీర్నిత్య మంగళం**

ఈ శ్లోకం ఆధారంగా చంద్రునకు సప్తమ కేంద్రంలో కుజుడు ఉన్నప్పుడు చంద్రమంగళ యోగం ఏర్పడుతుంది. ఇట్టి యోగమున్న జాతకులకు కుజదోషం ఉండదు. ఈ యోగజాతకులు నిత్యం లక్ష్మీ కటాక్షం ఉన్నవారుగా, నిత్యం శుభములు పొందేవారుగా ఉంటారు.

**గురు మంగళ సంయోగే కుజదోషోనవిద్యతే**

**చంద్ర మంగళ సంయోగే కుజదోషోనవిద్యతే**

శుక్లపక్ష చంద్రుడితో కుజుడు కలసి ఉన్న, కుజునిపై గురుదృష్టి ఉన్న కుజదోషం ఉండదు.

ధర్మశాస్త్రాలు కూడ వైధవ్య యోగాదులకు శాంతి విధానాలనే బోధిస్తున్నాయి. విశిష్టమైన జ్యోతిష్య గ్రంధాలలో కూడ ఒక జాతకమందలి ఒక దుష్టయోగం మరియొక శుభయోగం వలనే పరిహారం అవుతాయని భోదిస్తున్నాయి తప్ప ఒక జాతకము నందలి దుష్టయోగం మరియొక జాతకమందలి దుష్టయోగం చేత పరిహారింపబడుటలేదు. గాంధారికి వైధవ్య యోగం ఉందన్న కారణం చేత ధర్మ శాస్త్ర విహితమైన మార్గంలో ఆ దోషాన్ని తొలగించి వివాహం చేశారని భారతసారం అనే గ్రంథం తెలుపుతుంది.

జాతకమందలి వైధవ్య యోగం ఉన్నప్పుడు సావిత్రీ వ్రతం గాని, పిప్పల వ్రతం గాని చేయించి జాతకంలో దీర్ఘాయువు గల వరునితో వివాహం చేయాలి అని గ్రంథాలు తెలుపుతున్నాయి.



# కుజదోషం.. పరిహారాలు

'ధరణీ గర్భ సంభూతం -విద్యుత్కాంతి సమప్రభం, కుమారం శక్తిహస్తం-తం మంగళం ప్రణమామ్యహం' మంత్రాన్ని పటించాలి.

'లోహితో లోహితాక్షశ్చ సామగానం కృపాకరః ధరాత్మజః కుజో భౌమే, భూమదో భూమి నందనః' శ్లోకాన్ని ఉచ్చరించాలి.



కుజుడికి అధిపతి సుబ్రమణ్య స్వామి. కాబట్టి షష్టినాడు సుబ్రమణ్యాష్టకం ఏడుసార్లు పారాయణ చేయాలి. ఏడు మంగళ వారాలు ఉపవాసం ఉండి కుజ గాయత్రి మంత్రాన్ని 70 సార్లు పారాయణం, చేసి చివరి వారం కందులు దానం ఇవ్వాలి. కుజ శ్లోకం రోజు 70 సార్లు జపించాలి. కుజ జపం చేయించి కందులు, ఎర్రని వస్త్రంలో చుట్టి దక్షిణ, తాంబూలం ఇవ్వాలి. ఎడమ చేతి ఉంగరం వేలికి పగడం పొదిగిన వెండి ఉంగరం ధరించాలి.

## కుజుని యొక్క ఇతర నామాలు

అర, వక్ర, మహీజ, రుధిర, రక్త, అంగారక, క్రూరదృక్, భౌమ, మంగళ





# కుజుడు - ఆహారం

నవగ్రహాలు వాటి ప్రభావానికి అను గుణంగా ఆహారం తీసుకోవడం ద్వారా అనారోగ్య సమస్యలను దూరం చేసుకోవచ్చునని జ్యోతిష్య పండి తులు అంటున్నారు. ఆదివారం సూర్యుడు, సోమవారం చంద్రుడు, మంగళవారం కుజుడి ప్రభావం వుంటుంది. కుజుడు వేడి గ్రహం. కనుక వేడిపుట్టించే మామిడి పండు, పైనాపిల్, ఉల్లిపాయ, మిరి యాలు, వెల్లుల్లి మొదలైనవి బాగా పీల్చబడి మంగళవారం నాడు త్వరగా జీర్ణమవుతాయి అంటారు.




ముదురు ఎరుపురంగు కలిగి ప్రకాశ వంత మైన నునుపు పగడాలు కుజ గ్రహానికి చాలా ప్రీతి. కుజుడు రక్త వర్ణం కలిగి అగ్ని తత్వంగల పురుష గ్రహము. పగడం కూడా తేజో తత్వానికి సంబంధించింది. ఎరుపుగా ఉండటం కారణంగానే కుజుడుకి ఇష్టప్రద మైంది. ఈ పగడం త్రిదోషం లోని పిత్తమను దోషాన్ని హరింప గలదు. కుజ దోషం వలన కలిగే దాంపత్య జీవితంలో కలిగే కలహాలు, కలతలు కార్పణ్యాలు, విడాకులలాంటి దుర్మార్గపు భావనలు, అంతరించి, అన్యోన్యప్రేమ పూరితమైన అనురాగంతో దంపతులు దీర్ఘకాలం సుఖ సంసార జీవనం చేసుకొనుటకు తోడ్పడుతుంది.

# కుజదోషం నుండి బైటపడే మార్గాలు

ప్రతిరోజూ దక్షిణ దిక్కుగా మూడు వత్తులదీపం పెట్టి, అంగారక స్తోత్రంకాని, జపంకాని చేయుటవల్ల కుజగ్రహదోష నివారణ జరుగును. శుక్లపక్ష మంగళవారం ప్రారంభించి పద్దెనిమిది వారాలు ఉపవాస నియమం పాటించాలి. పగలంతా ఉపవాసముండి అంగారకస్తోత్రం కాని, సుబ్రహ్మణ్య కవచంగాని పఠించాలి.

సాయంత్రం స్నానంచేసి దక్షిణ దిక్కుగా దీపం పెట్టి తిరిగి పఠించి, రాత్రికి కందిపప్పు అన్నం తినవలెను. దీనివల్ల నివారణ జరుగును.

## ఆడపిల్లలకు వివాహం త్వరగా కావాలంటే

వివాహం త్వరగా కాదలచుకొన్నవారు (ఆడపిల్లలు) ప్రతినెలా వారి జన్మ నక్షత్రం రోజున సుబ్రహ్మణ్యస్వామికి పాలతో అభిషేకం చెయ్యాలి లేదా ఆయన యంత్రానికైనా అభిషేకం చెయ్యాలి లేదా దుర్గాదేవికి సప్తశతి శ్లోకాలు పఠిస్తూ కుంకుమపూజ చేయుట వల్ల దోషనివారణ జరుగును.

పద్దెనిమిది మంగళవారాలు గౌరీదేవిని పూజించి, సుమంగుళులకు ఎరుపు జాకెట్టు బట్ట, ఎర్ర రాగిదీపపు కుందులు లేదా పళ్లాలు లేదా చీరలు ఇచ్చి వారి పాదాలకు నమస్కరించి దీవెనలు పొందాలి.

కందిపప్పు, నెయ్యితో అరటి ఆకులో భోజనం కూడా పెట్టుట మంచిది. ప్రతిమంగళవారం ఆరు అరటి ఆకుల్లో బియ్యంపోసి, ఆరు నేతి దీపాలు వెలిగించి, తూర్పుదిశగా పెట్టి కూర్చుని స్కందుని కవచం పారాయణచేసి, హారతి ఇవ్వవలెను. ఈ విధంగా పద్దెనిమిది మంగళవారాలు చేయవలెను.

పెండ్లికాని అమ్మాయిలకు ఎర్రనిబట్టలు, మంగళసూత్రాలు లేదా కాలిమట్టెలు లేదా ఎర్రని గాజులు దానం చేయుట, నవగ్రహ దేవాలయంలో 18 దీపాలు వెలిగించి నవగ్రహ స్తోత్రం చేయుటవల్ల కుజ గ్రహ దోషాల నుండి నివారణ కల్గును. ఈ విధంగా 18 మంగళవారాలు చేయాలి.

ప్రతి మంగళవారం సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంలో స్వామి పాదాల సన్నిధిలో జాతకచక్రం పెట్టి పూజించాలి. లేదా ఇంటివద్దనే స్వామి అభయ హస్తమున్న పటము పెట్టి పూజించాలి. ఈ విధంగా 40 మంగళవారాలు చేయుటవల్ల ఫలితముంటుంది. ప్రతిరోజు రాహు కాలమందు నవగ్రహాలను పూజించి స్తోత్రం చేయాలి. ఈ విధంగా 36 రోజులు చేయుటవల్ల నివారణ కల్గును.

రోజుకు మూడుసార్లు కుజహోరలో కుజుని అష్టోత్తర శతనామ స్తోత్రం చేసి తల్లి పాదాలకు నమస్కరించి దీవెన పొందాలి. ఈ విధంగా 18 దినాలు చేయుటవల్ల కుజ గ్రహ దోషాల నుండి నివారణ జరుగును.

1వ స్థానాన కుజుడు సుఖ స్థానమును సప్తమ స్థానమును అష్టమమును చూచును గాన ఆయా భావములపై చెడు గలుగుతుంది అటులనే 2వ భావమున కుజుడు 5, 8, 9 భావములను 4వ భావకుజుడు 7, 10, 11 భావములను, అటులనే 7భావ కుజుడు 1, 2, 10 భావములను, 8 కుజుడు 11, 2, 3 భావములను, 10 కుజుడు 2, 4, 5 భావములను దృష్టి వలన తన స్థితి వలననూ తీక్షణ ఫలములను ఇచ్చును గాన కుజదోషము అని తెలుపబడింది. 

# కుజదోష నివారణకు 'మంగళ చండీదేవి" పూజ

కుజదోష నివారణకు 'మంగళ చండీదేవి' ని పూజించాలి అని 'బ్రహ్మావైవర్త పురాణం' చెబుతోంది.

ఏ కుజగ్రహ దోషం వలన అంతా నానా అవస్థలు పడుతున్నారో, ఏ కుజుడి అనుగ్రహం కోసం అంతా నానాప్రయత్నాలు చేస్తున్నారో ఆ కుజుడు పూజించే అమ్మవారే 'మంగళచండీ దేవి'.

కుజుడికి మంగళుడు అనే పేరు కూడా వుంది. మంగళవారం రోజున మంగళుడు పూజించిన కారణంగా ఆ తల్లి మంగళ చండీగా ప్రసిద్ధి చెందింది. మంగళుడి ఇష్టదైవాన్ని ఆరాధించడం వలన ఆయన కూడా తొందరగా అనుగ్రహిస్తాడు అని చెబుతారు.

ఇక మంగళుడే కాదు సాక్షాత్తు పరమశివుడు కూడా ఆమెను ఆరాధించాడు. మంగళవారం రోజున ఉపవాస దీక్ష చేపట్టి, మంగళ చండీని పూజించవలసి వుంటుంది. ఈ విధంగా చేయడం వలన ఆ తల్లి అనుగ్రహం వెంటనే లభిస్తుంది. సమస్త దోషాలు తొలగిపోయి, శుభాలు చేకూరతాయి.

కాబట్టి కుజదోషం వున్నవారు మంగళ చండీదేవి అమ్మవారిని అత్యంత భక్తి శ్రద్ధలతో పూజించడం వలన, సత్వరమే సత్ఫలితాలను సాధించి సంతోషంగా ఉంటారని చెప్పవచ్చు.



# కుజదోష నివారణకు 'విఘ్నహర్త ప్రవాళ గణపతి'



సంస్కృతంలో ప్రవాళం అంటే పగడం. పగడపు గణపతిని కుజదోషం ఉన్నవారు పూజించిన కొంతవరకు కుజదోష ప్రభావాన్ని తట్టుకునే శక్తి వస్తుంది. పగడపు గణపతిని రింగులో కుడిచేతి చూపుడు వేలుకి ధరించవచ్చును.

ప్రవాళ గణపతిని మొదటిసారిగా మంగళ వారం రోజు పసుపు నీళ్ళతో శుద్ధిచేసి గణపతి లేదా సుబ్రమణ్య లేదా మంగళ యంత్రం మీద గాని ప్రతిష్ఠించి "విఘ్న హర్త ప్రవాళ గణపతి ప్రీత్యర్థం" అంటూ ఆచమనీయం, అభిషేకం, శుద్ధోదక స్నానం తదితర పూజ చేస్తే కుజ దోష నివారణ జరుగుతుంది.

ఓం గం గణపతయే సర్వ విఘ్నహరాయ సర్వాయ
సర్వ గురవే లంబోదరాయ హ్రీం గం నమః

అనే మంత్రాన్ని జపించి ప్రవాళ గణపతికి ఉద్వాసన పలికి నిత్యం పూజమందిరంలో స్థాపించుకొని పూజ చేసుకోవచ్చును.

చంద్రుడనగా మనస్సుకి సంభంధించినది. శుక్రుడు కళత్ర (భార్య) కారకుడు. అనగా భార్యకు సంభంధించిన విషయము.

ఒక జాతకంలో లగ్నం నుంచి మరియు చంద్రుడు ఎక్కడ ఉన్నాడో అక్కడనుంచీ అలాగే శుక్రుడు ఎక్కడ వున్నా అక్కడనించి (ఈ మూడూ

వేరువేరుగా చూడాలి) లెక్క చూడగా 1,2,4,7,8,12 గదులలో (రాశులలో) కనుక కుజుడు ఉన్నచో ఆజాతకంలో కుజ దోషం ఉంది అనవచ్చు.

ఇందులో కొన్ని సవరణలు వున్నాయి. పిల్లవాడిజాతకంలోనూ పిల్ల జాతకంలోనూ కుజదోషం ఉన్నప్పుడు అనగా ఒకరి జాతకంలో లగ్నం నించి మరొకరి జాతకంలో శుక్రుడునించి కాని మరి ఏ ఇతర (పైన చెప్పిన ప్రకారం) రకాలుగావున్నా కుజదోషం సమసిపోయినట్లే! అనగా దోషం లేదు.

కర్కాటక, మీనం, ధనుస్సు, సింహం, మేషం, వృశ్చికం, మరియు మకర లగ్నాలకి అసలు కుజ దోషం పట్టింపు లేదు, కుజుడు ఉన్న రాశి లోనే గురుడు వున్నా గురుడు వున్న రాశిలో కుజుడు వున్నా ఆ జాతకానికి కుజ దోషం లేనట్లే.

**"ద్వితీయే భౌమదోషస్తు యుగ్న కన్యక యోర్వినా"** అని చెప్పిన శ్లోకం దేవ కేరళ గ్రంథము నుండి పరిశీలిస్తే మిధున కన్యా లగ్నములలో పుట్టిన వారికి రెండవ ఇంటిలో కుజుడు ఉంటే దోషం ఉండదు.

వృషభం తులలో పుట్టిన వారికి పన్నెండవ ఇంట కుజుడు ఉంటే కుజదోషం ఉండదు. మేష వృశ్చిక లగ్నంలో పుట్టిన వారికి నాల్గవ ఇంట కుజుడు వున్న దోషం ఉండదు.

మకర కుంభ లగ్నంలో పుట్టిన వారికి సప్తమంలో కుజుడు వున్న దోషం ఉండదు. ధనస్సు మీన లగ్నంలో పుట్టిన వారికి అష్టమంలో కుజుడు వున్న దోషం ఉండదు. సింహం కుంభం లగ్నములలో పుట్టిన వారికి కుజదోషం ఉండదు అని దేవకేరళ అనే గ్రంథమందలి విశేషం.

మేష వృశ్చికములు కుజుడికి స్వక్షేత్రములు. మకరము ఉచ్ఛ కనుక ఈ లగ్నములలో పుట్టిన వారికి కుజదోషం ఉండదు. మృగశిర, ధనిష్ఠ,

చిత్త నక్షత్రములు కుజ ఆధిపత్యం వున్న నక్షత్రములు అందువలన ఈ నక్షత్రములలో పుట్టిన వారికి కుజదోషం ఉండదు.

పుట్టిన సమయానికి కుజదశ వెళ్లిపోయినా వైవాహిక జీవిత కాలంలో కుజ మహాదశ రాదు అనినా కుజదోషం పరిధిలోకి తీసుకోనవసరం లేదు.

చంద్ర మంగళ సంయోగంతో కుజదోషం ఉండదు. గురు మంగళ సంయోగంతో కుజదోషం ఉండదు. కుజుడు నీచంలో ఉంటే కుజదోషం ప్రభావం అతితక్కువ.

కుజుడు దోషంగా ఉంటే పెళ్లి కాకుండా చేయడు. కలహకారుడు కుజుడు. వైవాహిక జీవితంలో కలహాలు తెస్తాడు. కళత్ర కారకుడు శుక్రుడు, కలహకారుడు కుజుడు పది డిగ్రీలలో కలిస్తే కుజదోషం ఉండదు. కానీ అటువంటి జాతకులకు వైవాహిక జీవితంలో కలహ కాపురం తప్పదు. ఒకవేళ వివాహమైన తరువాత ఒకరి జాతకంలో కుజదోషం ఉండి మరొకరి విషయంగా కుజదోషం లేకపోతే వారు **"విఘ్నహస్త ప్రవాళ గణపతి"** ఆరాధనలు నిత్యం చేస్తే కుజదోష ప్రభావం తట్టుకునే శక్తి వస్తుంది అని జ్యోతిషపండితులు చెబుతున్నారు.



# కుజహోర

మనం రోజును ఏ పేరుతో పిలుస్తామో దాన్ని ఆ వారంగా పరిగణిస్తాం. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారాల పేర్లతో 7 భాగాలుగా విభజింపబడుతుంది. వారం ఏర్పడడానికి హోరాక్రమం ఉంటుంది. ఆకాశంలో గ్రహాల వరుసల్లాగా ఉంటాయి. శని, గురు, కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్ర హోరలు. వరుసగా ప్రతిరోజూ అవే మళ్ళీ మళ్ళీ పునరావృత్తమౌతాయి.

ఈరోజు సోమవారం. సూర్యోదయం చంద్రహోరతో ప్రారంభం అవుతుంది. హోర అంటే ఒక గంట కాలం ఉంటుంది. సూర్యోదయం తర్వాత ఒక గంట తరువాత చంద్రహోర అయిపోతుంది. తరువాత శని హోర వస్తుంది. క్రమంగా గురు, కుజ, రవి, శుక్ర, బుధ, మళ్ళీ చంద్ర హోర మధ్యాహ్నం 1-2 వరకు ఉంటుంది. తిరిగి రాత్రి 8-9 వరకు మళ్ళీ చంద్ర హోర ఉదయం 3-4 వరకు ఉంటుంది. ఈ విధానం మూడు సార్లు తిరగడం వల్ల సూర్యోదయం నుండి 21 గంటలు పూర్తి అవుతాయి. తెల్లవారు ఉదయం 4-5 శనిహోర, 5-6 గురుహోర అయిపోయి మంగళవారం ఉదయం సూర్యోదయానికి కుజహోరతో వారం ప్రారంభం అవుతుంది. అందుకే ఆరోజును మంగళవారం అని పిలుస్తారు. ఈ విధంగానే వారాల క్రమం కూడా ఏర్పడుతుంది. ఈ కుజ హోరలో శస్త్రచికిత్సలకు చేసుకోవడానికి తప్ప ఇతర ఏ శుభకార్యాలకు పనికిరాదు. శస్త్ర చికిత్సలు కూడా తప్పనిసరి అయితే కాని లేకపోతే చంద్ర, బుధ, గురు, శుక్ర హోరలు అన్ని శుభకార్యాలకు శ్రేష్ఠమైనవి.



#  బుధుడు 



బుధ నపుంసక గ్రహం. మిశ్రమ రుచుల కారకత్వం కలిగినవాడు. ఇరవై వయసున్న వారిని సూచిస్తాడు. వర్ణం ఆకుపచ్చ, జాతి వైశ్య, అధి దేవత విష్ణువు, గుండ్రని ఆకారం, పరిమాణం పొడుగు, ప్రకృతి కఫ, వాత, పిత్తములు కలవాడు. శరదృతువును ఉత్తర దిక్కునూ, సూచిస్తూ, పృధ్వీ తత్వం కలిగినవాడు, గ్రహ సంఖ్య అయిదు, రత్నం పచ్చ, లోహం, ఇత్తడి, కంచు, గుణం రజోగుణం కలిగిన వాడు. లగ్నంలో దిక్బలం కలిగి ఉంటాడు. ఆశ్లేష, మూల, రేవతి నక్షత్రములకు బుధుడు అధిపతి. మిధున కన్యా రాశులకు అధిపతి. బుధుడు కన్యారాశిలో పదిహేను డిగ్రీల వద్ద పరమ ఉచ్ఛ స్థితిని పొందుతాడు. మీనరాశిలో పదిహేను డిగ్రీల వద్ద పరమ నీచను పొందుతుంది. కన్యారాశిలో పదిహేను ఇరవై డిగ్రీలు మూల త్రికోణము అవుతుంది. బుధుడికి సూర్యుడు, శుక్రుడు మిత్రులు. సింహరాశి, వృషభరాశి, తులారాశులు మిత్ర స్థానములు. చంద్రుడు శత్రువు. కర్కాటక రాశి శత్రుస్థానం. బుధ గ్రహ దశ పదిహేడు సంవత్సరాలు. బుధుడు ఏడవ స్థానం మీద మాత్ర్యమే దృష్టిని సారిస్తాడు.

బుధుడు స్వభావరీత్యా శుభుడు, తత్వము భూతత్వం, గ్రహ స్వభావం, ఒంటరిగాపాపి శుభగ్రహములతో చేరిన శుభుడు. జీవులు పక్షులు, గ్రహస్థానం క్రీడాస్థలాలు, జలతత్వం జలభాగం, ఆత్మాధికారం వాక్కు, పాలనా శక్తి రాకుమారుడు, గ్రహపీడ బంధువుల వలన బాధలు, గ్రహవర్గం శని, గృహంలో భాగములు పఠనా మందిరం, దిక్బలం తూర్పు, నివాస ప్రదేశములు జనావాసాలు, చెట్లు ఫలములు లేని చెట్లు, పండ్లు సీమ చింత, ధాన్యం పెసలు, పక్షులు చిలుక, గబ్బిలం, జంతువులు మేక గొర్రె, ఇతర వస్తువులు నగలు, మిశ్ర లోహములు. వస్త్రం తడి వస్త్రం, దేవవర్గం శైవం, గ్రహ వేదం అధర్వణ వేదం, గ్రహ గోత్రం ఆత్రేయ, అర్ధశుభుడు, అవతారం బుద్ధావతారం, గ్రహవర్ణం తాళపత్ర వర్ణం, వారం బుధవారం, మనస్థితి సాత్వికం, బలంగా ఉంటే వాక్చాతుర్యం బుద్ధి జ్ఞానం, ఋషి నారాయణుడు.

## బుధుడి ప్రభావం



బుధ ప్రభావితులు పొట్టిగా ఉంటారు. చురుకుగా ఉంటారు. వాక్చాతుర్యం కలిగి ఉంటారు. బుద్ధి కుశలత కలిగి ఉంటారు. వృద్ధాప్యంలో కూడా యౌవనంతో కనిపిస్తారు. దీర్ఘాలోచనలు కలవారు, మేధా సంపత్తి కల వారుగా ఉంటారు. సందేహ ప్రవృత్తి కలవారుగా ఉంటారు. విషయ జ్ఞానం నందు ఆసక్తులు. రచయితలు, కళాకారులుగా ఉంటారు. తలనొప్పి, అల్సర్ వ్యాధి పీడితులయ్యే అవకాశం ఉంది. ప్రసార రంగం లోనూ, కళారంగంలోనూ, గణికులుగా ఉంటారు.

## బుధుడి కారకత్వాలు



బుధుడు వాక్కుకు, మేనమామకు, మేనకోడలికి, మేనల్లుడికి, మాతామహులకు కారకత్వం వహిస్తున్నాడు. ఉపన్యాసంలో నైపుణ్యం, లలిత కళలు, గణిత శాస్త్రం, వాణిజ్యం, అర్ధశాస్త్రం, ఖగోళశాస్త్రం, వ్యాపారశాస్త్రం, వ్యాకరణం, జ్యోతిషం, వివిధరకాల భాషలు, శిల్పి, మంత్రం, తంత్రం, వివేకం, పుస్తక ప్రచురణ, గ్రంథాలయం మొదలైన వాటికి కారణం. దౌత్యం, వైద్యం, మధ్యవర్తిత్వం మొదలైన వాటికి కారకత్వం వహిస్తాడు. వైష్ణవులు, వైష్ణవ భక్తి, వైష్ణవాలయం మొదలైన వారికి కారకత్వం వహిస్తాడు. నాభి, నరము, స్వరపేటిక, చర్మమును సూచిస్తాడు కనుక నరముల బలహీనత, మూర్ఛ, చ్ఛెముడు, మెదడుకు సంబంధించిన వ్యాధులకు కారకత్వం వహిస్తాడు. సకల వివిధ ఆకు కూరలు, కాయకూరలకు కారకత్వం వహిస్తాడు. సభా నిర్వాహకులు, ప్రజాసంబంధిత వ్యవహారికులు, ప్రచారకులు, ఉపన్యాసకులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు మొదలైన వాటికి కారకత్వం వహిస్తాడు. వాక్సంబంధిత వృత్తులకు బుధుడు కారకుడు. మేధావులు, పండితులు, చరిత్రకులు, గుమస్తాలు, చిత్రకారులు, రాయబారులు, విద్య, గణికులు, దస్తూరి, నవలలు, వ్యాసాలు, కల్పితాలు, చిన్న పుస్తకములు, యువకులు, ప్రకటనలు, వాహనములు, వ్యాపారం, నిఘంటువులు, సత్యవాదముకు బుధుడు కాకత్వం వహిస్తాడు.

## బుధుని రూపురేఖలు

బుధుడు దుర్వాదళ దేహకాంతి కలిగిన వాడు. నాలుగు భుజములు కలిగి పీత వస్త్రములను ధరించి పసుపు పచ్చని మాలాధారణ చేసి గద, కత్తి, డాలు ఆయుధములను చేత పట్టి ఉంటాడు. బుధుడు సింహమును అధిరోహించి ఉంటాడు.

## బుధుని పూజించు విధానం

బుధుడిని పూజించుటకు బంగారు ప్రతిమను చేయాలి. పాలతో కలిపిన అన్నాన్ని నైవేద్యంగా పెట్టాలి. అధిదేవత విష్ణువు, అధిష్టాన దేవత దుర్గ. ప్రసాదము పులిహోర, వడపప్పు, దోషనివారణకు దానం చేయవలసిన లోహం బంగారం. బుధుడికి శ్రావణ శుక్ల పంచమి, వైశాఖ పూర్ణిమ, ఆచరించ వలసిన వ్రతం సత్యనారాయణ వ్రతం, పారాయణ చేయవలసిన గ్రంథం దేవీ భాగవతం, పారాయణ చేయవలసిన బుధగ్రహ అష్టోత్తర శతనామావళి, విష్ణు సహస్ర నామం, ధరించవలసిన మాల తులసి మాల, తీసుకోవలసిన దీక్ష గోవింద దీక్ష, ధరించ వలసిన రుద్రాక్ష చతుర్ముఖ రుద్రాక్ష, దర్శించ వలసిన ఆలయాలు విష్ణాలయం దుర్గాలయం, పూజ దుర్గాపూజ, దానం చేయవలసిన వాస్తువులు పెసలు ఆకు పచ్చని వస్త్రాలు, ఆసనం బాణాకారం, గ్రహ శాంతికి చేయవలసిన జపం పదిహేడు వేలు, హోమముకు వాడవలసిన సమిధ ఉత్తరేణి.

## బుధ గ్రహ జపం

**ఆవాహనము:**

**అస్య శ్రీబుధగ్రహ మహా మంత్రస్య! కాశ్యప ఋషిః**

**బుధగ్రహోదేవతా త్రిష్టుప్ ఛందః బుధగ్రహ మాల మంత్ర జపం కరిష్యే!!**

**కరన్యాసము:**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహే - అంగుష్ఠాభ్యాం నమః

ఓం త్వమిష్టపూర్తీ - తర్జనీభ్యాం నమః ఓం సగ్ నృజేథాంమయం చ - మధ్యమాభ్యాం నమః ఓం అస్మిస్నదస్తే ఆవాః - అనామికాభ్యాం నమః

ఓం జయమానశ్చ సీదతి - కరతల కరపృష్టాభ్యాం నమః

**అంగన్యాసము:**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహే - హృదయాయ నమః

ఓం త్వమిష్టపూర్తీ - శిరసే స్వాహా ఓం సగ్ నృజేథాంమయంచ - శిఖాయైవషట్ ఓం అస్మిస్నదస్తే ఆవాః - కవచాయహుం ఓం అద్భుతరాశ్మీన్ విశ్వదేవా - నేత్రత్రయా వౌషట్ ఓం జయమానశ్చ సీదతి - అస్త్రాయఫట్ ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః ఆదిదేవతా: ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధానిదధే పదం! సమూఢ మస్యపాగ్ సురే!! ప్రత్యధి దేవతా: సహస్ర శీర్షః పురుషః! సహస్త్రాక్ష సహస్ర పాత్! నభూమిం విశ్వతో వృత్యా! అత్యతిష్ట దశాంగులమ్!!

**వేద మంత్రము:** అద్భుద్య స్వాగ్నే ప్రతి జాగృహ్యే! సామిష్టా పూర్తేనగ్ సృజేథామయంచ పునః కృణ్వగ్ స్త్వాపితరం యువాన మన్వాతాగ్! సీత్వయితంతు మేతం!! బుధ కవచ స్తోత్రము పీతాంబర ధరః పాతు! పీతమాల్యానులేపనః! బుధః పాతు శిరోదేశం సౌమ్యః పాతు ఛ ఫాలకం!! నేత్రే జ్ఞానమయః పాతు! శ్రుతీ పాతు!విభూద్భవః! ఘ్రాణం గంధ ధరః పాతు! భుజౌపుస్తక భూషితః! మద్యం పాతు సురారాద్యః! పాతునాభిం ఖగేశ్వరః! కటిం కాలాత్మజః పాతు! ఊరు: పాతు సురేశ్వరః! జానునీ రోహిణి నూను:! పాతు జంఘే ఫలప్రదః! పాదౌ బాణాసనః పాతు:!

సౌమ్యౌఖిల వాపు:! ఫలశ్రుతి: ఏపోప్ కవచః పుణ్యం సర్వోపద్రవ శాంతిదః! సర్వరోగ ప్రశమనః సర్వదుఖ నివారకః! ఆయురారోగ్య శుభదః! పుత్రాపౌత్ర ప్రవర్తన:! యః పఠేత్కావచం దివ్యం శృణుయద్వా సమాహితః! సర్వాన్ కామా స్మవాప్నోతి! దీరఘుమాయుశ్చ వింరతి!!

**బుధ మంగళాష్టకం :** సౌమ్యః పీత ఉదఙ్ముఖ స్సమిదపామార్గోత్రి గోత్రోద్భవో: బాణేశాన దశస్సుహృద్ర విసితౌ వైరీం దురన్యే సమాః! కన్యాయుగ్మ పతిర్దశాష్టక చతుష్టణ్ణేత్రగ శ్యోభానః! విష్ణుర్వ్యోభగదైవతో మగధవః కుర్యాత్సదా మంగళమ్!!

**బుధాష్టోత్తర శతనామావళి:** ఓం బుధాయ నమః ఓం బుధార్చితాయ నమః ఓం సౌమ్యాయ నమః ఓం సౌమ్యచిత్తాయ నమః ఓం శుభప్రదాయ నమః ఓం దృఢవ్రతాయ నమః ఓం దృఢఫలాయ నమః ఓం శ్రుతిజాల ప్రబోధకాయ నమః ఓం సత్యవాసాయ నమః ఓం శ్రేయసాంపతయే నమః ఓం అవ్యయాయ నమః ఓం సోమజాయ నమః ఓం సుఖదాయ నమః ఓం శ్రీమతే నమః ఓం సోమవంశప్రదీపకాయ నమః ఓం వేదవిదే నమః ఓం వేదతత్త్వజ్ఞాయ నమః ఓం వేదాంతజ్ఞాన భాస్వరాయ నమః ఓం విద్యావిచక్షణ విభవే నమః ఓం విద్వత్ప్రీతికరాయ నమః ఓం బుధాయ నమః ఓం విశ్వనుకూలసంచారినే నమః ఓం విశేష వినయాన్వి తాయ నమః ఓం వివిధాగమసారజ్ఞానాయ నమః ఓం వీర్యవతే నమః ఓం విగతజ్వరాయ నమః ఓం త్రివర్గ ఫలదాయ నమః ఓం అనంతాయ నమః ఓం త్రిదశాదిపూజితాయ నమః ఓం బుద్ధిమతే నమః ఓం బహు శాస్త్రజ్ఞాయ నమః ఓం బలినే నమః ఓం బంధవిమోచకాయ నమః ఓం వక్రాతి వక్రగమనాయ నమః ఓం వాసవాయ నమః ఓం వసుధాధిపాయ నమః

ఓం ప్రసాదవదనాయ నమః ఓం వంద్యాయ నమః ఓం వరేణ్యాయ నమః ఓం వాగ్విలక్షణాయ నమః ఓం సత్యవతే నమః ఓం సత్యసంకల్పాయ నమః ఓం సత్యబంధవే నమః ఓం సదాదరాయ నమః ఓం సర్వరోగ ప్రశమనాయ నమః ఓం సర్వమృత్యు నివారకాయ నమః ఓం వాణిజ్య నిపుణాయ నమః ఓం వశ్యాయ నమః ఓం వాతాంగినే నమః ఓం వాతరోగహృతే నమః ఓం స్థూలాయ నమః ఓం స్థిరగుణాధ్యక్షాయ నమః ఓం అప్రకాశాయ నమః ఓం ప్రకాశాత్మనే నమః ఓం ఘనాయ నమః ఓం గగన భూషణాయ నమః ఓం విధిస్తుత్యాయ నమః ఓం విశాలాక్షాయ నమః ఓం విద్వజ్జనమనోహరాయ నమః ఓం చారుశీలాయ నమః ఓం స్వప్రకాశాయ నమః ఓం చపలాయ నమః ఓం చలితేంద్రియాయ నమః ఓం ఉదఙ్ముఖాయ నమః ఓం మఖాసక్తాయ నమః ఓం మగధాధిపతయే నమః ఓం హరయే నమః ఓం సౌమ్యవత్సర సంజితాయ నమః ఓం సోమప్రియకరాయ నమః ఓం సుఖినే నమః ఓం సింహాధిరూఢాయ నమః ఓం సర్వజ్ఞాయ నమః ఓం శిఖపర్ణాయ నమః ఓం శివంకరాయ నమః ఓం పీతాంబరాయ నమః ఓం పీతవపుషే నమః ఓం పీతచ్ఛత్రధ్వాజాంచితాయ నమః ఓం ఖడ్గ చర్మధరాయ నమః ఓం కార్యకర్త్రే నమః ఓం కలుషహారాకయ నమః ఓం ఆత్రేయ గోత్రజాయ నమః ఓం అత్యస్తవినయాయ నమః ఓం విశ్వ పావనాయ నమః ఓం చాంప ఏయ పుష్పసంకాశాయ నమః ఓం చారణాయ నమః ఓం చారుభూషణాయ నమః ఓం వీతరాగాయ నమః ఓం వీర భాయాయ నమః ఓం విశుద్ధకనక ప్రభాయ నమః ఓం బంధుప్రియాయ నమః ఓం బంధముక్తాయ నమః ఓం బాణమండల సంశ్రితాయ నమః ఓం తర్కశాస్త్ర విశారదాయ నమః ఓం ప్రశాంతాయ నమః ఓం ప్రీతిసం

యుక్తాయ నమః ఓం ప్రియకృతే నమః ఓం ప్రియభాషణాయ నమః ఓం మేధావినే నమః ఓం మాధవాసక్తాయ నమః ఓం మిథునాధిపతయే నమః ఓం సుధీయే నమః ఓం కన్యారాశి ప్రియాయ నమః ఓం కామ ప్రదాయ నమః ఓం ఘనఫలాశ్రయాయ నమః ఓం బుధగ్రహాయ నమః బుధ గ్రహ స్తోత్రమ్ అస్యశ్రీ బుధ స్తోత్ర మహామంత్రస్య వసిష్ట ఋషిః త్రిష్టుప్ఛంద: శ్రీ బుధో దేవతా బుధగ్రహ ప్రసాద సిద్ద్యర్ధే జపే వినియోగః భా మిత్యాది షడంగన్యాసః భూర్భువస్సురోమితి దిగ్బంధః ధ్యానమ్ బుధ శ్చతుర్భిర్వరదాభయాసిగదా వహంతం వరదం ప్రశాంతమ్, పీతప్రభం చంద్రసుతం సురాధ్యం సింహేనిషణ్ణం బుధమాశ్రయామి. పీతాంబరం: పీరవపు: కిరీటీ ఛ చతుర్భుజ: పీతధ్వజపతాకీ ఛ రోహిణీ గర్భసంభవః ఈశాన్యాధిషుదేశేషు బాణాసన ఉదాఙ్ముఖః నాథో మగధ దేశస్య మంత్రో మంత్రారథతత్త్వవితే. సుఖాసనః కర్ణికారో హైత్రశ్చాత్రే య గోత్రవాన్, భరద్వాజ ఋషి ప్రఖ్యైర్జ్యోతిర్మండలమండితః అడిపత్యది దేవాభ్యామన్మతో గ్రహమండలే, ప్రవిష్టస్సూక్ష్మ రూపేణ సమస్తవ రదస్సుఖీ. సదా ప్రదక్షిణం మేరో: కుర్వాణః సంప్రాప్త సుఫలప్రదః కన్యాయా మిథునస్యాపి రాశేరథి పతిర్ధ్వయో: ముద్గదాన్యప్రదో నిత్యం మార్త్యా మర్త్యసురార్చితః యస్తు సౌమ్యేన మనసా స్వమాత్మనం ప్రపూజ యేత్, తస్య వశ్యో భవేన్నిత్యం సౌమ్యనామ ధరో బుధః బుధస్తోత్రమిదం గమ్యం వసిష్ఠోనోదితం పురా, దిలీపాయ ఛ భక్తాయ యాచమానాయ భూభ్రుతే. యః పఠేదేకవారం వా సర్వాష్టమ వాప్నుయాత్, స్తోత్రరాజమిదం పుణ్యం గుహ్యాద్గుహ్యతమం మహాత్.

ఏకవారం ద్వివారం వా త్రివారం యః పఠేన్నరః తస్యాపస్మారకుష్టాది వ్యాధి బాధా స విద్యతే. సర్వగ్రహకృతాపీడా పఠితే స్మిన్న విద్యతే, కృత్రి

మౌషధదుర్మంత్రం క్రుత్రిమాదివిశాచరై: యద్భృద్భయం భవేత్తత్ర పఠితే స్మిన్ నవిద్యతే, ప్రతీమ యా ఛ స్వర్ణేణ లీఖీతా తు భుజాష్టకా. మఉద్గదా న్యోపరి స్వప్తపీతవస్త్రాన్వితే ఘటే, విన్యస్య విధినా సమ్యక్ మాసమేకం నిరంతరమ్. యే పూజయంతి తే యాంతి దీర్ఘమాయు: ప్రజాధనమ్, ఆరోగ్యం భాస్మగుల్యాది సర్వవ్యాధి వినాశనమ్. యం యం కామయత్ సమ్యక్ తత్తదాపొస త్యసంశయః

*ఇతి శ్రీస్కాందే పురాణే బుధస్తోత్రం సంపూర్ణమ్*

## బుధుడు రాశులు

బుధుడు కన్యారాశిలో 15 డిగ్రీలలోఉచ్ఛ స్థిలోనూ, మీన రాశిలో 15 డిగ్రీలలో పరమ నీచ స్థితిలోనూ ఉంటాడు. కన్యారాశి బుధునికి త్రికోణ స్థానం. శత్రుక్షేత్రం కర్కాటక రాశి. విషమ క్షేత్రం కర్కాటక రాశి. మిత్ర క్షేత్రములు వృషభ రాశి, తులారాశి, సింహరాశి. సములు కుంభరాశి, మకర రాశి, మేష రాశులు, వృశ్చిక రాశులు, ధనస్సు, మీనములు. రాశిలో 30 డిగ్రీల వరకు శుభఫలితం ఇచ్చాడు. బుధుడు ఒక రాశిలో ఒక నెల రోజులు ఉంటాడు. దిన చలనం ఒక డిగ్రీ. లగ్నంలో దిగ్బలం చెందుతాడు. గోచార రీత్యా బుధుడు 2, 4, 6, 11 స్థానములలో శుభుడు. గోచార రీత్యా అశుభ స్థానములు 1,3,5,7,8, 9,12. వేధ స్థానములు 3,5,9,12. దశాసంవత్సరములు పదిహేడు.

## బుధుడు మరికొన్ని విషయాలు

బుధుడు సూర్యుడితో చేరి 1, 4, 8 స్థానాలలో ఉన్న వ్యక్తి ఆ వ్యక్తి చక్రవర్తి స్థానానికి ఎదిగి భోగభాగ్యాలను అనుభవిస్తారు.

బుధుడు మిధునంలో ఉన్నప్పుడు అధికారప్రాప్తి, కన్యలో ఉన్నప్పుడు ఉన్నత పదవి పొందుతారు.

## ద్వాదశ స్థానములలో బుధుడు

లగ్నములో బుధుడు ఉన్న జాతకుడు దీర్ఘాయువు, మృదుమధుర వాక్కులు పలికేవాడు, హాస్యచతురుడు అవుతాడు.

ద్వితీయస్థానమున బుధుడు ఉన్న జాతకుడు స్వశక్తితో ధనమును సంపాదించు వాడు, ఆకర్షిణీయంగా మాటాడు వాడు, ప్రస్ఫుటముగా మాటాడు వాడు, భోజన ప్రియుడు అవుతాడు.

తృతీయమున బుధుడు ఉన్న జాతకుడు ధైర్యశాలి, శౌర్యం కల వాడు, సమ ఆయుషు కలవాడు, మంచిసోదరులు కలవాడు, త్వరితంగా అలసట పొందువాడు అవుతాడు.

చతుర్ధభావమున బుధుడు ఉన్న జాతకుడు విద్యావంతుడు, హాస్య విశారదుడు, భూమి కలవాడు, మిత్రులు కలవాడు, ధాన్యసమృద్ధి కల వాడు, ఐశ్వర్యం కలవాడు, సంతోషం కలవాడు అవుతాడు.

పంచమ స్థానమున బుధుడు ఉన్న జాతకుడు విద్యావంతుడు, సుఖవంతుడు, శైర్యవంతుడు, మంత్రవిద్యాభిలాషి, సంతానవంతుడు అవుతాడు.



షష్టమ భావమున బుధుడు ఉన్న జాతకుడు వివాదాస్పదుడు, క్రోధము కలవాడు, నిష్టుర వాక్కులు పలుకు వాడు, శత్రువులను నాశనం చేయు వాడు అవుతాడు.

సప్తమ స్థానమున బుధుడు ఉన్న జాతకుడు విద్యావంతుడు, ఔన్నత్యం కలవాడు, ధనసంపన్నత కలిఉగిన భార్య కలిగినవాడు, అందమైన వస్త్రధారణ చేయువాడు అవుతాడు.

అష్టమ స్థానమున ఉన్న జాతకుడు ప్రఖ్యాతి కలిగిన వాడు, చిరంజీవి, కుటుంబానికి అండగా ఉండేవాడు, ప్రభువు లేక సైన్యాధ్యక్షుడు అవుతాడు.

నవమ స్థానమున బుధుడు ఉన్న జాతకుడు విద్య, ఐశ్వర్యం, సచ్చరిత్ర, ఆచారము, ప్రావీణ్యం, స్వచ్ఛమైన పలుకులు కలిగినవాడు అవుతాడు.

బుధుడు దశమస్థానమున ఉన్న జాతకుడు మంచి విద్య, సకలకార్య విజయం, శక్తివంతుడు, మేధా సంపన్నుడు, సుఖము కలవాడు, సత్ప్రవర్తన, సత్యవాక్కు పలుకువాడు అవుతాడు.

ఏకాదశ స్థానమున ఉన్న జాతకుడు చిరంజీవి, సత్యసంధుడు, బహుధనవంతుడు, సుఖజీవి, సేవాజనము కలవాడు అవుతాడు.

ద్వాదశ స్థానమున బుధుడు ఉన్న జాతకుడు కష్టజీవి, విద్యాహీనుడు, నమ్రత కలిగినవాడు, క్రూరుడు, తేజోహీనుడు అవుతాడు.



**కుజ గ్రహం కలుగజేసే ఇబ్బందులకు పగడం పొదిగిన ఆభరణం లేదంటే ఉంగరాన్ని ఆవు నేతితోనూ, తేనెతోనూ శుద్ధి చేసి ధరించాలి అని చెబుతారు.**



# బుధుడు రాశులు



బుధుడు **మేషము**నందు ఉండగా జన్మించిన జాతకుడు సౌందర్యవంతుడు, అతి జారత్వము చేత కృశించిన దేహము కలవాడు, పాడుట, నాట్యమాడుట యందు ఆసక్తి కలవాడు, అబద్ధము పలుకువాడు, స్త్రీ లోలుడు, లేఖకుడు, అబద్ధపు సాక్ష్యము పలుకువాడు, అధికంగా భుజించువాడు, అనేక కష్టముల ధనము పోగొట్టుకున్న వాడు, నిలకడ లేని నివాసము కలవాడు, జూదరి అవుతాడు.

బుధుడు **వృషభము** నందు ఉండగా జన్మించిన జాతకుడు సమర్ధుడు, మిక్కిలిదాత, ప్రసిద్ధుడు, వేదసాస్త్రార్ధములను చక్కగా ఎరిగినవాడు, వ్యాయామ, వస్త్రములు, భూషణములు, పుష్ప మాలికలందు ప్రియము కలవాడు, చలించని స్వభావం కలవాడు, స్త్రీలయందు ఆసక్తి కలవాడు, ప్రియమైన వినుటకు ఇంపైన చారిత్ర కలవాడు, మాట తప్పనివాడు, గాంధర్వము, హాస్యము కలవాడు అవుతాడు.

బుధుడు **మిధునము** నందు ఉండగా జన్మించిన జాతకుడు మంగళ కరమగు వేషము కలవాడు, ప్రియభాషి, ధనవంతుడు, ప్రసిద్ధుడు, ఆత్మ స్తుతి చేసుకొనువాడు, అభిమానవంతుడు, సుఖమునందు అనాసక్తుడు, ఇద్దరు తల్లులకు పుత్రుడు, వివాదముల ఆసక్తుడు, వేదవేదాంగాములను ఎరిగినవాడు, కవి, స్వతంత్రుడు, జనులందరికి ఇష్టుడు, దానశీలుడు, పనులయందు ఆసక్తి కలవాడు, పుత్రులు, స్నేహితులు కలవాడు అవుతాడు

బుధుడు **కర్కాటకము** నందు ఉండగా జన్మించిన జాతకుడు ప్రాజ్ఞుడు, విదేశములందు నివశించువాడు, స్త్రీ లోలుడు, గానప్రియుడు, చపలుడు, అధికముగా మాటాడువాడు, తన బంధువర్గముతో ద్వేషము ఉన్నవాడు, స్త్రీ కలహమున ధనము పోగొట్టుకున్నవాడు, కుత్సితుడు, మంచికవి, సద్వంశ సంజాతకుడు, అనేక కార్యములందు ఆసక్తుడు అవుతాడు.

బుధుడు **సింహము**నందు ఉండగా జన్మించిన జ్ఞానము లేనివాడు, ప్రసిద్ధుడు, అసత్యవాది, జ్ఞాపకశక్తి కలవాడు, ధనవంతుడు, దుర్బలుడు, తోబుట్టువుల బాధించువాడు, స్త్రీలకు అయిష్టుడు, స్వతంత్రుడు, నీచములగు పనులు చేయువాడు, దూత, సంతతి లేనివాడు, తన వంశమునకు విరోధి, ప్రజలకు అందరకు ఇష్టుడు అవుతాడు.

బుధుడు **కన్య**నందు ఉండగా జన్మించిన జాతకుడు ధర్మమునందు ఆసక్తుడు, మిక్కిలిగా మాటాడువాడు, నేర్పరి, చిత్రకారుడు, కావ్యరచన చేయువాడు, విజ్ఞానము శిల్పము ఎరిగినవాడు, అందగత్తెల అందు ఆసక్తుడు, అల్ప ధైర్యం కలవాడు, పెద్ద మనిషి, స్నేహితులందరి చేతను పూజింపబడువాడు, అనేక విధముల వినయముతో ఉపచరించు భార్య కలవాడు, ప్రసిద్ధుడు, ఉదారుడు, బలవంతుడు అవుతాడు.

బుధుడు **తుల**నందు ఉండగా జన్మించిన జాతకుడు శిల్ప శాస్త్రము వాదము తెలిసినవాడు, మాట్లాడుటయందు నేర్పరి, ద్రవ్యము కొరకు ఇష్టమైన దానిని వ్యయము చేయువాడు, అన్ని వైపులా వాణిజ్యం చేయు వాడు, అతిథులు, బ్రాహ్మణులూ, దేవతలు, గురువులు, వీరియందు భక్తి , కపటపు పనులు చేయు సమర్ధుడు, అందరికి ఇష్టుడు, చంచలుడు, కోపము, సంతోషము స్వల్పకాలం మాత్రమే ఉండువాడు అవుతాడు.

బుధుడు **వృశ్చికము** నందు ఉండగా జన్మించిన జాతకుడు కష్టములు, దుఖములు అనుభవించువాడు, మిక్కిలి ధర్మం, సిగ్గు కలవాడు, మూర్ఖుడు, అసత్పురుషుడు, లోభి జార స్త్రీలను వాంచించువాడు, కఠినముగా దండించు వాడు, చంచలమైన పనులు చేయువాడు, తనకు అయిష్టమైన పనులందు నియోగింపబడు వాడు, ఋణగ్రస్తుడు, నీచపు పనులను ఆచరించువాడు, ఇతరుల సొత్తు అపహరించువాడు అవుతాడు.

బుధుడు **ధనస్సు**నందు ఉండగా జన్మించిన జాతకుడు ప్రసిద్ధుడు, ఉదారగుణము కలవాడు, వేదము, శాస్త్రము, శౌర్యము, మంచి నడవడి కలవాడు, మంత్రి లేక రాజపురోహితుడు, వంశములో ముఖ్యుడు, గొప్ప ఐశ్వర్యం కలవాడు, యజ్ఞములను చేయుట, వేదములను చదివించుట అందు ఆసక్తి కలవాడు, మేధావంతుడు, మాటనేర్పరి, దీక్షాపరుడు, దాత, వ్రాయుట, చిత్రలేఖనం ఎరిగినవాడు అవుతాడు.

బుధుడు **మకరము** నందు ఉండగా జన్మించిన జాతకుడు మూర్ఖుడు, నపుంసకుడు, ఇతరుల పనులు చేయువాడు, కులము, శీలము మొదలైన గుణములు కలవాడు, అనేక దుఃఖములు కలవాడు, కలవరించుట, స్వేచ్ఛగా విహరించుట కలవాడు, చాడీలను చెప్పువాడు, అబద్ధపు పనులు చేయువాడు, బంధువుల చేత వదలబడినవాడు, నిలకడలేనివాడు, మలినుడు, భయము చేత చంచలమగువాడు అవుతాడు.

బుధుడు **కుంభం** నందు ఉండగా జన్మించిన జాతకుడు సంగీతము, సాహిత్యము, కవిత్వము, అవధానము మొదలైన వాని అందు ఆసక్తి కలవాడు, ధర్మ, కామ, మోక్షములను సంపాదించువాడు, శత్రువుల చేత అవమానం పొందువాడు, అపరిశుద్ధుడు, మంచి నడవడి లేని

వాడు, అజ్ఞాని, మిక్కిలి దుష్టురాలైన భార్యకల వాడు, భోగ హీనుడు నలుగురిలో వ్యర్థముగా వాదము చేయువాడు, కడు కురూపి, మిక్కిలి భయశీలుడు, నపుంసకుడు, వినయము లేని వాడు,మలినుడు అవుతాడు.

బుధుడు **మీనం** నందు ఉండగా జన్మించిన జాతకుడు ఆచారము, పరిశుభ్రత, మొదలైన వాని అందు ఆసక్తుడు, విదేశముల ఉండువాడు, సంతానము లేని వాడు, దరిద్రుడు, మంగళకరి అయిన భార్య కలవాడు, మంచి కార్యములను చేయు వాడు, సత్పురుషులకు ఇష్టుడు, ఇతర ధర్మముల అందు ఆసక్తుడు, కుట్టు పని తెలిసిన వాడు, ప్రసిద్ధుడు, వేదము, చతుష్టి కళలు తెలిసిన వాడు, ఇతరుల ధనము అపహరించుటలో ప్రసిద్ధుడు అవుతాడు.

## బుధుడు కుజ క్షేత్రము

బుధుడు కుజ క్షేత్రమున ఉండి రవి చేత చూడబడిన జాతకుడు సత్యవాది, సుఖవంతుడు, రాజ గౌరవం పొందువాడు, బంధువులలో నేర్పు కలవాడు అవుతాడు. బుధుడు కుజ క్షేత్రమున ఉండి చంద్రుని చేత చూడబడిన జాతకుడు స్త్రీ మనోహరుడు, అతిగా సేవించువాడు, మలి నుడు, చెడ్డ నడవడి కలవాడు అవుతాడు.

బుధుడు కుజ క్షేత్రమున ఉండగా కుజుని చేత చూడబడిన జాతకుడు అబద్ధములు, మంచి మాటలు, కలహములు మాటాడువాడు కాగలడు, పండితుడు, ధనవంతుడు, రాజుల ప్రేమ పాత్రుడు అవుతాడు.

బుధుడు కుజ క్షేత్రమున ఉండి గురుని చేత చూడబడిన జాతకుడు సుఖవంతుడు, మంచి యౌవనవంతుడు, రోమములు అధికంగా కలవాడు, మంచి వెంట్రుకలు కలవాడు, మిక్కిలి ధనవంతుడు, జ్ఞాపక శక్తి కలవాడు, పాపి అవుతాడు.

బుధుడు కుజ క్షేత్రమున ఉండగా శుక్రుని చేత చూడబడిన జాతకుడు రాజకార్యములను చేయువాడు, అందగాడు, గణిత సాస్త్రములో మొదటివాడు, చతురములగు వాక్యములు పలుకువాడు, నమ్మకస్థుడు, స్త్రీ లతో కూడి ఉండువాడు అవుతాడు.

బుధుడు కుజక్షేత్రమున ఉండగా శని చేత చూడబడిన జాతకుడు మిక్కిలి దుఃఖితుడు, కోపము కలవాడు, హింసలను చేయువాడు, బంధువులు లేనివాడు అవుతాడు.

## బుధుడు శుక్ర క్షేత్రము

బుధుడు శుక్ర క్షేత్రమందు ఉండగా రవి చేత చూడబడగా జన్మించిన జాతకుడు దరిద్రము చేత దుఃఖితుడు, వ్యాధి బాధితుడు, ఇతరులకు ఉపచారము చేయువాడు, జనుల చేత దిక్కరించబడువాడు అవుతాడు.

బుధుడు శుక్ర క్షేత్రమందు ఉండగా చంద్రుని చేత చూడబడగా జన్మించిన జాతకుడు నమ్మకస్థుడు, మిక్కిలి ధనవంతుడు, ఆరోగ్య వంతుడు, గొప్ప కుటుంబమున జన్మించినవాడు, ప్రసిద్ధుడు, మంత్రి అవుతాడు.

బుధుడు శుక్ర క్షేత్రమందు ఉండగా కుజుని చేత చూడబడగా జన్మించిన జాతకుడు వ్యాధి పీడితుడు, శత్రువుల చేత బాధించ బడువాడు, అవమానం పొందువాడు, అన్ని దేశములనుండి బహిష్కృతుడు, కష్టములు కలవాడు అవుతాడు.

బుధుడు శుక్ర క్షేత్రమందు ఉండగా గురుని చేత చూడబడిన జన్మించిన జాతకుడు ప్రాజ్ఞుడు, అందరి మాటలకు విలువ ఇచ్చు వాడు, ప్రసిద్ధుడు, దేశములకు, పట్టణములకు, వీధులకు అధిపతి అవుతాడు.

బుధుడు శుక్ర క్షేత్రమందు ఉండగా శుక్రుని చేత చూడబడగా జన్మించిన జాతకుడు అందగాడు, మృదువైనవాడు, సుఖవంతుడు, మంచి వస్త్రములు, భూషణములు ధరించువాడు, కన్యల హృదయములను హరించువాడు అవుతాడు.

బుధుడు శుక్ర క్షేత్రమున ఉండగా శని చేత చూడబడిన జాతకుడు సుఖ హీనుడు, బంధువుల చేత బాధించ బడువాడు, మలినుడు, వ్యాధి పీడితుడు, అనర్ధములను పొందువాడు అవుతాడు.

## బుధుడు స్వక్షేత్రము

బుధుడు స్వక్షేత్రమున ఉండి రవి చేత చూడబడిన జాతకుడు అర్ధ వంతముగా మాటాడువాడు, మధురమైనవాడు, రాజాభిమానం పొందినవాడు, లోకహితుడు, పాలించువాడు, సున్నితమైన పనులు చేయువాడు అవుతాడు.

బుధుడు స్వక్షేత్రమున ఉండి చంద్రుని చేత చూడబడిన జాతకుడు అతిభాషి, కలహ పరాయణుడు, మధురమైనవాడు, అన్నింటా శుభం పొందువాడు, దృఢవ్రతుడు, శాస్త్రములందు ఆసక్తి కలవాడు అవుతాడు.

బుధుడు స్వక్షేత్రమున ఉండి కుజుని చేతచూడబడిన జాతకుడు గాయములు కలిగిన శరీరం కలవాడు, మలినుడు, ప్రతిభావంతుడు, రాజసేవకుడు, తనగృహమున ఉన్నవారి అభిమానం పొందువాడు అవుతాడు.

బుధుడు స్వక్షేత్రమున ఉండి గురుని చేత చూడబడిన జాతకుడు మంత్రి, ప్రధమ పూజితుడు, వైభవము, పరివారము కలవాడు, నలు గురితో సమానుడు అవుతాడు.

బుధుడు స్వక్షేత్రమున ఉండి శుకుని చేత చూడబడిన జాతకుడు ప్రాజ్ఞుడు, రాజ సేవకుడు, రాజదూత, రాయబారి, దుష్ట స్త్రీలయందు ఆసక్తుడు అవుతాడు.

బుధుడు స్వక్షేత్రమున ఉండి శనిచేత చూడబడిన జాతకుడు ఎల్లప్పుడూ ఉన్నత స్థానమున ఉండువాడు, అర్ధవంతమైన కార్యములు చేయుటలో ప్రధముడు, వస్త్రముల కొరత లేనివాడు అవుతాడు.

## బుధుడు చంద్ర క్షేత్రము

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున) ఉండగా రవి చేత చూడబడిన జాతకుడు రజకుడు, పుష్పమాలికలు, అమ్మువాడు, గ్రహములు, వాస్తు శాస్త్రము తెలిసిన వాడు, రత్నపరీక్షకుడు అవుతాడు.

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున) ఉండగా చందుని చేత చూడబడిన జాతకుడు స్త్రీల వలన నష్టమొందిన వాడు, స్త్రీలకొరకై దుఃఖము పొందిన శరీరం కలవాడు, సుఖములులేని వాడు అవుతాడు.

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున) ఉండగా కుజుని చేత చూడబడిన జాతకుడు స్వల్పంగా చదువుకొన్నవాడు అవుతాడు.

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున) ఉండగా గురుని చేత చూడబడిన జాతకుడు, అతిగా మాటాడువాడు, ఇతరుల సంతోషము కొరకు అబద్ధం పలుకువాడు, ప్రజాపాలకుడు, చోరుడు, సాక్ష్యము చెప్పువాడు అవుతాడు.

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున) ఉండగా శుక్రుని చేత చూడబడిన జాతకుడు మన్మధుని వంటి ఆకృతి కలవాడు, ప్రియముగా మాట్లాడువాడు, గాన వాద్యములయందు ప్రజ్ఞ కలవాడు, సౌందర్యవంతుడు, మృదువైనవాడు అవుతాడు.

బుధుడు చంద్ర క్షేత్రమున (కటకమున)ఉండగా శని చేత చూడబడిన జాతకుడు అతిశయోక్తులు చెప్పువాడు, పాపకార్యములు చేయువాడు, బంధనముల చిక్కువాడు, గుణహీనుడు, గురువులందు ద్వేషం కలవాడు అవుతాడు.

## బుధుడు రవి క్షేత్రము



బుధుడు రవి క్షేత్రమున (సింహమున) ఉండగా రవి చేత చూడబడిన జాతకుడు ఇతరుల చేత సేవింపదగినవాడు, మంచి గుణము, ధనము కలవాడు, హింసించువాడు, నీచుడు, సంపద స్థిరముగా ఉండనివాడు, సిగ్గు లేనివాడు అవుతాడు.

బుధుడు రవి క్షేత్రమున (సింహమున) ఉండగా చంద్రుని చేత చూడబడిన జాతకుడు సౌందర్యవంతుడు, ధన వంతుడు, సదాచారసంపన్నుడు, కావ్య రచయిత, నాట్యము, గానము తెలిసినవాడు,మిక్కిలి నేర్పరి అవుతాడు.

బుధుడు రవి క్షేత్రమున (సింహమున) ఉండగా కుజుని చేత చూడ బడిన జాతకుడు నీచుడు, దుఃఖ పీడితుడు, గాయములుకల శరీరం కలవాడు, నేర్పు విలాసము అందము లేనివాడు, నపుంసకుడు అవుతాడు.

బుధుడు రవి క్షేత్రమున (సింహమున)ఉండగా గురుని చేత చూడబడిన జాతకుడు సుకుమారుడు, మిక్కిలి ప్రాజ్ఞుడు, నేర్పుగా మాటాడువాడు, గొప్ప ఖ్యాతి కలవాడు, సేవకులు వాహనములు కలవాడు అవుతాడు.

బుధుడు రవి క్షేత్రమున (సింహమున)ఉండగా శుక్రుని చేత చూడబడిన జాతకుడు మిక్కిలి అందగాడు, ప్రియభాషి, వాహనములు కలవాడు, మృదువైన వాడు, ధైర్యవంతుడు, రాజు కాని మంత్రి కాని కాగలవాడు.

బుధుడు రవి క్షేత్రమున (సింహమున)ఉండగా శని చేత చూడబడిన జాతకుడు ఉష్ణ ప్రకృతి, విశాలదేహం కలవాడు, స్వేదజలమున దుర్గంధం కలవాడు, మిక్కిలి దుఃఖవంతుడు, సుఖము లేనివాడు అవుతాడు.

## బుధుడు గురు క్షేత్రము




బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా రవి చేత చూడబడిన జాతకుడు శూరుడు, దుఃఖితుడు, శాంతుడు అవుతాడు.

బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా చంద్రుని చేత చూడబడిన జాతకుడు లేఖకుడు, మిక్కిలి సుకుమారుడు, నలుగురి నమ్మకం అభిమానం పొందిన వాడు, గొప్ప కుటుంబము కలవాడు, సుఖవంతుడు, సంపన్నుడు అవుతాడు.

బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా కుజుని చేత చూడబడిన జాతకుడు వీధులకు, పట్టణములకు దొంగలకు, అరణ్యమున నివశించు బోయిలకు అధిపతి కాగలడు, లేఖకుడు అవుతాడు.

బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా గురుని చేత చూడబడిన జాతకుడు ఉన్నత వంశస్థుడు, నిశితబుద్ధి, జ్ఞాపకశక్తి, సాటిలేని సౌందర్యము, పెద్దలు సముపార్జించిన జ్ఞానము, కోశాధికారి, లేఖకుడు అవుతాడు.

బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా శుక్రుని చేత చూడబడిన జాతకుడు కన్యలకు, యువకులకు గురువు, సుకుమారుడు, ధనవంతుడు, శౌర్యం కలవాడు అవుతాడు.

బుధుడు గురు క్షేత్రమున (సింహమున) ఉండగా శని చేత చూడబడిన జాతకుడు దుర్గములు, అరణ్యములందు ఆసక్తి కలవాడు, దుష్టశీలుడు, మిక్కిలి నీచుడు, అతిభోజి, బాధ్యతలను తప్పించుకొనువాడు అవుతాడు.

## బుధుడు శని క్షేత్రము

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా రవి చేత చూడబడిన జాతకుడు మల్లుడు, అతిసార రోగము కలవాడు, అతిభోజి, కఠినమైనవాడు, ప్రియభాషి, ప్రసిద్ధుడు అవుతాడు.

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా చంద్రుని చేత చూడబడిన జాతకుడు సంపన్నుడు, పుష్పములు, దుంపలు, మద్యము మొదలైన వ్యాపారం చేయువాడు, భయస్తుడు, నడిచే శక్తి లేనివాడు అవుతాడు.

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా కుజుని చేత చూడ బడిన జాతకుడు దుడుకుగా మాట్లాడువాడు, సుఖవంతుడు, సౌమ్యుడు, సిగ్గు, సోమరితనం కలవాడు అవుతాడు.

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా గురుని చేత చూడబడిన జాతకుడు ధన ధాన్యములు విరివిగా కలవాడు, పట్టణముల గ్రామముల పూజింప బడువాడు, సుఖవంతుడు, ప్రసిద్ధుడు అవుతాడు.

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా శుక్రుని చేత చూడబడిన జాతకుడు కురూపి, దుష్టస్త్రీకి భర్త, అతి కాముకుడు, మిక్కిలి సంతానవంతుడు, బుద్ధిలేని వాడు అవుతాడు.

బుధుడు శని క్షేత్రమున (సింహమున) ఉండగా శని చేత చూడబడిన జాతకుడు కూలి చేయువాడు, పాపపు పనులు చేయువాడు, దరిద్రుడు, దుఃఖితుడు, దీనుడు అవుతాడు.



**బుధ గ్రహం ప్రభావం వలన కలిగే సమస్యలకు పచ్చను ఆభరణంగా గానీ లేదంటే ఉంగరంగా గానీ చేయించు కోవాలి.**

# బుధ గ్రహ దోష నివారణకు విష్ణుమూర్తికి రాగి పాత్రలో నైవేద్యం



జాతకచక్రంలో బుధుడు సూర్య గ్రహంతో అస్తంగత్వం చెందినప్పుడు బుధుడు తన బలాన్ని కోల్పోతాడు. బుధుడు నీచలో ఉన్న చెడు ఫలితాలు ఇస్తాడు. దోష నివారణకు బుధగ్రహనికి అది దేవుడు అయిన విష్ణుమూర్తికి రాగి పాత్రలో నైవేద్యం సమర్పించిన సూర్య, బుధ గ్రహ దోష నివారణ జరుగుతుంది. రాగి సూర్యగ్రహ లోహం. రాగి సూర్యగ్రహ దోష నివారణకు ఉపయోగపడుతుంది. రాగి పాత్రలో నీటిని తాగిన రోగ నిరోధక శక్తి పెరుగుతుంది.

సాధారణంగా ఆలయ దర్శనానికి వెళ్ళినపుడు, అక్కడ అర్చకులు స్వామికి ఓ పాత్రలో నైవేద్యాన్ని పెడుతుండటాన్ని చూస్తుంటాం. ముఖ్యంగా శ్రీమహావిష్ణువుకు రాగిపాత్రలో నైవేద్యమంటే అమిత ఇష్టం. ఇందువెనుక ఒక కథ వుంది. పూర్వం గుడాకేశుడనే రాక్షసుడుండేవాడు. అతడు పుట్టుకతో రాక్షసుడైనప్పటికి, ఎలాంటి రాక్షస లక్షణాలు లేకుండా దైవచింతనలో కాలాన్ని వెళ్ళబుచ్చుతుండే వాడు.

గుడాకేశుడు విష్ణుభక్తుడు. నిరంతరం విష్ణునామాన్నే జపిస్తూ ధర్మ కార్యాలను నిర్వర్తిస్తుందేవాడు. ఇదిలా ఉండగా, ఆ రాక్షసునికి విష్ణువును

గురించి తపస్సు చేయాలనిపించింది. ఫలితంగా, ఆ రాక్షసుడు పదహారు వేల సంవత్సరాల పాటు విష్ణువు గురించి తపస్సు చేసాడు. అతని తపస్సు మెచ్చి విష్ణువు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకోమని అడిగాడు. దానికి గుడాకేశుడు, తనకు ఏమి అక్కరలేదని, కొన్ని వేల జన్మలపాటు తాను విష్ణుభక్తిలో మునిగిపోయే విధంగా వరాన్ని అను గ్రహించమని కోరుకున్నాడు. అలాగే తన మరణం విష్ణుచక్రం వల్ల సంభవించాలని, తదనంతరం తన శరీరం రాగిలోహంగా మారిపోవాలని కోరుకున్నాడు.

విష్ణువు ఆ రాక్షసుడు కోరుకున్న వరాలను అనుగ్రహించి అంతర్ధాన మయ్యాడు. గుడాకేశుడు సంతోషించాడు. విష్ణుమూర్తి అనుగ్రహించిన అనంతరం గుడాకేశుడు తపస్సు చేస్తూనే ఉన్నాడు. వైశాఖ శుద్ధ ద్వాదశి నాడు ఆ రాక్షసుని కోరికను తీర్చాలని విష్ణుమూర్తి నిశ్చయించుకుని, మిట్టమధ్యాహ్నపు వేళ తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. తన కోరిక ఎప్పుడు నెరవేరుతుందా? అని ఎదురు చూస్తున్న గుడాకేశుడు మిక్కిలి సంతోషించాడు.

విష్ణుచక్రం ఆ రాక్షసుని తలను ఖండించిది. వెంటనే అతడి మాంస మంతా రాగిగా మారిపోయింది. ఆ రాక్షసుని ఎముకలు వెండిగా మారాయి. మలినాలు కంచులోహంగా మారాయి. గుడాకేశుని శరీరం నుండి ఏర్పడిన రాగితో ఒక పాత్ర తయారైంది. ఆ పాత్రలో విష్ణువుకు నైవేద్యం సమర్పించ బడింది. ఆ పాత్రలో నైవేద్యాన్ని స్వీకరించదమంటే విష్ణువుకు ఎంతో ఇష్టం. అనంతరం తన భక్తులు కూడా రాగి పాత్రలో నైవేద్యాన్ని సమర్పించాలని సూచించాడు విష్ణుమూర్తి. రాగిపాత్రలోని నైవేద్యంలో ఎన్ని మెతుకు లుంటాయో, అన్ని వేల సంవత్సరాల పాటు, ఆ నైవేద్యాన్ని పెట్టిన భక్తుడు వైకుంఠంలో ఉండగలాడని విష్ణుమూర్తి సెలవిచ్చాడు. విష్ణుమూర్తికి రాగి పాత్రలో నైవేద్యాన్ని సమర్పించడం వెనుక కథగా దీనిని చెబుతారు. 

# బుధ గ్రహ దోష నివారణకు చతుర్ముఖి రుద్రాక్ష



జాతకచక్రంలో బుధుడు మీనరాశిలో నీచలో ఉన్న, అస్తంగత్వం చెందిన, లగ్నానికి 6,8,12 స్థానాలలో ఉన్న శుభగ్రహ దృష్టి లేని శత్రు స్థానాలలో ఉన్న తెలివితేటలు తక్కువగా ఉండటం, చదువులో రాణించలేక పోవటం, వ్యాపారంలో తరచూ ఇబ్బందులు ఎదుర్కోవటం, తన మనసు లోని భావాలను బయటకు వ్యక్త పరచలేక పోవటం, ఇతరుల దగ్గర ఏది మాట్లాడిన తప్పుగా అర్థం చేసుకోవటం. బుద్ధి నిలకడ లేకపోవటం, చర్మవ్యాదులు, ఫిట్స్, నరాల బలహీనత, చెవుడు, నపుంసకత్వం, నిద్ర పట్టక పోవటం జరుగుతుంది.

బుధ ప్రభావితులు పొట్టిగా ఉంటారు. చురుకుగా ఉంటారు. వాక్చాతుర్యం కలిగి ఉంటారు. బుద్ధి కుశలత కలిగి ఉంటారు. వృద్ధాప్యంలో కూడా యౌవనంతో కనిపిస్తారు. దీర్ఘాలోచ కలవారు, మేధా సంపత్తి కల వారుగా ఉంటారు. సందేహ ప్రవృత్తి కలవారుగా ఉంటారు. విషయ జ్ఞానం అందు ఆసక్తులు. రచయితలు, కళాకారులుగా ఉంటారు. తల నొప్పి, అల్సర్ వ్యాధి పీడితులయ్యే అవకాశం ఉంది. ప్రసార రంగం లోనూ, కళారంగంలోనూ, గణికులుగా ఉంటారు.

చతుర్ముఖి రుద్రాక్ష నాలుగు ధారలు కలిగి ఉంటుంది. చతుర్ముఖి రుద్రాక్ష 'బ్రహ్మదేవుని' స్వరూపం. చతుర్ముఖి రుద్రాక్షకి బుధుడు అధిపతి

విద్యార్థులు, లాయర్లు, డాక్టర్లు రచయితలు, జ్యోతిష్యుల ధారణకు యోగ్య మైనది. విద్యార్థులకు జ్ఞాపకశక్తిని పెంచును. మానసిక రుగ్మతలు ఉన్నవారు, చర్మవ్యాధి గ్రస్తులు చతుర్ముఖి రుద్రాక్షను నీటిలో వేసుకొని త్రాగిన మంచి ఫలితం కలుగును. మాటలు సరిగా రానివారు, మూగవారు, చెవిటివారు చతుర్మకి ధరించిన ఆశించిన ఫలితాలు పొందుతారు. వ్యాపారస్థులు, వార్తాపత్రికల వ్యాపారులు, విద్యాలయాల వాళ్ళు, రచన, ఎక్కౌంట్స్ చేసేవారు చతుర్ముఖి ధరించాలి. ఈ రుద్రాక్షలను మణికట్టు వద్ద కూడ చేతికి ధరించవచ్చును.

'చతుర్ముఖి' రుద్రాక్ష సకల పాపాలను హరించుటలో ప్రధానపాత్ర పోషిస్తుంది. బ్రహ్మదేవుడి స్వరూపమైన ఈ రుద్రాక్ష, విద్యావంతులను చేస్తుంది. బుద్ధిబలాన్ని తేజస్సును పెంచి ప్రజల ఆదరాభిమానాలను చూరగొనేలా చేస్తుంది. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రాల వారు, చవితి తిధి రోజున జన్మించినవారు, కన్య, మిధున రాశిలో జన్మించిన వారు, జాతకంలో బుడుడు లగ్నానికి 6,8,12 స్థానాలలో ఉన్న, మీనరాశిలో నీచలో ఉన్న, బుధుడు శత్రుక్షేత్రాలలో ఉన్న, బుధదశ, అంతర్దశలలో, పిల్లలకు చదువులో ఆటంకాలు కలుగుతున్న, చదువు పైన ఆసక్తి లేకపోయిన చతుర్ముఖి రుద్రాక్ష ధారణ చేయటం మంచిది.

చతుర్ముఖి రుద్రాక్షను బుధవారం రోజు శివాలయంలో అభిషేకం చేయించి బుధ హోరలో చతుర్ముఖి రుద్రాక్ష ధారణ మంత్రంతో ధరించిన వారికి మానసిక రుగ్మతలను, పక్షవాతం, నాసికా సంబంధ, కంఠ సంబంధ వ్యాధులను రాకుండా చేస్తుంది. వాక్శుద్ధి, తెలివితేటలు మొదలగు ఉత్తమ ఫలితాలు పొందవచ్చును.

**చతుర్ముఖి రుద్రాక్ష ధారణ మంత్రం: "ఓం హ్రీం నమః"** 

# బుధ గ్రహ దోషాల నివారణకు గణపతిని పూజించాలి



బుధవారం ఆదిదేవుడైన గణపతిని ఆలయాల్లో దర్శించుకోవడం మంచిదని పురోహితులు అంటున్నారు. అందుచేత బుధవారం ఉదయం, సాయంత్రం సమయాన సమీపంలోని బొజ్జగణపతి ఆలయానికి వెళ్లి.. గజనాథుడిని దర్శించుకోవడం ద్వారా అష్టైశ్వర్యాలు చేకూరుతాయని పురాణాలు చెబుతున్నాయి.

ఇంకా బుధవారం రోజున గణపతిని భక్తి శ్రద్ధలతో పూజించి గరికను సమర్పించడం ద్వారా ఉన్నత ఫలితాలను పొందవచ్చునని పండితులు చెబుతున్నారు. అదే రోజున పెసరపప్పుతో చేసిన వంటలు అంటే పెసరట్లు, పెసరపప్పు పచ్చడి, పెసలతో చేసిన హల్వా, లడ్డు వంటి పదార్థాలను తీసుకోవడం ఆరోగ్యానికి మంచిదని పండితులు చెబుతున్నారు. అదే విధంగా చింత, సీమచింత పండ్లు స్వీకరించడం కూడా శ్రేయస్కరం.

బుధవారం ఆకుపచ్చ దుస్తులు ధరించడం శ్రేయస్కరం. ఆకుపచ్చ దుస్తులు ధరించడం ద్వారా చేపట్టిన కార్యాలు విజయవంతమవడంతో పాటు, శుభ ఫలితాలు చేకూరుతాయి. అదేవిధంగా... స్త్రీలు బుధవారం నాడు ఆకుపచ్చ రంగు పువ్వులు అంటే సంపంగి వంటివి తలలో ధరించడం ద్వారా దీర్ఘసుమంగళీ ప్రాప్తం సిద్ధిస్తుంది అని పండితులు చెబుతున్నారు. 

#  గురువు 

గురువు దేవ గురువు. ఇతడు సద్బ్రాహ్మణుడు. గురువుకు బృహస్పతి అనేది ఇతడికి ఉన్న నామాలలో ఒకటి. ఇతడికి వాచస్పతి, దేవేజ్యుడు, ఆంగీరస, జీవ అనే ఇతర నామాలు ఉన్నాయి. ఆదివారంతో మొదలయ్యే వారాలలో గురువుది అయిదవ స్థానం. అందుకే దానిని బృహస్పతి వారం అని కూడా అంటారు. అత్యంత శక్తివంతమైన గ్రహం. పురుష గ్రహం, అధిదేవత బ్రహ్మ, రుచులలో తీపికి రుచి కారకుడు, వయసు ముప్పై, ప్రకృతి కఫ ప్రకృతి, హేమంత ఋతువుకు అధిపతి, తత్వం ఆకాశతత్వం, దిక్కు ఈశాన్య దిక్కును సూచిస్తాడు. లోహములలో బంగారమును, రత్నములలో పుష్యరాగమును సూచిస్తాడు. గురువు లగ్నంలో దిక్బలం

కలిగి ఉంటాడు. గోదావరి వింధ్య పర్వత నడుమ ఉన్న భూమికి గురువు అధిపతి. గురువు పునర్వసు, విశాఖ, పూర్వాభద్ర నక్షత్రములకు అధిపతి. అంటే పునర్వసు, విశాఖ, పూర్వాభద్ర నక్షత్ర జాతకులకు గురుదశ ప్రారంభ దశ. గురువు కటక రాశిలో ఉచ్ఛస్థితిని, మకర రాశిలో నీచ స్థితిని పొందుతాడు. గురువు ధనస్సు రాశికి, మీన రాశికి ఆధిపత్యం వహిస్తాడు. గురువుకు మిత్రులు రవి, చంద్ర, కుజులు. శత్రువులు బుధ, శుక్రులు. సముడు శని. గురుదశ పదహారు సంవత్సరాలు. స్వభావం మృదు స్వభావం, సత్వగుణం, శుభ గ్రహం, జీవులు ద్విపాదులు, స్థానం ధనాగారం, అత్మాధికారత్వం జ్ఞానం, ధాతువు కొవ్వు, కుటుంబ సభ్యులు పుత్రుడు, గృహ స్థానం పూజ గది, ధన స్థానము, కాలబలం పగలు, స్థానబలం లగ్నం, కాల ఆధిపత్యం మాసము, దిక్బలం తూర్పు, వర్ణం పసుపు వర్ణం, రాశిలో ఉండే కాలం ఒక సంవత్సరం, సమిధ రావి, మూలిక రావి అరటి వేరు, గోత్రము అంగీరస, వేదము ఋగ్వేదము, అవతారం వామనుడు.

గురువు అంగీరస నామ సంవత్సరము వైశాఖ శుద్ధ ఏకాదశీ గురువారం ఉత్తర ఫల్గుణీ నక్షత్రం నాడు అంగీరస సురూపలకు పుత్రుడుగా జన్మించాడు.

**స్వక్షేత్రము :** ధనుస్సు, మీనము. **ఉచ్ఛ క్షేత్రము :** కర్కాటకము.

**శత్రుక్షేత్రము :** మిథునము, కన్య,

**మిత్రక్షేత్రము :** మేషము, వృషభము, సింహము.

**సమక్షేత్రము :** వృషభము, తుల. **నీచక్షేత్రము :** మకరము.

**మూలత్రికోణ క్షేత్రము :** ధనుస్సు

**గోచార రీత్యా శుభస్థానాలు :** 2,5,7,9,11.

**గోచారరీత్యా అశుభస్థానములు :** 1,3,4,6,8,12.

## గ్రహాలు

**మిత్ర గ్రహాలు :** సూర్యుడు, కుజుడు. **శత్రు గ్రహాలు :** బుధుడు.

**సమ గ్రహాలు :** శని, శుక్రుడు. **వృధా గ్రహము :** చంద్రుడు.

**నైసర్గిక బలగ్రహము :** శుక్రుడు. **స్వభావము :** శుభుడు.

**ఇతరనామాలు :** శుభుడు, జీవ, అంగీరస, వాచస్పతి, దేవేజ్యుడు.

**లింగము :** పురుష. **జాతి :** బ్రాహ్మణ.

**వర్ణము :** లేత పసుపు పచ్చ. **తత్వము :** ఆకాశతత్వము.

**గుణము :** సత్వగుణము. **రుచి :** తీయన.

**గ్రహోదయము :** ఉభయ. **జీవులు :** ద్విపాద.

**గ్రహస్థానము :** ధనాగారము. **ఆధిపత్య దిక్కు :** ఈశాన్యము.

**జలభాగము :** జల. **ఆత్మాధికారము :** జ్ఞానము.

**పాలనాశక్తులు :** మంత్రి. **శరీరధాతువు :** కొవ్వు.

**లోహము :** బంగారము. **కాలబలము :** పగలు, లగ్నము.

**ఆధిపత్యకాలము :** మాసము. **దిన చలనము :** 4 నుండి 5 నిమిషాలు.

**రాశి సంచార కాలము :** 1 సంవత్సర కాలము.

**రాశిలో ఫలము ఇచ్చు భాగము :** మధ్య భాగము.

**ఋతువు :** హేమంతము **దిగ్బలము :** తూర్పు.

**సూచించు ఎత్తు :** పొడుగు. **వయసు :** ముప్పై సంవత్సరాలు.

**ప్రాంతము :** గోదావరి నుండి వింధ్య ప్రాంతాలు.

**కుటుంబసభ్యులు :** పుత్రులు. **గ్రహ వర్గము :** గురువు, పూజగది.

**గృహ భాగము :** ధనము దాచు ప్రదేశము.

**అవయవములు :** కాలేయము, చిన్న ప్రేవులు.

**సూచించు వ్యాధులు :** కాన్సర్లు, వ్రణములు, కామెర్లు, కాలేయమునకు సంబంధించిన అవయవములు.

**గ్రహదశకాలము :** 16 సంవత్సరాలు. **జీవనకారకత్వము :** భాగ్యకారకుడు.

**సంబంధిత నక్షత్రములు :** పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర.

**వృక్షము :** వట వృక్షము.

**ధాన్యము :** సెనగలు

**పండ్లు :** పనస, తీయగుమ్మడి.

**పక్షులు :** హంస, పావురము.

**జంతువులు :** సింహము, ఏనుగు.

**ద్రవ్యములు :** పసుపు.

**మూలిక :** అరటి, రావి వేరు.

**వస్త్రము :** వాడిన వస్త్రము.

**దేవవర్గము :** వైష్ణవ.

**గోత్రము :** అంగీరస.

**వేదము :** ఋగ్వేదము.

**అవతారము :** వామనావతారము.

**రూపము :** రాగి జుట్టు, గచ్చ కళ్ళు, రుద్రాక్షమాలధారణ, కమండల ధారణ.

**గ్రహారూఢ వాహనము :** సింహము.

**గ్రహపూజకు వాడవలసిన లోహము :** బంగారము.

**నైవేద్యము :** దధ్యోజనము.

**అధిష్ఠాన దేవత :** బ్రహ్మ.

**అధిదేవత :** బ్రహ్మ.

**ప్రత్యధిదేవత :** ఇంద్రుడు.

**పండుగలు :** గురుపౌర్ణిమ, బ్రహ్మంగారి ఆరాధన.

**ప్రసాదములు :** సెనగలు, లడ్లు.

**దక్షిణ :** వస్త్రములు.

**ప్రీతికరమైన తిథి :** (ఆషాఢ) గురుపూర్ణిమ.

**వ్రతము :** అనఘావ్రతము. **పారాయణ గ్రంథము :** బ్రహ్మంగారి చరిత్ర.

**అష్టోత్తరము :** గురుగ్రహ అష్టోత్తరము. **సహస్రనామము :** శివ సహస్రము.

**జపసంఖ్య :** 16000.

**దీక్ష :** బ్రహ్మంగారి దీక్ష.

**ధరించవలసిన మాల :** చందన మాల.

**సమిధ :** రావి.

## గ్రహశాంతికి చేయవలసినది

**రత్నము :** పుష్యరాగము. **రుద్రాక్ష :** పంచముఖి

**దానము చేయవలసిన ద్రవ్యములు :** పసుపు వన్నె వస్త్రములు, పసుపు, బంగారము.

**గ్రహాసనము :** దీర్ఘచతురస్రము. **గ్రహ సంఖ్య :** 3.

**గ్రహదృష్టి :** 5,7,9. **వారము :** గురువారము.

**గ్రహబల ఫలితము :** సమాజములో గౌరవము, ధనలాభము.

**గ్రహ బలహీన ఫలితము :** ధననష్టము, పరువు నష్టము.

**తండ్రి :** అంగీరసుడు. **తల్లి :** సురూప.

**భార్య :** తార. **ఛందస్సు :** త్రిష్టుప్.

## రూపం

గురువుది స్థూల శరీరం, కపిల వర్ణ కనులు, కపిల వర్ణ వెంట్రుకలు, పీతవర్ణ శరీర కాంతి కలవాడు. నాలుగు భుజములు కలిగి చేతులలో దండము, కమండలం, రుద్రాక్షమాల ధరించి ఉంటాడు. గురువు పీతాంబర ధారి, వాహనము ఏనుగు. గురువు భార్య తార, తండ్రి అంగీరసుడు, తల్లి ప్రజాపతి మారీచి పుత్రిక అయిన సురూప.

## గురువు కారకత్వం

ధనం, విద్య, పుత్రులు, జ్యేష్ట భ్రాత, దేహపుష్టి, బుద్ధి, అర్ధసంపద, యజ్ఞం,కీర్తి,గృహం, బంగారం, శస్త్రం, అశ్వం, మెదడు, జ్యోతిషం, వేదశాస్త్రం, శబ్ధశాస్త్రం, వాహనశాస్త్రం, ఆందోళికం, గంజం, యజ్ఞయాగాధి క్రతువులు, కర్మ, ఆచారం, ఛాందసం, సుజనత్వం, శాంతం, మంత్రిత్వం, ఐశ్వర్యం,బంధివృద్ధి,దయ, దాక్షిణ్యం, ధర్మం, దైవభక్తి, వస్త్రం, సత్యం, తర్కం, మీమాంస, సింహాసనం, వాగ్ధోరిణి, పసుపురంగు, నృప

సన్మానం, ధర్మం, వెండి, బ్రాహ్మణులు, జ్ఞానం, కోశాగారం, నవీనగృహం, బంధుసమూహం, సుబుద్ధి, ఉత్తరదిశ, కావ్యజ్ఞానం, నిక్షేపం, వైదూర్యం, ఊరువులు, అగ్నిమాంద్యం, దంతములు,వేదాంతజ్ఞానం, బ్రాహ్మణ భక్తి, శ్రద్ధ, పాండిత్యం, బ్రాహ్మణవృత్తి, ఉపాధ్యాయవృత్తి, ముద్రాధికారం, భ్రాతృశుఖం, సంపత్తి, బహువిధ విద్వత్తు, వ్యాకరణం, రక్తం, పిత్తాశయం, రక్తనాళములు, ఉన్నత విద్యపై అధికారం, వాణిజ్య విషయములు, ధన విషయములు మొదలైనవి గురుగ్రహ కారకత్వాలు. ఆహార పదార్థాలు నెయ్యి, నూనె, పాలు, వెన్నలకు కారకత్వం వహిస్తాడు. శనగలు, పనస కాయలు, దబ్బకాయలకు కారకత్వం వహిస్తాడు. పక్షులలూ పావురం, హంసలు, జంతువులలో గుర్రములు, ఏనుగులకు, సింహములకు, వృక్షములలో వటవృక్షం కారకత్వం వహిస్తాడు. పుస్తకములు, కళాశాలలు, వైద్యులు, లాయర్లు, పూజారులు, ఫాదర్లు, బిషప్పులు, చర్చి మసీదు వంటి మత సంస్థలు, కరుణ, సంతోషం, పెట్టుబడులు, అభివృద్ధి, ఐశ్వర్యం, ఉపాసన, వీదేశీయులు, భవిష్యత్తు, బహుమతులు, ఆచారాలు బ్యాంకులు, ధనుర్విద్య, రేసులు, టైటిల్స్, నిజాయితీలను సూచిస్తాడు.

## గురు ప్రభావం

గురు ప్రభావితులు స్థూలకాయం కలిగి మంచి ఆకారం కలిగి ఉంటారు. గురుగ్రహ ప్రభావితులకు ఆహారం, వస్త్రం వంటి జీవిత సౌఖ్యములు పుష్కలంగా ఉంటాయి. సంప్రదాయాల పట్ల గౌరవం, దైవ భక్తి, పాండిత్యం, న్యాయబుద్ధి, ధర్మనిరతి, జ్ఞానం కలిగి ఉంటారు. చక్కని కంఠధ్వని, విశాల నేత్రాలు కలిగి ఉంటారు. విద్యావంతులై విద్యా సంస్థలతో సంబంధం కలిగి ఉంటారు. న్యాయశాస్త్ర అధ్యయనం, దేవాలయ వ్యవస్థ, విద్యా సంబదిత పదవులలో రాణిస్తారు.

## పూజా విధానం



గురువుని పూజించుటకు బంగారు ప్రతిమను వాడాలి. దధ్యోజనం, శనగలు నైవేద్యం చేయాలి. శివ సహస్ర నామావళి, గురువుకు అధిదేవత బ్రహ్మ, ప్రత్యధి దేవత ఇంద్రుడు కనుక వీరిని ఆరాధించాలి. దోష నివారణకు పసుపు వర్ణ వస్త్రములను దక్షిణ తాంబూలముతో దానం చెయ్యాలి. గురు అష్టోత్తర నామావళి, దత్త చరిత్ర, బ్రహ్మంగారి చరిత్ర వంటి గురు చరిత్రలను పారాయణం చెయ్యాలి. గురువుకు ఇష్టమైన వ్రతం అనఘావ్రతం. గురువుకు ప్రీతికరమైన రోజు అషాఢ పూర్ణిమ. ధరించవలసిన మాలలు చందన మాల, పుష్యరాగ మాలలు. పంచముఖ రుద్రాక్షను ధరించవచ్చు. బంగారం, పసుపు, శనగలు, పసుపు రంగు వస్త్రాలు దానం చెయ్యాలి. పసుపు రంగు పండ్లు, పసుపు రంగు పూలను పూజకు ఉపయోగించాలి. గ్రహశాంతికి చేయవలసిన జపం పదహారు వేలు. హోమముకు రావి చెట్టు పుల్లలను వాడాలి. గురువులను ఆరాధించుట, గురువు ఆలయాలను దర్శించుట, గురుదీక్షలను స్వీకరించుట వలన దోష నివారణ చేయవచ్చు.

గురును బృహస్పతి అని కూడా పిలుస్తారు. ఒక ప్రయోజన గ్రహం మరియు దేవతల గురువు. పురాణాల ప్రకారం బ్రహ్మచరిత, చరితదేవి దంపతుల కుమారుడైన అంగిరాసకు గురుదేవుడు జన్మించాడు. గురు (బృహస్పతి) గ్రహం ద్వాదశ చక్రాలను తిరిగి రావడానికి పుష్కర కాలం

పన్నెండు సంవత్సరాలు పడుతుంది. ప్రతి రాశిలో ఒక సంవత్సరం పాటు ఈ రాశి ఉంటుంది. ఇది ఒక రాశి నుండి మరో రాశిలోకి ప్రవేశించడాన్ని లేదా కదలికను గురుపెయార్చి అంటారు. లగ్నము నుండి 4, 7, 10వ స్థానాల్లో గురు ఉంటే, ఆ వ్యక్తికి సంపద పెరుగుతుందని, ధనలక్ష్మి ఇంట్లో నివసిస్తుందని చెబుతారు. 12వ స్థానాన్ని కూడా గురు గరిష్ట స్థానం అని అంటారు. దీనివల్ల జాతక సంపన్న జీవితం లభిస్తుంది. వివాహం, పిల్లలు, అదృష్టం, సంపద, మొదలైన వాటికి గురువు బాధ్యత వహిస్తాడు. గురువు ఉన్నతమైన లేదా సొంత ఇంట్లో మంచి స్థితిలో ఉంటే, స్థానికుడు ప్రభావవంతమైన వ్యక్తి అవుతాడు. అన్ని ప్రయోజనాలు మరియు ఆనందాన్ని పొందుతాడు. వారు అసాధ్యమైన పనులను సాధ్యమైన రీతిలో చేస్తారు. ఒకవేళ గురుబలంగా లేకపోతే, వారు జీవితంలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి ఉంటుంది. ద్రవ్య పరిస్థితులు అస్థిరంగా ఉంటాయి మరియు వారి జీవితంలో అడ్డంకులు కనిపిస్తాయి. ధనస్సు రాశి మరియు మీనరాశులకు గురు ప్రభువు. సూర్య మరియు చంద్రు లను మినహాయించి మిగతా గ్రహాలన్నీ రెండు రాశులకు ప్రభువులే. జ్యోతిష శాస్త్రం ప్రకారం ఎవరైనా జీవితంలో సంతోషంగా ఉండాలన్నా, లేదా ప్రశాంతంగా జీవించాలన్న, విజయాలు సాధించాలన్నా, ఆర్థికంగా బలపడాలన్నా గురువు అనుగ్రహం చాలా అవసరం.

## ద్వాదశ రాశులలో గురుడు

**మేష రాశిపై** గురుడి ప్రభావం అనుకూలంగా ఉంటుంది. మేషరాశి వారు వృత్తిపరంగా మంచి పేరు తెచ్చుకుంటారు. సమాజంలో కూడా వీరికి మంచి గుర్తింపు వస్తుంది. ఆధ్యాత్మిక క్షేత్రాలకు వెళ్లే అవకాశాలు న్నాయి. వెళితే మంచిదని శాస్త్రం చెబుతుంది.

**వృషభరాశిలో** గురుడు 8వ స్థానంలో ఉంటాడు. వీరు కూడా వృత్తిపరంగా ఎదుగతారు. ఈ రాశి వారు ప్రయత్నాలు ఎన్ని చేసినా నిరాశ చెందే అవకాశముంది. వీరి ఆరోగ్యంపైనా ప్రభావం పడనుంది.

**మిథునరాశిపై** గురు గ్రహం ఏడో స్థానంలో ఉండి అనుకూల ప్రభావం ఉంటుంది. ఈ రాశి వారు వ్యాపారంలో లేదా షేర్ మార్కెట్లో మీరు పెట్టే పెట్టుబడులు మంచి ఫలితాలను ఇస్తాయి.

**కర్కాటక రాశిపై** గురుడు వ్యతిరేక ప్రభావం చూపుతాడు. ఇక్కడ గురువు ఆరో స్థానంలో ఉంటారు. ఈ రాశివారు కొంత అనారోగ్యానికి గురయ్యే అవకాశం ఉంది. మానసికంగానూ, శారీరకంగానూ ఈ రాశి వారు చాలా ఇబ్బందులను ఎదుర్కొంటారు. అరటి చెట్టుకు పూజ చేస్తే మంచి ఫలితాలుంటాయి.

**సింహరాశిలో** గురుడు ఐదో స్థానంలో ఉంటారు. దీంతో ఈ రాశివారు ఆర్థికంగా బలపడతారు. వారు ఉండే రంగాల్లో అభివృద్ధి సాధిస్తారు. దీనివల్ల సమాజంలో కూడా వీరికి మంచి గుర్తింపు లభిస్తుంది. వాహనాలు కొనుగోలు చేసే అవకాశం ఉంది.

**కన్యరాశిలో** గురువు నాలుగో స్థానంలో ఉంటాడు. ఈ రాశివారిపై గురుడి ప్రభావం ఉంటుంది. వీరు నమ్మే వ్యక్తులే వారిని మోసం చేస్తారు. వీరి భావోద్వేగాలను దెబ్బ తీస్తారు. ఈ రాశి వారు ప్రపంచానికి దూరంగా, ప్రశాంతంగా, శాంతియుతంగా జీవితం గడపాలని భావిస్తారు.

**తులరాశిలో** గురుడు మూడో స్థానంలో ఉంటాడు. వీరి పనులు రీత్యా నివసించే ప్రాంతం మారాల్సి ఉంటుంది. మీరు పసుపు లేదంటే చపాతీలు ఏదైనా సరే ఆవుకు హారంగా పెడితే మంచింది.

**వృశ్చికరాశిపై** గురుడు రెండో స్థానంలో ఉంటాడు. ఈ రాశిపైనా గురుగ్రహం ఉంటుంది. ఈ రాశి వారికి ఎక్కువగా అదృష్టం వరిస్తుంది. వీరికి అన్ని విషయాల్లో కుటుంబం అండగా ఉంటుంది.

**ధనస్సు రాశిలో** ప్రథమ స్థానంలో ఉంటాడు. దీంతో ఈ రాశివారిపై అనుకూల ప్రభావం ఉంటుంది. వైవాహిక జీవితంలో, ప్రేమ విషయంలో సంతోషంగా ఉన్నప్పటికీ ఆర్థికంగా ఇబ్బందులు ఎదుర్కొంటారు.

**మకరరాశిపై** గురుడి ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఈ రాశివారి వైవాహిక జీవితం చాలా బాగుంటుంది. ఈ రాశివారు ఆధ్యాత్మికత క్షేత్రాలకు వెళ్తే మంచిది. గురుడు పదకొండో స్థానంలో ఉంటాడు.

**మీనరాశిపై** గురుడు ప్రభావం చూపుతాడు. ఈ రాశి కుటుంబం ప్రశాంతంగా ఉంటుంది. ఈ రాశి వారు కూడా కాస్త ఇబ్బందులు పడే అవకాశాలు ఉన్నాయి.

## కారకత్వము

**వృత్తులు :** గురుబలంతో న్యాయవాదులు, న్యాయ మూర్తులు, బోధకులు, ఉపాధ్యాయులు, సామాజిక రచయితలు, మత ప్రవక్తలు, పురోహితులు, మత ప్రచారకులు, ఉన్నత ప్రభుత్వ పదవులు వహిస్తారు. గురువు రవి చంద్రులతో కలిసిన బ్యాంకులు, అధ్యక్షులు, మేయర్, కౌన్సిలర్లు, పార్లమెంటు సభ్యులు, మేనేజరు, మేనేజింగు డైరెక్టర్లు అయ్యే అవకాశం ఉంది. గురు బుధులు కలిసిన విదేశీ భాషలు, ఎగుమతులు దిగుమతులు, సివిల్ ఇంజనీరింగ్ వంటి వృత్తులను సూచించును.

**వ్యాధులు :** మధుమేహం, కాలేయము, ప్రేగులకు సంబంధించిన వ్యాధులు, బోదకాలు, చెమట, నీరు చేరటం, నిస్సంతానం, కాన్సర్ వంటి వ్యాధులు. గురువు చంద్రుడితో కలిసిన గర్భాశయ వ్యాధులు, శుక్రుడితో కలిసిన మధుమేహం, విచిత్రమైన కోరికలు, రవితో కలిసిన కొలెస్ట్రాల్, మూత్ర పిండ వ్యాధులు, అతిమూత్ర వ్యాధి, పసిరికలు, కామెర్లు వంటి వ్యాదులను సూచించును.

## ద్వాదశస్థానాలలో గురువు

**లగ్నంలో** గురువు ఉన్న జాతకుడు అదృష్టవంతుడు, సౌందర్యవంతుడు, నిర్భయుడు, సంతానవంతుడు, చిరంజీవి అవుతాడు.

**ద్వితీయ** స్థానమున గురువు ఉన్న జాతకుడు స్వచ్ఛమైన వాక్కులు కలవాడు, భోజనప్రియుడు, సుందరవదనుడు, ధనవంతుడు, విద్యావంతుడు అవుతాడు.

**తృతీయ** స్థానమున గురువు ఉన్న జాతకుడు కష్టజీవి, అమర్యాదస్తుడు, ఖ్యాతి కలిగిన సోదరవర్గం ఉన్నవాడు, పాపకార్యములు చేయువాడు మాయావి అవుతాడు

**చతుర్థ** స్థానమున గురువు ఉన్న జాతకుడు సుఖజీవి, తల్లి, సేవకులు, భార్యా పుత్రులు, బంధువులతో కలిసి జీవించువాడు, సంపద్వైభవం కలవాడు అవుతాడు.

**పంచమ** స్థానమున గురువు ఉన్న జాతకుడు పుత్రుల వలన క్లేశములు అనుభవిస్తాడు. మేధావి, మంత్రి పదవిని అలంకరించువాడు అవుతాడు.

**షష్టమ** స్థానమున గురువు ఉన్న జాతకుడు నిరుత్సాహి, అగౌరవ ములు పొందువాడు, శత్రునాశకుడు, మంత్రభినివేశనం కలవాడు అవుతాడు.

**సప్తమమున** గురువు ఉన్న జాతకుడు జాతి ఉదారుడు, మంచి కళత్రం కలవాడు, మంచి పుత్రులను కలిగినవాడు, వినయసంపన్నుడు అవుతాడు.

**అష్టమ** స్థానమున గురువు ఉన్న జాతకుడు కడుబీదవాడు, అతి తక్కువ సంపాదనాపరుడు, పాపి, చిరంజీవి అవుతాడు.

**నవమ** స్థానమున గురువు ఉన్న జాతకుడు ఖ్యాతి వహించిన మంత్రిగానూ, సంతతి కలవాడు, ఐశ్వర్యం కలవాడు, పవిత్ర కార్యములందు అనురక్తుడై ఉంటాడు.

**దశమ** స్థానమున గురువు ఉన్న జాతకుడు రుజువర్తనుడు, పవిత్ర కార్యములు చేసి ప్రఖ్యాతి చెందువాడు, బహుధనవంతుడు, రాజమిత్రుడు అవుతాడు.

**ఏకాదశ** స్థానమున గురువు ఉన్న జాతకుడు ధనవంతుడు, నిర్భయుడు, వాహనములు కలవాడు, చిరంజీవి, అల్పసంతానవంతుడు అవుతాడు.

**ద్వాదశ** స్థానమున గురువు ఉన్న జాతకుడు ఇతరులచేత అసహ్యించుకొనబడువాడు, అసంగతములు పలుకువాడు, పాపము చేయువాడు, అలసట పొందువాడు అవుతాడు. 

# గురుగ్రహ దోషాలుకు పుష్యరాగ మణి



గురుగ్రహ దోషాలు, వ్యాధుల పరిహారం కోసం మంచి పుష్యరాగ మణిని గురువారం రోజు శివ పంచాక్షరి మంత్రం, గురుగ్రహ మంత్రంతో కలిపి జపించిన తర్వాత ధరించాలి. స్త్రీలు పాదాలకు ధరించే పసుపు, గడపలకు రాసే పసుపు, పూజా కార్యక్రమాల్లోనూ, స్నానానికి మనం వినియోగించే పసుపు ఎన్నో వ్యాధుల్ని నివారించగలదు. కాబట్టి పసుపు రంగు వేయబడిన గది గోడల మధ్య నివాసం ఈ లోపాన్ని పూరిస్తుందని జ్యోతిష్య నిపుణులు చెబుతున్నారు.

## పసుపు కొమ్ము గణపతి



గురు గ్రహ దోషనివారణకు పసుపు కొమ్ము గణపతిని, పసుపు రంగు స్టోన్ గణపతిని పూజిస్తే చాలా మంచిది. పసుపు రంగు స్టోన్ నీటిలో వేసుకొని ఆ నీటిని త్రాగిన దోష నివారణ కలుగును. పూర్వ కాలం నందు గురుగ్రహ దోష నివారణకు ఇంద్రుడిని పూజించేవారు, ప్రస్తుతం దత్తత్రేయ, హయగ్రీవుడిని పూజిస్తున్నారు.

# గురుగ్రహ దోష నివారణకు హయగ్రీవస్తోత్రం



జాతకంలో గురుగ్రహ దోషం ఉన్నవారు ప్రతిరోజు హయగ్రీవ స్తోత్రం చదివితే గురుగ్రహ అనుగ్రహం కలుగుతుంది. భక్తి భావనలు, ఉన్నత విద్య, విదేశి విద్య కలగాలంటే గురుగ్రహ అనుగ్రహం ఉండాలి. గురుగ్రహానికి అధిదేవత హయగ్రీవుడు. సకల విద్యాధిదేవతయైన శ్రీమన్నారాయణుడు 'హయగ్రీవుని'గా అవతరించాడు. సరస్వతీదేవి, వేదవ్యాసుడు హయగ్రీవుని నుండి విద్యాశక్తిని సముపార్జించారని 'హయగ్రీవ స్తోత్రం'లో దేశికాచార్యులు పేర్కొన్నారు. హయగ్రీవోపాసన వాక్‌శక్తిని, విద్యాశక్తిని, జ్ఞానశక్తిని సిద్ధింప చేస్తుంది.

జ్ఞానానంద మయం దేవం, నిర్మలాస్ఫటికాకృతమ్
ఆధారం సర్వ విద్యానాం, హయగ్రీవ ముపాస్మహే

జ్ఞానం, ఆనందం, మూర్తీభవించిన దైవస్వరూపం హయగ్రీవుడు. నిర్మలమైన స్ఫటికాకృతి కలిగి సర్వవిద్యలకు ఆధారభూతమైన విద్యాధి దేవత హయగ్రీవునకు నమస్కారము. హయగ్రీవుని పూజించడంవల్ల విద్య, ఐశ్వర్యం, అధికారం, ఆయువు మొదలైనవన్నీ లభిస్తాయి.

## హయగ్రీవస్తోత్రం

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి వాదినం ।
నరం ముంచంతి పాపాని దరిద్రమివ యోషితః ॥

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యోపదేత్ ।
తస్య నిస్సరతే వాణీ జహ్నుకన్యా ప్రవాహవత్ ॥

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యోధ్వనిః ।
విశోభతే చ వైకుంఠ కవాటోద్ఘాటన ధ్వనిః ॥

## ఫలశ్రుతి

శ్లోకత్రయ మిదం దివ్యం హయగ్రీవ పదాంకితం ।
వాదిరాజయతిప్రోక్తం పఠతాం సంపదాం ప్రదం ॥

## జాతకంలో గురువు బలహీనంగా ఉంటే...

జాతకంలో గురువు బలహీనంగా ఉంటే.. సంతాన సౌఖ్యత లేక పోవటం, కీర్తి గౌరవ ప్రతిష్టలకు నశించుట, నిత్యం వాహన ప్రమాదాలు దయాదాక్షిణ్యాలు లేక పోవుట, ఇతరులను కష్టపెట్టే విధంగా నిర్మోహ మాటంగా సత్యం చెప్పుట, నిష్ఠూరంగా మాట్లాడటం, షుగర్, క్యాన్సర్, మూత్ర రోగాలు, పెద్ద పొట్టతో కలిగిన దేహం, పరులను నమ్మి సెక్యూరిటీగా ఉండటం, గురువు జాతక చక్రంలో ఏ అవయవం మీద ఆధిపత్యం వహిస్తే ఆ అవయవ పరిమాణాన్ని పెంచి పెద్దది చేస్తాడు. వ్యాధి వస్తే తొందరగా తగ్గదు. లైఫ్‌లో ఎంజాయ్‌మెంట్ ఉండదు. జీవితంలో సుఖం, సంతోషం లేకపోవుట, దైవంపై నమ్మకం లేకపోవుట, పెద్దల యందు గౌరవం లేకపోవుట, ఆచారములు పాటించకుండుట, ఉన్నత విద్యకు ఆటంకాలు, నియంతగా ప్రవర్తించుట, ధనమునకు ఇబ్బందులు కలుగుట, ఎన్ని పూజలు, వ్రతాలు చేసినా ఫలితం లేకపోవుట, జీర్ణశక్తి లేకపోవుట, లివర్‌కు సంబంధించిన వ్యాధులు కలుగుచున్నప్పుడు గురుగ్రహ దోషంగా గుర్తించి గురుగ్రహ అనుగ్రహం కొరకు గురుచరిత్ర పరాయణ చేయడం, గురువులను గౌరవించుట, దైవ క్షేత్రములు సందర్శించుట, శనగలు దానం చేయుట, పంచముఖ రుద్రాక్షను లేదా కనక పుష్య రాగమును ధరించవచ్చును.



# గురు గ్రహ అనుగ్రహం కోసం "హరిద్ర గణపతి"



పసుపు కొమ్ము మీద గణపతి ఆకారాన్ని చెక్కబడిన గణపతిని పూజించిన గురు గ్రహ అనుగ్రహం కలుగుతుంది అని చెప్పబడుతుంది. జాతకచక్రంలో గురువు అనుకూలంగా లేనివారు పసుపు కొమ్ము గణపతిని పూజిస్తే వ్యతిరేక ఫలితాల నుండి విముక్తి కలుగుతుంది. పసుపుకొమ్ము గణపతిని పూజామందిరంలో ఎరుపు లేదా పసుపు రంగు వస్త్రం పరిచి దానిపై గణపతిని ప్రతిష్టించాలి. పసుపుకొమ్ము గణపతికి ధూప దీప నైవేద్యాలు సమర్పించి మనసులో ఉన్న కోరికను చెప్పుకోవాలి. **"ఓం హరిద్ర గణపతాయనమః"** అనే మంత్రాన్ని ప్రతిరోజు 108 సార్లు జపించాలి.

## సంతాన సమస్యలకు పసుపుకొమ్ము గణపతి

జ్యోతిష్యశాస్త్రంలో అత్యంత ప్రాధాన్యత కలిగిన గ్రహం మరియు శుభగ్రహం గురుగ్రహం. గురుగ్రహ కారకత్వాలలో సంతాన కారకత్వం ప్రధానమైనది. సంతాన సమస్యలు ఉన్నవారు పసుపు కొమ్ము గణపతిని పూజించటం మంచిది. మనదైవిక ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో మొట్టమొదటిసారిగా పసుపు గణపతిని పూజించటం మన ఆచారం. ఈ పసుపు గణపతిని పూజించటానికి ఒక కథ ఉంది.

## పసుపుకొమ్ము పసుపు కొమ్ముగా మారిన కథ

త్రిపురాశులనే రాక్షసుల సంహారార్థం శివుని త్రిశూలం ప్రయోగించగా అందునా వారు ఏకకాలం మరణం కోరుకొనుట వలన మువ్వురిని ఒకే

కాలంలో సంహరించే ప్రయత్నంలో నందీశ్వరుడు త్రిశృంగములు కలిగిన వాడు కావున ముగ్గురిని తన శృంగములలో ఒకే కాలమందు పైకెత్తగా శివుని త్రిశూలం ముగ్గురిని ఏకకాలంలో సంహరించుట జరిగింది. ఇందు చిన్న అపశ్రుతి వలన నంది మధ్య శృంగం త్రిశూల ఉద్ధృతికి నేలరాలగా అదియే పరమేశ్వరుని వరం వలన పశువు కొమ్ము పసుపు కొమ్ముగా మారి ఆరంభ పూజలందుకొనే విఘ్నేశ్వరునికి మూర్తి రూపంగా (హరిద్ర మూర్తిగా) చేయటం సంప్రదాయంగా వస్తున్నది.

గురుగ్రహం పసుపు వర్ణానికి అధిపతి. పసుపు కొమ్ము గణపతి శుభానికి ప్రతీక కావటం వలన మనం ఆరంభించే అర్చనాది కార్యక్ర మాలు, ఆధ్యాత్మిక క్రతువులు శుభారంభాన్ని, మోక్ష కారకాన్ని కలుగ జేస్తాయి. జ్యోతిష్య శాస్త్రంలో గురువు జ్ఞానకారకుడు, సంతానకారకుడు, గృహసౌఖ్యం, ఆచారాలు మొదలైన వాటికి సంబందించిన ఇబ్బందులు ఉన్నవారు పసుపుకొమ్ము గణపతిని పూజించటం మంచిది.

గురు గ్రహం ఒక రాశి నుంచి బయలుదేరి తిరిగి అదే రాశికి చేరుకోవడానికి 'పుష్కర కాలం' పడుతుంది. మేధోపరమైన ఉన్నత లక్షణా లను ప్రాసాదించే గురువు, కొన్నిరకాల వ్యాధుల బారిన పడటానికి కారకుడు అవుతుంటాడు. జాతకంలో గురువు స్థానం సరిగ్గా లేనప్పుడు కాలేయ సంబంధమైన వ్యాధులు సంక్రమిస్తుంటాయి. ఇక పైకి తెలియకుండా లో లోపల విస్తరించే షుగర్ ... కేన్సర్ వంటి వ్యాధులు కూడా గురువు అనుగ్రహం లేకపోవడం వల్లనే కలుగుతాయి. ఇలాంటి వారు పసుపుకొమ్ము గణపతిని పూజించాలి.

గురుగ్రహం నుంచి ప్రసరించే దుష్ఫలితాల బారి నుంచి కొంతలో కొంత తప్పించుకునే మార్గం లేకపోలేదు. దత్తాత్రేయుడు, రాఘవేంద్ర

స్వామి, శిరిడీ సాయిబాబా, రామకృష్ణ పరమహంస వంటి గురువులను పూజించడం వలన బృహస్పతి అనుగ్రహాన్ని పొందవచ్చు. దక్షిణామూర్తిని స్మరించడం వలన గురువుని శాంతింపజేసి, ఆయన నుంచి వస్తున్న వ్యతిరేక ఫలితాల నుంచి బయట పడవచ్చు.

## పసుపు గణపతిని పూజిస్తే కలిగే శుభాలు

శనగలు గురు సంబంధమైన ధాన్యంగా చెప్పబడ్డాయి కనుక, వాటిని దానం చేయడం వలన కొంత ఉపశమనం లభిస్తుంది. ముఖ్యంగా సంతాన సమస్యలు ఉన్నవారు పసుపు కొమ్ము గణపతిని పూజించాలి.

హరిద్ర గణపతిని పూజగదిలో పెట్టుకుని పూజిస్తే ఇంటికి, ఇంట్లో ఉన్నవారికి అన్ని ఆటంకాలు తొలగుతాయి. అన్ని విధాల ధన, కనక, వస్తు, వాహనాలు వృద్ధి చెందుతాయి. పసుపు గణపతి లేక హరిద్ర గణపతి పూజ వలన దేహకాంతి పెరుగుతుంది. సమస్త చర్మ రోగాలు నయం అవుతాయి.

పసుపు గణపతి లేక హరిద్ర గణపతి పూజతో పాటు గౌరీ దేవీని పూజించటం ద్వార ఇంట్లో వుండే వధువుకు లేక వరుడుకు ఉన్న వివాహ దోషాలు తొలగిపోతాయి త్వరలో వివాహం నిశ్చయం అవుతుంది.

హరిద్ర గణపతిని పూజించి దేవికి పసుపు రంగు చీరను ఇస్తే ఇంట్లో ఉండే దోషం మరియు దైవ దోషాలు తొలగిపోతాయి.

దుకాణల్లో చాల రోజులుగా అమ్ముడు కాకుండా మిగిలివుండే వస్తువులపై హరిద్ర గణపతిని తాకిస్తే వెంటనే వ్యాపారం అవుతుంది.

హరిద్ర గణపతిని పూజించే వారికి డబ్బు సమస్య రాదు. అప్పుల బాధ తొలగిపోతుంది. కామెర్లు ఉన్నవారి ఇంటి వారు హరిద్ర గణపతిని దానంగా ఇస్తే కామెర్ల రోగం తొలిగిపోతుంది. ప్రతి సంవత్సరం కామెర్ల

రోగం వచ్చేవారు సుమంగుళకు హరిద్ర గణపతితో పాటు పసుపు రంగు చీర తాంబూలాలను దానంగా ఇస్తే కామెర్ల సమస్య తలెత్తదు.

హరిద్ర గణపతికి హరిద్ర మాలను అలంకరింపజేసి పూజిస్తే దైవకళ పెరుగుతుంది. వ్యాపారం జరగని దుకాణాల్లో దక్షిణావృత శంఖాన్ని, హరిద్ర గణపతి, హరిద్రమాలతో పాటు పసుపు రంగు కాగితంలో చుట్టి దానిని గల్లా పెట్టిలో ఉంచితే వ్యాపారం వృద్ధి అవుతుంది.

గురువు జాతకచక్రంలో ఏ అవయవానికి ఆధిపత్యం వహిస్తాడో దాని సహజ పరిమాణాన్ని పెంచి పెద్దదాన్ని చేస్తాడు. స్థూలకాయులు, షుగర్, కాలేయ, క్యాన్సర్, ఉన్నవారు పసుపు కొమ్ము గణపతిని పూజిస్తూ పాలల్లో ఒక చిటికెడు పసుపుగాని, మెంతి పొడిగాని గాని వేసుకొని త్రాగితే గురు గ్రహ అనుగ్రహం కలిగి ఈ వ్యాధుల నుండి ఉపశమనం కలుగుతుంది.



**తమిళనాడులోని సిరికంజి వద్దనున్న తిరువెంకడు శ్వేత్రాణ్యేశ్వరర్ ఆలయం మనదేశంలోని బుధుడి ఆలయాలలో ప్రముఖమైనది. రాశిచక్ర పరివర్తన కాలంలో బాధల నుండి బయట పడటానికి భక్తులు ఈ ఆలయాన్ని సందర్శిస్తారు.**



# గురు గ్రహ దోష నివారణకు "దక్షిణామూర్తి స్తోత్రం"



దక్షిణామూర్తి విగ్రహాన్ని పరిశీలించినప్పుడు ఒక మర్రి చెట్టుకింద కూర్చుని ఒక కాలు రాక్షసుణ్ణి తొక్కిపట్టి ఉంటుంది. మరో కాలు పైకి మడిచి ఉంటుంది. చుట్టూ ఋషులు కూర్చుని ఉంటారు. ఈ భంగిమలోని ఆంతర్యాని ఈ విధంగా చెబుతారు.

బ్రహ్మ యొక్క నలుగురు కుమారులైన సనక, సనందన, సనాతన, సనత్కుమారులు బ్రహ్మజ్ఞానం కోసం అనేక రకాలుగా తపస్సు నాచరించారు. అయినా వారికి బ్రహ్మజ్ఞానం అంతుపట్టలేదు. వారు చివరికి పరమ శివుని దగ్గరకు వెళ్ళి తమకు పరమోత్కృష్టమైన జ్ఞానాన్ని ప్రబోధించాల్సిందిగా కోరారు. అప్పుడు శివుడు ఒక మర్రి చెట్టు కింద కూర్చు న్నాడు. ఆయన చుట్టూ నలుగురు ఋషులు కూర్చున్నారు. శివుడు ఒక్క మాట కూడా మాట్లాడకుండా ఆయోగ భంగిమలోనే కూర్చున్నాడు. ఋషులందరికీ అనుమానాలన్నీ వాటంతట అవే తొలగిపోయి జ్ఞానోదయ మైంది. ఈ రూపాన్నే దక్షిణామూర్తిగా హిందూ పురాణాల్లో వర్ణించబడింది. ఈ రూపం మనకు ఏమని సూచిస్తుందంటే జ్ఞానమనేది మాటల్లో వర్ణించలేనిది, కేవలం అనుభవించదగినది అని. గురు దక్షిణామూర్తిగా మనం పూజించే

దక్షిణామూర్తి గురువులకే గురువు. అందుకనే ఈయన గురించి మన పురాణాల్లో విస్తృతంగా వర్ణించారు.

## అమ్మవారి స్వరూపంలేని శివరూపమే దక్షిణామూర్తి

స్మార్త సంప్రదాయంలో గురు సంప్రదాయానికి ఆద్యుడు దక్షిణా మూర్తి. ఉత్తర భాగాన (అనగా ఎడమభాగాన) అమ్మవారి స్వరూపం లేని కేవల శివ స్వరూపం కనుక దానికి 'దక్షిణామూర్తి' అని పేరు. మేధా దక్షిణామూర్తి వేరే దేవత కాదు. ఆ స్వామిని ప్రతిపాదించ మంత్రాలలో ఒక మంత్రానికి అధి దేవతామూర్తి మాత్రమే. అలాగే శ్రీ దత్తాత్రేయుడు, గురుదత్తుడు అనేవారు వేరేవేరే దేవతామూర్తులు కాదు. ఈ దత్తుడు త్రిమూర్త్యాత్మకుడు. సర్వసంప్రదాయ సమన్వయకర్త.

## శివుని గురు స్వరూపమే దక్షిణామూర్తి

శివుని గురు స్వరూపాన్ని దక్షిణామూర్తిగా ఉపాసించడం సంప్రదాయం. దక్షిణ అంటే సమర్ధత అని అర్థం. దుఃఖాలకు మూల కారణం అజ్ఞానం. అలాంటి అజ్ఞానం నాశనమైతే దుఖాలన్నీ తొలగిపోయాయి. దుఃఖాలకు శాశ్వత నాశనాన్ని కలిగించేది దయాదాక్షిణ్యం. ఈ దాక్షిణ్యం ఒక మూర్తిగా సాక్షాత్కరిస్తే ఆ రూపమే దక్షిణామూర్తి. విష్ణు, బ్రహ్మ, సూర్య, స్కంద, ఇంద్ర తదితరులు దక్షిణామూర్తిని ఉపాసించి గురుత్వాన్ని పొందారు.

## మంత్రశాస్త్రం ప్రకారం వివిధ దక్షిణామూర్తులు

మంత్రశాస్త్రం ప్రకారం దక్షిణామూర్తులు అనేకులు. ఆ రూపాలు వరుసగా శుద్ధ దక్షిణామూర్తి, మేధా దక్షిణామూర్తి, విద్యా దక్షిణా మూర్తి, లక్ష్మీ దక్షిణామూర్తి, వాగీశ్వర దక్షిణామూర్తి, వటమూల నివాస దక్షిణా మూర్తి, సాంబ దక్షిణామూర్తి, హంస దక్షిణామూర్తి, లకుట దక్షిణామూర్తి,



చిదంబర దక్షిణామూర్తి, వీర దక్షిణామూర్తి, వీరభద్ర దక్షిణామూర్తి, కీర్తి దక్షిణామూర్తి, బ్రహ్మ దక్షిణామూర్తి, శక్తి దక్షిణామూర్తి, సిద్ధ దక్షిణామూర్తి. ప్రధానమైన ఈ 16 మూర్తులలో వటమూల నివాస దక్షిణా మూర్తినే వీణా దక్షిణామూర్తిగా శాస్త్రం చెబుతోంది. చిన్న పిల్లలకు చదువు దగ్గర నుండి, సంపద (ధనము) దగ్గర నుండి, పెద్దలకు మోక్షము వరకు దక్షిణామూర్తి ఇవ్వలేని సంపద, విద్య లేనేలేదు. చదువుకు, సంపదకు, మోక్షానికి దక్షిణామూర్తి అధిష్టానం దైవం అయి ఉంటాడు.

## దక్షిణామూర్తి స్తోత్రం

విశ్వందర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యధానిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రభోధసమయే స్వాత్మానమే వాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

బీజస్యాంతతి వాంకురో జగదితం ప్రాక్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్రచిత్రీకృతం
మాయావీవ విజృంభ త్యపి మయా యోగేవయః స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

యస్యైవ స్ఫురణం సదాత్మకం అసత్కల్పా ర్థకం భాసతే
సాక్షాత్తత్వమసీతి వేదవచసాయో బోధయత్యాశ్రితాన్



యస్సాక్షాత్కరణాద్భవేన్నపురనావృత్తిర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

నానాచ్ఛిద్ర ఘటోదర స్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిస్పందతే
జానామీతి తమేవ భాంతమనుభాత్యేతత్సమస్తంజగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించశూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహ మితి భ్రాంతాభృశం వాదినః
మాయాశక్తి విలాస కల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోప సంహరణతో యో భూత్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్సమితి ప్రభోద సమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథాసర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తా స్వను వర్తమాన మహమి త్యంతస్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటికరోతిభజతాం యోముద్రయా భద్రయా
తస్మైశ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యచార్యతయా తథైవ పిత్ర పుత్రాద్యాత్మనా భేదతాః
స్వప్నే జాగ్రతి వాయు ఏష పురుషో మయా పరిభ్రామితః
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

భూరంభాం స్యనలోనిలోబర మహర్నాథోపిమాంశుః పుమాన్
నిత్యాభతి చరాచరాత్మక మిదం యస్మైచ మూర్త్యష్టకం
నాన్యత్కించ నవిద్యతే విమృశతాంయస్మాతత్పర స్వాదిభో
తస్మై గిరిమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

సర్వాత్వమితి స్ఫుటీకృత మిదం యస్మాదముష్మిన్ స్తవే
తేనాస్వశ్రవణాత్త దర్థ మననా ధ్యానా చ్ఛ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్వాదీశ్వత్వం స్వతః
సిద్ధేత్తత్పురష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్



రాహువు ప్రభావం వలన కలిగే ఇబ్బందులు అనారోగ్య సమస్యలకు గోమేధికం పొదిగిన ఆభరణం లేదంటే ఉంగరాన్ని పాలతో శుద్ధి చేసి ధరిస్తే ఆరోగ్యం కుదుటపడడమే కాకుండా ఇబ్బందులు తొలగి పోతాయని శాస్త్రం చెబుతోంది.

# గురువుతో వచ్చే బాలారిష్ట దోషాల నివారణ



మనిషి బతికినంతకాలం జీవనం కోసం అవసరమయ్యే ధనం, విద్య, దేహపుష్టి గురు గ్రహం ద్వారా లభిస్తాయి. **'గురుణా దేహ పుష్టిశ్చ బుద్ధిః పుత్రార్థ సంపదః'** బృహస్పతి యొక్క సానుకూల ఫలితాలు పొందడం కోసం పాదరసంతో చేసిన సాయిబాబా ఆరాధన విశేషంగా చేయడం వలన బృహస్పతి అనుగ్రహం లభిస్తుంది.

ఏ రకమైన విద్యను అయినా సరే స్వయంగా ఇవ్వగల శక్తిమంతుడు బృహస్పతి. ఈయన అనుగ్రహం ఉంటే మంచి విద్యాజ్ఞానం లభిస్తుంది.

**'కేంద్రాదిపత్య దోషస్తు బలవాన్ గురు శుక్రయోః మారక త్వేపిచ తమోః మారక స్థాన్ సంస్థితిః'** అని పరాశరులు చెప్పారు. కేంద్రాధిపత్యం వచ్చిన బృహస్పతి బహుదోషి. ఈయన మారక స్థానంలో ఉంటే వెంటనే మారకం చేస్తారు అని శాస్త్రవచనం. అలాగే జన్మ లగ్నంలో మూడవ ఇంట బృహస్పతి ఉంటే అది బాలారిష్టం. మిగిలిన గ్రహ బాలారిష్టముల కంటే గురువుతో వచ్చే బాలారిష్టములు అత్యంత ప్రమాదకరమయినవి. కారణం ఆయన దేహ కారకుడు. దేహపుష్టికి కారకుడు.

## బాలారిష్ట దోషం - పాదరస సాయిబాబా



జాతకంలో గురుగ్రహ దోషం ఉన్నవారు, గురువు తృతీయంలో ఉండటం వలన వచ్చే బాలారిష్ట దోషం ఉన్నవారు పాదరస సాయిబాబాను పూజించిన గురుగ్రహ అనుగ్రహం కలిగి గురుగ్రహ దోష పరిహారం జరుగుతుంది. పాదరస సాయిబాబాను గురువారం రోజు పూజా మందిరంలో పసుపు బట్టపైన గాని, పసుపు పొడి మీద గాని ప్రతిష్టించి **"ఓం సాయీశ్వరాయ విద్మహే షిరిడీశ్వరాయ ధీమహి తన్నో బాబా ప్రచోదయాత్"** అనే మంత్రాన్ని కనీసం 108 సార్లు జపించాలి. మంత్ర జపానంతరం దూప, దీప నైవేద్యాలతో హారతి ఇచ్చి సాయిబాబా విభూదిని నుదుట ధరించి పూజా మందిరంలో నిత్య పూజ కొరకు పాదరస సాయిబాబా విగ్రహాన్ని ప్రతిష్టించుకోవచ్చు. వీటివల్ల బాలారిష్ట దోషాలు తొలగుతాయని పూజ్యుల భావన. 

## రాహుకాలంలో ఏమి చేయకూడదు?



పవిత్రమైన లేదా చాలా ముఖ్యమైనదిగా భావించే ఏ కార్యాన్నిఅయినా రాహు కాల సమయంలో ప్రారంభించకూడదు. ఈ రాహుకాలాన్ని నమ్మే ప్రజలు ఈ రాహుకాల సమయములో కొత్తపనులను, వివాహం, ఏదైనా కొనడం మరియు వ్యాపారం వంటి కార్య కలాపాలను మొదలు పెట్టరు. అయితే మీరు ఇప్పటికే ప్రారంభించిన కార్యకలాపాలను ఆపవలసి అవసరం లేదు వాటిని రాహుకాలంలో కూడా కొనసాగించవచ్చు.

# గురు చండాల యోగ నివారణకు "ఏనుగు వెంట్రుక రింగ్ మరియు కంకణం"




జాతకంలో గురు, రాహువుల కలయిక వలన వచ్చే గురు చండాల యోగ నివారణకు ఏనుగు వెంట్రుకతో చేసిన రింగ్‌ని కాని కడియాన్ని గాని ధరించవచ్చు. ఇవి ధరించటం వలన నరదృష్టి ప్రభావాల నుండి కూడా విముక్తి కలుగుతుంది. రింగ్ కానీ, కడియం గాని మొదటి సారి ధరించే వారు గురువారం రోజు ఉదయం సూర్యోదయంలో గాని, ఆదివారం రాహుకాలంలో గాని ధరించటం వలన గురుచండాల యోగం వలన కలిగే చెడు ఫలితాల నుండి ఉపశమనం కలుగుతుంది.

గురు, రాహువుల కలయికను గురు, రాహు దోషం అని, కేంద్ర స్థానాలైన 1, 4, 7, 10 భావాలలో గురు, రాహువులు కలసినప్పుడు దానిని గురు చండాలయోగంగాను పిలుస్తారు. మిగతా స్థానాలలో కంటే కేంద్ర భావాలలో రాహు, గురుల కలయిక ఎక్కువ పాప ఫలితాలను ఇస్తుంది. ఎందుకంటే కేంద్ర స్థానాలలో పాపగ్రహాలు పాప ఫలితాలను, శుభ గ్రహాలు శుభ ఫలితాలను ఇస్తాయి. అయితే గురు, రాహువులు 10 డిగ్రీల లోపు ఉంటేనే వారి ఇద్దరి మధ్య సంయోగం ఏర్పడి గురు

చండాల యోగ ఫలితాలను పొందుతారు. గురు, రాహువుల మధ్య 10 డిగ్రీల కంటే ఎక్కువ దూరంలో ఉన్నప్పుడు గురు, రాహువులు ఏ భావంలో ఉంటే ఆ భావ ఫలితాలను గురు చండాల యోగ ఫలితాలను ఇవ్వలేరు.

లగ్న, పంచమ, నవమ స్థానాలు బలంగా ఉంటే ఈ గురు చండాల యోగం ఉన్న చిన్న చిన్న పరిహారాల ద్వారా శుభ ఫలితాలను పొందవచ్చును. గురు, రాహువులు ఉన్న భావం శుభార్గళం పొందిన పాప ఫలితాలను ఇవ్వలేవు.

గురు, రాహువులు ఉన్న రాశికి ఇరువైపుల పాప గ్రహాలు ఉన్నప్పుడు పాపార్గళం పొందటం వలన గురు చండాల యోగం యొక్క అధిక చెడు ఫలితాలను అనుభవిస్తారు. దశ అంతర్దశలలో గురు, రాహువుల యొక్క దశలలోను పాప ఫలితాలనే ఇస్తారు. గోచారంలోను గురు, రాహువులు కలసి ఉన్న లేదా రాశి చక్రంలో గురు, రాహువులు ఉన్న భావాలలో గోచార గురు రాహువుల సంచారం జరుగుతున్న చెడు ఫలితాలను ఇస్తారు.

పూర్వజన్మలో గురువులను నిందించటం, పెద్దలను ఎదిరించటం, తల్లిదండ్రులను సరిగా చూసుకోలేక పోవటం వంటి మనం చేసిన కొన్ని చెడుకర్మలు ద్వారా జాతకంలో గురు, రాహువుల యొక్క కలయిక జరుగుతుంది.

చర లగ్నాలైన మేషం, కర్కాటకం, తుల, మకర లగ్నాలకు లాభ స్థానమైన బాధక స్థానాలలో గురు, రాహువులు కలసి ఉన్న, స్థిర లగ్నాలైన వృషభం, సింహం, వృశ్చికం, కుంభ లగ్నాలకు నవమ స్థానమైన బాధక స్థానాలలో గురు, రాహువులు కలసి ఉన్న, ద్విస్వభావ లగ్నాలైన మిధున, కన్య, ధనస్సు, మీన లగ్నాలకు సప్తమ స్థానమైన బాధక స్థానాలలో గురు, రాహువులు కలసి ఉన్న పాప ఫలితాలను ఎక్కువగా ఇస్తారు. వీటి పైన శుభగ్రహ దృష్టి ఉన్న, స్వ, ఉచ్చ, మిత్ర క్షేత్రాలలో ఉన్న పాప ఫలితాలను తక్కువగా ఇస్తారు.



# వివిధ స్థానాలలో గురు, రాహువుల కలయిక ఫలితాలు



**లగ్నంలో** గురు, రాహువులు కలసినప్పుడు తమను తాము గొప్ప వాళ్లుగా ఊహించుకుంటారు. ఇతరులు తన గురించి తప్పుగా భావించటం, ఏదో జరుగుతుందని ముందుగానే ఊహించుకొని భయపడటం, ఎప్పుడూ ఊహల్లో విహరిస్తూ ఉండటం, ఎప్పుడూ నెగిటివ్‌గా ఆలోచించటం, చెడు వ్యామోహాలకు ఈజీగా లొంగిపోవటం జరుగుతుంది.

**ద్వితీయం** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు గుప్త సంపాదన కలగి ఉండటం. చెడు ఆహారపు అలవాట్లు ఉండటం. ఇంటి తిండి కంటే బయట తిండికి ఎక్కువగా ఆసక్తి చూపటం. చెడు మార్గాల ద్వారా ఐన సంపాదించి గొప్పవారు కావాలని కోరుకోవటం. కుటుంబంలో మాటకు విలువ లేకపోవటం జరుగుతుంది. చేతిలో డబ్బులు నిలవవు. కుటుంబంలో కలతలు ఉంటాయి.

**తృతీయం** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు ఇతరులను ఈజీగా కమ్యూనికేషన్ చేసి తమ ఆదీనంలోకి తెచ్చుకుంటారు. ఏదైనా ఆశించి మాత్రమే ఇతరులకు సహకరిస్తారు. సోదర, సోదరిల మధ్య తరచుగా గొడవలు లేదా కొంత ఎడబాటు ఉంటుంది. సోదరుల మధ్య ఆస్తి తగాదాలు రావటం జరుగుతుంది. రచనలు చేయగలిగే సామర్థ్యాన్ని కలిగి ఉంటారు. కుటుంబంలో తన తరువాత ఎవరు లేకపోవటం జరుగుతుంది.

**చతుర్ధ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు చదువుపై ఆసక్తి ఉంటుంది కానీ శ్రద్ధగా చదవలేరు. స్థానబలం తక్కువ ఉండటం వలన పుట్టిన ఊరుకి దూరంగా ఉంటారు. తల్లితో విభేదాలు గాని వారికి దూరంగా ఉండటంగాని జరగచ్చు. స్థిరాస్థుల విషయంలో జాగ్రత్తగా ఉండవలెను. తరచుగా మార్పులు చెందుతుంటారు. బంధు మిత్రులతో విభేదాలు ఉండటం జరుగుతుంది.

**పంచమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు సంతాన దోషం ఉంటుంది. సాంప్రదాయానికి విరుద్ధంగా ఆలోచిస్తారు. పంచమంలో రాహువు ఉండటం వలన నాగదోషం ఏర్పడి సంతానం తొందరగా కలగకపోవటం, పిల్లలపై శ్రద్ధ లేకపోవటం, స్త్రీలకు గర్భ సంబంధ సమస్యలు ఉండటం జరుగుతుంది. ప్రేమ వివాహం చేసుకుంటారు.

**షష్టమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు ఇతరులపై విజయం సాధిస్తారు. ప్రతి పనిలోనూ స్వార్ధపూరిత పోటీతత్వాన్ని కల్పించుకొని విజయం సాధిస్తారు. ఉద్యోగం చేసే చోట శతృత్వాన్ని పెంచుకుంటారు. తెలివిగా ఋణాలను పొందుతారు. కోర్టు వివాదాలలో ఇతరులను ముప్ప తిప్పలు పెట్టటంలో సమర్ధులు. ఎటువంటి రోగం లేక పోయిన మానసిక రోగులుగా ఇబ్బంది పడతారు.

**సప్తమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు వైవాహిక జీవితంలో అపోహలు ఉంటాయి. వివాహంపై విముఖత ప్రదర్శిస్తారు. ఇతరులను ఈజీగా తమ మాటలతో తమ ఆదీనంలోకి తెచ్చుకోవటం జరుగుతుంది. ఇతర కులస్థులతో వివాహం జరగచ్చు. భార్యభర్తల మధ్య సఖ్యత లేకపోవటం జరుగుతుంది. వ్యాపార భాగస్వామితో విభేదాలు లేదా మోసపోవటం జరగచ్చు. వివాహ విషయంలో తొందరగా ఒక నిర్ణయానికి రాకపోవటం జరుగుతుంది.

**అష్టమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు గుప్త శత్రువుల వలన నష్టపోవటం జరుగుతుంది. ఆయుర్ధాయ స్థానం కావటం వలన అనారోగ్య సమస్యలు ఎదుర్కోవటం జరుగుతుంది. ప్రతి పనిలోనూ ఆటంకాలు కలగటం జరుగుతుంది. ఊహించని పరిణామాలు ఉంటాయి. పిత్రార్జితాన్ని కోల్పోవటం, తండ్రికి పరువు నష్టాన్ని కలిగిం చటం జరుగుతుంది.

**నవమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు పితృదోషం ఏర్పడుతుంది. ఆధ్యాత్మిక భావనలు లేకపోవటం. సరైన గురువు లభించకపోవటం. తండ్రికి తలవంపులు తీసుకురావటం. తండ్రితో విభేధాలు కలగటం జరుగుతుంది. ఊహించిన ఆలోచనలను కార్యరూపంలో పెట్టలేరు. విదేశాలకు తరచుగా తిరగటం. పెద్ద చదువు చదివిన గుర్తింపు లేకపోవటం. తన విజ్ఞానాన్ని ప్రదర్శించలేకపోవటం జరుగుతుంది.

**దశమ** స్థానంలో గురు, రాహువులు కలసినప్పుడు పిత్రార్జితాన్ని పాడు చేసుకోవటం చేస్తారు. ఎప్పుడు తిరిగే వృత్తిలో ఉంటారు. రహస్య వృత్తుల ద్వారా ఆదాయ మార్గాలు అన్వేషించటం. వృత్తి, ఉద్యోగాలలో ఎంత కష్టపడిన గుర్తింపు లేకపోవటం. ఇతరులు చేసిన తప్పులు తనమీద పడి పరువుపోవటం జరుగుతుంది.

**లాభ స్థానంలో** గురు, రాహువులు కలసినప్పుడు కష్టపడకుండా సంపా దించాలనికోరుకోవటం. స్నేహితుల విషయంలో మోసపోవటం లేదా వారికి తన వలన లాభం చేకూరటం జరుగుతుంది. ముందే తెలిసిన వ్యక్తిని గాని లేదా స్నేహితులమధ్య వివాహం జరగటం గాని జరగచ్చు. తనకంటే పెద్ద సోదర, సోదరి విషయంలో విభేదాలు ఉండటం లేదా వారికి దూరంగా ఉండటం జరుగుతుంది.

**వ్యయ స్థానంలో** గురు, రాహువులు కలసినప్పుడు కుటుంబానికి దూరంగా జీవిస్తారు. బందన యోగం వలన శ్మశాన దర్శనాలు, జైలు దర్శనాలు కలగటం. అనవసరమైన ఖర్చులు ఉండటం. సమయాన్ని వృధా చేయటం. హాస్పటల్ ఖర్చులు అనుకోకుండా రావటం. విదేశాలకు వెళ్ళటం జరుగుతుంది.



## శనికంటే క్రూరమైనవి రాహు కేతువులు



రాశి చక్రంలో శని ప్రవేశం తోనే ఏలినాటి శని ప్రారంభ మవుతుంది. ఇది ఏడున్నరేళ్లు ఉంటుంది. ఈ సమయంలో అనేక ఆటుపోట్లు, ఇబ్బం దులు ఎదురవుతాయి. కాబట్టి శని అంటే భయపడతారు. అయితే శని కంటే అత్యంత క్రూరమైనవి రాహు కేతువులు. ఈ రెండు సృష్టించే అలజడి సామాన్యమైనది కాదు. ఇవి వ్యతిరేక దిశలో పయనిస్తే నాశనమైపోతారు. ఒకసారి వీటి ప్రభావం పడిందంటే వ్యక్తి జీవితం నరకమే. ఈ ప్రభావంతో అపార నష్టాలు, దురదృష్టం వెంటాడటం, అనారోగ్య సమస్యలు ఎదుర్కొంటారు. ఒక్కోసారి కాలసర్ప దోషాలకు కూడా సంభ విస్తాయి. ఇది మరింత ప్రమాదకరమైన ఫలితాలకు దారితీస్తుంది. రాశి చక్రంలో చంద్రుడితో రాహువు కలిసి ప్రయాణం చేస్తే అలాంటి వ్యక్తి జీవితాంతం భయంతో కుంగిపోతాడు అంటారు.



# శుక్రుడు



శుక్రుడు రాక్షస గురువు, భృగుపుత్రుడు, విష్ణుద్వేషి. స్త్రీ గ్రహం. రుచులలో పులుపుకు ప్రతీక, తెలుపువర్ణాన్ని సూచిస్తాడు. జాతి -బ్రాహ్మణ, అధిదేవత-ఇంద్రాణి. ఏడు సంవత్సరాల వయసును సూచిస్తాడు. మనో హర శరీరం, నల్లని జుట్టు, సౌందర్యవంతులకు ప్రతీక. శ్లేష్మ, వాత ప్రకృతిని సూచిస్తాడు. తత్వము-జలతత్వం, దిక్కు - ఆగ్నేయము, రత్నము -వజ్రము, లోహము -వెండి, ఋతువు -వసంతం, దిక్బలం చతుర్ధస్థానం, గుణము -రజోగుణము, ప్రదేశం -కృష్ణా గోదావరి నదుల మధ్య ప్రాంతం. శుక్రుడు భరణి, పూర్వఫల్గుణి, పూర్వాషాఢ నక్షత్రాలకు అధిపతి. శరీరంలో సంతానోత్పత్తి వ్యవస్థ. వృషభం, తులారాశులకు ఆధిపత్యం వహిస్తాడు.

రవి, చంద్రులు శత్రువులు. శని, బుధులు మిత్రులు. కుజుడు, గురువులు సములు. శుక్ర దశాకాలం ఇరవై సంవత్స రాలు. శుక్రుడు మీన రాశిలో ఉచ్ఛ స్థితిని, కన్య రాశిలో నీచ స్థితిని పొందుతాడు.

## కారకత్వములు

శుక్రుడు శారీరక సుఖము, భార్య, యౌవనం, సౌందర్యం, రాజసము, వినోదము, స్త్రీలు, ఐశ్వర్యం, జలవిహారం, ఆభరణములు, సౌందర్య సాధనములు, చతుష్షష్టి కళలు, వీర్యము, మన్మధుడు, సుగంధ ద్రవ్యములు, గౌరి, లక్ష్మి ఆలయములు, క్రీడా ప్రదేశములు, పాలు, పాల కేంద్రాలు, పాలకు సంబంధించిన వస్తు విక్రయము, వస్త్రములు దానికి సంబంధించిన వృత్తులు, అలంకార సామాగ్రి, పరిమళ ద్రవ్యములు వాటికి సంబంధించిన వృత్తులు, పానీయములు, పండ్లరసాలు వాటికి సంబంధించిన సంస్థలు, పెట్రోలు వాహనములు, నౌకలు, సముద్రయానం, రస సంబంధం ఉన్న నిమ్మ, నారింజ, కమలా, బత్తాయి మొదలైన పండ్లు, నేత్ర, సుఖ, చర్మ, కంఠముకు సంబంధించిన రోగములు, దర్జీ, కళాసంబంధ వృత్తులు, సౌందర్య సంబంధిత వృత్తులు, స్నేహితులు, బహుమతులు, హనీమూన్, ప్రేమ, విందులు విలాస విహారాదులు, పూలు, అలంకరణ సామాగ్రి, లౌక్యము, లాభము, ఒప్పందము, ఆకర్షణ మొదలైన వాటికి కారకుడు.

## రూపము

శుక్రుని వర్ణం ధవళ వర్ణం. నాలుగు భుజములు కలిగి ఉంటాడు. చేతులలో దండము, కమండలం, రుద్రాక్షమాలను ధరించి ఉంటాడు. రథాన్ని అధిరోహిస్తాడు. ఇతడి తండ్రి భృగువు, తల్లి హిరణ్యకశిపుని కుమార్తె ఉష. ఇతడికి కావ్యుడు, సితుడు, భృగుసుతుడు, దానవాచార్యుడు, ఉశనుడు అనే ఇతర నామాలు ఉన్నాయి.

## వ్యాధులు

గర్భాశయ వ్యాధులు, మూత్రపిండ వ్యాధులు, సుఖ వ్యాధులు మొదలైన వాటికి కారకుడు. కుజుడితో కలిసిన గొంతు నొప్పి, టాన్సిల్స్, గొంతు కాన్సర్, గొంతు వాపు మొదలైనవి కలుగుతాయి. బుధుడితో కలిసిన నపుంసకత్వం, చర్మ వ్యాధులు, మధుమేహం, శనితో కలిసిన సుఖ వ్యాధులు, రాహువుతో కలిసిన గర్భ సంబంధిత వ్యాధులు, కేతువుతో కలిసిన సంతాన లేమి మొదలైన వ్యాధులు కలుగుతాయి.

## వృత్తులు

శుక్రుడు కళారంగ సంబంధిత వృత్తులు, స్వీట్ షాపులు, పానీయాల షాపులు, పండ్లరసాల వ్యాపారం, పాల సంబంధిత వృత్తులు, వెండి, బంగారు, రత్న వ్యాపారములు, ప్లాస్టిక్, కలప, రబ్బరుకు సంబంధించిన వృత్తులు శుక్ర ప్రభావితులకు లాభిస్తాయి. సముద్రయానం, నౌకాయాన సంబంధిత వృత్తులు, సముద్ర సంబంధిత వృత్తులు, ఆహార సంబంధిత వృత్తి వ్యాపారాలు, ఉప్పు సంబంధిత వృత్తి వ్యాపారాలు, పెట్రోల, వాహన సంబంధిత వ్యాపారాలు, ముత్యాల వ్యాపారం, మత్యకారులకు సంబంధిత వృత్తి వ్యాపారాలను సూచిస్తుంది.

## శుక్రగ్రహ దోష పరిహారాల కోసం

మేడి చెట్టు శుక్రుని వృక్షము. ప్రతి శుక్రవారం ఉదయం అయిదున్న నుంచి ఆరున్నర లోపు చిన్న రాగి లేదా ఇత్తడి, స్టీల్..(ఇందులో ఏదైనా పర్వాలేదు) చెంబు తీసుకుని దానిలో నీటిని పోసి గంధం కలిపి, ఆ నీటిని మేడిచెట్టుకు పోయాలి. అక్కడే దీపం వెలిగించాలి. దానిని పూజించి రావాలి. ఇలా చేసిన రోజు సాయంత్రం తెల్లటి గుడ్డ, అనుమలు దానం ఇవ్వాలి. ఇలా పదహారు వారాలు చేయాలి. ఇలా చేయడం వల్ల వారి శుక్రదోషాలు పరిహారమగును. మేడిచెట్టు దేవాలయములకు అందుబాటులో ఉంటుంది.

## పురాణాలలో శుక్రుడి గురించి

శ్రీకృష్ణుడు కుచేలుడికి అనుగ్రహించిన అపార ధనసంపత్తిని ఉశనుడు అపహరించబూనడంతో ఈశ్వరుడు ఆగ్రహించి శుక్రుడిని సంహరించడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఉశనుడు తన తపశ్శక్తితో ఈశ్వరుడి ఉదరంలో ప్రవేశించి అతడిని స్తుతించసాగాడు. బోళాశంకరుడైన ఈశ్వరుడు ఉశనుడికి అభయం ఇచ్చి, శుక్ర శోణిత రూపంలో బయటకు పంపాడు. అప్పటి నుండి అతడికి శుక్రుడన్న పేరు సార్ధకమయింది. చైత్ర శుద్ధ ఏకాదశినాడు మఖ నక్షత్రంలో మన్మధ సంవత్సరంలో ఉశనుడు శుక్రుడిగా అవతరించాడు. శివుడు అతడి స్తుతికి మెచ్చి ధన్వీర్యాలకు అధిపతిగానూ, రాక్షసులకు గురువుగానూ చేసి గ్రహమండలంలో స్థానం కల్పించాడు. అసురుల గురువైన శుక్రుడు వారి అభ్యున్నతి కొరకు ఘోర తపస్సు చేసాడు. ఈశ్వరుడిని మెప్పించి మృతసంజీవనీ విద్యను సాధించాడు. శుక్రుడు సంపదలకు, మంత్రాలకు, రసాలకు, ఔషధులకు అధిపతి. అద్భుతమైన శక్తి సామర్ధ్యాలు కలిగిన శుక్రుడు తన సంపదలను దానవ శిష్యులకు అప్పగించి తపోవనాలకు వెళ్ళాడు. వర్షాలపై ఆధిపత్యం వహిస్తూ అతివృష్టి, అనావృష్టికి కారకుడౌతాడు. వర్షాలను నిరోధించే వారిని శాంతింపచేస్తాడు.

## ద్వాదశ స్థానాలలో శుక్రుడు

**శుక్రుడు లగ్నమున** ఉన్న జాతకుడు గణిత శాస్త్రజ్ఞుడు, భార్యయందు ప్రేమకలవాడు, ధనవంతుడు, పచ్చాని శరీర కాంతి కలవాడు చిరకాలం జీవించువాడు. శుక్రుడు పాప గ్రహ చేరిక కలిగి ఉన్నను శత్రుస్థానం లేక నీచస్థానంలో ఉన్న జాతకుడు కారుడు మోసకారి, వాత శ్లేష్మ పీడితుడు, సుఖరోగా పీడితుడు అవుతాడు.

**ద్వితీయమున** శుక్రుడు ఉన్న ధనవంతుడు, విశాలనేత్రములు ఉన్నవాడు, దయకలవాడు, సత్యవాది, స్త్రీ వలన లాభం పొందువాడు, స్త్రీల స్నేహం పొందువాడు , పరోపకారి అవుతాడు. శత్రువు పాపగ్రహములతో చేరిక కలిగిన నేత్ర పీడ, చంద్రునితో కలిసిన రేచీకటి కలవాడు, ధన నష్టం కుటుంబం లేనివాడు అవుతాడు.

**మూడవ స్థానంలో శుక్రుడు** ఉన్న జాతకుడు అతి లోభి, ఎక్కువ మంది సోదరులు కలవాడు, సంకల్ప సిద్ధి, ధన వృద్ధి పొందువాడు, శుక్రుడు ఉచ్ఛ క్షేత్రం స్వక్షేత్రం అందు ఉన్న సోదర వృద్ధి కలుగును. ఆరు, ఎనిమిది, పన్నెండులో ఉన్న సోదర నష్టం కలుగును.

**నాల్గవ స్థానంలో శుక్రుడు** ఉన్న జాతకుడు రూపవంతుడు, గాయ కుడు, బుద్ధిమంతుడు, ముప్పదవ సంవత్సరమున వాహన సుఖం కలుగును. సోదర సుఖం కలవాడు, క్షమాహృదయం కలవాడు ఔతాడు. భావాధిపతి బలవంతుడైన కార్లు స్కూటర్లు కలవాడు, ధన కనక వస్తు వాహన సంపద కలవాడు ఔతాడు. శత్రు, పాపస్థానమున ఉన్న బలహీనుడైన ధనహీనుడు, వాహన సుఖం లేనివాడు, తల్లికి అశాంతి, పరస్త్రీ పట్ల ఆకర్షితుడు అవుతాడు.

**పంచమ స్థానమున శుక్రుడు** ఉన్న జాతకుడు విజ్ఞాని, మంత్రి లేక సైన్యమున గొప్ప పదవి పొందువాడు, సదా అందమైన భార్యను పొందువాడు, మంచి గుణం, రాజ సన్మానం కలిగినవాడు అవుతాడు. శుక్రుడు పాప గ్రహచేరిక, బలహీనుడు, నీచ లేక శత్రు స్థానముల ఉన్న జాతకుడు మందబుద్ధి కలవాడు ఔతాడు.

**అరవ స్థానమున శుక్రుడు** ఉన్న జాతకుడు కీర్తి కలవాడు, అవసరమైన ఖర్చులు చేయువాడు, మాయావాదములు చేయువాడు, రోగ పీడితుడు



అవుతాడు. శత్రు, నీచ స్థానముల ఉన్న పాపుల చేరిక లేక చంద్రునితో చేరిక కలిగి ఉన్నా బందునష్టం పుత్రా సంతానం లేకపోవుట, శత్రునాశకుడు అవుతాడు.

**సప్తమమున శుక్రుడు** ఉన్న జాతకుడు అతి కాముకుడు, బహు ధనవంతుడు, అన్య స్త్రీ లందు ఆసక్తుడు, వాహనములు కలవాడు, సంగీత కారుడు, కార్య శూరుడు, భోగి, పుత్రవంతుడు అవుతాడు. శత్రు, నీచ స్థానముల ఉన్న బలహీనుడైన భార్యావియోగం, బహు వివాహములు, పుత్ర సంతానహీనుడు అవుతాడు. బలయుక్తుడు, స్వక్షేత్రం, ఉచ్ఛ క్షేత్రముల ఉన్న భార్య మూలమున ధనం కీర్తి కలవాడు అవుతాడు.

**ఎనిమిదవ స్థానమున శుక్రుడు** ఉన్న జాతకుడు సుఖవంతుడు, నాలువ సంవత్సరం తల్లికి గండం, అర్ధాయుష్కుడు, రోగపీడితుడు, అసంతృప్త జీవితం, త్యాగనిరతి కలిగిన భార్య కలవాడు అవుతాడు. శుక్రుడు బల యుక్తుడై, ఉచ్ఛ, శుభ గ్రహ చేరిక కలిగిన దీర్ఘాయువు, పాప గ్రహ చేరిక, నీచ, శత్రు స్థానముల ఉన్న అల్పాయువు కలవాడు అవుతాడు. మేషరాశి అష్టమమైన తృష్ణా పీడితుడు, వృషభ రాశి అష్టమమైన సుఖరోగా పీడితుడు, మిధునం అష్టమమైన దంత వ్యాధి పీడితుడు, కటకం అష్టమమైన వాత శ్లేష్మ పీడితుడు, సోహం అష్టమమైన మసూచి పీడితుడు, కన్య అష్టమమైన మంత్రముల చేత, తుల అష్టమమైన సర్పముల చేత , వృశ్చికం అష్టమమైన విష భక్షణ చేత, ధనుస్సు అష్టమమైన క్రిమి కీటకం

చేత, మకరం అష్టమమైన విష ప్రయోగం లేక శాస్త్ర చికిత్స అనంతరం, కుంభం అష్టమమైన అతికామము చేత, మీనం అష్టమమైన అతి బాధల చేత మరణం సంభవించును. ఇవి అన్ని శుక్రుడు ఉపస్థితమై ఉన్న జరుగును.

**నవమున శుక్రుడు** ఉన్న ధార్మికుడు తపస్వి, సత్కర్మ చేయువాడు, పాదముల పుట్టుమచ్చలు శుభ చిహ్నములు కలవాడు, బహు భోగ లాలసుడు, పుత్రవంతుడు, తండ్రి దీర్ఘాయువు కలవాడు అవుతాడు. శత్రు, పాపగ్రహ చేరిక కలిగి ఉన్న జాతకుని తండ్రిని బాల్యమున కోల్పోవును. భాగ్యమును కోల్పోవును. స్వక్షేత్రం, ఉచ్ఛ క్షేత్రము బలయుక్తుడై ఉన్న ధనవంతుడు మహాభోగి అవుతాడు. చతుర్ధ, సప్తమ అధిపతులతో సంబంధం ఉన్న బహు భోగములు, విదేశీ కార్లు, విదేశీ ప్రయాణాలు కలుగును.

**దశమ స్థానంలో శుక్రుడు** ఉన్న జాతకుడు ధైర్యవంతుడు, బుధ, గురు, చంద్రులతో కలిసి ఉన్న భారీహనములు కలవాడు, యజ్ఞములు చేయు వాడు, మరణానంతరం కుడా కీర్తిని పొందువాడు అవుతాడు. బలహీనుడైన, పాపగ్రహ చేరిక ఉన్న, నీచలో ఉన్న కార్య పరాజయం కలుగును.

**ఏకాదశ స్థానంలో శుక్రుడు** ఉన్న ధనవంతుడు, భూ వసతి కల వాడు, విద్యావంతుడు ఔతాడు. బలవంతుడి, శుభ గ్రహ చేరిక, ఉచ్ఛ స్థానముల ఉన్న అనేక వాహనములు కలవాడు అవుతాడు. పాపగ్రహ చేరిక, నీచం, శత్రు స్థానముల ఉన్న అన్యాయ మార్గమున ధన సంపాదన చేయును.

**ద్వాదశ స్థానమున శుక్రుడు** ఉన్న దరిద్రుడు, పాప గ్రహ చేరిక ఉన్న నీచం అయిన స్త్రీ స్నేహం, శుభగ్రహ చేరిక కలిగిన ధనవంతుడు అవుతాడు.



# దాంపత్య సౌఖ్యం,సుఖములకు కారకుడు శుక్రుడు



శుక్ర గ్రహం జాతకంలో స్త్రీ సౌఖ్యమునకు కారకుడు. వివాహం, దాంపత్య సౌఖ్యం, భోగ వస్తువులు, సుఖములు కల్పించే ఉపకరణములు ఈ శుక్రగ్రహ ప్రభావంచేత మనకు తెలుస్తుంది. అంటే శుక్రుడు జాతకంలో బలంగా ఉంటే నవరత్నధారణ, పట్టువస్త్రాలు ధరించుట, అత్తరులు, సెంట్లు మొదలైన సుగంధ ద్రవ్యాలువాడటం, పువ్వుల అలంకరణ, వినోదములు, సంగీత, నృత్య సాహిత్యములతో కాలక్షేపానికి ఎక్కువ సమయం గడపటం, భార్య అనుకూలవతిగా ఉండటం, దాంపత్యసుఖం, చిత్ర విచిత్రమైన ఫలహారములు భుజించు అవకాశం, చిత్ర లేఖనం, శిల్పమువంటి లలిత కళలలో ప్రావీణ్యత ఈ శుక్రగ్రహ ఉచ్చ స్థితిలో ఉన్నప్పుడు లభించే ఫలితాలు. అంతేగాక సింహాసనము, సుగంధము, హేమము, రాజు, రతి, స్త్రీ సుఖం, గానం, కాంతి, కళాకౌశలం, స్పర్శ, గొంతు, మూత్రపిండములు, అండ కోశము, అంతఃకరణముమీద ప్రభావం, భూతదయ, ఉన్నతమైన మేధాశక్తి, సంగీతము, నాట్యము, నాటక శాలలు, వేశ్యా సంభోగం, సౌమ్యం, సౌందర్యం, శ్వేతవర్ణం, సునేత్రం, ఖండశరీరం, పొట్టి, గర్వం, ఆజ్ఞ, శుక్లం, శయనాగారం, మంత్రం, ఆగ్నేయదిశ, చిత్రలేఖనము మొదలైన వాటికి కూడా శుక్రుడు కారకత్వం వహిస్తాడు.

# శుక్ర ప్రభావం ఎలా ఉంటుంది?



శుక్రుడు వైవాహిక ఆనందం, వ్యక్తుల గౌరవం, ఆనందాన్ని సూచిస్తుంది. ఎవరైన వ్యక్తులు జాతకంలో శుక్రుడు బలహీనంగా ఉంటే కొన్ని పరిహారాలు తప్పనిసరిగా పాటిం చాలి. వాటిలో ఆవును పూజిచడం, శ్రీహరిని ఆరాధించడం, తులసి కోటకు పూజ చేయడం లాంటివి చేయాలి అని జ్యోతిష పండితులు చెబుతారు.

జ్యోతిషశాస్త్రం ప్రకారం గ్రహాల గమనం వ్యక్తుల జీవితాలపై ప్రభావం చూపుతుంది. గతంలో లేదా భవిష్యత్తులో జరగబోయే పరిణామాలను వీటి కదలిక ఆధారంగా అంచనా వేయవచ్చు. ఈ నేపథ్యంలో సూర్యుడు తర్వాత రెండో అతిపెద్ద గ్రహం శుక్రుడు. అంతేకాకుండా శుక్రగ్రహం సూర్యుడు, చంద్రుడు తర్వాత అత్యంత ప్రకాశవంతమైన గ్రహంగా గుర్తింపు తెచ్చుకుంది. అందుకే దీన్ని అందాల దేవత అని కూడా అంటారు. జ్యోతిషశాస్త్రం ప్రకారం వృషభం, తుల రాశులకు అధిపతి. సమాజంలో గౌరవం, సమానత్వం, ఆనందం, కీర్తి, వైవాహిక ఆనందం, విలాసాలకు సంకేతంగా పరిగణిస్తారు. ఈ గ్రహం మన సంపదకు సంబంధించిన భౌతిక ఆనందాలు, వివాహ బంధానికి సంబంధించి అంశాలను ఈ గ్రహం కదలిక ఆధారంగా అంచనా వేస్తారు. ఒకవేళ వ్యక్తుల జాతకంలో శుక్రుడు బలహీనంగా ఉన్నట్లయితే ఈ కింద చెప్పిన పరిహారాలు పాటించాలి అని చెబుతారు.

## రొమాంటిక్ గ్రహం

ఏవరైన వ్యక్తుల జాతకంలో శుక్రుడు బలంగా ఉన్నట్లయితే పని తక్కువగా ఉన్నా అందులో విజయం సాధిస్తారు. అంతేకాకుండా వీరి జీవితాలు సజావుగా సాగుతాయి. అందుకే దీన్ని ప్రేమ గ్రహంగా పరిగణిస్తారు. అంతేకాకుండా దీని పరిస్థితి భార్య భర్తల మధ్య సంబంధాన్ని నిర్ణయిస్తుంది. వైవాహిక బంధంలోనూ ఈ గ్రహం కీలక పాత్ర పోషిస్తుంది. శుక్రుడు ప్రభావం వల్ల వ్యక్తులు రొమాంటిక్‌గా ప్రవర్తిస్తారు. ప్రేమ విషయంలో ఎంతో కళాత్మకంగా ఉంటారు.

## శుక్రుడు బలహీనంగా ఉంటే..

జ్యోతిషశాస్త్రం ప్రకారం ఏవరైన వ్యక్తి జీవితంలో శుక్రుడు బలహీనంగా ఉన్నట్లయితే వారి వైవాహిక జీవితం అంత ఆనంద దాయకంగా సాగదు. అంతేకాకుండా చిన్న అవసరాలకు కూడా ఎంతో ఖర్చు చేయాల్సి ఉంటుంది. ప్రేమ బంధాల్లో వైఫల్యాన్ని ఎదుర్కొంటారు. మహిళలు కూడా ఎంతో బాధను చవిచూస్తారు. ఏకాగ్రత లేకపోవడం, ఆహారం తీసుకోవడంలో సమస్య, సంపద లేకపోవడం ఆనందంలో లేకపోవడం లాంటి ఇబ్బందులు ఎదురవుతాయి. శుక్రుడు వల్ల కలిగే ఈ సమస్యలను పరిష్కరించడానికి తీసుకోవాల్సిన చర్యలు

## తులసి మొక్క నాటాలి

ఇంట్లో తులసి మొక్క ఉండటం వల్ల ఏమైనా ప్రతికూల శక్తులు ఉంటే అవి నశిస్తాయని విశ్వసిస్తుంటారు. తులసి వల్ల ఇంట్లో ఆనందం, సౌభాగ్యం, మనశ్శాంతి కలుగుతుంది. అంతేకాకుండా ఎంతో శుభం కూడా. జ్యోతిషశాస్త్రం ప్రకారం ప్రతిరోజూ తులసి కోటకు పూజ చేసి

దీపం వెలిగిస్తే ఎంతో మంచిది. శుక్రగ్రహం వల్ల మానసిక ప్రశాంతత కూడా చేకూరుతుంది. అంతేకాకుండా వెండి లేదా ప్లాటినం ఉంగరం ధరించడం ద్వారా కూడా శాంతి కలుగుతుంది. ఇది ప్రతికూల శక్తిని దూరం చేస్తుంది. అంతేకాకుండా చర్మ సంబంధిత సమస్యలను దూరం చేసుకోవాలంటే వెండి ఉంగరం ఎంతో మంచిది అని అంటారు.

## యాలకులనీటితో స్నానం

శుక్రుడు బలోపేతం చేయాలంటే ఓ కుండలో నీరు తీసుకుని అందులో రెండు యాలకులు వేసి ఓ మాదిరిగా ఉడకబెట్టాలి. ఆ నీటిని స్నానం చేసేందుకు ఉపయోగించుకోవాలి. ప్రతి శుక్రవారం ఈ విధంగా చేయడం వల్ల ఎంతో మేలు చేకూరుతుంది. అంతేకాకుండా జాతకంలో శుక్రుడు బలహీనంగా ఉంటే బలపడి జీవితంలో ఆర్థిక సమస్యలుంటే తీరుతాయి. అంతేకాకుండా వ్యక్తులకు మానసిక ప్రశాంతత కూడా చేకూరుతుంది.

## శ్రీహరిని పూజించాలి

శుక్రుడు అధిపతి విష్ణువు. కాబట్టి శ్రీహరి, లక్ష్మీ దేవిలను ఆరాధిస్తే సానుకూల ఫలితాలు అందుకుటారు. విష్ణువు అవతారమైన శ్రీరాముడు కూడా జాతకంలో ఎంతో ప్రయోజనకారిగా ఉంటాడు. ఫలితంగా వైవాహిక జీవితం ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది. ఆర్థిక సమస్యలు కూడా తీరుతాయి.

## గోవును ఆరాధించాలి

జ్యోతిషశాస్త్రం ప్రకారం జాతకంలో శుక్రుడు బలహీనంగా ఉన్నప్పుడు ఆవును ఆరాధించడం తప్పనిసరి. అంతేకాకుండా ఆవును కొలిస్తే.. వేరే ఇతర రత్నాలు, వజ్రాలు ధరించడం, నివారణలు పాటించాల్సిన అవసరం లేదు అంటారు.



# శుక్ర మూఢమి అంటే ఏమిటి?

మూఢమి అంటే చీకటి అని అర్థం. మూడమి అన్ని గ్రహాలకు ఉన్నా గురు, శుక్ర మౌఢ్యమి మాత్రమే మానవులపై ప్రభావం చూపు తుంది అని చెబుతారు. నవగ్రహాల్లో గురుడు, శుక్రుడు తమ గమనంలో సూర్యునికి దగ్గరగా వచ్చినప్పుడు మూఢమి సంభవిస్తుంది. అనగా గురు గ్రహము సూర్యునకు దగ్గరగా ఉన్నప్పుడు గురు మౌఢ్యమి ఏర్పడును . శుక్ర గ్రహము సూర్యునకు దగ్గరగా ఉన్నప్పుడు శుక్ర మూడమి ఏర్పడును. గురుడు మరియు శుక్ర గ్రహములు నైసర్గికముగా శుభ గ్రహములు. ఇవి సూర్యునకు దగ్గరగా ఉన్నప్పుడు అస్తంగతము పొందును. అంటే అవి తమ శక్తిని కోల్పోతాయి. శుభ ఫలితములను ఇవ్వలేవు.

## శుక్ర మూఢమి ఎలా ఏర్పడుతుంది?

బుధుడు, శుక్రుడు భూకక్ష్యకు లోపల ఉండి సూర్యుని చుట్టూ తిరుగుతూ బుధ శుక్రులు భూమి కంటే వేగంగా తిరుగుతూ సూర్యుని యొక్క అవతలి వైపుకి వెళ్ళినప్పుడు భూమిపైన ఉన్న మనకు బుధ, శుక్రులు కనిపిస్తారు. అట్టి సమయాన్నే బుధ అస్తంగత్వం, శుక్ర అస్తంగత్వం అంటారు. శుక్రుడు అస్తంగత్వం అయినప్పుడు శుక్ర మౌఢ్యమి అంటారు.

## శుక్ర మూఢమిలో శుభ కార్యాలు చేయకూడదా?

శుభ గ్రహమైన శుక్రునకు మౌఢ్యమి వచ్చినప్పుడు సమస్త శుభ కార్యాలు నిషిద్ధము. మౌఢ్యమిని మూఢమిగా కూడా పిలుస్తారు. శుక్రుడు సూర్య గ్రహమునకు ముందూ, వెనుక 10 డిగ్రీల దూరములోపు శుక్రు

దన్నట్లయితే అస్తంగత్వమునకు గురి అవును. అనగా శుక్రుడు తన తేజస్సును, ప్రభావాన్ని, శుభత్వాన్ని కోల్పోవును. అందువల్ల ఆ కాలములో చేసే శుభ కార్యాలకు శుభ గ్రహమైన శుక్రబలం ఉండదు కాబట్టి శుభ కార్యాలు చేయరాదు. దీనిని నిషేధ కాలముగా పరిగణించారు. ఈ మౌఢ్యమి ఉన్న కాలములో శుభ కార్యములు జరుపకూడదు. ముఖ్యముగా పెళ్ళిచూపులు, వివాహము, గృహారంభము, గృహ ప్రవేశము, వాహనము కొనుగోలు చేయుట మొదలగు సమస్త శుభకార్యములు చేయరాదు.

## శుక్ర మౌఢ్యమిలో శృంగార సమస్యలు

శుక్ర మౌఢ్యమి ఏర్పడినప్పుడు సమస్త జీవకోటి శృంగార సంబంధమైన విషయాల్లో బలహీనత ఏర్పడుతుంది. వీర్యకణాలలో జీవత్వం, పటుత్వం ఉండదు. శుక్రుడు సంసార జీవితానికి,శృంగార జీవితానికి కారకుడు. జాతకములో శుక్రుడు బలహీనముగా ఉంటే సంసార జీవితం సజావుగా సాగదు అంటారు.

## శుక్ర మౌఢ్యమిలో విపత్తులు జరుగుతాయా?

స్త్రీ ల మీద అత్యధికంగా అత్యాచారాలు జరిగే అవకాశాలుంటాయి. శుక్రగ్రహ పాలిత ద్వీపాలకు, ప్రదేశాలకు భూకంప ప్రమాదాలు పొంచి ఉంటాయి. శుక్రమౌఢ్యమి కాలములో ప్రకృతి సంపద క్షీణిస్తుంది. సముద్రం ఆటు, పోటులలో మార్పులు వస్తాయి.

## శుక్ర మౌఢ్యమిలో ఏమిచేయాలి?

ఇంద్రాణీ దేవి స్తోత్రం పారాయణం చేయాలి అని చెబుతారు. మూఢమిలో జప, హోమాది శాంతులు గ్రహాశాంతికి అభిషేకాలు గండనక్షత్ర శాంతులు అన్ని వ్రతాలు చేయవచ్చును. శుక్రమౌఢ్యమి కాలంలో ప్రసవం జరిగినప్పుడు శుక్ర గ్రహ, రవిగ్రహ శాంతి చేయాలి. నక్షత్ర శాంతి, నవగ్రహ దోష పరిహారములు, హోమము, జపములు, అభిషేకములు వంటివి కూడా చేయవచ్చును.

# శుక్ర గ్రహ దోష నివారణకు "షణ్ముఖి రుద్రాక్ష"



షణ్ముఖి రుద్రాక్ష ప్రత్యక్ష కుమారస్వామి కార్తికేయ రూపముగా భావిస్తారు. జ్యోతిష్యంలో శుక్రగ్రహ దోషాలు ఉన్నవారు షణ్ముఖి రుద్రాక్ష ధరించాలి. శుక్రుడు వివాహం, సౌఖ్యత కారకుడు. దాంపత్య జీవితంలో గొడవలు, సౌఖ్యత లేని వాళ్ళు షణ్ముఖి రుద్రాక్షను ధరించాలి. వివాహం కాని స్త్రీ, పురుషులు షణ్ముఖి రుద్రాక్షను ధరిస్తే వివాహం తొందరగా జరుగుతుంది అంటారు.

## అనామకులుగా ఉండిపోతారు

శుక్రుడు జాతకంలో బలహీనంగా ఉన్నా లేక వ్యతిరేకంగా ఉన్నా అట్టి జాతకుని సామర్థ్యాలు బయటి ప్రపంచానికి తెలియవు. ఎక్కడా అవకాశాలు రావు. తన సామర్థ్యము మీద తనకే నమ్మకము పోతుంది. ఇతరుల దగ్గర ఉద్యోగాలు చేసి లేక వారి దగ్గర సహాకులుగా స్థిరపడి వాళ్ళ పురోగతికి వీళ్ళు సోపానాలు అవుతారు. జీవితములో ఏదో సాధించాలని తాపత్రయ పడి అన్నిరకాలుగా శక్తి సామర్థ్యాలు, క్రియేటివిటీ ఉండి అనేక సంవత్సరాలు అవకాశము కోసము ఎదురుచూసి ఏ రకమైన ప్రయోజనము పొందలేక జీవితములో ఓడిపోతారు.

కొందరి జాతకములో శుక్రుడు అఖండంగా యోగిస్తాడు. కానీ ఆ యోగాన్ని నిలబెట్టలేడు. గొప్ప కళాకారుడిగా రాణించి, కీర్తిప్రతిష్టలు

సంపాదించి అత్యున్నత స్థానములో వెలిగిపోతారు. కానీ మద్యపానానికి అలవాటుపడి మద్యమే జీవితమై సర్వం కోల్పోతారు. ప్రాణనష్టం కూడా సంభవించవచ్చు. లేనిపక్షములో జీవిత చరమాంకములో తిండికి, బట్టకి నానా ఇబ్బందులూ ఎదుర్కుంటారు.

## స్త్రీలోలత్వం కూడా శుక్రగ్రహ ప్రభావమే

పేకాటలో, గుఱ్ఱపు పందాలలో నష్టపోవడము మాత్రము శుక్ర గ్రహ ప్రభావము వల్ల మాత్రం కాదు. ఓ స్త్రీకి బానిసై, వృత్తి, ఉద్యోగాలు, కెరియర్ అన్నీ నిర్లక్ష్యము చేసి సంపాదించినదంతా ఖర్చుపెట్టి దివాలా తీస్తారు. ఇది శుక్రగ్రహ ప్రతికూల ప్రభావం మాత్రమే. జాతక రీత్యా శుక్రుడు బాగా లేకపోతే స్త్రీలవల్ల అష్టకష్టాలు, నిందలు సంభవిస్తాయి. స్త్రీ లోలుడిగా అపఖ్యాతి సంభవిస్తుంది. సహోదరీ వర్గం స్థిరాస్థులను సంగ్రహిస్తారు. కోర్టుకు లాగి మరీ ఆస్తులు దక్కించుకుంటారు. చేసిన మేలును మరుస్తారు. రక్త సంబంధమే లేనట్లు ప్రబల శత్రువర్గముగా మారిపోతారు. శుక్రుడు అనుకూలముగా ఉంటే ఎంతటి వ్యభిచారము చేసేవాడయినా అతని లీలలు వెలుగులోనికి రావు.

## షణ్ముఖి రుద్రాక్ష ధరించాల్సిన వారు

వ్యాపారంలో అభివృద్ధి లేనివారు, ఒడుదుడుకులు ఉన్నవారు షణ్ముఖి రుద్రాక్ష ధరించాలి. లలిత కళలలో రాణించాలని అనుకునేవాళ్ళు, కావ్య రచన చేయువారు, సంగీతం, నాట్యం, కవిత్వం, జ్యోతిష్యం, రత్న వ్యాపారం చేయువారు షణ్ముఖి రుద్రాక్ష ధారణ చేయాలి.

సంసార సౌఖ్యత లేనివారు, శయ్యా సౌఖ్యత లేనివారు షణ్ముఖి రుద్రాక్ష ధరించాలి. కంటిలో రెటినాకు శుక్రుడు కారకుడు కావున దృష్టి లోపం

ఉన్నవారు షణ్ముఖి రుద్రాక్షను మెడలో ధరించటం గాని, నీటిలో రుద్రాక్షను వేసుకొని నీటిని తాగిన దృష్టి లోప సమస్యల నుండి నివారింపబడతారు. జాతకంలో శుక్రుడు బలహీనంగా ఉంటే శృంగార సంబంధమైన విషయాల్లో బలహీనత ఏర్పడుతుంది. వీర్యకణాలలో జీవత్వం,పటుత్వం ఉండదు.

## షణ్ముఖి రుద్రాక్ష నీటిని త్రాగవల్సిన వారు

అతిమూత్ర వ్యాధి ఉన్నవారు, సుఖవ్యాధులు ఉన్నవారు, వీర్య సమస్యలు ఉన్నవారు, చర్మ వ్యాధులు, బొల్లి ఉన్నవారు షణ్ముఖి రుద్రాక్షను నీటిలో వేసుకొని త్రాగవలెను. స్త్రీ దేవతోపాసన చేయువారు, వ్యాపార భాగస్వాములు, రియల్ ఎస్టేట్, గృహోపయోగ అలంకరణ సామాగ్రి వ్యాపారం చేయువారు, వస్త్రవ్యాపారం చేయువారు, సుగంధ ద్రవ్యాల వ్యాపారం చేయువారు షణ్ముఖి రుద్రాక్షను ధరించాలి. షణ్ముఖి రుద్రాక్షను శివాలయంలో అభిషేకం చేయించి సోమవారం గాని, శుక్రవారం గాని ధరించాలి అని చెబుతారు.



## శుక్రగ్రహ దోషాలకు స్ఫటికమాల ధారణ



శుక్రగ్రహ దోషం ఉన్నవారు స్ఫటిక మాల ధారణ వల్ల కూడ జాతకులు శాంతిని అనుభవిస్తారని చెప్పబడింది. వివాహకారకుడు శుక్రుడు. వివాహం కాని వారు, వివాహం ఆలస్యం అవుతున్నవారు, వివాహం అయిన తరువాత దాంపత్య సౌఖ్యంలో ఇబ్బందులు ఎదుర్కోనేవారు శుక్రగ్రహనికి చెందిన స్పటిక మాలను ధరించటం మంచిది. నిర్మలమయిన మనస్సును స్ఫటికంతో పోలుస్తారు.

# శుక్రగ్రహ దోష నివారణకు "దక్షిణావృత శంఖం"



జాతకచక్రంలో గల శుక్రగ్రహ దోషాలు దక్షిణావృతశంఖం పోగొడుతుంది అని చెబుతారు. దక్షిణావృత శంఖం అంటే ఎడమ చేతితో పట్టుకునే శంఖము. దక్షిణావృత శంఖంలో నీరు నింపి సంతానం లేని దంపతులు ఆ నీటిని తాగినచో సంతానయోగం కలుగుతుంది అని భావన. దక్షిణావృత శంఖంలో నీరు నింపి తలపై రోజు చల్లుకుంటే పాపాలు, రోగాలు, కష్టాలు తొలిగిపోతాయి. దక్షిణావృత శంఖంలో నీటిని ఉంచి త్రాగటం వలన దీర్ఘకాలిక రోగాలు నశిస్తాయి అంటారు.

దక్షిణావృతశంఖంతో పూజచేసే వారికి సరియైన సమయంలో వివాహం జరుగుతుంది. అంతేకాక వివాహ అనంతరం దాంపత్య జీవితంలో ఎటువంటి కలతలు ఉండవు.

## ఓంకార నాదాన్ని వినిపించే దక్షిణావృత శంఖం

ఋషిశృంగుడు చెప్పిన విధానం ప్రకారం చంటి పిల్లలకు దక్షిణావృత శంఖంలో నింపిన నీరును త్రాగించినట్లయితే పిల్లలు ఆరోగ్యవంతులు అవుతారు. శంఖాలు చెవి దగ్గర పెట్టుకుంటే 'ఓంకార నాదం' వినిపిస్తుంది. శంఖాలు వల్ల ఆయువృద్ధి, లక్ష్మి ప్రాప్తి, పుత్రప్రాప్తి, శాంతి, వివాహ ప్రాప్తి కలుగునని ప్రతీతి. శంఖము పాపనాశిని ప్రతి ఇంటిలోను

శంఖము వుండవలసిన వస్తువు. శంఖము వున్న ఇల్లు లక్ష్మీ నివాసము. దక్షిణావృత శంఖం "లక్ష్మీదేవి" స్వరూపం.

## దక్షిణావృత శంఖ జననం

దక్షిణావృత శంఖం పుట్టుక సముద్రమధనంలో జరిగిందని చెబుతారు. సముద్ర మధనంలో వచ్చిన పదునాలుగు రత్నాలలో దక్షిణావృత శంఖం ఒకటి. విష్ణుపురాణం ప్రకారం దక్షిణావృత శంఖం లక్ష్మీ సముద్ర రాజ తనయ అయినది. దక్షిణావృత శంఖం లక్ష్మీకి సోదరి, సోదరుడు కూడాను. ఈమె లక్ష్మీకి వారసురాలు, నవనిధులలో అష్టసిద్ధులలో దీనికి ఉపయోగిస్తారు. దీపావళి రోజున దక్షిణావృత శంఖాన్నిపూజ, ఆరాధన, అనుష్ఠాలలో, హారతిలో, యజ్ఞాలలో, తాంత్రిక క్రియలలో దీనిని ఉపయోగిస్తారు.

## దక్షిణావృత శంఖాలలో తెలుపు రంగే శ్రేష్ఠం

దక్షిణావృతశంఖాన్ని తూర్పు ముఖంగా ఉంచి అభిషేకం చేసినప్పుడు కుడి ప్రక్కన అనగా దక్షిణం వైపు కడుపు (ఆవృతం) ఉంటుంది కాబట్టి ఈ శంఖానికి దక్షిణావృత శంఖం అంటారు. దక్షిణావృత శంఖాలలో తెలుపు రంగులో ఉన్నవి శ్రేష్టం. ఎరుపు రంగు గీతలతో ఉన్న శంఖాలను కూడ పూజిస్తారు.

**"శంఖే చంద్ర మావాహయామి కుక్షే వరుణ మావాహయామి**
**మూలే పృథ్వీ మావాహయామి ధారాయాం సర్వతీర్థ మావాహయామి"**

దక్షిణావృతశంఖం సంపదలకు ప్రతీక. ఈ పవిత్రమైన శంఖాన్ని పూజా గదుల యందు వుంచినట్లు అయితే అన్ని అరిష్ఠాలు మాయమై పోతాయి. సౌభాగ్యాల పంట దక్కుతుంది. ఇందువల్లనే భారతీయ సంస్కృతిలో దీనికి ప్రత్యేకమైన స్థానం కలదు. మందిరాలలోను శుభకార్యాలలోను శోభను పెంచుతుంది.

## దక్షిణావృత శంఖాన్ని ఏ రోజున పూజించాలి?

దక్షిణావృత శంఖాన్ని దీపావళి, అక్షయ తృతీయ మరియు శుక్ర వారం రోజు పూజిస్తే ఉత్తమ ఫలితాలు సాధించవచ్చు. దక్షిణావృత శంఖాన్ని పూజామందిరంలో ఎర్రని వస్త్రంపైనగాని, బియ్యం పైనగాని, కుంకుమ పైన గాని, కూర్మస్టాండ్ పైనగాని ఉంచి లలితసహస్రనామంతో గాని, లక్ష్మీ అష్టోత్తరంతో గాని చదువుతూ పూజచేయాలి. ఇంకా శంఖంతో విగ్రహాలను అభిషేకించవచ్చును.

**"సముద్రతనయాయ విద్మహే శంఖరాజాయ ధీమహీ తన్నో శంఖప్రచోదయాత్"** అనే మంత్రం గాని **"ఓం శ్రీ లక్ష్మీ సహోదరాయ దక్షిణావృత శంఖాయనమః"**అను మంత్రాన్ని గాని 108 సార్లు పఠించాలి. శంఖం సాధకుని మనోవాంచలను పూర్తి చేస్తుందని, సుఖ సంతోషాలను కలగజేస్తుంది అని నమ్మకం.

## దక్షిణావృత శంఖ అభిషేకం

దక్షిణావృత శంఖాన్ని గంగాజలం, పాలు, తేనె, నేయితోను, బెల్లం తోను అభిషేకిస్తూ వుంటారు. దక్షిణావృత శంఖాన్ని ధూపదీప నైవేద్యాలతో పూజిస్తారు. దక్షిణావృత శంఖాన్ని పూజించటం వల్ల వాస్తు దోషాలు పోతాయి. వాస్తుదోషం పోవడానికి ఆవుపాలతో దక్షిణావృత శంఖాన్ని నింపి ఇల్లు అంతా చల్లుతారు. ఆ పాలను ఇంటి సభ్యులు అంతా సేవిస్తారు. ఇలా చేయడంవల్ల అసాధ్యరోగాలు, దు:ఖాలు దౌర్భాగ్యం దూరమవుతాయి. దక్షిణావృత శంఖాలు వున్న చోట నుండి లక్ష్మీ తరలిపోదు.



# స్త్రీలకు అత్యంత ప్రాధాన్యతనిచ్చే శుక్ర గ్రహ జాతకులు



శుక్రగ్రహ జాతకులు తమ జీవితమందు స్త్రీలకు అత్యంత ప్రాధాన్యత నిస్తారు. వీరి జీవితములో యోగ, అవయోగములు ప్రధానమైన సంఘటనలు స్త్రీలపై ఆధారపడియుండును. భార్య, ప్రేయసి, స్నేహితురాళ్ళు, గ్రహ స్థితిని బట్టి ఎవరో ఒకరు జీవితములో ప్రధానమైన మంచి మార్పులకు కారకులగుదురు. సర్వసాధారణమైన జాతకుడు వివాహానం తరము అత్యంత గొప్ప స్థితిని పొందుట, ధనము, సౌందర్యము కలిగిన స్త్రీ భార్యగా లభించుట శుక్రగ్రహ ప్రభావమే. ప్రేయసి ద్వారా, రెండో వివాహము ద్వారా లేక స్నేహితురాళ్ళ ద్వారా సామాన్యమైన జీవితము గడుపుచున్న వారు అసాధారణమైన అదృష్టవంతులగుటకు శుక్ర గ్రహమే కారణమగు చున్నది. ఈ రకమైన యోగము శుక్రుడు, యోగకారకుడైన పక్షములో తన అధియోగాన్ని జాతకునికి తన వింశోత్తరీ దశలలో ఇచ్చు చున్నాడు. శుక్ర గ్రహ జాతకులు ప్రత్యేకమైన విలక్షణమైన, పదుగురిలో గుర్తింపు పొందే విధముగా వాళ్ళ ప్రవర్తన, వేషభాషలు రూపము కలిగి యుంటారు. వీరు అలంకరణకు ప్రాధాన్యత నిస్తారు. ఉన్నదానికన్నా మరింత చక్కగా కనపడేలా ఉండడానికి ప్రయత్నిస్తారు. ఇందుకోసం ప్రత్యేక శ్రద్ధ,

సమయం కేటాయిస్తారు. బాధలు బైటికిచెప్పరు. డాంబికము అధికమయి భంగమగును. ఇందుకు శుక్రుని శాపమే కారణము. ఈజాతకులు మద్యం సేవించిన పిమ్మట ఒళ్ళు అదుపుతప్పి నోటికి వచ్చినట్లుగా మాట్లాడి, అసభ్యముగా ప్రవర్తించి, విలువ, గౌరవము పోగొట్టుకుంటారు. ఆ పరి స్థితులలో కూడా మనస్సులోని రహస్యాలు మాత్రం బయటపడవు. చంద్ర, రాహు, శని గ్రహ జాతకులు ఎంత మద్యం సేవించినా తొట్రుపడక నిగ్రహముతో ఉంటారు.



## స్త్రీ జాతకములో శుక్రుని ఫలితము

స్త్రీ జాతకములో యోగకారక శుక్రుని ఫలితముగా ఆ స్త్రీ సౌందర్యవతి, చక్కని పలువరుస, నొక్కుల జుట్టు, అహంభావము, శారీరక బలహీనత కలిగి యుండుట, ఉన్నత విద్య, వైద్య వృత్తి, సినిమా నటి, మోడలింగ్ గర్ల్‌గా రాణించగలరు. భర్తపై ఆధిపత్యము, సంతానానికి వీరి పట్ల గౌరవము, భయము ఉంటుంది. దానశీలత లక్షణాలు, శుక్ర గ్రహ గృహిణి లక్షణాలు విలక్షణముగా ఉంటాయి. భర్త పిల్లలపైన నియంత్రణ సాధించి బద్ధకముతో పనిచేయక, అనారోగ్య లక్షణాలు వల్లె వేస్తుంటారు, సమాజ సేవ, సాహిత్య, సాంస్కృతిక సేవలాంటి కార్యక్రమాల్లో మాత్రం ఉత్సాహముగా పాల్గొంటారు. (అప్పుడు ఎలాంటి రోగముండదు) భర్తను అత్త, మామలనుండి విడదీయడము, వేరు కుంపటి పెట్టడము, ముందుచూపు లేని అర్ధములేని సామాన్లుకొని డబ్బు నాశనము చేయుట, భర్తకు తెలియకుండా అప్పులు చేయుట, కోడళ్ళను వేధించడము, స్వజాతిపట్ల ఏవగింపు, నడుంనొప్పి, రక్తస్రావము, పచ్చ కామెర్లు, లో బి.పి వీరి లక్షణాలు అంటారు.

# రావణబ్రహ్మనే బోల్తాకొట్టించిన గ్రహం

రావణబ్రహ్మ మహాతపస్వి. సర్వశాస్త్ర కోవిదుడు. మహా పండితుడు. నవగ్రహాలను శాసించిన ఘోరతపస్వి. నిత్యం శతకోటి లింగార్చన చేసిన మహా శివభక్తుడు. అఖండ జ్యోతిష్య వాస్తు శాస్త్రవేత్త. లంకానగర పట్టణాన్ని తన వాస్తుశాస్త్ర ప్రావీణ్యంతో చక్కగా, గొప్పగా, సుందరంగా నిర్మించాడు. లంకానగర వాస్తు వైభవాన్ని శ్రీఆంజనేయ స్వామి వారు నాశనం చేసినట్లు మనకు సుందరకాండలో వివరించబడినది. అంతటి గొప్ప పౌళస్త్యబ్రహ్మ తన కుమారుని జన్మలగ్న నిర్ణయ విషయంలో పొరబాటు పడ్డాడు. అన్ని గ్రహాలతో పాటు శుక్రుడిని కూడా ఏకాదశంలో ఉండమని ఆదేశించాడు. దానితో శుక్రాచార్యుల వారు ఏకాదశం బంధక స్థానము. ఏకాదశంలో నేను యోగకారకుడిని కాను అని వివరించినప్పటికీ రావణబ్రహ్మ వినిపించుకోలేదు. మేఘనాథుని జన్మసమ యములో ఏకాదశంలో ఉండవసినదేనని ఆదేశించాడు. ఏకాదశంలో శుక్రుడు ఉన్న కారణం చేతనే ఇంద్రజిత్తు అనబడే మేఘనాథుడు యుద్ధంలో మరణించాడు అని చెబుతారు.

మిగిలిన యోగాల విషయం ఏవిధంగా ఉన్నా ఆయుర్భావ యోగాన్ని నిర్ణయించడంలో రావణ బ్రహ్మ పొరబడ్డాడు. కనుక ఏకాదశ స్థానములో శుక్రుడు ఉంటే వైవాహిక సంబంధమైనటువంటి ఇబ్బందులు, మర్మావయవములకు సంబంధించిన వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. కనుక ఏకాదశ శుక్రునికి శాంతి చేయించడం అవసరం.



# ఏకాదశ శుక్రుడు దోష ఫలప్రదుడు

సాధారణముగా ఏ గ్రహమైనా ఏకాదశ స్థానములో ఉంటే చాలా మంచిది. అని ఆ గ్రహ దశలలో మంచియోగం పడుతుందని జ్యోతిష్య శాస్త్ర ప్రమాణిక గ్రంథములలో చెప్పబడుతుంది. కానీ శుక్రుడు మాత్రం ఏకాదశంలో యోగించడు అని చెబుతారు. శుక్రుడు లాభస్థానములో కంటే వ్యయస్థానములో అంటే పన్నెండవ స్థానంలోనే ఎక్కువగా యోగిస్తాడు. లాభస్థానములో ఉండి శుక్రుడు ఉచ్ఛస్థితిని పొందినప్పుడు మరింత ప్రతికూల ఫలితాలను ప్రసాదిస్తాడు. శుక్రుడు నీచలోనూ యోగకారకుడే. 27వ డిగ్రీలోనూ, పరమ నీచలోనూ ఉన్నప్పుడు మాత్రం యోగకారకుడు కాదు. నీచ భంగమయినప్పుడు శుక్రగ్రహం మంచియోగాన్ని ఇస్తుంది. ఏకాదశంలో ఉన్న శుక్రుడు మారకయోగ లక్షణాలను కలిగి ఉంటాడు.

## శుక్రగ్రహ శాంతికి అవసరమైన హోమాలు

శుక్రగ్రహ దోషాలు నశించడానికి జాతకంలో శుక్రుని స్థితి ననుసరించి దోష పరిహారం కోసం భృగుపాశుపత హోమం, మహా పాశుపత హోమం పర్వత, అరణ్య, నదీ తీర ప్రాంతములలో ఈ హోమం చేయాలి. శైవ క్రతువుల్లో అనుభవము ఉన్న పండితులు ఇటువంటి హోమాలను నిర్వహించగలరు. శుక్రుడు కలిగించే దుర్యోగాల నివారణకు, శుక్ర మౌఢ్యమిలో జన్మించినవారు భృగు పాశుపత హోమం, మహా పాశుపత హోమం చేయించుకున్నట్లయితే అతి శీఘ్రముగా శుభ ఫలితాలను పొందగలరు. ఈ హోమము ద్వారా శుక్ర మహాదశ మరియు అంతర్దశలు నడుస్తున్న వారు కూడా సత్ఫలితాలు పొందవచ్చు అని అంటారు.





# శని




భారతీయ జ్యోతిష శాస్త్రంలో శని ఒక గ్రహం. దీన్ని నపుంసక గ్రహంగా భావిస్తారు. వర్ణం నలుపు, నీలం సూచిస్తాడు. శని సూర్యుడి పుత్రుడు. అధిదేవత యముడు. శని మకర రాశి, కుంభరాశులకు అధిపతి. తులారాశిలో ఉచ్ఛస్థితిని, మేషరాశిలో నీచ స్థితిని పొందుతాడు. పుష్యమి, అనూరాధ, ఉత్తరాభద్ర నక్షత్రాలకు ఆధిపత్యం వహిస్తాడు. మిత్రులు బుధుడు, శుక్రుడు, శత్రువులు రవి, చంద్ర, కుజులు, సముడు గురువు. ముసలి వారిని, సన్నని పొడగరులను సూచిస్తాడు. తత్వం వాయుతత్వం, దిక్కు పడమర, ఋతువు శిశిరం, జాతి శూద్ర, లోహము ఇనుము, ఉక్కు, రత్నములలో నీలం, గ్రహసంఖ్య ఎనిమిది, దిక్బలం సప్తమ స్థానం, గుణము తమోగుణము, ప్రదేశము హిమాలయాలలోని గంగా పరీవాహక ప్రాంతాన్ని సూచిస్తాడు. శరీర అవయవములలో ఎముకలు, క్లోమము, విసర్జకావయములను సూచిస్తాడు.

## విశేషాలు

**ఆకారం :** ప్రాచీన జ్యోతిషగ్రంథాలలో శని ముసలి వాడుగా వర్ణించబడ్డాడు. అంటే 90 సంవత్సరాల వృద్ధుడు. రంగు నలుపు, నీలం. నపుంసక గ్రహంగా శని వర్ణించబడ్డాడు. సన్నగా, పొడవుగా ఎముకల గుట్టగా నరాల పోగుగా ఉంటాడు. నూనెపూసిన శరీరం, ఇనుప కిరీటం, ఇనుప ఆభరణాలు, చేతిలో చీపురు ఉంటుంది.

**వాహనం :** కాకి. **ఋతువు :** శిశిరం. **రుచి :** వగరు.

**నివాసస్థలం :** అత్యంత మురికైన ప్రదేశాలు, శిథిల నిర్మాణాలు, చెత్తకుప్పలు, వసతులు లేని గ్రామాలు, శ్మశానాలు, పనికిరాని వస్తువులని దాచే ప్రదేశం.

**గుణం :** క్రూర గుణం. ప్రాణుల పాపఫలితాన్ని అందించే గ్రహంగా గుర్తించబడింది. ఇది పాపగ్రహంగా కూడా వర్ణించబడింది.

**దశా కాలం :** 19 సంవత్సరాలు.

## ఏలిననాటి శని

జాతక చక్రంలో 12, 1, 2 స్థానాలలో శని సంచరించే కాలం ఏలిననాటి శని కాలం. ఇది జాతకుని అత్యంత కష్టాలపాలు చేస్తుందని విశ్వసించబడుతుంది. ఇది దాదాపు ఏడున్నర సంవత్సరముల కాలం. ఇది జాతకునికి నాలుగు సార్లు రావచ్చని భావన. పాద శని, పొంగు శని, మంగు శని, మరణ శని.

**శత్రువు :** రవి,చంద్రుడు,కుజుడు శత్రుగ్రహాలుగా భావిస్తారు. ఆకారణంగా రవి కారకత్వంగా కలిగిన తండ్రి చంద్రుడు కాతకత్వంగా కలిగిన తల్లి కుజుడు కారకత్వంగా కలిగిన సోదరులతో శని ఆదిపత్యం కలిగిన మకర, కుంభ రాశుల వారికి పరస్పర వైరం ఉంటుందని భావిస్తారు.

## శని ప్రభావం

సాధారణంగా శనిని చూసి కష్టాలు కలిగిస్తాడని చాలా మంది భయపడుతుంటారు. శని పాపములకు తగిన దండన ఇస్తాడని జ్యోతిష శాస్త్రం వివరిస్తుంది. ఏలిన నాటి శని కాలం ఏడున్నర సంవత్సరమముల కాలం, శని మహర్దశ కాలంలో, అర్ధాష్టమి, అష్టమ స్థాన సంచార కాలంలో సమస్యలు సృష్టిస్తాడు. వీటికి ఆందోళన చెందవలసిన పని ఉండదు. పరిహారాలు ఉంటాయి. శని ఆధిపత్యంలో ఉన్న రాశులు అయిన కుంభ, మకర రాశుల వారికి, మిత్ర స్థానాలు అయిన మిధున, కన్యా, వృషభ, తులా రాశుల వారికి శని నక్షత్రాలైన పుష్యమి, అనూరాధ, ఉత్తరాభద్ర నక్షత్రాలలో జన్మించిన వారికి, కొంత వెసులుబాటు ఉంటుంది. కష్టాలు మనిషి అహంకారం తగ్గించి జీవిత సత్యాలను తెలియ చేయడమే కాక సుఖానికి ఉన్న విలువను గుర్తించేలా చేస్తుంది. శని జీవిత గమనానికి కావలసిన స్థిరాస్థులను ఏర్పరుచుకోవడానికి కారకుడౌతాడు కనుక కొంత మంచి జరుగుతుంది. కష్టాలను ఓర్చుకునే శక్తిని, వాటిని అధిగమించే శక్తిని ఇచ్చి మనిషిని పుటం పెట్టిన బంగారంలా మెరిసేలా చేస్తుంది. శని వైరాగ్యాన్ని, భక్తిని ప్రసాదిస్తాడు.

## కారకత్వం

ఆయుఃకారకుడు, ఆటంకములు, విరోధం, కష్టం, బాధలు, దుఃఖం, సేవకత్వం, దురాచారము, బంధనం, మూర్ఖత్వం, జూదము, జైలు జీవితం, మద్యపానం, అంగవైకల్యం, మూర్ఛ రోగం, అంగవైకల్యం, బ్లాక్ మార్కెట్, అన్యాయార్జన, జీవహింస, అవమానము, రాజదండన, బద్ధకం, క్షుద్రశక్తులు, అప్పులు, మృత్యుదేవతారాధాన, అంద విహీనత, బంధు మిత్ర తిరస్కారం

సూచిస్తాడు. వంటవారు, నపుంసకులు, చండాలురు, అక్రమసంతానం, సేవకులు, నీచులను సూచిస్తాడు. పురాతన భవనాలు, పురాతన వస్తువులు, పూరావస్తు శాఖ, సొరంగాలు, గుహలు, చలివేంద్రములు, నువ్వుల నూనె, గానుగ, నూనె దుకాణములను సూచించును. నువ్వులు, ఉల్లి, వేరు శనగ, బంగాళాదుంపలు, రాగులు, జొన్నలు, మినుములు, దున్నపోతు, గాడిద, ఒంటె, కోడి, బొగ్గు, తారు, నల్లమంగోళ్ళకు సంబంధించిన సమస్యలు, అజీర్ణం, కిరోసిన్, వెంట్రుకలు, ఎముకలు, దంతములను సూచిస్తాడు. కలప, తోలు పరిశ్రమలను సూచిస్తాడు. ఆలస్యము, దురదృష్టము, సరిహద్దులు, దహనకార్యక్రమాలు, అపవాదు, పదవీ విరమణ, నిర్మాణం, శాస్త్రీయ దృక్పదం, ఒంటరితనం సూచిస్తాడు. గనులు, వంతెనలు, చర్మము, ఆనకట్టలు, పిరికి వాళ్ళు, రాళ్ళు, ఆస్తి, ఆపద, మంచు, ఆందోళన, వినయము, అనుమానము, అనుకూలత, వినయము, సెరామిక్స్, మట్టిని సూచిస్తాడు.

## వ్యాధులు

శని వాత సంబంధ వ్యాధులను సూచిస్తాడు. కీళ్ళవాతం, పక్షవాతం, బలహీనత, నొప్పులు, కిడ్నీ లివర్ మొదలైన వాటిలో రాళ్ళు ఏర్పడుట, క్షయ, దగ్గు, ఆస్త్మా, న్యుమోనియా, ఎముకలకు సంబంధించిన వ్యాధులు, వెంట్రుకలకు సంబంధించిన సమస్యలు, అజీర్ణ వ్యాధులు, పని చేయలేని అశక్తి, డ్రగ్స్ అలవాటు మొదలైన వాటికి కారకుడు. చంద్రుడితో కలిసిన మతిభ్రమణం, పిచ్చి, వాతం, గుండె నొప్పి, కండరాల నొప్పి, తలనొప్పి, బద్ధకం, నీరసం మొదలైనవి సూచిస్తాడు. గురువుతో చేరిన జీర్ణవ్యవస్థకు సంబంధించిన వ్యాధులు. బుధుడితో కలిసిన మాటలు సరిగా రాకుండుంట, నత్తి, నాలుక మొద్దుబారటం, మెదడు మొద్దుబారటం, చెవి సంబధిత

వ్యాధులు సూచిస్తాడు. కుజుడితో కలిసిన కండరాల నొప్పి, కండరాల జబ్బులు సూచిస్తాడు. శుక్రుడితో కలిసిన గొంతు నొప్పి, టాన్సిల్స్, పైల్స్, విరేచనాలు మొదలైన వ్యాదులను సూచిస్తాడు. రాహువుతో కలిసిన విషప్రయోగం, వైరస్ వ్యాదులను సూచిస్తాడు. కేతువుతో కలిసిన రక్త పోటు వ్యాదులను సూచిస్తాడు.

## వృత్తులు వ్యాపారాలు

జైలర్, ప్లంబర్, వాచ్‌మన్, పాకీపని చేయువారు, వీధులు ఊడ్చు వారు, కూలీలు, మేస్త్రీ పనివారు, తోటమాలి, రైతులను సూచిస్తాడు. లోహాలు, తోలు, కలప వ్యాపారాలు. చంద్రుడితో కలిసిన సివిల్ ఇంజనీర్లు, బిల్డర్స్, సర్వేయర్లు, ఎక్స్‌రే టెక్నీషియన్లను సూచిస్తాడు. రవితో కలిసిన ప్రభుత్వ రంగ సేవలు చేసేవారు. గురువుతో కలిసిన భూముల కొనుగోలు అమ్మకాల వ్యాపారం, గనుల యజమానులు, సైంటిఫిక్ లాబ్‌లో పని చేయువారు. బ్యాంక్ సిబ్బంది, ప్రచారం చేయు వారిని సూచిస్తాడు. బుధుడితో కలిసిన రచయితలు, శాస్త్రవేత్తలు, కలప కోయు వారు, ఉపాధ్యాయులు, సెన్సార్ బోర్డ్, సిఐడి డిపార్ట్‌మెంటులో పని చేయువారిని సూచిస్తాడు.

## రూపము

శని నల్లని, నీల కాంతి కలిగిన మేని ఛాయ కలవాడు. నాలుగు భుజములు కలవాడు. ధనుర్బాణాలు, శూలం ధరించిన వాడు. కాకిని వాహనంగా చేసుకున్న వాడు. శనికి నిదానంగా సూర్యుడిని చుట్టి వస్తాడు కనుక మందుడు అని పిలుస్తారు. పంగు, సౌరి అను ఇతర నామాలు ఉన్నాయి. సూర్యుడికి ఛాయాదేవికి కలిగిన పుత్రుడు. మాఘ మాసం కృష్ణ పక్షం చతుర్ధశి నాడు ధనిష్ఠా నక్షత్రంలో విభవానామ సంవత్సరంలో

జన్మించాడు. శనిభగవానుడి సోదరి యమున, సోదరుడు యముడు, భార్య జ్యేష్టాదేవి. సూర్యుడి భార్య త్వష్ట ప్రజాపతి కుమార్తె సంజ్ఞాదేవి సూర్యుడి తాపం భరించలేక తనకు ప్రతిగా ఛాయాదేవిని సృష్టించి పుట్టింటికి వెళ్ళిన సమయంలో శని జన్మించాడు. తరువాతి కాలంలో సూర్యుడిని చేరిన సంజ్ఞాదేవి శనిని సరిగా చూడని కారణంగా శని ఆమెను కాలితో తన్నాడు. ఆకారణంగా శనిని ఆమె శపించంగా శనికి మందగమనం ప్రాప్తించింది.

## పరిహారం



శని దశా ప్రారంభ సమయం, అష్టమ శని, అర్ధాష్టమ శని, ఏలిన నాటి శని కాలం శని సమస్యలను ఇచ్చే సమయం. శివారాధన, శివార్చన, శివాలయ దర్శనం సమస్యలకు పరిస్కారంగా చేయాలి. శని క్షేత్రాలయిన తిరునల్లారు, శని సింగినాపురం లాంటి క్షేత్ర దర్శనం. మందపల్లిలో శనీశ్వరుడికి తైలంతో అభిషేకం, శ్రీకూర్మ దేవాలయ దర్శనం చేయాలి. శని దశాకాలం పందొమ్మిది సంవత్సరాలు కనుక పంతొమ్మిదివేల సార్లు జపం చేయించాలి. నువ్వులు, మినుములు, నూనె లను దానం ఇవ్వాలి. నల్ల వస్త్రాలు ధరించి శని గాయత్రి, శని శ్లోకం లాంటివి పారాయణం చేయాలి. అయ్యప్ప జయంతి, శనీశ్వర వ్రతం, సత్యనారాయణ వ్రతం, అయ్యప్పస్వామి పూజ చేయాలి. కూర్మపురాణ పారాయణం, వేంకటేశ్వర

శతనామావళి, శని అష్టోత్తరం చేయాలి. ఆంజనేయుడిని పూజించి దర్శించుట. పూజకు ఇనుముతో చేసిన ప్రతి మను వాడాలి. నైవేద్యం నువ్వులతో కలిపిన అన్నం, నువ్వు చిమ్మిరి, నువ్వు ఉండలు, ద్రాక్షరసం వాడాలి. కపిలగోవు దానం చేయాలి. శనికి ప్రీతికరమైన జ్యేష్టశుద్ధ ద్వాదశి, మార్గశిర శుద్ధ అష్టమి నాడు పూజలు జపాలు నిర్వహించడం శ్రేష్టం. దోషనివారణకు నీలమణి, ఎర్రచందన మాల, చతుర్దశ ముఖ రుద్రాక్ష ధారణ చేయాలి. హోమముకు వాడవలసిన సమిధ జమ్మి. ప్రీతికరమైన వారం శనివారం.

## ద్వాదశ స్థానములలో శని



లగ్నంలో శని ఉన్న జాతకుడు దుఃఖ పూరితుడు, నిస్సహాయుడు, మలినాంబరధారి, నీరసి అయి ఉంటాడు. అయినా శని స్వరాశు లైన మకరం, కుంభం, ఉచ్ఛ స్థానమైన తుల రాశులు లగ్నమై వాటిలో శని లగ్నస్థుడై ఉంటే మాత్రం రాజతుల్యుడు, ప్రధాన పదవులు వహించేవాడు, నగరపాలకుడు అవుతాడు.

ద్వితీయస్థానమున శని ఉన్న జాతకుడు జుగుప్స కలిగించే ముఖం కలవాడు, ధనహీనుడు, అన్యాయవర్తనుడు, కాల క్రమమున దూర ప్రాంత ములందు నివసించువాడు ధనవంతుడు అవుతాడు.

తృతీయస్థానమున శని ఉన్న జాతకుడు మిక్కిలి విజ్ఞానవంతుడు, ఉదారుడు, భార్యాసమేతంగా సుఖపడువాడు, ఉత్సాహి, దుఃఖం లేని వాడు అవుతాడు.

చతుర్థ స్థానమున శని ఉన్న జాతకుడు సుఖహీనుడు, గృహము లేనివాడు, వాహనములు లేనివాడు, బలారిష్టములు అనుభవించువాడు, తల్లిని పీడించువాడు అవుతాడు.

పంచమ స్థానమున శని ఉన్న జాతకుడు, అజ్ఞాని, పుత్రులు లేనివాడు, ధనహీనుడు, సుఖహీనుడు, దురభిమాని, దురాలోచనాపరుడు అవుతాడు.

షష్టము స్థానమున శని ఉన్న జాతకుడు ధనవంతుడు, అధికంగా ఆహారం తినువాడు, దుశ్చరిత్రుడు, అభిమానవంతుడు, శత్రువుల చేత ఓడింపబడిన వాడు అవుతాడు.

సప్తమ స్థానమున శని ఉన్న జాతకుడు తిరుగాడు వాడు, కళత్రం కలిగిన వాడు, భయకంపితుడు అవుతాడు.

అష్టమ స్థానమున శని ఉన్న జాతకుడు శుభ్రం లేనివాడు, ధనం లేనివాడు, మూల వ్యాధి పీడితుడు, క్రూర మనస్కుడు, సజ్జనుల చేత అవమానించబడినవాడు అవుతాడు. అదే శని వక్ర మార్గంలో ఉంటే ఆయుష్షు నష్టం అవుతుంది.

నవమ స్థానమున శని ఉన్న జాతకుడు అదృష్టం లేనివాడు, సంపద లేనివాడు, సంతతి లేనివాడు, పితృధర్మం లేనివాడు, మోసకారి అవుతాడు.

దశమ స్థానమున శని ఉన్న జాతకుడు రాజుకాని, మంత్రి కాని అవుతాడు. ధైర్యవంతుడు, ధనవంతుడు, ఖ్యాతి కలవాడు అవుతాడు.

ఏకాదశ స్థానమున శని ఉన్న జాతకుడు చిరంజీవి, బహు సంపాదనా పరుడు, స్థిరసంపదలు కలిగినవాడు, రోగములు లేని వాడు అవుతాడు.

ద్వాదశ స్థానమున శని ఉన్న జాతకుడు నిర్లజ్జ కలవాడు, ధనం లేని వాడు, పుత్రులు లేనివాడు, అంగవికలుడు, మూర్ఖుడు, శత్రువులచేత తరమబడిన వాడు, పుత్రులు లేనివాడు అవుతాడు.



# శనీశ్వరుని జన్మ వృత్తాంతము



అదితి, కస్యపముని కుమారుడైన సూర్య భగవానునికి ముగ్గురు భార్యలు. ఉషా (సంజ్ఞా), చాయ, పద్మిని. లోకాలన్నిటికి వెలుగునిచ్చే సూర్యుడు త్వష్ట ప్రజాపతి "విశ్వకర్మ" కూతురు సంజ్ఞా (ఉమా) దేవిని పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళైన నుండే సూర్యకాంతిని, తేజస్సును భారిచలేక, చూడలేక విచారముతో ఉన్న ఉమాదేవిని నారదుడు చూసి, విషయము తెలుసుకొని ఈశ్వరునిగురించి తపస్సు చేసి శక్తిని పొందమని ఉపాయ మార్గము చెప్పాడు. అప్పటికే సూర్యునికి ముగ్గురు పిల్లలు. మొదటివాడు వైవాస్తవ. రెండవవాడు యముడు. మూడవ సంతానం కుమార్తె యమున. నారదుని సలహామేరకు ఉమాదేవి తన నీడకు ప్రాణము పోసి "చాయా దేవి" గా సూర్యుని వద్ద పెట్టి పుట్టింటికి వెళ్ళిపోయెను. కూతురు భర్తకి చెప్పకుండా పుట్టింటికి వచ్చినందున అనరాని మాటలతో నిందించి

తిరిగి సుర్యుని వద్దకే వెళ్ళిపొమ్మని చెప్పగా గోప్యంగా ఉన్న ఛాయా రహస్యము బయట పడకూడదనే సదుద్దేశముతో అడవికి పోయి తపస్సు చేయసాగింది. తన అందము, యౌవ్వనము చూసి ఇతరుల బారినుండి తప్పించుకొనుటకు గుఱ్ఱము రూపములో మారిపోయి ఈశ్వరుని గురించి తపస్సు చేయసాగెను. సూర్యునికి ఛాయాదేవికి మను (సావర్ణుడు), శని, తపతి (కుమార్తె) జన్మిచారు. శని గర్భములో ఉండగా చాయ ఈశ్వరుని గురించి ఘోర తపస్సు చేసింది. ఉపవాసదీక్ష చేయడం వల్ల కడుపులో ఉన్న బిడ్డనల్లగా మారిపోయాడని, తల్లి తపోశక్తి వల్ల అనేక ఈశ్వర శక్తులు గ్రహించాడని, శని చూపే వినాశకరంగా మారినదని పండితులు అంటారు. సూర్య తేజస్సులేని ఈబిడ్డ తనబిడ్డ కాదని చాయని సూర్యుడు అనుమానించి అవమానిస్తాడు. అదివిన్న శని తన తండ్రి అయిన సూర్యుణ్నే నల్లగా మారిపోవాలని, సూర్యగమనం ఆగిపోవాలని, సూర్యరథం నల్ల రంగుగా అయిపోవాలని శపిస్తాడు. అప్పుడు తన తప్పును తెలుసుకున్న సూర్యుడు ఈశ్వరుని వేడగా జరిగిన విషయమంతా సూర్య నకు తెలిజేయగా ఈశ్వరుని కోరిక మేరకు శని తన శాపాన్ని వెనక్కి తీసుకొని సూర్యున్ని శాపవిముక్తి గావించెను. అంతా సుఖముగా ఉన్నా. శని సూర్యుని పై పగబూని ఈశ్వరుని తపస్సు జేసి ఎన్నో వరాలు పొందెను.

## శని జన్మ నక్షత్రము

శని విభావనామ సంవత్సరము, మాఘమాసము, కృష్ణపక్షము, చతుర్దశినాడు, ధనిష్టా నక్షమున జన్మించాడని కొందరంటే .. మార్గశిర మాసము బహుళ నవమి, రోహిణీ నక్షత్రాన శివుని ఆశీస్సులతో జన్మించాడని కొందరు అంటారు. శనీశ్వరుడు కుడి చేతిలో దండము, ఎడమ చేతిలో కమండలము ధరించి ఉంటాడు.

## శని భగవానుని పెళ్ళి

లక్ష్మీదేవి సోదరి అయిన జ్యేష్ఠాదేవి (ఈమెనే దరిద్రదేవత అంటారు) శనైశ్చరుడి భార్య. అంటే శనిభగవానుడు విష్ణుమూర్తికి తోడల్లుడు అన్న మాట. యమధర్మరాజుకి సోదరుడు, గ్రహాలకు యువరాజు.

శనిదూషణ సర్వదేవతలనూ తిట్టినదాంతో సమానం అని పెద్దలు చెబుతారు. ఆయనను పూజిస్తే దేవతలందరినీ పూజించినంత ఫలితం లభిస్తుందంటారు. త్రేతాయుగంలో లంకలో రావణాసురుని చెరలో ఉన్న శనైశ్చరుని ఆంజనేయుడు విడిపించాడని ఒక కథనం. అందుకే హనుమ దీక్షలో ఉన్నవారినీ అలాగే మందుడికి ఇష్టమైన నల్లటి వస్త్రాలు ధరించే అయ్యప్ప దీక్షాపరులనూ ఆయన బాధించడని నమ్మిక.

## శనీశ్వరుడు మరియు హనుమంతుడు



హనుమంతుడుని పూజించుట వలన శని భగవానుడి యొక్క ఉనికిచే ఏర్పడే 'ప్రతికూల' ప్రభావాల నుండి ఉపశమనాన్ని పొందవచ్చుని విశ్వసిస్తారు. రామాయణంలో హనుమంతుడు రావణుని బారి నుండి తనను రక్షించినందుకు కృతజ్ఞతగా, ఎవరైనా హనుమంతుని ప్రార్థించినచో, ముఖ్యముగా శనివారాలలో, వారు శనిగ్రహం యొక్క "దుష్ప్రభావాల" నుండి విముక్తులగుదురు, లేదా కనీసం వాటి ప్రభావము తగ్గుతుందని శని హనుమంతునికి ప్రమాణం చేశాడు.

## శనీశ్వరుడు - శివుడు

పూర్వము కృతయుగములో కైలాసములోని పరమశివుని దర్శించ వచ్చిన నారదుడు పరమేశ్వరునికి నవగ్రహాలలో శనిగ్రహ ఆధిక్యతను బహువిధాల చెప్పాడు. నారదుడు చెప్పిన శనిగ్రహం పొగడ్తలు శివునికి నచ్చలేదు. ఆకారణముగా 'శని అంతటి శక్తిమంతుడైతే తన ప్రభావాన్ని తనపై (శివునిపై) చూపి, తనను పీడించి శని శక్తిసామర్థ్యాలను నిరూపించుకోమను అని శివుడు అనగా నారదుడు ఆవిషయము శనితో చెప్పెను. పరమశివుని మాటలకు శనికి అవేశము, పట్టుదల ప్రేరేపించాయి. తను శివుని ఒక క్షణము పట్టి పీడిస్తానని, ఆ విషయము తెలియజేయమని నారదునిచే వార్త పంపెను. ఈ విధముగా నారదుడు శివ, శనిల మధ్య తగాదా సృష్టించాడు. నారదుడు తక్షణం శని చెప్పిన మాటలు శివునికి తెలియజేసి శని ప్రభావాన పడకుండా జాగ్రత్తపడమని చెప్పి వెళ్ళిపోయెను. "శని తనను ఎలా పీడించ గలడో చూస్తాను" అనుకుంటూ కైలాసము నుంచి మాయమై దండ కారణ్యము దారిపట్టాడు శివుడు. ఎవరి దృష్టికీ ఊహకు రాని చోటు కోసం అలోచించాడు. ఆ ఆడవిలో తూర్పు గోదావరి జిల్లా రావులపాలెం వద్ద మందపల్లి గ్రామం నందు ఒక పెద్ద రావిచెట్టు తొర్రలో ఈశ్వరుడు దాక్కున్నాడని, తపస్సు చేశాడని పురాణాలు చెప్తున్నాయి.

మరునాడు ఉదయం ఈశ్వరుడు కళ్లు తెరిచేటప్పటికి శని ఎదురుగా నిలబడి ఈశ్వరునికి నమస్కరించాడు. అప్పుడు "ఏమయింది నీ శపథం" అని ప్రశ్నించాడు ఈశ్వరుడు.



ఆయన మాటలకు శని పరిహాసం చేస్తూ "పరమశివుడంతటివాడు దేవతలకు, ఋషులకు, మరి ఎందరికో ఆరాధ్య దైవం, ప్రశాంతమైన కైలాసము నుంచి పారిపోయి దండకారణ్యములో పరుగులు పెట్టి దిక్కులేని వాడివలె చెట్టు తొర్రలో దాగుకోవడమంటే... ఆ క్షణము శని పట్టినట్లు కాదా !" అని అడిగాడు శని నెమ్మదిగా వినయంగా. శని సమయస్ఫూర్తికి, వినయానికి ఆయన ప్రభావానికి, పట్టుదలకు మెచ్చుకున్నాడు శివుడు. తనను మెప్పించిన శనికి ఆనాటి నుండి ఈశ్వర అనే శబ్దము సార్ధకం కాగలదని మానవులు తనను (శనిని) శనీశ్వరా అని పూజిస్తే .. శని తరపున పరమశివుడు ఆశీస్సులు ఇస్తానని వరము ఇచ్చెను. అలా శనిగ్రహం శనీశ్వరడు అయ్యాడు.

## శని త్రయోదశి

సృష్టి స్థితి లయ కారకుడైన ఈశ్వరుడునే ఆహా! శని ప్రభావమునకు లోనయ్యాను. సామాన్యులైన మానవులు శని ప్రభావం వల్ల ఎంత ఇక్కట్లు పడుతున్నారో కదా అని ఆలోచించి ఈశ్వరుడు, శని... "నేను ఇక్కడ తపస్సు చేసినందువల్ల నీవు నా పేరు కలుపుకుని శనేశ్వరుడని పేరు పొందగలవు. ఈ రోజు శని త్రయోదశి కావున ఈ శని త్రయోదశినాడు నీ వల్ల ఇబ్బందులు పడుతున్నవారు నీకిష్టమైన నువ్వుల నూనె, నల్ల నువ్వులు, నీలపు శంఖు పుష్పములు, నల్లని వస్త్రంతో నిన్ను ఎవరైతే అర్పించి ఆరాధిస్తారో వారికి నీ వల్ల ఏర్పడిన అనారోగ్యం, మృత్యుభయం పోయి ఆరోగ్యం చేకూరగలదు అని వరము ఇస్తునానని తెలిపాడు. శనివారం – త్రయోదశి తిథి వచ్చినరోజున శనికి నువ్వులనూనెతో అభిషేకం చేసినా ఆస్వామికి ఇష్టమైన నువ్వులు, నల్లటి వస్త్రం వంటివి దానం చేసినా శని ప్రసన్నుడవుతాడనీ ఏలినాటిశని, అర్ధాష్టమ శని బాధల నుంచి ఉపశమనం లభిస్తుందనీ భక్తుల ప్రగాఢ విశ్వాసం.

## శని త్రయోదశి పూజ నియమాలు

తలంటుకుని,ఆరోగ్యము సహకరించగలిగినవారు ఆరోజు పగలు ఉపవాసము ఉండి సాయంత్రము 8 గంటల తరువాత భోజనాదులను చేయటము.

ఆరోజు మద్యమాంసాదులను ముట్టరాదు.

వీలైన వారుశివార్చన స్వయముగా చేయటము.

శనిగ్రహదోషాలవలన బాధపడుతున్నవారు **నీలాంజన సమాభాసం, రవిపుత్రం యమాగ్రజం, ఛాయా మార్తాండ సంభూతం, తం నమామి శనైశ్చరం** అనే స్తోత్రాన్ని వీలైనన్ని ఎక్కువసార్లు పఠించటం. వీలైనంతసేపు ఏపని చేస్తున్నా **"ఓం నమ:శివాయ"** అనే పంచాక్షరీ మంత్రాన్ని జపించటం చేయాలి.

ఆరోజు కుంటివాళ్ళు, వికలాంగులకు, ఆకలి గొన్న జీవులకు భోజనం పెట్టటం చేయాలి.

ఎవరివద్ద నుండి ఇనుము, ఉప్పు, నువ్వులు, నువ్వులనూనె చేతితో తిసుకోకుండా వుండటం చేయాలి.

## ఏలినాటి శని గ్రహ దోష శాంతి విధానం

మయూరి నీలం ధరించుట.

శని జపం ప్రతి రోజు జపించుట.

శనికి తిలభిషేకం చేయించుట.

శివదేవునకు అభిషేకం, ప్రతి శనివారం రోజు ఎనిమిది రూపాయలు లేదా ఎనిమిది సంఖ్య వచ్చే లాగా దానం చేయుట.

శనివారం రోజు నవగ్రహాల ఆలయంలో లేదా శివాలయంలో ప్రసాదం పంచుట.

ప్రతి రోజు నువ్వుల ఉండలు కాకులకు పెట్టటం.

శనివారం రోజు రొట్టిపై నువ్వుల నూనే వేసి కుక్కలకు పెట్టుటం.

హనుమంతుని పూజచేయటం.

సుందరకాండ లేదా నలచరిత్ర చదవటం.

కాలవలోకానీ నదిలో కానీ బొగ్గులు, నల్ల నువ్వులు, మేకు కలపటం.

శని ఎకాదశ నామాలు చదువటం వలన ( శనేశ్వర, కోన, పింగల, బభ్రు, కృష్ణ , రౌద్ర, అంతక, యమ, సౌరి, మంద, చాయపుత్ర) ప్రతిరోజు చదవటం.

బియపు రవ్వ మరియు పంచదార కలిపి చీమలకు పెట్టుటం.

ఆవుకు నల్ల చెక్క ప్రతి రోజు పెట్టుటం.

ప్రతి శనివారం రాగి చెట్టుకు ప్రదక్షిణం మరియు నల్ల నువ్వులు మినుములు కలిపిన నీటిని రాగి చెట్టుకు పోయటం.

ఇనుముతో చేసిన ఉంగరం ధరించుటం.

చేపలు పట్టే పడవ ముందు బాగంలోని మేకుతో ఉంగరం చేసి ధరించటం.

బ్రాహ్మణులకు నల్ల వంకాయ, నల్ల నువ్వులు, మేకు, నల్లని దుప్పటి దానం చేయటం.

ప్రతి శనివారం శివాలయం లేదా నవగ్రహాలయం ముందు బిచ్చగాళ్ళకు ఆహరం పెట్టుటం.

నల్లని దుప్పటి దానం చేయటం.

అయ్యప్ప మాల ధరించుట వలన, శ్రీ వెంకటేశ్వర స్వామికి తల నీలాలు ఇచ్చుట వలన, శ్రీ వెంకటేశ్వర స్వామి మాల ధరించుట వలన,

ప్రతి శనివారం వెంకటేశ్వర స్వామి దర్శనం, శివాలయంలో శివుని దర్శనం, హనుమంతుని దర్శనం.

పైన చెప్పిన కార్యక్రమాలు మొదలైన వాటిని ఆచరించటం వలన శని దోషాలు శాంతిచునని పెద్దలు చెబుతారు.



# శని గ్రహ దోష నివారణకు "కాలమణి"



జాతకంలో ఏల్నాటి శని, అష్టమ శని, అర్ధాష్టమ శని, కంటక శని, శని మహాదశలు జరుగుతున్నవారు కాలమణిని ఉపయోగించి దోష నివారణను తగ్గించవచ్చును. ప్రతిరోజు సూర్యోదయానికి గంట ముందు వచ్చే శని కక్ష్యలో ఈ కాలమణిని చేతిలో ఉంచి శని జపం చేసిన లేదా శారీరక శ్రమ చేసిన, శనిగ్రహ బాధల నుండి విముక్తి కలుగుతుంది అని చెప్పబడుతుంది.

దీర్ఘకాల అనారోగ్యాలు ఉన్నవారు, బద్ధకం, అలసత్వం, ఒళ్ళు నొప్పులు ఉన్నవారు ఈ కాలమణిని నీటిలో ఉంచి ఉదయం సూర్యోదయంలో ఒక గంట సేపు ఉంచిన తరువాత ఆ నీటిని స్వీకరించిన లేదా ఆ నీటిని శరీరానికి తడిగుడ్డతో రుద్దిన శారీరక బాధల నుండి విముక్తి కలుగుతుంది.

వ్యాపార సంస్థలయందు గాని, ఇంటికి గాని నరదృష్టి ప్రభావం అధికంగా ఉంటే నల్ల గుడ్డలో ఈ కాలమణిని ప్రధాన సింహద్వారానికి ఉంచిన నరదృష్టి ప్రభావం నుండి ఇంటిని, వ్యాపార సంస్థని రక్షణ కవచంలా కాపాడుతుంది. శనిగ్రహాల దోషాలు ఉన్నవారు, నరదృష్టి ఉన్నవారు ఈ కాలమణిని లాకెట్‌గా గాని, చేతికి బ్రాస్‌లెట్ గాని ధరించవచ్చును. శనిగ్రహ జపం చేసేవారు ఈ కాలమణిమాలతో జపం చేయవచ్చును.



# ఏలినినాటి శని



గోచారరీత్యా శని మేషాదిరాశుల్లో సంచరిస్తాడు. అంటే 12 రాశుల్లో సంచారం పూర్తిచేయడానికి మొత్తం 30 సంవత్సరాల సమయం పడుతుంది. 30 ఏళ్ళకు ఒకసారి ప్రతిఒక్కరిపై ఏల్నాటి శని ప్రభావం ఉంటుంది. ఏల్నాటి శని వల్ల కలిగే కష్టనష్టాలు ఇలా ఉంటాయి అని అంటారు.

జాతకునికి గోచారరీత్యా తన జన్మరాశి (జన్మ నక్షత్రాన్ని బట్టి చూసుకోవాలి) నుంచి 12, 1, 2 స్థానాల్లో శని సంచరించే కాలాన్ని ఏల్నాటి శని అంటారు. ఈ మూడు రాశుల్లో మొత్తం ఏడున్నర సంవత్సరాలు సంచరించడం వల్ల దీనిని దీనిని ఏలినాటి శని అని వ్యవహరించడం జరుగుతోంది.

12వ రాశిలో సంచరించేటప్పుడు వ్యవహారాల్లో చిక్కులు, వ్యాపారాల్లో ఒడిదుడుకులు, ఊహించని మార్పులు, అనారోగ్యం, ఔషధ సేవనం, తరచూ ప్రయాణాలు. సమయం వృథా, అనవసర వ్యయం కలుగుతాయి

జన్మరాశిలో సంచరిస్తున్నప్పుడు ఆరోగ్య భంగం, నీలపానిందలు, భాగస్వాములతో వైరం, మనశ్శాంతి లోపం, ధనవ్యయం. రుణబాధలు, వృత్తి, వ్యాపారాల్లో చికాకులు. స్థానచలన సూచనలు.

రెండవ రాశిలో సంచరిస్తున్నప్పుడు ఆశలు కల్పించి నిరాశ కల్పిస్తాడు. రుణబాధలు, అనారోగ్యం, మానసిక ఆందోళన వంటి ఫలితాలు ఉంటాయి. చేతిలో డబ్బు నిలవనియ్యడు. కుటుంబ పోషణ భారం కలుగుతుంది

## మంగుశని, పొంగుశని, మృత్యుశని

జీవితంలో మొదటిసారి వచ్చే ఏల్నాటి శనిని మంగు శని అంటారు. రెండవ పర్యాయము (30 సంవత్సరాల అనంతరం) వచ్చే ఏల్నాటి శనిని పొంగుశని అని అంటారు. ఈ కాలంలో అన్ని విధాలుగా యోగదాయకంగా ఉంటుంది. ఆర్థిక, ఆస్తిలాభాలు, గృహయోగాలు, ఉద్యోగ యోగం వంటి ఫలితాలు కలుగుతాయి. మూడవ పర్యాయం వచ్చిన శనిని మృత్యుశని అంటారు. ఈ కాలంలో ఆరోగ్య సమస్యలు, అపమృత్యు భయం వంటి చికాకులు ఎదుర్కొంటారు. అలాగే జన్మరాశికి 4, 8, 10 స్థానాల్లో శని సంచరిస్తున్నప్పుడు అర్ధాష్టమ, అష్టమ, దశమ శని సంచారం అంటారు. ఇవి కూడా దోషకారకమే.

## అర్ధాష్టమ శని

జన్మరాశి నుంచి నాలుగవ రాశిలో శని సంచరిస్తే అర్ధాష్టమ శని అంటారు. రాజకీయ, వ్యాపారాల్లో చిక్కులు, కుటుంబ సమస్యలు, అశాంతి, ఆకస్మిక బదిలీలు, వ్యాపార, ఉద్యోగాల్లో మార్పులు వంటి ఫలితాలు ఉంటాయి. స్థానచలనం, స్థిరాస్తి సమస్యలు, వాహన ప్రమాదాలు, తల్లికి అనారోగ్యం కలుగుతాయి.

## అష్టమ శని

జన్మరాశి నుంచి 8వ స్థానంలో శని సంచరించడాన్ని అష్టమ శని అంటారు. ఈ కాలంలో ఉద్యోగాల్లో ఆటంకాలు. వ్యాపారాల్లో ఒడిదుడుకులు. ఆలోచనలు స్థిరంగా ఉండకపోవడం, అశాంతి, అనారోగ్య సమస్యలు వంటి ఫలితాలు ఉంటాయి. శత్రు బాధలు, ఊహించని నష్టాలు వస్తాయి.

## దశమ శని

జన్మరాశి నుంచి 10వ స్థానంలో శని సంచరిస్తున్నప్పుడు కంటక శని అంటారు. దీనివల్ల కోర్టు కేసులు, సాంఘిక, రాజకీయంగా అప వాదులు, అధికారులతో విభేదాలు, ఉద్యోగులకు ఆకస్మిక బదిలీలు వంటి ఫలితాలు ఉంటాయి. తండ్రితో గొడవలు.

అయితే జాతకచక్రంలో శని మంచి స్థితిలో ఉన్నప్పుడు, గోచారంలో గురుబలం ఉన్నప్పుడు ఏల్నాటి శని అంతగా బాధించడు. ఈ దోషాలు ఉన్న వారు శనికి తైలాభిషేకాలు, జపాదులు చేయించుకుంటే కొంత ఉపశమనం కలుగుతుంది. శని శ్రమ కారకుడు, వాయు కారకుడు కాబట్టి రోజు ఉదయాన్నే వాకింగ్ కానీ, మేడిటేషన్ (గాలి పీల్చుటం వదలటం) చేస్తే శని తృప్తిపడతాడు అని పండితుల భావన.



## శని ఇబ్బందులకు నీలమణి

శని గ్రహం వలన వచ్చే ఇబ్బందులు, కష్ట నష్టాలకు నీలమణిని ఆభరణంలో కానీ లేదంటే ఉంగరంగా గానీ ధరించ వచ్చు.



# హనుమాన్ చాలీసాతో ఏలినాటి శని దోష పరిహారం!



గ్రహాల్లో శని ప్రభావం చాలా ఎక్కువ, శనిదోషం ఉన్నవారు కష్టాలతో బాధపడుతుంటారు. జాతకంలో పుష్యమి, అనురాధ, ఉత్తరాభాద్రలను శని సంబంధ నక్షత్రాలుగా పేర్కొంటారు.

ఏలినాటి శనిలో ముఖ్యంగా జన్మ శని, వ్యయ శని, ద్వితీయ శనిలో ఒక్కొక్కటి రెండున్నరేళ్లు చొప్పున ఏడున్నరేళ్లు కొనసాగడం వల్ల ఖర్చులు, చికాకులు, అవమానాలు, బంధుమిత్రులతో విద్వేషాలు, వైరాలు, మంచి చేయబోతే చెడు జరగడం, అప్పులు, అనారోగ్యంతో హాస్పిటల్‌లో చేరడం లాంటివి ఎదురవుతాయి.

ఇక, అర్ధాష్టమ, అష్టమ శనులు సమయంలో ప్రతిపనిలోనూ అసంతృప్తి, మోకాళ్లు, కీళ్ల నొప్పులు, నరాల సంబంధిత వ్యాధులు పట్టి పీడిస్తాయి. వృత్తిపరంగా మార్పులు, వైరాగ్యం, కొత్తవారితో చిక్కులు, హోదా ఉన్నా తెలీని ఆందోళన, అసంతృప్తి, వేదన వెంటాడతాయి. ఈ సమయంలో శని దోష పరిహారం చేసి సంతృప్తి పరచడానికి వివిధ మార్గాలు ఉన్నాయి.

## శనిగ్రహ దోష పరిహారంకోసం హనుమాన్ చాలీసా

ఏలినాటి శని పీడిస్తున్నవారు హనుమాన్ చాలీసా పారాయణం చేస్తే దాని ప్రభావం నుంచి బయటపడతారు. అంతేకాదు అరోగ్యంతో పాటు ఐశ్వర్యం ప్రాప్తిస్తుంది. హనుమాన్ చాలీసా పారాయణంతో భూత ప్రేత పిశాచల పీడనం కూడా విరగడవుతుంది. ఉదయం, రాత్రి సమ యంలో పారాయణం చేస్తే ఫలితం ఉంటుంది. అలాగే ఏలినాటి శని సమయంలో ప్రతి శనివారం రాత్రి ఎనిమిది సార్లు చాలీసా పారాయణం చేస్తే శనిదోషం పరిహారమవుతుంది.

## సంజీవినీ హనుమంతుడు

సంజీవని పర్వతం మోసుకొస్తున్న హనుమంతుని పటమును కూడా ఇంట్లో ఉంచడం వల్ల శుభం జరుగుతుంది. ఎందుకంటే, రామ రావణ యుద్ధంలో మేఘనాథుడి అస్త్రం వల్ల మూర్ఛపడిపోయిన లక్ష్మణుని తిరిగి అరోగ్యవంతుని చేయడానికి సంజీవని ఔషధాలు తీసుకురమ్మంటే హను మంతుడు ఏకంగా పర్వతాన్ని తీసుకురావడం వెనుక బలమైన కారణమే ఉంది. ఒక్క మూలికను తీసుకొస్తే లక్ష్మణుడికే స్వాంతన కలుగుతుంది. అదే పర్వతాన్ని తీసుకొస్తే రామలక్ష్మణులతోపాటు అక్కడ ఉన్న అందరి నొప్పులు నివారించడానికి అవకాశం ఉంటుందని భావించాడు. అందుకే



సంజీవని పర్వతం చేతిలో ఉన్న హనుమ చిత్రపటం ఇంట్లో ఉంటే బాధల నుంచి విముక్తి లభిస్తుంది అంటారు.

ఏలినాటి శని ప్రభావం పోవా లంటే వరుసగా 45 రోజులు హను మాన్ చాలీసా పారాయణం చేయాలి. అలాగే జాతకంలో శని వక్ర చూపునకు గురైనవారు ప్రతి శనివారం రాత్రి ఎనిమిది సార్లు హనుమాన్ చాలీసా పారాయణం చేస్తే మంచి ఫలితం ఉంటుంది.

శని ప్రభావం ఉన్నవారు నవరత్నాల్లో ఒకటైన 'నీలం' ధరిస్తే ఇబ్బం దులు అధిగమించవచ్చని భావిస్తారు. అయితే, అది సరి అయిన పద్ధతి కాదని, ఎవరికి వారు నిర్ణయం తీసుకోకుండా ఈ రంగంలో అనుభవం ఉన్న జ్యోతిషుల సూచన మేరకే జాతకం ప్రకారం నీలం ధరించాలి అని అంటారు.

శని శ్రమ కారకుడు కాబట్టి సోమరితనాన్ని వీడి రోజు ఉదయాన్నే వ్యాయమం చెయ్యాలి. సాధ్యమైనంత మేరకు వాహనాలను వాడకుండా నడక ద్వారా పనులు చేసుకుంటే మంచిది.

శనివారం శరీరానికి నువ్వుల నూనేతో మర్దనచేసుకుని కొద్ది సేపటి తర్వాత వేడి నీటితో స్నానం చెయ్యాలి. పై కార్యాలవల్ల శని గ్రహదోషాలు నివారించగలవని జ్యోతిష పండితుల భావన.



# శనిగ్రహ దోష నివారణకు గుర్రపు నాడా



నల్లగుర్రానికి కొట్టబడిన వెనకనున్న ఎడమకాలి నాడాని మాత్రమే శనిగ్రహ దోష నివారణలో స్వీకరించాలి. గుర్రానికి కొట్ట కుండా ఉన్న నాడాని ఉపయోగించినను ఎటువంటి ఫలితము ఉండదు. గుర్రపునాడాని శనివారం గాని, శనిత్రయోదశి నాడు గాని సేకరించి గుర్రపునాడాకి హనుమాన్ సింధూరం పూసి ఉంచాలి.

సింధూరంతో పూసిన గుర్రపునాడాని శనివారం ఉదయం ఇల్లు లేదా ఆఫీసు లేదా ప్యాక్టరీ యొక్క ప్రదాన ద్వారానికి ఎడమవైపున ఉంచాలి. ఇంటికి సంబంధించినంత వరకు గుర్రపునాడాని ఊర్ధ్వ ముఖంగా ఉంచాలి. ఇలా ఉంచటం వలన శనిదోషం, నరదృష్టి ప్రభావాలు కిందకి అణగ ద్రొక్కబడతాయి అని భావన. గుర్రపునాడాని వ్యాపార స్థలంలో గాని, ప్యాక్టరీ ప్రధాన ద్వారానికి ఎడమవైపున U ఆకారంలో ఉంచాలి. ఇలా ఉంచడం వలన శత్రుభాధలు, దృష్టి దోషాలు దరిచేరనివ్వదు.

## ఉపయోగాలు

ఏలినాటి శని, అష్టమ శని, అర్ధాష్టమ శని ఉన్నవారు వారు నివసిస్తున్న ఇంటిలో గాని వ్యాపారస్థలంలో గాని గుర్రపునాడాని ఉంచిన లేదా నాడాతో చేసిన రింగుని ఎడమచేతి మధ్య వ్రేలుకి ధరించిన, నాడాని కడియం లాగా చేసుకొని ఎడమచేతికి ధరించిన శని తీవ్రత తగ్గు ముఖం పడుతుంది.

అంగారక దోషం కూడ తగ్గుతుందని కొంతమంది నమ్మకం.

గుర్రపునాడా అలంకరించిన ఇల్లు ఆ ఇంటిలోని వారికి రక్షణ కవచం లాగా ఉంటుంది.

చేతబడులు, రోగాలు, దృష్టిదోషాలు దరిచేరనివ్వదు.

మంచి ఆరోగ్యాన్ని చురుకుతనాన్ని ప్రసాదిస్తుంది.

ఇనుము, నూనె, పెట్రోల్ బంక్‌లు, నువ్వులు, మిరియాల వ్యాపారాలు చేసేవారు తప్పకుండా వారి వ్యాపారస్థలంలో గుర్రపునాడాని ప్రధాన ద్వారానికి ఉంచాలి.

రాజకీయ నాయకులు, సినిమా, సాఫ్ట్‌వేర్, టెలికమ్యూనికేషన్, అధికారుల, అవమానాలు ఎదుర్కొంటున్న వారు ఈ గుర్రపునాడాని ఉపయోగించాలి.





## ఒక్కో గ్రహానికి ఒక్కో రంగు

| | |
|---|---|
| తెలుపు రంగు | - శుక్ర, చంద్రులకు |
| పసుపు రంగు | - గురువుకు |
| ఎరుపు వర్ణం | - అంగారక, సూర్యులకు |
| ఆకుపచ్చ రంగు | - బుధునికి |
| నలుపు వర్ణము | - శనికి |
| పొగరంగు (దూమ్ర వర్ణం) | - రాహువు, కేతువులకు |

# శని భయంకర గ్రహమా?



శని సంచారం అంటే సాధారణంగా అందరూ అధికంగా భయపడతారు. నిజంగా ఆయన అంత భయంకరమైన గ్రహమా? రాశి చక్రంలో మకర కుంభ రాశులకు అధిపతి. అనూ రాధ, పుష్యమీ, ఉత్తరాభాద్ర లకు ఆధిపత్యం వహిస్తూ 19 సంవత్సరాల కాలం దశాకాలం తీసుకున్న శని, అందరినీ ఇబ్బంది పెడతారా? శని వచ్చాక మాత్రమే బాగు పడినవారూ ఉన్నారు అని కొందరి భావన.

**'యుష్యం జీవనోపాయం మరణంచ శనైశ్చరమ్'** అని 'ముహూర్త దర్పణం కారక నిఘంటువు'లో ఉంటుంది. ఆయుష్షు జీవనోపాధి రెండిం టికీ శనియే కారకుడు. ఇటువంటి కారకత్వాలు వేరే ఇతర గ్రహాలకు లేవు. ఇబ్బంది పెట్టవలసిన సందర్భంలో ఎంత ఎక్కువ ఇబ్బంది పెడ తాడో వరములు ఇచ్చే విషయంలో కూడా ఆయన ఇచ్చే స్థాయి అధిక మైనదే అంటే ఆశ్చర్యమే. మారకత్వం ఇవ్వాలి అంటే ఇతర ఏ గ్రహాలు సరియగు స్థితిలో లేవు అంటే అప్పుడు 'అతిక్రమ్యేతరాన్ సర్వా భవత్యేన సంశయః' అని ఎవరి కారకత్వాలతోనూ సంబంధం లేకుండా మారకం ఇచ్చే గ్రహం శనైశ్చరుడుగా అభివర్ణించబడతాడు.

జైమిని సూత్రాలతో బాగా రీసెర్చ్ చేసేవారు ఒక మంచిమాట చెబుతారు. ఎవరి వ్యాపకములలో వారు వుంటే శని ఏమీ చేయడు అని. అది నిజమే. ఇతరుల పనులలో తలదూర్చినా చేయు వృత్తితో పాటు కొత్త వృత్తి ఆశ్రయించినా ఇబ్బంది పెట్టే అంశాలుగా మారుస్తాడు. ప్రాకృత ధర్మం తప్పిన వారి విషయంలోనే శని ప్రభావం అధికం అని చెబుతారు.

ఐరన్, స్టీల్, సిమెంట్, సాల్ట్‌బేస్డ్ వ్యాపారాలు, ఫర్నీచర్, మందులు వంటి వ్యాపారులు, వైద్యులు బాగున్నారు అంటే వారికి శని అనుగ్రహం వున్నది అని గ్రహించవచ్చు. అలాగే శని దోషం త్వరగా ప్రసరించేది మాలిన్యమైన సందర్భాలలోనే. అందులో భాగంగా పురాణాలలో విజ్ఞానం ఉండి అలాగే జ్యోతిశ్శాస్త్రం మీద అవగాహన ఉన్నవారు చెప్పే శని శాంతి మార్గాలు.

## వీరినే శనీశ్వరుడు ఇబ్బంది పెడతాడట

ప్రాకృతమయిన ధర్మాలు విడనాడటం, ఒకరి చెప్పులు మరొకరు ధరించడం, ఒకరోజు ధరించిన వస్త్రములు మరుసటిరోజు ధరించడం, పగలు నిద్ర, మంచం మీద పగలు కూర్చోవడం, పడుకోవడం, ఎప్పుడూ నిద్రమత్తుగా ఉండటం, రాత్రులందు తైలము రాసుకోవడం, ఒకరు వాడిన వస్తువులు మరొకరు వాడడం, పురుషుడు రోజూ తలస్నానం చేయకపోవడం, తోలు, ఉప్పు, ఇనుము చెక్క వంటి వస్తువులు ఉచితంగా తీసుకోవడం, పాదప్రక్షాళన లేకుండా బయట తిరిగి ఇంటిలోకి రావడం, ఇలా జ్యేష్ఠాదేవిని ఆహ్వానించే అంశాలు అన్నీ కూడా ఎవరయితే పాటిస్తారో వారిని శనైశ్చరుడు ఇబ్బందికి గురి చేస్తాడు అని చెబుతారు.



# శని దోష నివారణకు నేరేడు పండ్లు



చాలాకాలంగా కడుపులో పేరుకు పోయిన మలినాలకు శని కారకుడు. కడుపులో పేరుకుపోయిన మలినాలను బయటకు పోవటానికి నేరేడు పండ్లను తినటం మంచిది. పేగుల్లో చుట్టుకు పోయిన వెంట్రుకలకు శని కారకుడు. నేరేడు పండ్లు తింటే వెంట్రుకలను కోసేసి బయటికి పంపే శక్తి నేరేడు పళ్ళకు ఉంది అంటారు.

శని దేవునికి నేరేడు పండ్లతో నైవేద్యం పెడితే నీరసం, నిస్సత్తువ తగ్గిపోతుంది. నీరసం, నిస్సత్తువ ఉన్న వారు నేరేడు పండును దేవునికి నైవేద్యంగా పెట్టి ఆ ప్రసాదాన్ని తింటే జబ్బులు దూరమై ఆరోగ్యవంతులుగా తయారవుతారు అని నమ్మకం. అంతేకాక వెన్నునొప్పి, నడుం నొప్పి, మోకాళ్ల నొప్పులు, నయం అవుతాయి అంటారు.

పూజ చేసిన తర్వాత నేరేడు పండును బ్రాహ్మణునికి దానం చేస్తే రోగ బాధలు కలుగవు. నేరేడు పండును శనైశ్చర స్వామికి ప్రియమైన నల్ల నువ్వులతో కలిపి దానం చేస్తే శని బాధలు ఉండవు. నేరేడు పండు దేవుని పేరిట పూజించి భిక్షగాళ్లకు దానం చేస్తే దారిద్ర్యం దరిచేరదు. భోజనంతో పాటు నేరేడు పండును వడ్డిస్తే మీకు ఎప్పుడూ మృష్టాన్న భోజనం లభిస్తుంది. నేరేడు పండును పుణ్యక్షేత్రాల్లో యోగ్య బ్రాహ్మణులకు తాంబూల సమేతంగా దానం చేస్తే భూదానం చేసినంత ఫలితం లభిస్తుంది.

శనైశ్చర స్వామికి నువ్వులనూనెతో గాని,ఆముదం నూనెతో గాని తెలుపు లేదా నలుపు వత్తులను పడమర దిక్కున ఇనుప గరిటెలో శని దీపాన్ని పెట్టి దానికి నేరేడు పండును నైవేద్యం పెట్టాలి. తరువాత ఈ క్రింది శ్లోకం చదవాలి.

శని బాధా వినాశాయ ఘోర సంతాప హారిణే ।
కనకాలయ వాసాయ భూతనాధాయతే నమః ॥
దారిద్ర్యజాతాన్ రోగాదీన్ బుద్ధిమాంద్యాది సంకటాన్ ।
క్షిప్రం నాశయ హే దేవ!శని బాధా వినాశక ॥
భూత బాధా మహాదుఃఖ మధ్యవర్తిన మీశమాం ।
పాలయ త్వం మహాబాహో సర్వదుఃఖ వినాశక ॥
అవాచ్యాని మహాదుఃఖ న్యమేయాని నిరంతరం ।
సంభవంతి దురంతాని తాని నాశయమే ప్రభో ॥
మాయా మోహన్యానంతాని సర్వాణి కరుణాకర ।
దూరి కురు సదాభక్త హృదయానందదాయక ॥
అనేక జన్మ సంభూతాన్ తాప పాపాన్ గుహేశ్వర ।
చూర్ణీకురు కృపాసింధో సింధుజాకాంత నందతే ॥
ఉన్మాదోద్భూత సంతాపా గాధకూపాద్మహేశ్వర ।
హస్తావలంబం దత్వా మాం రక్షరక్ష శనైశ్చర ॥
దేహిమే బుద్ధి వైశిష్ట్యం దేహిమే నిత్య యౌవనం ।
దేహిమే పరమానందం దేవదేవ జగత్పతే ॥

ఈ శ్లోకాన్ని ప్రతిరోజు ఉదయాన్నే 19 సార్లు పఠించిన శనిదోషం తొలగిపోవును అని అంటారు

# శనిగ్రహ దోష నివారణకు నల్ల పసుపు



జాతకంలో శనిగ్రహ దోష నివారణకు నల్ల పసుపు చాలా బాగ ఉపయోగపడుతుంది. నల్ల పసుపు అనేక దుష్ప్రభావాలను అరికడుతుంది. నల్లపసుపుని "కృష్ణ హరిద్ర"అని అంటారు.

నల్లపసుపు తాంత్రిక విధానంలో ధనవృద్ధి కారక వస్తువుగా ఉపయోగపడుతుంది. నల్ల పసుపు తాంత్రిక, వశీకరణ చర్యల కోసం ఉపయోగించే అరుదుగా దొరికే ఒక విధమైన పసుపు. ఇది మధ్యప్రదేశ్‌లోని నర్మదా నదీ ప్రాంతంలోను, ఈశాన్య రాష్ట్రాలలోనూ, అరుదుగా తూర్పు కనుమలలోనూ మరియు నేపాల్‌లోను లభిస్తుంది.

నల్లపసుపు మొక్కను నీలకంఠ, నరకచూర, కృష్ట కేదార అని కూడా పిలుస్తారు. ఆయుర్వేద గ్రంథాలలో చెప్పబడిన నిషా, నిషి, రజిని, రాత్రి మొక్క నల్ల పసుపేనని భావిస్తారు. దీని దుంపలోపలి భాగం ముదురు నీలం –నలుపు సమ్మేళనంతో ఉంటుంది. పువ్వు ముదురు పింక్ రంగులో ఉంటుంది. కాళీమాత పూజలోవాడే ఈ రకం పసుపుని హిందీలో కాలీ హాల్దీ అని పిలుస్తారు. కాలీ అంటే నలుపు అని అర్థం. అందుకే ఈ రకం పసుపుకి నల్లపసుపు అని పేరు వచ్చింది. ఆంగ్లంలో నల్ల పసుపును Black Turmeric అని అంటారు.

దృష్టి దోషాలు, గ్రహపీడలు, తాంత్రిక సంబంధమైన ప్రయోగాల వలన నానా ఇబ్బందులు పడుతున్నవారు, నల్ల పసుపు కొమ్మును గింజలుగా చేసి మాలగా కట్టి, సాంబ్రాణితో ధూపం వేసి ధరిస్తే ఫలితం

వుంటుంది. రెండు, మూడు నల్ల పసుపు కొమ్ములను సింధూరం రంగు గుడ్డలో కట్టి, ప్రధాన ద్వారం పైన కట్టడం వలన దుష్టగ్రహాల బారి నుంచి బయట పడవచ్చు. అయితే ప్రతిరోజు ఇంట్లో పూజ అయ్యాక ప్రవేశ ద్వారానికి కట్టిన పసుపు కొమ్ములకు ధూపం చూపించవలసి వుంటుంది.

నల్లపసుపు దుంపను జేబులో పెట్టుకున్నా, గుమ్మానికి వ్రేలాడదీసినా దుష్టశక్తులు వెళ్ళిపోతాయని, భారతదేశంలో చాలా మంది నమ్ముతారు. ముఖ్యంగా నల్లపసుపు దుంపను తాంత్రిక విద్యల్లో వాడతారు. వశీకరణ చర్యలకు తాంత్రికులు నల్ల పసుపును ఆవు మూత్రంతో పేస్టులా చేసి దానిని నుదుటికి కుంకుమవలె పెట్టుకుంటారు. నల్ల పసుపుని చూర్ణం చేసి కొద్దిగా పాలతో వేసుకొని తాగినచో శనిగ్రహ దోష నివారణతోపాటు దీర్ఘకాల అనారోగ్యాలు నివారణ అవుతాయి. నల్లపసుపు కొమ్ము పొడిని తాయిత్తులలో ఉంచి ధరించిన శనిగ్రహ బాధనుండి విముక్తి కలుగుతుంది. నల్లపసుపు కొమ్మును పొడి చేసి చందనంతో కలిపి నుదుట ధరించిన నరదృష్టి ఉండదు అంటారు.

నల్ల పసుపు కొమ్ముని శనివారం రోజు పూజ చేసుకొని బీరువాలో గానీ, గల్లా పెట్టెలో గాని ఉంచిన ధనాభివృద్ధి ఉండును. నల్ల పసుపును ఇంటి గుమ్మానికి గాని, షాపు గుమ్మానికి గాని ఎర్రటి గుడ్డలో కట్టి వ్రేలాడ దీసిన ఎటువంటి దుష్ట శక్తులు దరిచేరవు. పసుపు కొమ్మును ఒక మంచి రోజున ఇంటికి తీసుకు వచ్చి పూజలో ఉంచాలి. ఆ తరువాత ఉపయోగించడం వలన మంచి ఫలితాలను ఇస్తుంది. ఈనల్లపసుపు శనిగ్రహ దోషాల వలన వచ్చే దుష్ప్రభావాలను అరికట్టి దీర్ఘకాలిక బాధలను తగ్గిస్తూ ఆత్మ విశ్వాసాన్ని ప్రసాదించే మహిమను కలిగి వుంటుంది. ఇక దుష్ట గ్రహాల కారణంగా కలిగే బాధల నుంచి విముక్తి కలిగించడంలో ఇది ప్రధాన పాత్రను పోషిస్తుంది. 

# శని గ్రహం జన్మకుండలిలో ఉంటే కన్పించే ప్రతికూల లక్షణాలు



శనిగ్రహం మంచి చేస్తుందా లేక చెడు చేస్తుందా అనేది ఓ పెద్ద ప్రశ్నగా ఉంటుంది. శని ప్రతికూల పరిస్థితులు మన దినచర్యల్లో మార్పులు తీసుకు వస్తాయి. వీటిని గుర్తుంచు కుని వ్యవహరించాల్సివుంటుంది.

ఒకవేళ మీ శరీరం తరచూ అలసటకు గురవుతుంటే లేదా నిస్స హాయంగా మారిపోతుందేమో గుర్తించండి.

నిత్యకృత్యాలు జరపడంలో ఇష్టం కలగకపోవడం లేక స్నానం చేసే తీరిక కలగకపోవడం.

కొత్త దుస్తులు కొనడం లేదా తొడుక్కునే అవసరం రాకపోవడం.

నూతన వస్త్రాలు లేదా చెప్పులు త్వరగా పాడైపోవడంకాని, చిరిగి పోవడం కాని జరుగటం.

ఇంట్లో నూనె, పప్పుదినుసులు నష్టపోతుంటే లేదా చేతిలోనుంచి జారిపోతుంటే.

మీ ఇంట్లోని అలమారా అస్తవ్యస్తంగా ఉంటే.

భోజనం చేయాలంటే ఇష్టం కలగకపోవడం.

తల, కాలిపిక్కలు, నడుములో నొప్పి అలాగే ఉంటే.

కుటుంబంలో తండ్రితో పొరపొచ్చాలు ఏర్పడితే.

చదువు పట్ల, ప్రజలను కలిసేందుకు మనసు అంగీకరించకపోతే, చిరాకుగా ఉంటే.

ఒకవేళ ఈ లక్షణాలు మీరు స్వయంగా అనుభవిస్తుంటే శనిగ్రహం మీ జన్మకుండలిలో ఉన్నట్లు లెక్క అని చెబుతారు.

## నివారణకై చేయాల్సిన పనులు

నూనె, సన్న ఆవాలు, ఉద్దిపప్పును దానం చేయాలి.

రావిచెట్టును పెంచాలి. ఆ చెట్టువద్ద దీపాలు వెలిగించాలి.

హనుమంతుడుని ఆరాధించాలి.

మాంసం, మద్యపానం అలవాటుంటే వాటిని త్యజించాలి.

పేదవారికి సహాయం చేయాలి.

నల్లటి వస్త్రాలు ధరించకూడదు.

నల్లటి వస్తువులు దానం చేయాలి.



## నవగ్రహాలు దేహభాగాలు

తల మరియు గుండె సూర్యుని నియంత్రణలో ఉంటాయి, ముఖం మరియు గొంతు చంద్రుని నియంత్రణలో ఉంటాయి, చేతులు మరియు భుజాలు అంగారకుడు(కుజుడు) నియంత్రణలో ఉంటాయి మరియు ఛాతీ బుధుడు నియంత్రణలో ఉంటుంది. ఉదరం శరీర భాగం, దిగువ ఉదరం గురువు ఆధిపత్యం చెలాయిస్తుంది, పుట్టించే అవయవం శుక్రునిచే నియంత్రించబడుతుంది. అదేవిధంగా, తొడలు, కాళ్ళు మరియు పాదాలు శని ప్రభావంతో ఉంటాయి. మానవ శరీరం నీడ కనుక దానికి గ్రహాల్లో స్థానం లేదు.

# ఆలస్య వివాహమునకు హరితాళికా వ్రతం



సప్తమ భావము వివాహము మరియు జీవిత భాగస్వామి యొక్క భావముగా చెప్పబడుతున్నది. సప్తమాధిపతి శని అయిన సప్తమ స్థానాన్ని శని చూస్తున్న కొన్ని సందర్భాలలో వివాహము ఆలస్యముగా జరుగును. మరియు కలహములతో గృహస్థ జీవనము అశాంతిగా వుండును.

సప్తమ భావములో శని నీచ పట్టి వుండిన ఎడల వ్యక్తి కామ ప్రేరితుడై ఎవరో ఒకరితో అనగా తన కన్న వయస్సులో చాలా పెద్దవారితో కూడా వివాహము చేసుకొనెదరు. సప్తమ శని మరియు దానితో పాటు యుతి కలిగించు చున్న గ్రహములు వివాహము మరియు గృహస్థ జీవితమునకు శుభ కారకముగా వుండవు.

శని ఎవరి జన్మకుండలిలో అయితే ఆరవ భావములో వుండునో మరియు అష్టమములో సప్తమాధిపతి బలహీనముగా వుండిన లేదా పాప పీడితమైన ఎడల కూడా వారి వివాహములో చాలా బాధలు కలుగగలవు.

ఏ స్త్రీ కి అయినను వివాహములో శని గ్రహ కారణముగా ఆలస్యం కలుగుతున్నవో వారు “హరితాలికా వ్రతము”ను చేపట్టవలెను మరియు శని భగవానుని పూజించవలెను. పురుషులకు కూడా శని దేవుని ఉపాసనము వలన లాభము కలుగును మరియు వారి వివాహము తొందరగా జరుగును.

## హరితాలికా వ్రత కధ

కైలాస శిఖరమందు పార్వతి ఒకనాడు పరమశివుడిని ఇలా అడిగింది “స్వామీ! తక్కువ శ్రమతో, ధర్మాచరణతో ఎవరు నిన్ను భక్తిశ్రద్ధలతో సేవిస్తారు, వారికెలా ప్రసన్నుడవౌతావో తెలుపు”మని ప్రార్థించింది. అంతే కాక, “జగత్ప్రభువైన మీరు నాకు యేతపోదాన వ్రతమాచరించుటచే లభించారు” అని అడిగింది. అప్పుడు పరమశివుడు “దేవీ! వ్రతాల్లోకి చాలా ఉత్తమమైంది, అత్యంత రహస్యమైన వ్రతమొకటున్నది. దానిని ఎవరు ఆచరించినా నేను వారికి వశుడనైతాను. ఈ వ్రతాన్ని ఆచరించిన వారు సర్వపాప విముక్తులవుతారు. “దేవీ! నీవు నీ చిన్ననాట హిమాల యాల్లో ఈ మహావ్రతాన్ని ఎలా ఆచరించావో చెబుతాను. విను!’ అన్నాడు.

భూలోకమున వివిధ పక్షులతో, విచిత్ర మృగాలతో మంచుచేత కప్పబడి బహుసుందరమైన హిమవత్పర్వతము కలదు. హిమవంతుడా ప్రాంతానికి ప్రభువు. నీవు అతని కూతురువు. చిన్నతనం నుంచే శివ భక్తురాలవు. యుక్తవయసు వస్తున్న నీకు వరుడెవరగునా? అని హిమవంతుడు ఆలోచించగా, త్రిలోక సంచారి నారద మునీశ్వరులు ఒకనాడు మీ తండ్రి వద్దకు వచ్చాడు. అర్ఘ్య పాద్యాలు అందించి మీ తండ్రి నిను చూపి, ఈ కన్యను ఎవరికిచ్చి వివాహం చేయవచ్చును, తగిన వరుడెవరని నారదుని అడిగినాడు. వెంటనే నారదుడు ‘ఓ గిరిరాజా! నీ కన్యారత్నమునకు

అన్నివిధముల యోగ్యమైనవాడు బ్రహ్మాదిదేవతలలో విష్ణువు. అతడు పంపితేనే నీ వద్దకు వచ్చానన్నాడు'. సంతోషంతో హిమవంతుడు ఆ విష్ణుదేవుడే స్వయంగా ఈ కన్యను కోరి నిను పంపాడు కనుక గౌరవించి, అతనికిచ్చి వివాహం చేస్తానని వెంటనే తెలుపుమన్నాడు. నారదుడందుకంగీకరించి బయలుదేరాడు.

హిమవంతుడు ఆనందంతో భార్యాపిల్లలకు ఆ విషయం తెలిపాడు. కుమార్తెను దగ్గరకు పిలిచి 'ఓ పుత్రీ! గరుడవాహనునితో నీ వివాహం నిశ్చయం చేస్తున్నానని' తెలిపెను. ఆ మాటలు విని పార్వతి తన మందిరం లోకి వెళ్ళి పొర్లిపొర్లి దుఃఖించసాగింది. ఇది చూసిన పార్వతి ప్రియసఖి ఆమె ఈ పెండ్లికి సుముఖంగా లేదని తెలుసుకుని స్నేహితురాలికొక ఉపాయం చెప్పింది. నీ తండ్రి జాడ తెలియని అడవిలోకి మనమిద్దరం కొంతకాలం పారిపోదామని చెప్పింది. ఆమె అనుమతితో ఇద్దరూ వన ప్రాంతానికి ప్రయాణమైనారు. కుమార్తె కనిపించుటలేదని గిరిరాజు హాహా కారాలు చేసి, ఏడ్చి మూర్ఛిల్లాడు. నీవు పరమశివుని గూర్చి ఘోర తపస్సు చేశావు. అడవిలో దొరికిన ఫలాలతో, పుష్పాలతో, పత్రాలతో అనేక విధాల పూజించావు. నీభక్తికి మెచ్చి సైకత లింగాన్ని (ఇసుక), చేసుకొని పూజిస్తున్న నీకు నేను ప్రసన్నుడైనాను.

చెలికత్తెచే హరింపబడినావు కనుక ఈ వ్రతాన్ని "హరితాలిక వ్రతం" అంటారు. ఆరోజు శివరాత్రివలె ఉపవసించి, రాత్రంతా జాగరణతో ఎవరైనా పరమశివుని సైకత లింగాన్ని పత్రపుష్పాలతో పూజిస్తారో వారికి సకల సౌభాగ్యాలు, సంపత్తులు కలుగుతాయి" అని పరమేశ్వరుడు పార్వతితో చెప్తాడు. 16 ఉత్తరేణి ఆకులతో 16 వరుసల దారాన్ని 16 గ్రంథులు ముళ్ళు వేసి తోరానికి గ్రంథిపూజచేసి భక్తి శ్రద్ధలతో ఈ వ్రతం నోచుకోవాలి అని శివుడు చెప్పినట్లు పురాణ వచనం.



# శనిరాహు (శపిత) యోగం



జాతకంలో శని రాహువులు ఒక రాశిలో కలసి ఉంటె అది గొప్ప దోషంగా పరిగణింప బడుతుంది. దీనిని శపితయోగం అని అంటారు. కొన్ని జ్యోతిష సాంప్రదాయాలలో దీనిని మహా దోషంగా పరిగణిస్తారు. కొంత మంది అయితే ఈ దోషం ఉన్న జాతకాన్ని చూడటానికి కూడా ఇష్టపడరు.

గోచార రీత్యా వీరిద్దరూ ఒకే రాశిలో కలసినప్పుడు కూడా ఇదే దోషం ఏర్పడుతుంది. వీరిద్దరి పరస్పర వేగాలలో తేడాలవల్ల అలా కల వడం ఎప్పుడో కాని జరగదు. కాని అలా కలిసినప్పుడు మాత్రం లోకంలో చాలా ఘోరాలు జరుగుతాయి. ఆ సమయంలో పుట్టిన జాతకాలలో ఈ యోగం రకరకాలుగా ప్రతిఫలిస్తుంది. ఆయా జాతకులను ముప్పు తిప్పలు పెడుతుంది. కాలసర్ప యోగం ఎంత బాధ పెడుతుందో ఈ యోగమూ అంతకంటే ఎక్కువ బాధ పెడుతుంది.

ఈ సమయంలో పుట్టే పిల్లల జాతకాలలో ఈ దోషం తప్పకుండా ఉంటుంది. కనుక పెరిగి పెద్దయ్యాక వారి జీవితాలలో వారు చాలా చెడు కర్మను అనుభవించక తప్పదు. గతజన్మలో చాలా పాపకర్మల బరువు ఉన్న జీవులు ఈ సమయంలో భూమిమీద జన్మ తీసుకుంటారు.

## శపిత దోషం అని ఎందుకంటారు?

ఈ జాతకులకు చాలా శాపాలు ఉంటాయి. గత జన్మలలో వీరు అనేక చెడుకర్మలు చేసుకుని అనేక మంది ఉసురు పోసుకుని వారి శాపాలకు గురై ఉంటారు. పూర్వజన్మలలో చేసుకున్న చెడుకర్మల ఫలితంగా ఈ జన్మలో అనేక కష్టాలు బాధలు పడవలసి వస్తుంది. అహంకారంతో ఒళ్ళు కొవ్వెక్కి చేసుకున్న చెడుకర్మ ఈ రకమైన దోషంగా జాతకంలో ప్రతిఫలిస్తుంది అని అంటారు.

శపిత దోషం ఉన్న జాతకాలు చూచి వారికి రెమిడీలు చెప్పిన జ్యోతిష్కుడు కూడా ఆ కర్మలో భాగం పంచుకోవలసి వస్తుంది. పరిహారాలు చేసిన జోస్యునిపైన రాహు, శనుల కోపదృష్టి పడుతుంది. జాతకుని తీవ్ర కర్మలో జోస్యుడు జోక్యం చేసుకుంటున్నాడు కనుక అతనూ ఆ కర్మను కొంత పంచుకోవలసి వస్తుంది అని అంటారు.

పన్నెండు రాశులలో దేనిలో ఈ దోషం ఏర్పడింది? దీనిపైన మిగతా గ్రహాల ప్రభావం ఎలా ఉన్నది? అన్న దానిని బట్టి ఈ దోష తీవ్రతను జాతకుని పూర్వకర్మను అంచనా వెయ్యాలి.

ఈ యోగం ఉన్నప్పుడు ఆ జాతకుడు తీవ్రమైన కోపానికి, నిలకడలేని ప్రవర్తనకు లోనవుతాడు. తట్టుకోలేని కోపం ఉంటుంది. ఉన్నట్టుండి తీవ్ర నిర్ణయాలు తీసుకునే వారిలో ఈ దోషం ఉంటుంది. వీరిలో విచక్షణ లోపిస్తుంది. మొండిగా కొన్ని నిర్ణయాలు తీసుకుని వాటి ఫలితాలు తర్వాత ఏడుస్తూ అనుభవిస్తారు. శనిరాహువుల సంయోగం అలాంటి ప్రవర్తనను ప్రేరేపిస్తుంది. తట్టుకోలేని భావోద్రేకా లను, మొండితనాన్ని, మూర్ఖపు వాదనలను ఈ గ్రహ సంయోగం కలిగిస్తుంది. స్నేహితుల మధ్యన, ప్రేమికుల మధ్యన, అప్పటివరకూ కలిసి మెలిసి తిరిగిన వారిమధ్యన, హఠాత్తుగా గొడవలు రావడం ఈ దోషం యొక్క ప్రభావమే అని అంటారు. 

#  రాహువు 



రాహువు స్త్రీ గ్రహం. ఇది ఛాయాగ్రహం. అపసవ్య మార్గాన నడుస్తుంది. అంటే మేషం, తరువాత మీనం ఇలా వెనక్కు నడుస్తుంది. రాహువు నక్షత్రాలు ఆరుద్ర, స్వాతి, శతభిషం. ఈ మూడు నక్షత్ర జాతకులకు మొదటి దశ రాహుదశా శేషంతో ప్రారంభం అవుతుంది. రాహు దశా కాలం పద్దెనిమిది సంవత్సరాలు. సాధారణంగా రాహు దశాకాలంలో మనిషి జీవితంలో ఒడి దుడుకులు అధికం. కాని కొన్ని నక్షత్రాలకు కొంత వెసులు బాటు ఉంటుంది. రాహువుకు రాశిచక్రంలో ఇల్లు లేదు. రాహువు వృషభరాశిలో ఉచ్ఛస్థితి పొందుతాడు. రాహువు వృశ్చిక రాశిలో నీచ స్థితిని పొందుతాడు. కొన్ని ప్రాచీన గ్రంథాలలో జ్యోతిష శాస్త్ర రాహువు ప్రస్తావన లేదు. కాని ఆధునిక శాస్త్రంలో రాహువుకు అధిక ప్రాముఖ్యత ఇస్తున్నారు. రాహువు పాపగ్రహం. రాహువు ఏ గ్రహంతో కలిసి ఉంటే



ఆ ఫలితాలను ఇస్తాడు. రాహువు శరీరం దిగువ భాగం పాము శరీరం ఉంటుంది. అందుకనే రాహువుకు విషముతో అధిక ప్రాముఖ్యత ఉంటుంది. ఎప్పుడూ రోదశీలో ఉండే సూర్యుడిని కొంతకాలం కనిపించకుండా చేస్తాడు కనుక కల్పనా జగత్తుకు ప్రతీకగా జ్యోతిష పండుతులు విశ్వసిస్తారు. కళాకారుల జీవితంలో రాహువు ప్రధాన పాత్ర పోషిస్తాడని జ్యోతిషశాస్త్ర పండితులు విశ్వసిస్తారు.

## గుణగణాలు

రాహువు తమోగుణ ప్రధానుడు, గ్రహ సంఖ్య రెండు, అధిదేవత గౌరి, ముసలివారిని సూచిస్తాడు. బుధుడు, శుక్రుడు, శని మిత్రులు. సూర్యుడు, చంద్రుడు, కుజుడు శత్రువులు. గురువు సముడు. స్వక్షేత్రం కుంభం, శత్రు క్షేత్రం సింహం, మిత్ర క్షేత్రంతుల. అసుర, బహి, స్వర్భాను, తమస అనేవి ఇతర నామాలు. జాతి మ్లేచ్ఛ, స్వాభావము క్రూరము, రుచులలో పులుపును సూచిస్తాడు. ప్రదేశం పాములు తిరిగే ప్రదేశం. దిక్కు నైరుతి, పాలనా శక్తి భటుడు, ఆత్మాధికారం కష్టాలు, లోహము సీసం, గృహ స్థానం ఉపయోగంలో లేని ప్రదేశం, గ్రహపీడ సంతాన లేమి, గ్రహం రాశిలో ఉండే కాలం ఒకటిన్నర సంవత్సరం. వృక్షము పొదలు, ఆహార పదార్థాలు మినుములు, ఖర్జూరం, ఆవాలు. జంతువులు ఏనుగు, పాములు అడవి ఎలుకలు. వస్తువు గొడుగు, సమిధ దుర్వ, మూలిక చందనం, దేవ వర్గం శైవ, అవతారం వరాహావతారం.

## కారకత్వం

రాహువు పితామహుడు (తాత), వృద్ధాప్యము, శ్వాస, భాష, అసత్యము, భ్రమ, వాయువు, విచారము, జూదము, కఫము, సంధ్యా సమయం, బయట ప్రదేశం, గొడుగు, పల్లకి, అపరిశుభ్రం, గొడుగు, పల్లకి, విమర్శ, అంటరానితనం, నల్లులు, దోమలు, గుడ్లగూబలు, విషకీటకములను సూచిస్తాడు.

**వృత్తులు :** విషసంబంధిత రసాయనాల తయారీ సంస్థలు, పాములు పట్టుట, భూతవైద్యము, శ్మశానంలో పనిచేయుట, నాగపూజ, దొంగతనం, వైద్య శాస్త్రం, గారడీ విద్యలు. శుక్రుడితో కలిసి ఉంటే సినీరంగం, నాటక రంగం, అడ్వర్టజ్‌మెంటు రంగం, బుధుడితో చేరిన రచయిత, గారడీ విద్య, శనితో చేరిన మోసపూరిత జీవితం, గురువుతో కలిసిన కపట గురువు మొదలైనవి. జైళ్ళు, క్రిమినల్ కోర్ట్‌లో ఉద్యోగాలు, ఎలక్ట్రిసిటీ, ఆటోమొబైల్స్, గ్యాస్, ఇనుము, నిప్పుకు సంబంధించిన వృత్తులు. అగ్నిమాపక దళ వృత్తులను సూచిస్తాడు.

**విద్యలు :** రాహువు ఏగ్రహముతో చేరిన ఆగ్రహ సంబంధిత విద్యలను సూచిస్తాడు.

## రూపము

రాహువు క్రూర రూపము కలవాడు, పొడగరి, నల్లని మేని ఛాయ కలవాడు. నాలుగు భుజములు గలవాడు. కత్తి, త్రిశూలమును ధరించి కవచధారణ చేసి ఉంటాడు. సింహాన్ని అధిరోహించి ఉంటాడు. తండ్రి కశ్యపుడు, తల్లి సింహిక, భార్య కరాళ. పార్థివ నామ సంవత్సరం బాధ్రపద శుక్ల పూర్ణిమ నాడు పూర్వాభద్రా నక్షత్రములో జన్మించాడు. రాహువు క్షీర సాగర మధన సమయంలో దేవతా రూపం ధరించి మోహినీ చేతి అమృతపానం చేసాడు. దానిని సూర్య, చంద్రులు విష్ణుమూర్తికి చెప్పడంతో విష్ణువు అతడి తలను మొండెం నుండి వేరు చేయడంతో పాము శరీరం పొందాడు. విష్ణుమూర్తి అతడిని అనుగ్రహించి గ్రహ మండలంలో స్థానం కల్పించాడు. అప్పటి నుండి సూర్యచంద్రులకు శత్రువై గ్రహణ సమయాన కబళించి తిరిగి విడుస్తుంటాడని పురాణ కథనం వివరిస్తుంది. రాహువు రాక్షస నామ సంవత్సరం మాఘ కృష్ణ చతుర్దశి ఆశ్లేష నక్షత్రంలో గ్రహజన్మను ఎత్తాడు.

## రాహుకాలం

రాహుకాలం వారంలో ప్రతిరోజు ఒకటిన్నర గంటల సమయం ఉంటుంది. ఆ సమయంలో చేసే పనులకు ఆంటంకం కలుగుతుందని విశ్వసిస్తారు కనుక ముఖ్యమైన పనులైతే ఆసమయంలో చేయరు. కాని దోష నివారణ కొరకు రాహుకాలంలో పూజలు నిర్వహిస్తారు. దుర్గాదేవికి రాహుకాలంలో నిమ్మడిప్పలో నూనె పోసి దీపం వెలిగిస్తారు. ఆదివారం సాయంత్రం 4 1/2 (నాలుగున్నర ) గంటల నుండి 6 గంటల వరకు, సోమవారం ఉదయం 71/2 (ఏడున్నర) నుండి 9 వరకు, మంగళవారం 3 గంటల నుండి 41/2 (నాలుగున్నర) గంటల వరకు, బుధవారం 12 గంటల నుండి 1 1/2 (ఒకటిన్నర), గురువారం 1 1/2 గంటల నుండి 3 గంటల వరకు, శుక్రవారం 10 1/2 గంటల నుండి 12 గంటల వరకు, శనివారం 9 గంటల నుండి 10 1/2 గంటల వరకు రాహుకాలం ఉంటుంది.

## పరిహారం

రాహువును శాంతింప చేయడానికి చేయవలసిన పరిహార విధులు. ప్రతిమకు కావలసిన లోహము సీసం, ప్రతిమకు పూజకు గ్రహ ఆసనం చేట, సమిధ దూర్వ, నైవేద్యం మినప సున్ని, మినప గారెలు, ఖర్జూరం, చేయవలసిన పూజ అధిష్టాన దేవత అయిన సరస్వతి పూజ, దుర్గా పూజ, సుబ్రహ్మణ్య స్వామి పూజ, శివారాధన, రాహుకాలంలో దుర్గకు నిమ్మకాయ దీపం పెట్టడం. ఇది దేవాలయంలో దుర్గాదేవి సన్నిధిలో చేయాలి. ఇంట్లో అయితే నేతి దీపం పెట్టాలి. ఆచరించవలసిన వ్రతం సరస్వతి వ్రతం, రాహువుకు ప్రియమైన తిథి చైత్ర బహుళ ద్వాదశి, పారాయణ చేయవలసినవి రాహు అష్టోత్తరం, లలితా సహస్రనామం,

ఆచరించవలసిన దీక్ష భవానీ దీక్ష, ధరించవలసిన మాల రుద్రాక్ష మాల, అష్టముఖ రుద్రాక్ష, రత్నము గోమేధికము, దర్శించవలసిన దేవాలయములు సరస్వతి, దుర్గ, సుబ్రహ్మణ్య స్వామి దేవాలయం, శివాలయాలు, నవగ్రహాలయాలు. దానం చెయ్యవలసినవి ఎండు ద్రాక్ష, తేనె, ఖర్జూరములు. చేయవలసిన జపసంఖ్య పద్దెనిమిది వేలు.

## రాహువు స్థానాలు ఫలితాలు

రాహువు ఉన్న స్థాన ఫలితాలు రాహు మహర్ధశా కాలములో మాత్రమే ఫలితాలను ఇస్తాయి.

జాతక చక్రములో ప్రథమ స్థానాన్ని లగ్నము అంటారు. రాహువు ప్రథమ స్థానములో ఉన్న జాతకుడు సహాయగుణము కలిగి ఉంటాడు. ముఖము మీద మచ్చలు కలిగి ఉంటాడు. ధైర్యసాహసాలు ప్రదర్శించే వారుగా ఉంటారు.

ద్వితీయస్థానములో రాహువు ఉన్న జాతకుడు. నల్లని ఛాయ గలవారు వివాహేతర సంబంధముల అందు ఆసక్తి కలవారుగా ఉంటారు.

రాహువు తృతీయ స్థానమున ఉన్న జాతకుడు క్రీడాకారుడు, ధనవంతుడు, సాహసికులు అవుతారు.

రాహువు చతుర్ధ స్థానమున ఉన్న జాతకుడు బహుభాషాకోవిదుడు అవుతాడు. తల్లికి కష్టాలు ఉంటాయి. విద్యలందు ఆటంకం కలిగిస్తాడు.

రాహువు పంచమస్థానములో ఉన్న జాతకుడు క్రూరస్వభావము కలిగి ఉంటాడు. భ్రమలు అధికంగా ఉంటాయి. సంతానము కలగటములో ఆటంకములు కలిగిస్తాడు.

రాహువు షష్టమ స్థానమున ఉన్న జాతకుడు శత్రురహితుడు అవుతాడు. పెద్ద బంధువర్గము కలిగి ఉంటాడు.

రాహువు సప్తమ స్థానమున ఉన్న జాతకుడు భోజనప్రియత్వము కలిగి ఉంటాడు. మధుమేహవ్యాధికి కారకుడు అవుతాడు. కళత్రానికి ఆరోగ్యసమస్యలు కలిగిస్తాడు.

రాహువు అష్టమ స్థానమున ఉన్న జాతకుడు పోట్లాడె గుణము కలిగి ఉంటాడు. సంకుచిత మనస్తత్వము కలిగి ఉంటాడు.

రాహువు నవమ స్థానమున ఉన్న జాతకుడు పిరికితనము కలిగి ఉంటాడు. తండ్రికి కష్టాలు ఉంటాయి.

రాహువు దశమ స్థానం ఉన్న జాతకుడు కళాకారుడు, కవి, రచయిత, యాత్రికుడు అవుతాడు.

రాహువు ఏకాదశమున ఉన్న జాతకుడు ధనసంపద కలిగి సమాజంలో గౌరవ మర్యాదలు కలిగి ఉంటాడు. రాహువు ఉన్న జాతకుడు తాత్విక చింతన కలిగి ఉంటాడు. నేత్ర వ్యాధి కలిగి ఉంటాడు.

## గోచార రాహువు ఫలితములు

రాహువు చంద్రుడు ఉన్న స్థానములో ఉన్నప్పుడు లేక ప్రవేశించి నప్పుడు వ్యాధులు, రోగములు పీడించును. అనుకున్నది ఒకటి జరిగేది మరొకటి ఉన్నందువలన మానసిక వ్యాకులత కలుగును. శారీరక అలసట కలిగి ఉంటారు.

రాహువు చంద్రుడికి ద్వితీయ స్థానములో ప్రవేశించినప్పుడు అవవసర ధనవ్యయమును కలిగించి వ్యక్తిని ఆర్థిక ఇబ్బందులకు గురిచేస్తాడు. కుటుంబము, సహసంబంధులతో కలతలు కలిగించును. కుటుంబ సభ్యుల మధ్య వివాదములు తలెత్తుతాయి. ఈ కాలము వ్యక్తిని మద్యము వంటి మత్తు పదార్ధములకు బానిసను చేస్తుంది కనుక జాగ్రత్త వహించుట మంచిది.

రాహువు తృతీయ స్థాన ప్రవేశము శుభఫలితాలను ఇస్తుంది. ఇతరులతో చేరి చతురతను ఉపయోగించి కార్యములు చక్కబెట్టుటకు ప్రయత్నము

చేస్తారు. ఏ కార్యము చేసినా గుప్తముగా చేసి దానిని పూర్తి చేసిన తరువాతనే బహిర్గతము చేస్తారు.

రాహువు చతుర్ధ స్థాన ప్రవేశము అనేక సమస్యలను, కష్టములను కలిగించును. రాహువు నాల్గవ స్థాన ప్రవేశము తల్లికి కష్టములను కలిగించును. అడుగడునా కష్టములు, సమస్యలు ఎదురౌతూ అగౌరవము, అవమానము కలుగుతాయాన్న భయము సదా వెన్నంటి ఉంటుంది. భూమి వాహనము సంబంధించిన సమస్యలు ఎదురౌతాయి.

రాహువు పంచమస్థాన ప్రవేశము కష్టములు, దుఃఖము కలిగించును. మతిభ్రమను కలిగించును. త్వరగా ధనికుడు కావాలన్న పగటి కలలు కంటూ ధనము కావాలన్న లాలసలో ఉన్న ధనమును కోల్పోవడము జరుగుతుంది.

రాహువు షష్టమ స్థాన ప్రవేశము అంతగా హాని కలిగించక పోయినా ఆరోగ్యము మీద ప్రభావము చూపెట్టవచ్చు కనుక భోజన పానీయాలను తీసుకునే విషయములో శ్రద్ధ వహించవలసి ఉంది. ఉదర సంబంధిత సమస్యలు పీడిస్తాయి. ఈ సమయములో ఆర్థిక పరిస్థితి బాగుంటుంది ఆకస్మిక ధనలాభము వస్తుంది.

రాహువు సప్తమభావ ప్రవేశము దాంపత్య జీవితము బాధించును. భార్యాభర్తల మధ్య కలతలు పెరిగి దూరము కలగవచ్చు. కళత్రానికి కష్టములు కలుగుతాయి. ఆరోగ్యకారణముగా దుఃఖిస్తారు. సహజమైన బుద్ధి కూడా సరిగా పని చెయ్యదు.

రాహువు అష్టమ స్థానప్రవేశము ఆరోగ్య సమస్యలను కలిగిస్తుంది. పలువిధ రోగములు వస్తాయి. మూత్ర సంబంధిత వ్యాధులతో బాధపడవచ్చు. ఆర్థికమైన సమస్యలను ఎదుర్కొంటారు. అనవసర ఖర్చులు ఆర్థిక నష్టము సంభవము.

రాహువు నవమ స్థాన ప్రవేశము తలపెట్టిన కార్యక్రమాలన్నింటా రాహువు ఆటంకములను కలిగించవచ్చు. పనులు పూర్తికానున్న తరుణములో పనులు ఆగవచ్చు. అనవసర ఖర్చుల వలన ఆర్థికపరమైన చిక్కులు తలెత్తవచ్చు.

రాహువు దశమ స్థాన ప్రవేశము ఉద్యోగ బదిలీలకు కారణము అవుతుంది. అప్పటి వరకూ చేస్తున్న పనిని వదిలి వేరొక పని చేయవలసి ఉంటుంది. ఆర్థికపరమైన నష్టముకలగ వచ్చు. అనవసర శ్రమ ఫలిత ముగా అలసట కలగవచ్చు.

రాహువు ఏకాదశ స్థాన ప్రవేశము శుభఫలితాలను ఇస్తుంది. ఈ సమయములో గౌరవము, కీర్తి, ప్రతిష్ఠ కలగవచ్చు. పాత దారులలో ఆదాయముతో కొత్త దారులలో కూడా ఆదాయము రావచ్చు. ఆర్థికంగా పరిస్థితి మెరుగుపడుతుంది. కార్యసఫలత కలుగుతుంది.

రాహువు ద్వాదశ స్థాన ప్రవేశము అనవసర ఖర్చులను కలగచేస్తుంది. ఫలించని పగటి కలలను కలిగిస్తాయి. గాలిమేడలు కట్టడం ఊహాగానాల వలన ప్రయోజనము శూన్యము.

## ద్వాదశ స్థానములలో రాహువు

లగ్నంలో రాహువు ఉన్న జాతకుడు అల్పాయుస్సు కలవాడు, ధనం కలవాడు, దృఢమైన శరీరం కలవాడు, ముఖం శిరస్సు నందురోగములు కలవాడు, అవుతాడు.

ద్వితీయ స్థానమున రాహువు ఉన్న జాతకుడు అనుమానాస్పద పలుకులు చెప్పువాడు, నోటియందు రోగములు కలవాడు, సునిశిత హృదయుడు, రాజాశ్రయం చేత ధనం సంపాదించే వాడు, సుఖవంతుడు, రోషవంతుడు అవుతాడు.

తృతీయ స్థానమున రాహువు ఉన్న జాతకుడు గర్వం కలవాడు, సోదరులతో విరోధించువాడు, స్థిరచిత్తుడు, చిరాయుష్మంతుడు, ధన వంతుడు అవుతాడు.

చతుర్ధ స్థానమున రాహువు ఉన్న జాతకుడు దుఃఖకారకుడు, మూర్ఖుడు, అప్పుడప్పుడూ సుఖపడేవాడు అవుతాడు.

పంచమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు ముక్కుతో మాట్లాడినట్లు మాట్లాడువాడు, పుత్రులు లేనివాడు, కఠినాత్ముడు, గర్భరోగములు కలవాడు అవుతాడు.

షష్టమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు శత్రువుల చేత బాధలను అనుభవించువాడు, గ్రహపీడితుడు, గుర్తించలేని రోగము కలవాడు, ధనవంతుడు, చిరంజీవి అవుతాడు.

సప్తమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు పరస్త్రీ లోలుడు, రోగగ్రస్థుడు, ఆత్మీయుల ఎడబాటు వలన బాధలను అనుభవించు వాడు, తన భావములే గొప్పవని భావించే వాడు, మానవత్వం కోల్పోయిన వాడు, పాపం చేయువాడు అవుతాడు.

అష్టమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు అల్పాయుష్కుడు, అపవిత్ర కార్యాలు చేయువాడు, అంగవైకల్యం కలవాడు, వికల మనస్కుడు, వాత ప్రకృతి కలవాడు, అల్పసంతతి కలవాడు అవుతాడు.

నవమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు ప్రతికూల భావములు కలిగినవాడు, కులపెద్ద, గ్రామ పెద్ద, పట్టణముకు అధిపతి, పాపక్రియా సక్తుడు, అవుతాడు.

దశమ స్థానమున రాహువు ఉన్న జాతకుడు ప్రఖ్యాతి కలిగిన వాడు ఔతాడు. అల్పసంతానవంతుడు, పరుల కార్యములు చేయువాడు, నిర్భయుడు, సత్కర్మ రహితుడు అవుతాడు.

ఏకాదశ స్థానమున రాహువు ఉన్న జాతకుడు అభివృద్ధి చెందుతూ ఉంటాడు, స్వల్పసంతాన వంతుడు, చిరంజీవి, కర్ణ రోగి అవుతాడు.

ద్వాదశ స్థానమున రాహువు ఉన్న జాతకుడు రహస్యముగా దుష్కృత్యములు చేయువాడు, అధికంగా ఖర్చు చేయువాడు, శరీరమున జల సంబంధ రోగములు కలవాడు అవుతాడు.





## శనీశ్వరుని గృహంలో పూజించవచ్చా?

శనీశ్వరుని విగ్రహాన్ని లేదా పటాన్ని పూజ గదిలో వుంచకూడదు.. అనడం కంటే శనీశ్వరుడి పటాన్ని పూజగదిలో వుంచాల్సిన అవసరం లేదని చెప్తున్నారు ఆధ్యాత్మిక పండితులు. శనీశ్వరుడితో పాటు నవగ్రహాలను ఇంట్లో వుంచి పూజించే సంప్రదాయం పురాతన కాలం నుంచే లేదు. కొన్ని పురాతన ఆలయాల్లో నవగ్రహ విగ్రహాలుండవు. అత్యధికంగా అంటే 200 సంవత్సరాల తర్వాతే నవగ్రహాలను ఆలయాల్లో ప్రతిష్టిస్తున్నారు. వాటికి పూజ చేస్తున్నారు. దేవుడు ఆదేశించే పనులను నిర్వర్తించేందుకే నవగ్రహాలున్నాయి. అలాంటి నవగ్రహాల వల్ల ఏర్పడే ఇబ్బందుల నుంచి బయటపడాలంటే.. పరమాత్ముడిని పూజించాలే కానీ.. నవగ్రహాలను పూజించడం సరికాదు అని కొందరి భావన.

# రాహు గ్రహ దోషాలు, నివారణ



ప్రాచీనులు రాహువును చాయా గ్రహం అని అన్నారు. చాయా అనగానే ఇంకొక దానికి నీడ లేదా ప్రతిబింబము అని అర్ధం. అందుకే మన ఆర్యులు "శని వత్ రాహు" అని శని గ్రహానికి బదులుగా రాహువని భావించారు. అన్ని గ్రహాలు రవి వలన అస్తంగతులైతే, రవి చంద్రులను సహితం నిస్తేజులుగా చేయగల చండ ప్రచండుడు రాహువు. అందుకే ఈయన స్తోత్రంలో "చంద్రాదిత్య విమర్ధనం" అని మర్దించే శక్తీ రాహువుకు కలదని చెప్పబడింది. ప్రాణ శక్తికి కారకుడైన సూర్యుని, మనః శక్తికి కారకుడైన చంద్రుని మర్దించే శక్తీ కలదు. కావునే రాహు మహాదశః బాగుగాలేనివారు పడే పాట్లు అన్ని ఇన్ని కావు.

పురాణాల ప్రకారం దక్షుని కూతురు సింహికకు కశ్యపునికి రాహువు జన్మించాడు. పైటినసగోత్రజుడు పార్ధవా నామ సంవత్సర భద్రా పద పౌర్ణమి పూర్వభద్రా నక్షత్రామందు జన్మించాడు. మ్లేచ్ఛ స్వభావం కలిగిన వాడు. సూర్యునికి నైరుతి దిశలో శూర్పకార మండలంలో సింహ వాహునుడై, కరాళ వక్త్రంతో ఉపవిష్ణుడై వుంటాడు

## రాహు గ్రహ సామర్థ్యాలు

కొత్తదాన్ని దేన్ని అయినా తెచ్చిపెట్టే స్వభావం రాహువునిది. మనుష్యులకు ఫారిన్ ప్రయాణం కానీ, వ్యక్తులతో పరిచయాలు కానీ, అలవాట్లతో అనుభూతులు కానీ కల్గించేవాడు రాహువు. ఈ గ్రహం గారడీ చేయించే శక్తి కలవాడు. అబద్ధాలు, అల్లకల్లోలాలు, క్రొత్త అలవాట్లు. క్రొత్త వేష భాషలు కల్గించడంలో సిద్ధహస్తుడు. గ్రీకు పురాణ గాధల్లో డ్రాగన్ అనే రాకాసి బల్లి వంటి జంతువు తలగా రాహువును, తోకగా కేతువును ప్రతికలుగ చిత్రీకరించారు. పూర్వజన్మ కర్మల్ని అతి విడ్డురంగా అనుభవింప చేయగలడు. దుర్మార్గ స్వభావం కలవారు అందలం ఎక్కడానికి, సాహస కార్యక్రమాలు చేపట్టే వారికి చేయూత నివ్వడానికి, రాహువు బాగా సహకరిస్తాడు. రాహు మహాదశలో ఖచ్చి తంగా పితృ కర్మలు చేయిస్తాడు. కుటుంబంలో ఇద్దరు ముగ్గురికి రాహు దశఃకానీ, అంతర్ దశః కానీ జరుగుతున్నపుడు తండ్రి, తాత, తల్లి, అమ్మమ్మలో ఒకరికి ఆయువు తీరుతుంది అంటారు. రాహువుకు యోగాలు కల్గించడం ఉన్నా, అనుభవంలో అవయోగాలు ఎక్కువగా కల్గిస్తాడు. "రాహు మహా దశః పట్టిందిరా" అనెడి లోకోక్తి అల్పులకు అందలం ఎక్కుట వల్ల ఏర్పడిందే. ఫారిన్ భాషలు, ఫారిన్ వస్తువులు ఫారిన్ జబ్బులు తెప్పించడంలో రాహువుదే అగ్రతాంబూలం అని అంటారు.

## రాహువు కల్గించే బాధలు

స్వంత బుద్ధి లోపించి ఇతరుల చెడు సలహాలను పాటించుట. మూర్ఖునిగా ప్రవర్తించుట, అధికార దుర్వినియోగం చేసి అల్లరి పాలగుట ఎలక్ట్రికల్ లేదా ఎలక్ట్రానిక్స్ వస్తువుల వల్ల నష్టాలు, పోలీసు గూడచారి సంస్థల వల్ల భాద కలుగును.

కుటుంబంలో పెద్దవారికి ఆకస్మిక మరణాలు, పిల్లలు తప్పిపోవుట లేదా పిల్లలను ఎత్తుకు పోవుట.

కోర్టు వ్యవహారాల్లో ఇరుక్కు పోవుట.

మిలటరీ సంబంధ, బిల్డింగ్ కాంట్రాక్టు సంబంధ నష్టాలు.

పాములు, తేళ్ళు, గేదెలు, విష జంతువుల వల్ల బాధలు.

విష గ్యాసులు, ఆమ్లాలు, వాతావరణ కాలుష్యం వల్ల ప్రమాదాలు.

ఎక్కడికో పారిపోదామనే మానశ్చాంచల్యం.

జైలు వరకు తెసుకొని వెళ్ళుట చేయించుట.

చంద్రునితో కలిస్తే గొప్ప బుద్ధి చాంచల్యం కానీ పిచ్చి కానీ కల్గించవచ్చును.

కుజునితో కలిసి చెడిపోతే ఆకస్మిక ప్రమాదాలు, దెబ్బ లాటలు, గాయాలు కల్గిస్తాడు.

రవితో కలిస్తే తప్పకుండా తండ్రితో సత్సంబంధాలు దెబ్బ తీస్తాడు.

శని రాహువుల కలయిక త్రీవ్రమైన పరిస్థితిలకు దారి తీయవచ్చును.

గురునితో కలిస్తే సద్భావన ఉన్నా, తప్పని పరిస్థితులలో తప్పులు చేయిస్తాడు.

ఎంత రహస్యంగా పనులు చేసినా బహిర్గతం చేసి పరువు తీయిస్తాడు. రాహువు ఎంత యోగం కల్గించినా, ఎంతో కొంత అప్రతిష్ట పాలు చేయకుండా ఉండలేడు

## రాహువు కల్గించే వ్యాధులు

రాహువు వాయుతత్వ కారకుడు అవడం వల్ల మానవ శరీరంలోని సమస్త వాయు సంబంధ రోగాలను కల్గిస్తాడు. నొప్పి ఎక్కడుందో అక్కడ రాహువు ఉంటాడు. కడుపు, నాభి, మర్మాంగాల నొప్పులకు ప్రతీక. ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లోని గమన శీలత్వాన్ని నిలుపుదల చేసే శక్తి రాహువుది.

ఉరఃపంజర సంబంధ రోగాలను కల్గిస్తాడు. శుక్ర రాహువుల కలయికతో చర్మ సౌందర్యాన్ని దెబ్బ తీస్తాడు. సమస్తమైన అంటువ్యాధులకు రాహువు అధిపతి. టైఫాయిడ్, మలేరియా, మసూచి, ఇన్ఫ్లూయెంజా లాంటి అనేక రకాల వైరస్ జ్వరాలకు రాహువు పెట్టింది పేరు. కన్యారాశిలో వుంటే అన్ని రకాల పురుగులను కడుపులో పెంచుతాడు. శరీరంలోని రోగ నిరోధక శక్తిని తగ్గించి, బ్యాక్టీరియాను ఆహ్వానించడంలో రాహువు మొదటి వాడు. రాహువు స్థితిని బట్టి పక్షవాతం, కీళ్ళ వాతం, నడుము నొప్పి మడాల పగుళ్ళు కల్గుతాయి. రాహువు ఏగ్రహంతో కలిసి ఉంటే ఆయాగ్రహ సంబంధిత రోగాలను ఇస్తాడు.

## రాహు గ్రహ నివారణోపాయాలు

రాహువుకు అధిదేవత పృద్వీ అని కొందరు, గోవులని కొందరు చెప్తారు. ప్రత్యధి దేవత సర్పములు, అధిప్రత్యధి దేవతా సహితంగా పునశ్చరణ చేసి దార పోయుట వలన నివారణ కల్గును.

రాహువుకు అధిష్టాన దేవత దుర్గాదేవి సప్తశతి పారాయణం కానీ మంత్రం జపం కానీ , కవచం కానీ పునఃశ్చరణ చేయుట వలన నివారణ పొందవచ్చును. చిన్నమాస్తాదేవిని విధి విధానంగా పూజించడం వల్ల రాహు గ్రహ దుష్ప్రరిణామాలను నివారించవచ్చును.

రాహు గ్రహ దోష నివారణకు శనివారం నాడు ప్రారంబించి వరుసగా 18 దినాలు పారుతున్న నీటిలోకి రోజుకొక కొబ్బరికాయ దార పోయుట వల్ల నివారణ కల్గును అని అంటారు. నిద్రించే ముందు గదిలో నెమలి ఫించాన్ని కనపడేటట్లుపెట్టి, తెల్లవారు జామున లేవగానే చూచుట వల్ల రాహు గ్రహ పీడ నివారణ కల్గును అని నమ్మకము. 

# రాహుకాలంలో దుర్గాపూజ



రాహు గ్రహానికి, దుర్గాదేవికి ఓ సంబంధం ఉంది. రాహు గ్రహానికి అధిదేవత దుర్గా దేవి. అందుచేత రాహు కాలంలోనే దుర్గాపూజ జరుగుతోంది. ఆదివారం రాహు కాల పూజ విశిష్టమైనది. రాహువుకు శరీరమంతా విషంతో నిండివుంటుంది. కానీ తోకలో మాత్రం అమృతం ఉంటుంది. అందుచేత ఆదివారం సూర్యుడు అస్తమించే సంధ్యా కాలానికి ముందు వచ్చే రాహుకాలంలో ఆయన తోక అమృతంగా మారి వుంటుంది. అంటే ఆదివారం సాయంత్రం 4.30 గంటల నుంచి 6 గంటలలోపు దుర్గాదేవిని పూజించినట్లైతే అనుకున్న కార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయని విశ్వాసం. రాహుకాలంలో దుర్గాదేవి కంటూ ప్రత్యేకంగా గల ఆలయంలో ఒక నిమ్మపండును సగంగా కోసి.. నిమ్మరసాన్ని పిండేసి.. నిమ్మపండును ప్రమిదల్లా తిప్పి.. అందులో నెయ్యి పోసి ఐదు వత్తులతో దీపమెలిగించాలి. ఈ దీపాలు అమ్మవారిని చూసేట్లు వెలిగించాలి. ఈ పూజ చేసేటప్పుడు అమ్మవారికి మల్లెపువ్వులు లేదా పసుపు చామంతులను మాత్రమే సమర్పించాలి. దుర్గాపూజ తర్వాత నవగ్రహ ప్రదక్షణలు కూడదు. ఇంటికొచ్చాక పూజగదిలో నెయ్యిదీపమెలిగించి.. ఐదు అగరవత్తులు, కర్పూరంతో పూజ చేయాలి.

#  కేతువు 

కేతువు రాశి చక్రంలో అపసవ్యదిశలో పయనిస్తుంటాడు. అంటే మేషం నుండి మీనానికి ఇలా పయనిస్తుంటాడు. రాశిలో ఒకటిన్నర సంవత్సరకాలం ఉంటాడు. సూర్యుడిని ప్రదక్షిణం చేయడానికి పద్దెనిమిది సంవత్సరాల కాలం పడుతుంది. రాహువు కేతువులు ఎప్పుడూ ఒకరికి ఒకరు రాశిచక్రం లోని ఏడవ స్థానంలో సంచరిస్తుంటారు. కేతు మహర్దశా కాలం ఏడు సంవత్సరాలు. కేతువు ముక్తి కారకుడు. అశ్విని, మఖ, మూలా నక్షత్రాలకు ఆధిపత్యం వహిస్తాడు. ఈ మూడు నక్షత్రాలలో వారికి పుట్టిన ఆరంభ దశ కేతుదశ. కేతువుకు అవల, శిఖి, ధూమ, ధ్వజ, మృత్యుపుత్ర అనే ఇతర నామాలు ఉన్నాయి.

కేతువు పురుష గ్రహము. గ్రహ స్వభావం పాప గ్రహం, తత్వం వైరాగ్యము, స్వభావం క్రూర స్వభావం, గుణం తమోగుణం, దిక్కు వాయవ్యము, ప్రదేశం పాములు తిరిగే ప్రదేశం. ఆత్మాధికారం మోక్షం, పాలనా శక్తి భటుడు, లోహము ఇనుము, కుటుంబ సభ్యుడు తాత, వర్ణం ధూమ్ర వర్ణం, గ్రహపీడ అతితెలివి, గ్రహ వర్గం గురువు, గృహం లోని ఖాళీ ప్రదేశాలను సూచిస్తాడు, కాలబలం పగలు, శత్రు క్షేత్రం కటకం, సమక్షేత్రం మీనము, ఉచ్ఛ క్షేత్రము వృశ్చికము, నీచ క్షేత్రము వృషభము, మిత్రులు సూర్యుడు, చంద్రుడు, కుజుడు, శత్రువులు శని, శుక్రుడు, సములు గురువు, బుధుడు. వయసు ముసలి వయసు, చెట్లు ముళ్ళ చెట్లు, ధాన్యం ఉలవలు, పండ్లు సీతాఫలము, ప్రదేశములు గుహలు, బిలములు. దేశంలో కేతువు ఆధిక్యత ఉన్న ప్రదేశం అంతర్వేధి. ధాన్యము ఉలవలు, పక్షులు రాబందు, గద్ద, కోడి. జంతువులు కుక్క, పంది, గాడిద. మూలికలు తెల్ల జిల్లేడు, పున్నేరు వేరు, సమిధలు దర్భ. దైవ వర్గం వైష్ణవ, గోత్రము పైఠీనస. అవతారం మీనావతారం. గ్రహారూఢ వాహనం గ్రద్ద, రత్నము వైఢూర్యం, రుద్రాక్ష నవ ముఖ రుద్రాక్ష, లోహము కంచు, శుభ సమయం ఉదయ కాలం, వారము ఆదివారం, స్వభావం చంచల స్వభావం, దృష్టి అధోదృష్టి.

## కారకత్వము

కేతువు కుటుంబ సభ్యులలో తాత (తల్లికి తండ్రి) ను సూచిస్తాడు. కేతువు దైవోపాసన, వేదాంతం, తపస్సు, మోక్షము, మంత్ర శాస్త్రము, భక్తి, నదీస్నానం, మౌన వ్రతం, పుణ్యక్షేత్ర దర్శనం, మోసము, పరుల సొమ్ముతో సుఖించుట, దత్తత మొదలైన వాటిని సూచిస్తాడు.

**వ్యాధులు :** అజీర్ణం, స్ఫోటకము, రక్తపోటు, చెముడు, నత్తి, దురదలు, గ్యాస్, అసిడిటీ, వైద్యము, జ్వరము, వ్రణములను సూచిస్తాడు. కేతువు ఏగ్రహముతో కలిసిన ఆ అవయవమునందు బాధలు కలిగిస్తాడు. రోగ నిర్ధారణ సాగదు కనుక చికిత్స జరుగుటలో సమస్యలు సృష్టిస్తాడు. ఇతడు మృత్యుకారకుడు, భయాన్ని కలిగిస్తాడు, రక్తపోటు, అలర్జీ, మతి స్థిమితం లేక పోవుట మొదలైన వ్యాధులకు కారకుడౌతాడు.

## రూపము

కేతువు పార్థివ నామసంవత్సరం ఫాల్గుణ మాసం శుక్ల పౌర్ణమి అభిజిత్ నక్షత్రంలో బుధవారం జన్మించాడు. కేతువు గోత్రం జైమినీ పైఠీనస. కేతువు బూడిద వర్ణంలో రెండు భుజములతో ఉంటాడు. కేతువు వాహనం గ్రద్ద. బ్రహ్మదేవుడికి తాను సృష్టించి జనం అపారంగా పెరగడంతో వారిని తగ్గించడానికి మృత్యువు అనే కన్యను సృష్టించాడు. మానవులకు మరణం ఇచ్చే బాధ్యతను అప్పగించాడు. తనకు మరణం ఇచ్చినందుకు ఆ కన్య దుఃఖించింది. ఆమె కన్నీటి నుండి అనేక వ్యాధులు ఉద్భవించాయి. అప్పుడు తెల్లని పొగ రూపంలో ఒక పురుషుడు జన్మించాడు. కీలక నామ సంవత్సరం మార్గశిర కృష్ణ అమావాస్య నాడు మంగళవారం మూలా నక్షత్రంలో కేతువు జననం జరిగింది. బ్రహ్మ ఆజ్ఞానువర్తి అయి కేతువు ధూమ్రకేతువుగా సంచరించ సాగాడు. క్షీరసాగర మధన సమయంలో మోహినీ చేతి అమృతం తాగిన తరువాత విష్ణువు కేతువు తల నరికి ఆ స్థానములో పాము తలను ధరింపచేసాడు. అప్పటి నుండి కేతువుగా నామధేయం చేయబడి విష్ణు అనుగ్రహం చేత గ్రహస్థితి పొందాడు. కేతువు పత్ని చిత్ర రేఖ. సాధారణంగా కేతువు ఒంటరిగా కుజ ఫలితాలను ఇచ్చినా ఏగ్రహంతో చేరి ఉంటే ఆ ఫలితాలను ఇస్తాడు. గ్రహస్థానం పొందిన కేతువు విష్ణువుకు అంజలి ఘటిస్తూ ఉంటాడు.

## పరిహారం



కేతుగ్రహ పరిహార పూజార్థంగా కంచు ప్రతిమ శ్రేష్టం. అధి దేవత బ్రహ్మ. నైవేధ్యం చిత్రాన్నం, కుడుములు, ఉలవ గుగ్గిళ్ళు. ప్రీతికరమైన తిథి చైత్ర శుద్ధ చవితి. ఆచరించవలసిన వ్రతం పుత్ర గణపతి వ్రతం, పారాయణం చేయవలసినది శ్రీ గణేశ పురాణం, కేతు అష్టోత్తర శత నామావళి, గణేశ శతనామావళి. దక్షిణగా ఇవ్వవలసిన జంతువు మేక, ధరించవలసిన రత్నం వైడూర్యం, ధరించ వలసిన మాల రుద్రాక్ష మాల, ధరించవలసిన రుద్రాక్ష నవముఖి రుద్రాక్ష. ఆచరించవలసిన దీక్ష గణేశ దీక్ష. చేయవలసిన పూజ విఘ్నేశ్వర పూజ, సూర్యారాధన, దానం చేయవలసిన ఆహార పదార్ధాలు ఖర్జూరం, ఉలవలు. గ్రహస్థితిని పొందిన వారం బుధవారం. మండపం జెండా ఆకారం. గ్రహం బలంగా ఉంటే ఆధ్యాత్మిక చింతన బలహీనమైన అతి భయం కలుగుతుంది.

## కేతువు స్థానములు

లగ్నంలో కేతువు ఉన్నజాతకుడు అవయవములు కలవాడు సుఖ హీనుడు, స్థానభ్రష్టుడు, మాయావులతో మాటాడువాడు అవుతాడు. అధికంగా స్వేదం స్రవించువాడు, చక్కని ప్రజా సంబంధాలు కలిగినవాడు, కృతఘ్నుడు, చాడీలు చెప్పువాడు, జాతిభ్రష్టుడు, స్థానభ్రష్టుడు, అసంపూర్ణమైన అవయవములు కలవాడు, మాయావులతో కలసి ఉండువాడు అవుతాడు.

ద్వితీయ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు విద్యలేని వాడు, విద్యా హీనుడు, ధనం లేనివాడు, అల్పపదములు పలుకువాడు, దుష్టబుద్ధి

కలిగినవాడు, పరుల మీద ఆధారపడి జీవించువాడు, శాంతస్వభావులు, ముక్తసరిగా మాటాడువాడు అవుతాడు.

తృతీయ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు చిరంజీవి, శక్తి సంపన్నుడు, ఆస్తి కలవాడు, కీర్తికలవాడు, భార్యాసమేతంగా జీవితం సాగించువాడు, సుఖంగా భుజించువాడు, సోదరుని కోల్పోవువాడు అవుతాడు.

చతుర్ధ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు భూమిని, తల్లిని, వాహనములను, సుఖములను కోల్పోవును. స్వస్థలమును వదిలి అన్యప్రదేశంలో జీవించువాడు. పరధనముతో జీవించువాడు, గొడవలు పెట్టుకునే స్వభావం కలవాడు అవుతాడు.

పంచమ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు గర్భకోశ వ్యాధి పీడితుడు అవుతాడు, సంతతిని నష్టం కలుగువాడు, పిశాచపీడచేత బాధపొందువాడు, దుర్బుద్ధి కలవాడు, మోసగాడు అవుతాడు.

షష్టమ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు మాటకారి, ఉదారుడు, ఉత్తమగుణ సంపన్నుడు, దృఢచిత్తుడు, మిగుల కీర్తివంతుడు, ఉన్నతోద్యోగి, శత్రునాశనాపరుడు, కోరికలు సిద్ధించువాడు అవుతాడు.

సప్తమ స్థానమున కేతువు ఉన్న జాతకుడు అగౌరవం పొందువాడు, దుష్టస్త్రీ సమేతుడు, అంతర్గత రోగపీడితుడు, కళత్రనష్టం పొందువాడు, శక్తి హీనుడు అవుతాడు.

అష్టమ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు అల్పాయుష్మంతుడు, ప్రాణమిత్రులను విడిచినవాడు, కలహములతో జీవించువాడు, ఆయుధముల చేత గాయపడిన వాడు, నిరాశా నిస్పృహాలతో కార్యములు చేయువాడు, కళత్రముతో పేచీలు పడువాడు అవుతాడు.

నవమ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు పాపచింతన కలిగిన వాడు, అశుభవంతుడు, పితృదేవతలను అణచివేయు వాడు, దురదృష్ట వంతుడు, ప్రసిద్ధులను దూషించువాడు, చత్వారం, మంచి కళత్రం కలిగినవాడు అవుతాడు.

దశమ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు కార్యములలో విఘ్నములు కలుగువాడు, మలినుడు, నీచమైన కార్యములు చేయువాడు, శక్తిమం తుడు, బహుకీర్తిమంతుడు, తాత్విక చింతన కలవాడు అవుతాడు.

ఏకాదశ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు ధనవంతుడు, బహుగుణ వంతుడు, భోగి, మంచి వస్తువులు పొందువాడు, ప్రతి కార్యమునందూ విజయం సాధించు వాడు, హాస్యచతురత కలిగిన వాడు అవుతాడు.

ద్వాదశ స్థానంలో కేతువు ఉన్న జాతకుడు రహస్యంగా దురాచార ములు చేయువాడు, అధమ కార్యాలు చేయువాడు, ధననాశనం పొందిన వాడు, ఆస్తిని నాశనం చేయువాడు, విరుద్ధమైన ప్రవర్తన కలిగిన వాడు, నేత్రరోగి, విదేశీయానం చేసేవాడు అవుతాడు.



## మనస్సుపై ప్రభావాన్ని చూపే చంద్రుడు

**చంద్రుని కదలికలు నిత్యజీవితంలో మానవుని మనస్సుపై ప్రభావాన్ని చూపుతాయి. ప్రతి నెలపొడుపు చంద్రుని ప్రభావము మానవ జీవితం పైన, జీవిత లక్ష్యాలపైన ప్రభావాన్ని చూపుతుంది. చంద్రుడు శని ప్రభావానికి లోనైతే అనుకోని దిగులు, విచారం మనస్సును అలుము కుంటాయి. చంద్రుడు గురువు లేక శుక్రుని ప్రభావానికి గురైతే ఉత్సాహంగాను, ప్రోత్సాహంగాను జీవితం ఉంటుంది.**

# రాహు కేతువులు-ఆరోగ్యం



రాహువు దుర్ఘటనలను, ప్రయాణాలలో సమస్యలను, దుష్ట ప్రయోగాలను శాసిస్తాడు. శరీరంలోని కాళ్ల విషయంలో రాహు కేతువులు చాలా సక్రియంగా ఉంటారు. ఆరోగ్యం విషయంలో వీరిరువురు ఎవరితో కలసినా ఇబ్బందే! ఆగ్రహం, భావం లేదా రాశి పీడితమైనదని తెలుసుకోవాలి.

కేతువు సామాన్యంగా స్త్రీల విషయంలో మానసిక సమస్యలను చంద్రునితో కలసి అందచేస్తాడు. లగ్నాత్ అయిదులోనూ, ఏడులోనూ ఉంటే శరీరంలో ఏవో లంప్స్, ట్యూమర్లు ఇలాంటివి కనపడ వచ్చును. ఎనిమిదిలో చర్మ వ్యాధులు ఉందవచ్చును.

రాహువు విష ప్రయోగాన్నీ, అర్థం కాని అనారోగ్యాన్నీ సృష్టిస్తాడు. కేతువు పుండ్లను శాసిస్తాడు. రాహువు కేతు నక్షత్రంలో (అస్విని, మఖ, మూల) ఉంటే దారుణమైన ఏక్సిడెంట్లను ఇస్తాడు. ఆ దశలో జాగ్రత్త వహించాలి.

రాహువు ఆర్ద్ర 3, 4 పాదాలలో ఉంటే ఆరోగ్యం దెబ్బ తింటుంది. నాల్గవ పాదంలో ఉంటే చెడు అలవాట్లకు లోనవుతారు. అలాగే స్వాతి మొదటి, నాలుగు పాదాలలో రాహువు ఉంటే ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలి.

రాహువు శతభిషం రెండవ పాదంలో ఉంటే కోపిష్ఠి, మూడవ పాదంలో ఉంటే కాలేయ సమస్యలున్నవారు ఉంటారు.

కేతువు అశ్విని మూడవ పాదంలో ఉంటే ఆరోగ్యం విషయంలో జాగ్రత్త వహించాలి. అలాగే మఖ 1,2,3 పాదాలలో ఉన్నా అనారోగ్యం, మూల 1,2 లో ఉన్నా జాగ్రత్త వహించాలి.

రాహు కేతువులు ఎవరి దశలో ప్రవేశించినా ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి. వారి దశలలో ముఖ్యంగా గుండె విషయంలోనూ, విష జ్వరాల విషయంలొనూ జాగ్రత్త వహించాలి.

## రాహు కేతువులు కలిగించే శుభాలు

రాహువు మంచి కూడా చెస్తాడు. రాహువు మంచి స్థానంలో ఉండి గురువు చేత 5 లేదా 9 దృష్టి కలిగి యున్నప్పుడు రాజయోగం, సంఘంలో గౌరవం ఇస్తాడు. పన్నెండులో ఉన్నప్పుడు చక్కని తెలివి తేటలిస్తాడు. కేతువు ఆరులో ఉన్నప్పుడు కీర్తి, జ్యోతిష శాస్త్రం, జరిగేది తెలియటం ఇలాంటివి ఇస్తాడు. అలాగే రెండులో ఉన్నప్పుడు మార్కెట్ వలన లాభాలూ, పదకొండులో ఉన్నప్పుడు లాటరీలు ఇస్తాడు. కేతువు తాత్వికమైన గ్రహం. సంప్రదాయ బద్ధమైన ఉపాసన ఇస్తాడు కేతువు.

**శ్రీకాళహస్తి :** శ్రీకాళహస్తిలోని ఈశ్వరుడు నవగ్రహ కవచధారి! ఆయనకు ఎదురుగా సూర్యుడు ఉంటాడు. శివాలయంలో ఇది అరుదు! శివుడు ఇక్కడ భక్తుల గ్రహ దోషాలన్నీ సూర్యుడు సాక్షిగా హరించి వేస్తాడు. అలాగే ఈ కాలసర్ప దోషాన్ని





నివారించి ఆశీర్వదిస్తాడు. ఇక్కడ మరొక విశేషం కలదు. అమ్మవారు శ్రీజ్ఞాన ప్రసూనాంబ ఎదురుగా ఉన్న ప్రాకారంలో నేల మీద ఒక పద్మం ఉంటుంది. దీని మీద నిలబడి చూరు పైకి చూస్తే రాహువు యంత్రం ఉంటుంది. ఈ యంత్రాన్ని చూస్తూ ఆత్మ ప్రదక్షిణ చేయాలి. అలా చేస్తూ పేరు, నక్షత్రం, గోత్రం మనస్సులో చెప్పుకుని అమ్మవారిని రాహువు నుంచి కాపాడమని కోరాలి. చాలు! ఈ జన్మకు మనలను రాహువు బాధించడు.

రాహువు దుర్గా ఉపాసన ఉన్న వారిని బాధించడు. దృష్టి దోషం సామాన్యంగా రాహువు డిపార్ట్మెంట్! దుర్గా సప్తశ్లోకీ, ఖడ్గమాలా స్తోత్రం, చండీ ధ్వజ స్తోత్రం చదువుకునే వారికి రాహువు బాధలు ఉండవు. సుబ్రహ్మణ్య ఉపాసన ఉన్నవారికి, నాగపూజ ఉన్నవారికీ, ఇంటిలో నాగ పడగ బూపు మీద పాలతో అభిషేకం చేయువారికీ, కేతువు వలన ఇబ్బందులు ఉండవు.



దశలో కానీ, గోచారంలో కానీ రాహువు సమస్య ఉన్న వారు 1800 గ్రాములు నల్ల మినుములు శివాలయంలో దానమిచ్చిన మంచి ఫలితాలను పొందగలరు.

రాహువు సంఖ్య 18. ఒకప్పుడు అయ్యప్ప యాత్ర శ్రీకాళహస్తి నుంచి ప్రారంభమయ్యేదని చెబుతారు. అయ్యప్ప గుడి మెట్లు 18. (దీక్షలో రాహువు రంగు నలుపు వస్త్రాలు ధరిస్తారు.) మహాభారత రణరంగం 18 రోజులు. సంఖ్యా శాస్త్రంలో 18 అంకె-రవి(1), 8(శని) కలసిన సంఖ్య ఇది. అనగా సూర్యోదయం-వెలుగు, పడమర దిక్కు, రిసైక్లింగ్ చేసే శనికి కలిగే సంయోగం ఇది. ఆది, అంతం కలసిన ఏమిటి? యుద్ధం.

ఇదే వెలుగు నీడల యుద్ధం. రాశి చక్రంలోని వెలుగు నీడల పర్యంతం మన జీవితం అలా సాగిపోతుంది. రాహువు నీడను -మృత్యువును గుర్తు చేస్తూనే ఉంటాడు. అటు చివర కేతువు ఉపాసన మార్గం ద్వారా మోహాన్ని జయించి అమృత తత్వాన్ని తెచ్చుకో మంటాడు.

రాహు కేతువులు ఇద్దరూ ఒక శరీరమే. పురాణం మనకు చెబుతుంది. ఒకరు తల భాగం, ఒకరు అధో భాగం. ఈ రెండిటినీ అధిగమించే సారమే అమృతం. అదే 'తమసోమా జ్యోతిర్గమయ!' అనే ప్రార్థన, వేదం లోని మహావాక్యం.



# రాహువు కేతువు



రాహువు కేతువు జ్యోతిషంలో ఇవి చాయా గ్రహాలు. ఇవి అపసవ్య మార్గంలో ప్రయాణిస్తాయి. రాహువు దశాకాలం జాతకంలో పద్దెనిమిది సంవత్సరాలు కేతువు దశాకాలం జాతకంలో ఏడు సంవత్సరాల కాలం. రాహువు విషం, విషజ్వరాలు మొదలైన వాటికి కారకుడు. కేతువు రణములకు కారకుడు. జాతక చక్రంలో రాహుకేతువులకు ఇల్లు లేదు. రాహువు సూర్యచంద్రులతో కలిసినప్పుడు సూర్యగ్రహణం. కేతువు సూర్య చంద్రులతో కలసినప్పుడు చంద్రగ్రహణం ఏర్పడతాయి. రాహుగ్రహ నక్షత్రాలు ఆర్ద్ర, స్వాతి, శతభిష ఈ నక్షత్రజాతకులకు రాహుదశా శేషంతో జన్మిస్తారు.

కేతువు నక్షత్రాలు అశ్విని, మఖ, మూల నక్షత్రాలలో జన్మించిన వారు కేతుదశా శేషంతో జన్మిస్తారు. రాహువు కేతువు నక్షత్రాలైన అశ్విని, మఖ, మూల నక్షత్రాలలో సంచరిస్తున్నప్పుడు దారుణమైన దుర్ఘటనలు సంభవిస్తాయి.

రాహువు ఆర్ద్ర మూడు, నాలుగవ పాదాలలో సంచరించే సమయాన ఆరోగ్య సమస్యలు, చెడు అలవాట్లు ఉత్పన్నమౌతాయి. స్వాతి నాలుగు పాదాల సంచారం ఆరోగ్య సమస్యలు సృష్టిస్తాయి. శతభిష రెండవ పాదసంచారంలో కోపం, మూడవ పాద సంచారం కాలేయ సమస్యలు ఉత్పన్నమౌతాయి.

కేతువు అశ్విని మూడవ పాదంలో, మఖ ఒకటి, రెండు, మూడు పాదాలలో, మూల ఒకటి రెండు పాదాలలో ఉన్నప్పుడు ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమౌతాయి.

రాహు శుక్రుల కలయిక కళారంగ ప్రవేశానికి అధికంగా దోహదం చేస్తుంది. రాహు శుక్రులు దశమ స్థానంలో ఉన్నప్పుడు ఇది సంభవం.

రాహువు కేంద్రంలో ఉండి గురుగ్రహ దృష్టి అంటే అయిదవ, తొమ్మిదవ దృష్టి కలిగిన రాజయోగం, సంఘంలో గౌరవ మర్యాదలు ఇస్తాడు. పన్నెండులో రాహువు చక్కని తెలివితేటలు ఇస్తాడు.

కేతువు ఆరులో ఉన్నప్పుడు కీర్తి, భవిష్యజ్ఞానం కలిగిస్తాడు. రెండవ స్థానంలో ఉన్నప్పుడు మార్కెట్ వలన లాభాలు కలిగిస్తాడు. పదకొడులో ఉన్న కేతువు లాటరీల ద్వారా ధనం ఇస్తాడు.

జాతక చక్రంలో రాహు కేతువుల మధ్య గ్రహములు చిక్కు పడడం కాలసర్ప దోషంగా పరిగణిస్తారు. కాలసర్ప దోష నివారణకు కాళహస్తీశ్వర దర్శనం అక్కడ చేసే పరిహారం నివారణగా భావించబడుతుంది.

రాశి చక్రంలో రాహుకేతువులు పద్దెనిమిది మాసముల తరువాత అపసవ్య మార్గంలో రాశి మార్పు జరుగుతుంది. రాహుకేతులవలన ఒక పరిభ్రమణ కాలం పద్దెనిమిది సంవత్సరాలు. రాశి చక్రంలో రాహు కేతువుల మధ్య సరిగ్గా ఏడు స్థానాల దూరం ఉంటుంది. రాహుకేతువులు చాయా గ్రహాలు కనుక ఏరాశి అందు ఉన్న ఆ రాశ్యధిపతి ఫలితాలు ఇస్తారు. 

**శుక్ర గ్రహానికి సంబంధించి దోషాలను నిరోధించటానికి వజ్రాన్ని ఆభరణంలో గానీ లేదా ఉంగరంలోగానీ ధరించాలి అంటారు.**



# నవమ భావం, రాహుకేతువుల ప్రభావం

నవమ భావాన్ని భాగ్యభావము అని అంటారు. దశమ భావంలో ఉండే విజయం కాని, అపజయంకాని దశమ భావానికి వ్యయమైన నవమం మీద ఆధరపడి ఉంటుంది. నవమం పూర్వ పుణ్యానికి, నమ్మకానికి, జ్ఞానానికి స్థానం. ఉన్నత విద్య ఏ విషయం గురించియైనా శాస్త్రీయమైన పరిజ్ఞానం, పరిశోధనలు, దూరదృష్టి తదితర విషయాలు అన్ని ఈభావం నుండి పరిశీలింపబడతాయి. నూతన విషయాలు ఆవిష్కరణ, గుర్తించిన వాటిని పదిమందికి తెలియచేయటం కూడ ఈ భావం నుండి పరిశీలించవచ్చు అంటారు.

## రాహు, కేతు అంతర్ధశలలో జరిగే అనుభవాలు

ఇతర గ్రహాలవలె వీటికి గ్రహ పదార్థాలుకాని, ఆకర్షణ శక్తిగాని లేవు. ఇవి రెండు బలమైన ఫలితాలను ఇవ్వడం అత్యంత ఆశ్చర్యకర విషయము. ప్రతి వ్యక్తికి రాహు, కేతు దశ అంతర్ధశలలో కలిగే వివిధ అనుభవాలు తెలుస్తూ ఉంటాయి. రాహువు మన పూర్వజన్మల కర్మ ఫలాన్ని అనుసరించి మనకు ఈ జన్మలో మన కుటుంబాన్ని మనకు భౌతిక మానసిక బాధలను, ఆనందాన్ని సంతోషాన్ని ఇస్తాడు. ఏది ఎలా ఎప్పుడు జరగాలో నిర్ణయించేది కాలము. వ్యక్తి పుట్టిన సమయాన్ని అనుసరించి నక్షత్రపాదాన్ని అనుసరించి వింశోత్తరి దశ మొదలు అవుతుంది. వివిధ గ్రహాలు దశ అంతర్ దశలలో శుభమైనా అశుభమైనా ఆయా

ఫలితాలను ఇస్తాయి. ప్రతి మానవుడు ఒక జన్మలో తన కర్మఫలం ప్రకారం చేయవలసిన పనులన్ని చేసిన తరువాత మరణించినా, ఆ మరణం కేవలం వ్యక్తి శరీరానికే గాని అతని ఆత్మకు కాదు. ఆత్మకు చావులేదు. రాశి చక్రంలో రాహుకేతువులు సర్పానికి సంకేతాలు. అంటే ఇవి మనం పూర్వ జన్మలో చేసుకున్న కర్మ ఫలాల ఆధారంగా మనం ఈజన్మలో అనుభవింప వలసిన శుభ, అశుభ కర్మలను నిర్ధేశించే గ్రహాలు అని చెబుతారు.

రాహుకేతువులు ఏరాశిలో, రాశి చక్రంలో ఉంటాయో ఆ రాశ్యాధి పతి యొక్క ఫలితాలను ఇస్తాయి. అవి ఏ భావల్లో ఉన్నయో ఆ భావ ఫలితాలను ఇస్తాయి. ఇవి ఇతర గ్రహాల కన్నాబలమైన ఫలితాలు ఇస్తాయి. రాహువు పితా మహులను సూచిస్తాడు. ఆకస్మిక ప్రమాదాలు, చెడు సలహాలు పాటించడం, కోర్టు వ్యవహారాలలో ఇరుక్కోవడం, ఎలక్ట్రి కల్ వస్తువుల వలన నష్టాలు, విషవాయువు కాలుష్యాల వలన ప్రమా దాలు, తండ్రితో సత్ సంబంధాలు లేకపోవడం, రోగనిరోధక శక్తి తగ్గిపోవడం, శుక్రునితో కలిస్తే చర్మసౌందర్యం తగ్గిపోవడం ఎన్నో జరుగు తాయి. కేతువు మాతామహులను తెలుపుతాడు. ఆకస్మిక సంఘటనలు, అనుకోని అడ్డంకులు రావడం, అనాచార పరత్వం, సంప్రదాయాలను ధిక్కరించడం, మోసపోవడం, ఇతరమతస్తులవలన కష్టాలు, ఊపిరితిత్తు లలో బాధలు కలిగిస్తాడు. శుభస్థానాలలో, శుభగ్రహాలతో కలిసి ఉంటే అధ్యాత్మిక కార్యక్రమాలు పూజలు దైవభక్తి పెరుగుతుంది. రాహువు మంచి స్థానాలలో ఉంటే మంచి ఉన్నత స్థితికి వ్యక్తి చేరుకుంటాడు.



# నవగ్రహాల దోష నివారణకు నవ నారసింహ క్షేత్రాలు



నరసింహస్వామి హిరణ్యకశిపుడిని సంహరించి వికటాట్ట హాసాలు చేస్తూ అహోబిల కొండల్లో తిరుగుతూ తొమ్మిది ప్రదేశాల్లో వివిధ రూపాల్లో వెలసారని ప్రతీతి. జ్వాల నరసింహ స్వామి, అహోబిల నరసింహ స్వామి, మాలోల నరసింహ స్వామి, వరాహ నరసింహస్వామి (క్రోడా), కారంజ నరసింహ స్వామి, భార్గవ నరసింహస్వామి, యోగానంద నరసింహస్వామి, చత్రవట నారసింహస్వామి, పావన నరసింహ స్వామి రూపాలుగా వీటిని చెబుతారు.

## జ్వాలా నరసింహ క్షేత్రము

నవ నారసింహ క్షేత్రాల్లో ఒకటైన యాదగిరిగుట్ట హైదరాబాద్ నుండి 65 కి మీ దూరంలో ఉంది. ఇక్కడ కొండపైన వెలసిన నరసింహ స్వామివారికి ఘనమైన చరిత్ర ఉంది. పూర్వం యాదవ మహర్షి ఈ కొండపైన తపస్సు చేసాడట. అప్పుడు మహావిష్ణువు ప్రత్యక్షమవ్వగా తనకు నరసింహమూర్తిని మూడు అంశాలతో దర్శనం అనుగ్రహించమని కోరాడట. అప్పుడు స్వామి గండబేరుండ నరసింహుడు, జ్వాల నరసింహుడు, యోగానంద నరసింహుడు అనే రూపాలలో కనిపించాడట. ఎప్పటికి స్వామి తన కళ్ళముందే ఉండవలసిందిగా యాదవ మహర్షి కోరటం వలన స్వామి అలాగే కొండపైన వెలశాడని అంటారు. స్వామి వెలసిన స్థలం కొండపైన గుహలో ఉంటుంది. ఇక్కడ స్వామి వారిని దర్శించు కుంటే కుజగ్రహ దోషాలు తొలుగుతాయి అంటారు.

## అహోబిల నరసింహ స్వామి

నారాయణుడు ఉగ్రనారసింహ అవతారం దాల్చి హిరణ్యకశపుని చీల్చి చెండాడిన క్షేత్రమిదేనని స్థల పురాణం చెబుతుంది. హిరణ్యకశపుని చీల్చి చెండాడిన నరసింహ స్వామి ఉగ్రరూపాన్ని చూసి దేవతలు అహో.. బలం, అహోబలం అని ఆశ్చర్యంతో పొగిడారటా అందుకీ ఈ క్షేత్రానికి అహోబిల నరసింహ స్వామి దేవాలయంగా పేరు వచ్చింది అని చెబుతారు. ముక్కోటి దేవతలు స్తోత్రము చేసినా కోపము తగ్గని నృసింహ స్వామిని ప్రహ్లాదుడు తపస్సు చేయగా “స్వయంభు” తనకు తానే సాలగ్రామముగా, ఎవరు ప్రతిష్ఠచేయని మూర్తిగా ఈ బిలమునందే వెలసినారు. ప్రహ్లాదుడు ప్రార్థించగా గరుడాద్రి పర్వత క్రింద భవనాశిని తీరమునందు గుహలోపల

స్వయంభువుగా వెలసి ప్రహ్లాదునికి దర్శన మిచ్చినదియే ఈ అహోబిలం. ఈ అహోబిలానికి దేవతలు స్తుతించినందున అహోబలం అని, బిలం నందు స్వయముగా వెలసినందుకు అహోబిలం అని రెండు విధాలుగా అభివర్ణించారు. ఈ నరసింహా స్వామిని పూజించిన వారికి గురుగ్రహా దోషాలు నివారణ అవుతాయి అని ప్రసిద్ధి.

## మాలోల నరసింహ స్వామి

వేదాద్రి పర్వతంమీద లక్ష్మీనృసింహ స్వామిగా "మా" అనగ లక్ష్మి లోల యనగ "ప్రియుడు" అని అర్థం. ఈ దేవాలయానికి మార్కొండ లక్ష్మమ్మపేట అని కూడా పిలుస్తారు. ఎగువ అహోబిలానికి 1 కి.మీ దూరంలో ఈ ఆలయం కలదు. స్వామి వారు ప్రసన్నాకృతిలో దర్శనమిస్తారు. వేదాద్రి శిఖరాన చదునైన ప్రదేశంలో ఈ గుడి నిర్మించబడినది. ఇక్కడి స్వామివారి శిల్పము వామపాదాన్ని మడుచుకొని, దక్షిణపాదాన్ని వంచి కిందకు వదలి సుఖాసీనుడై ఉన్నాడు. స్వామివారి ఎడమ తొడపై లక్ష్మీదేవి స్వామివారి వామ హస్తము లక్ష్మీదేవిని ఆ లింగనము చేసుకొన్నట్లుగా యున్నది. స్వామివారి విగ్రహము శంఖు, చక్ర, వరద, హస్తాలతో యున్నది. భూతలం నుండి ఆవిర్భవించిన తామరపై లక్ష్మీదేవి పాదాలు ప్రకాశిస్తు న్నాయి. ఇదొక ప్రశాంతమైన సుందరమైన ప్రదేశము. ధ్యాన అనుష్టాలకు చక్కని వేదిక. ఈ నరసింహా స్వామిని పూజించినవారికి శుక్రగ్రహ దోషాల నుండి విముక్తి కలుగుతుంది అని చెబుతారు.

## వరాహ నరసింహస్వామి (క్రోడా)

వేదాద్రి పర్వతముయందు వేదములను భూదేవిని సోమకాసురుడు అపహరించుకొని పోగా వరాహ నరసింహుడుగా శ్రీమన్నారాయణుడు అవతరించి భూలోకం కిందకు వెళ్ళి సోమకాసుని సంహరించి భూదేవి

సహితంగా పైకితెచ్చినందుకు ఈ క్షేత్రానికి వరాహ నరసింహ క్షేత్రమని పేరు. భూదేవిని ఉద్ధరించిన వరాహస్వామి. ఈ నరసింహా మూర్తిని దర్శించిన రాహుగ్రహ దోషాలు తొలగిపోతాయి అని చెబుతారు.

## కారంజ నరసింహస్వామి

కారంజ వృక్ష స్వరూపిమైన శ్రీ కారంజ నరసింహ మూర్తికి కరంజ వృక్షము క్రింద పద్మాసనంతో వేంచేసియున్న స్వామికి కారంజ నరసింహ స్వామి అని పేరు. పగడలువిప్పి నిలిచిన ఆదిశేషుని క్రింద ధ్యాన నిమగ్నుడైన మూర్తిగా స్వామివారు దర్శనమిస్తారు. గోబిలుడనే మహర్షి తపస్సు చేసినందుకు ఆయనకు ప్రత్యక్షమైనారని మరియు శ్రీ ఆంజనేయస్వామి ఇక్కడ తపస్సు చేయగా నృసింహస్వామి దర్శనమివ్వగా అందుకు ఆంజనేయుడు "నాకు శ్రీరామ చంద్రమూర్తి తప్ప వేరెవ్వరు తెలువదనగా" నృసింహుడు నేనే శ్రీరాముడ, నేనే నృసింహస్వామి సాంగ (ధనస్సు) హస్తములతో దర్శన మిచ్చినట్లు చెబుతారు. ఈ స్వామికి ఫాలనేత్రము (త్రినేత్రము) కలదు. అందుకే అన్నమయ్య "పాలనేత్రానల ప్రబల విద్యుల్లత కేళి విహార లక్ష్మీనరసింహ" అని పాడారు. ఈ నరసింహా మూర్తిని పూజించిన వారికి చంద్రగ్రహ అనుగ్రహం లభించును అని నమ్మకము.

## భార్గవ నరసింహస్వామి

పరశురాముడు ఈ అక్షయ తీర్థ తీరమందు తపస్సు చేయగా శ్రీ నృసింహస్వామి హిరణ్యకశిపుని సంహారం చేసే స్వరూపంగా దర్శనమిచ్చాడు. కావున ఈ క్షేత్రానికి భార్గవ నరసింహ క్షేత్రమని పేరు. ఈ స్వామిని "భార్గోటి" అని ప్రాంతీయ వాసులు పిలుస్తారు. పరశురాముని పూజలందుకున్న దివ్యధామము. ఈ ఆలయం దిగువ అహోబిలానికి 2 కి.మీ. దూరం

లో ఉత్తర దిశ (ఈశాన్యము) యున్నది. స్వామి వారి విగ్రహం, పీఠంపై చతుర్బాహయుతమై శంఖు చక్రాన్వితములైన ఊర్ధ్వ బాహువులు, అసురుని ప్రేవులను చీలుస్తు రెండు హస్తాలు, ఖడ్గహస్తుడైన హిరణ్య కశిపుడు, ప్రక్కనే అంజలి ఘటిస్తున్న ప్రహ్లాదుడు, ప్రభావళి నందు దశావతారములతో ఈ విగ్రహము కలిగియున్నది. ఈ నరసింహా మూర్తిని పూజించిన వారికి సూర్యగ్రహ అనుగ్రహం లభించును అని అంటారు.

## యోగానంద నరసింహస్వామి

యోగమునందు ఆనందమును ప్రసాదించుచున్నాడు కాబట్టి స్వామి వారికి యోగానంద నరసింహ స్వామి అని పిలవబడుచున్నాడు. ప్రహ్లాదునికి ఈ యోగ నృసింహుని అనుగ్రహంతో యోగాభ్యాసం చేసినారట. మనశ్చాంచ ల్యము కలిగిన బ్రహ్మ నరసింహుని గురించి తపస్సు చేసి మన:స్థిరత్వమును సాధించెను. ఈ ప్రదేశము యోగులకు, దేవతలకు నిలయం. ఈ నరసింహా మూర్తిని పూజించిన వారికి శనిగ్రహ అనుగ్రహం లభించును అని చెబుతారు.

## చత్రవట నారసింహస్వామి

పద్మాసనంతో అభయహస్తాలతో నల్లగా నిగనిగలాడుతున్న ఈ మూర్తి చాలా అందమైన ఆకర్షణీయమైన మూర్తి. “హా హా” “హుహ్వా” అను ఇద్దరు గంధర్వులు అతి వేగముతో గానం చేసి నృత్యం చేయగా నృసింహస్వామి సంతోషించి వారికి శప విమోచనం కావించెనట. కిన్నెర, కింపుర, నారదులు ఈ క్షేత్రం నందు గానం చేశారట. సంగీతాన్ని అనుభవించినట్లు ఉండే ఈ స్వామిని చత్రవట స్వామి అని పిలుస్తారు. ఈ నరసింహా మూర్తిని పూజించిన వారికి కేతుగ్రహ అనుగ్రహం లభించును అని చెబుతారు.

## పావన నరసింహ స్వామి

పరమ పావన ప్రదేశంలో ఏడుపడగల ఆదిశేషుని క్రింద తీర్చిదిద్దిన మూర్తి ఈ స్వామివారి పేరులోనే సమస్త పాపములను, సంసారంలో జరిగే సుఖదు:ఖాలను తొలగించగలిగేవాడని అర్ధమగుచున్నది. మరియు "భరద్వాజ" ఋషి ఇచ్చట తపస్సు చేయగా స్వామి వారు మహాలక్ష్మి సహితంగా వారికి దర్శనమిచ్చారు. కావున ఈ స్వామికి పావన నరసింహస్వామి అని పేరు. ఈ క్షేత్రానికి పాములేటి నరసింహ స్వామి అని కూడా పిలుస్తారు. ఎగువ అహోబిలానికి 6 కి.మీ. దూరము లో దక్షిణ దిశలో యున్నది. పాప కార్యములు చేసినవారు ఈ స్వామిని దర్శించినంతనే పావనులగుదురు అని చెబుతారు. బ్రహ్మోత్సవముల దగ్గరనుండి ప్రతి "శనివారం" నృసింహ జయంతి వరకు అద్భుతంగా వేడుకలు జరుగుతాయి. ఈ నరసింహా మూర్తిని పూజించిన వారికి బుధగ్రహ అనుగ్రహం లభించును అని చెబుతారు.












# ఆంధ్రప్రదేశ్‌లో నవగ్రహా సంబంధిత క్షేత్రాలు











నవగ్రహాలకు సంబంధించిన క్షేత్రాలు ఆంధ్రప్రదేశ్‌లోనే చాలా వరకు ఉన్నాయి. ఈ దేవాలయములలో నవగ్రహ పూజలు నిర్వహించు కొంటారు. కొన్ని ప్రసిద్ధ క్షేత్ర వివరాలు.

## సూర్యునకు సంబంధించిన ఆలయములు

**శ్రీకాకుళం జిల్లా :** హర్షవల్లి సూర్యనారాయణ స్వామి.

**తూర్పుగోదావరి :** పెద్దాపురం సూర్యనారాయణ స్వామి.

**తూర్పుగోదావరి :** గొల్లలమామిడాడ సూర్యనాయణ స్వామి.

**కర్నూలు :** నందికొట్టూరు సూర్యనారాయణ స్వామి.

## చంద్రునకు సంబంధించిన ఆలయములు

**పశ్చిమ గోదావరి :** గునుగుపూడిలో సోమేశ్వర స్వామి (భీమవరం).

**తూర్పుగోదావరి :** కోటేపల్లి సోమేశ్వర స్వామి

**కృష్ణ :** విజయవాడలో కనకదుర్గాదేవి, పెద్దకళ్ళే పల్లెలో దుర్గాదేవి.

**నెల్లూరు :** జొన్నవాడ కామాక్షితయారు అమ్మవారు.

## అంగారకునకు సంబంధించిన ఆలయములు

**కృష్ణ :** మోపిదేవి సుబ్రమణ్యస్వామి మరియు చోడవరం

**తూర్పుగోదావరి :** బిక్కవోలు సుబ్రమణ్యస్వామి మరియు పెద్దాపురం

**గుంటూరు :** పెద్దనందిపాడు, నాగులపాడు పుట్ట, పెద్దకూరపాడు పుట్ట.

**మంగళగిరి :** సుబ్రమణ్య స్వామి, పొన్నూరు.

## బుధునకు సంబంధించిన ఆలయములు

**పశ్చిమ గోదావరి :** ద్వారకా తిరుమల.

**తూర్పుగోదావరి :** ర్యాలీ, అన్నవరం, పిఠాపురం కుంతీమాధవ స్వామి.

**కృష్ణ :** శ్రీ కాకుళంలో ఆంధ్రా మహావిష్ణువు.

**చిత్తూరు :** తిరుమల తిరుపతి వెంకటేశ్వర స్వామి.

## బృహస్పతికి సంబంధించిన ఆలయములు

**గుంటూరు :** చేబ్రోలు బ్రహ్మ దేవుడు.

**తూర్పుగోదావరి :** కోటిపల్లోలో కోటిలింగేశ్వర స్వామి. మందపల్లిలో బ్రహ్మేశ్వర స్వామి.

**గుంటూరు :** అమరావతిలో అమరలింగేశ్వరస్వామి, కోటప్పకొండ త్రికూటేశ్వర స్వామి.

## శుక్రునకు సంబంధించిన ఆలయములు

**విశాఖ :** విశాఖ పట్టణం కనకమహాలక్ష్మి, సింహాచలం లక్ష్మీ దేవి.

**చిత్తూరు :** అలిమేలు మంగాపురం, పద్మావతీ దేవి.

**నెల్లూరు :** పెంచలకోన ఆది లక్ష్మీదేవి.

## శనీశ్వరునకు సంబంధించిన ఆలయములు

**తూర్పుగోదావరి :** మందపల్లెలో మందేశ్వర స్వామి.

**అనంతపురం :** హిందుపురం తాలూకా పావగడలోని శనిమహాత్ముడు

**కృష్ణ :** విజయవాడలోని కృష్ణనది తీరాన జ్యేష్ఠదేవి సహిత శనైశ్చర్య స్వామి

**ప్రకాశం :** నర్శింగోలు (సింగరాయ కొండ వద్ద) శనీశ్వర స్వామి.

## రాహువు, కేతువుకు సంబంధించిన ఆలయములు

**చిత్తూరు :** శ్రీ కాళహస్తి **తూర్పుగోదావరి :** మందమల్లి నాగేశ్వర స్వామి

**కృష్ణ :** విజయవాడ కనకదుర్గా దేవి.

**విశాఖ :** సంపత్ వినాయక స్వామి.

**గుంటూరు :** అమరావతి వినాయకస్వామి, తెనాలి వైకుంఠపురం పుట్ట.

ఈ నవగ్రహ క్షేత్ర దర్శనములన్నింటిని ఒక వారము రోజులలో దర్శనము పూర్తి చేసినచో నవగ్రహ దోషములు తొలగి, శుభ ఫలితాలు చేకూరగలవని ఒక నమ్మకము.



# ఏలినాటి శని నుంచి విముక్తి కలిగించే సూర్యనార్ ఆలయం

నవగ్రహాల్లో సూర్య భగవానుడిది కీలక స్థానం. యావత్ ప్రపంచానికి ఆయన వెలుగును ప్రసాదిస్తూ, జీవవైవిధ్యాన్ని సంరక్షిస్తున్నాడు. నవగ్రహ స్తోత్రంలో 'ఆదిత్యయాచ' అంటూ తొలుత సూర్య భగవానుడినే ప్రార్థిస్తాం. అలాంటి సూర్య భగవానుడు ఇతర గ్రహాలతో కలిసి వెలసిన ప్రాంతమే కుంభకోణం. ఈ ఆలయాన్ని సందర్శించి ప్రత్యేక పూజలు చేస్తే ఏలినాటి శనితో పాటు ఇతర గ్రహదోషాల నుంచి కూడా విముక్తి పొందవచ్చు అని అంటారు.

తమిళనాడు రాష్ట్రంలోని కుంభకోణానికి 15 కిలోమీటర్ల దూరంలో సూర్యనార్ దేవాలయం వెలసివుంది. ఇక్కడ నవగ్రహాలకు వేర్వేరుగా



ఆలయాలు ఉన్నాయి. సూర్యభగవానుడు మధ్యలో ఉంటే, ఆ ఆలయానికి చుట్టూ మిగిలిన 8 గ్రహ ఆలయాలు ఉన్నాయి. అన్ని నవగ్రహాల్లో శివుడు ప్రధాన దైవమైతే ఈ ఆలయంలో మాత్రం సూర్యుడు ప్రధాన దైవం. ఇక్కడ సూర్యభగవానుడి వేడిని తగ్గించడానికి నవగ్రహాల్లో ఒకటైన గురుడు ఆ సూర్య భగవానుడికి ఎదురుగా ఉంటారు. సూర్య భగవానుడికి చక్కెర పొంగలిని నైవేద్యంగా పెడతారు. భక్తులకు ప్రసాదంగా కూడా ఆ చెక్కెర పొంగలినే ఇస్తారు.

## ఇద్దరు దేవేరులతో సూర్యదేవుడు



ఈ ఆలయంలోనే మూలవిరాట్టు అయిన సూర్యభగవానుడు తన ఇద్దరు సతులైన ఉషా, ప్రత్యూషలతో ఆశీనులై భక్తులకు దర్శన మిస్తుంటాడు. సాధారణంగా సూర్యుడు అంటే తీక్షణమైన కిరణాలు కలిగినవాడు. ఇక్కడ అందుకు భిన్నంగా స్వామి మంద హాసంతో రెండు చేతుల్లో తామర పుష్పాలు కలిగి భక్తకోటికి ఆశీర్వచనాలు ప్రసాదిస్తున్న ముద్రలో ఉంటాడు. అంతేకాకుండా సూర్యుడు అంటే వేడి. అందుకే ఈ ఆలయం ఉన్న ప్రాంతమంతా చాలా వేడిగా ఉంటుంది. వర్షా కాలంలో కూడా ఈ వేడిని గమనించవచ్చు అని అంటారు. ఈ దేవా లయంలో సూర్యుడితోపాటు గురుడిని 12 ఆదివారాలు ఆలయంలోనే ఉండి కొలిస్తే ఏలినాటి శని వదులుతుందని భక్తుల నమ్మకం. అందుకు తగిన ఏర్పాటు కూడా ఈ ఆలయంలో భక్తులకు ఉన్నాయి.

## ఆలయ నిర్మాత కుళోత్తుంగ చోళ మహారాజు

సూర్యనార్ ఆలయాన్ని క్రీస్తుశకం 11వ శతాబ్దంలో కుళోత్తుంగ చోళ మహారాజు నిర్మించినట్టు చరిత్ర చెబుతోంది. అనంతరం విజయ నగర రాజులు, ఇతర రాజవంశాలు ఈ ఆలయాన్ని అభివృద్ధి చేసినట్టు చారిత్రక ఆధారాలు వెల్లడిస్తున్నాయి. ఐదు అంతస్తుల రాజగోపురాన్ని పూర్తిగా గ్రానైట్‌తో నిర్మించారు. ఈ ఆలయంలో ఇతర గ్రహాధిపతులకు ప్రత్యేకమైన చిన్న ఆలయాలు కూడా ఉన్నాయి. నవగ్రహాలకు వాటి వాహనాలు ఇక్కడ కనిపించవు. అలాగే ఆలయ ప్రాంగణం లో విశ్వనాథ, విశాలాక్షి, నటరాజ, శివగామి, వినాయక, మురుగన్ విగ్రహాలు ఉన్నాయి. వీటితో పాటు ప్రధాన ఆలయ మందిరానికి అతి సమీపంలోనే బృహస్పతి ఆలయం కూడా ఉంది.

## సూర్యునికి ఎదురుగా తెల్లని గుర్రం

సాధారణంగా అన్ని శివాలయాల్లో మహాదేవుడుకి ఎదురుగా నంది ఉంటుంది. కానీ, ఇక్కడ సూర్యదేవుడుకి ఎదురుగా అశ్వం ఉంటుంది. ఎందుకంటే సూర్యుడి రథాన్ని లాగేది శ్వేత అశ్వాలే కదా. ఆలయంలో సూర్యుడు పడమర దిక్కును చూస్తూ, రెండు చేతుల్లో కలువ పువ్వులు ధరించి ప్రసన్నవదనంతో భక్తులకు దర్శనమిస్తుంటాడు.

## అత్యంత వైభవంగా రథసప్తమి

ఈ ఆలయంలో రథసప్తమి పండుగను అత్యంత వేడుకగా నిర్వహిస్తారు. తమిళ నెల అయిన తాయ్ మాసంలో ఈ వేడుకలు జరుపుతారు. తాయ్ మాసంలో సూర్యదేవుని రథం దక్షిణం వైపు నుంచి ఉత్తరం వైపునకు తిరుగుతుందని పురాణాలు చెపుతున్నాయి. భక్తుల ప్రగాఢ

నమ్మకం కూడా. అలాగే, ప్రతి యేడాది తమిళ మాసం ప్రారంభంలో ప్రత్యేకమైన వేడుకలు కూడా నిర్వహిస్తారు. ఈ సందర్భంగా జరిగే మహాభిషేకానికి విశేష సంఖ్యలో భక్తులు తరలిస్తుంటారు.

## స్థల పురాణం

కాలవముని అనే యోగి కుష్టువ్యాధితో బాధపడుతుండేవాడు. ఆ బాధ నుంచి తనను రక్షించాలని నవగ్రహాలను ప్రార్థించాడు. ఆయన ప్రార్థనకు అనుగ్రహించిన గ్రహాధిపతులు కాలవమునిని వ్యాధి నుంచి విముక్తి చేస్తారు. ఈ విషయం తెలుసుకున్న బ్రహ్మ కన్నెర్రజేస్తాడు. మానవుల్లో మంచి, చెడులకు సంబంధించిన ఫలితాలను ఇవ్వడమే గ్రహాల పని అని పేర్కొంటూ తమ పరిధిని అతిక్రమించిన గ్రహాలను భూలోకంలోనే శ్వేతపుష్పాల అటవీప్రాంతానికి వెళ్ళమని శపిస్తాడు. దీంతో భూలోకానికి వచ్చిన నవగ్రహాలు లయకారుడైన పరమశివుని కోసం తపస్సు చేస్తారు. ఆ తపస్సుకు ప్రత్యక్షమైన మహాశివుడు వారికి శాప విముక్తి చేస్తాడు. అంతేకాకుండా, వారు ఎక్కడైతే తనను పూజించారో అక్కడ వారికి మహాశక్తులను ప్రసాదిస్తాడు. ఆ క్షేత్రంలో ఎవరైనా భక్తులు వచ్చి తమ బాధలను తీర్చమని నవగ్రహాలను వేడుకుంటూ ప్రార్థిస్తే వారికి బాధలు ఉపశమనం కలిగేలా వరాన్ని ప్రసాదించాడు ఆ పరమేశ్వరుడు.

## ఏలినాటి శని విముక్తి కోసం

అనేకమంది వివిధ రకాల గ్రహదోషాలతో పాటు ఏలినాటి శనితో బాధపడుతుంటారు. ఇలాంటి వారు కుంభకోణం చుట్టుపక్కల ఉండే నవగ్రహాలను ఒక్కసారి దర్శనం చేసుకుని ప్రత్యేక పూజలు నిర్వహిస్తే

ఏలినాటి శని ఇట్టే పోతుందట. అలా స్వాంతన కలిగేలా నవగ్రహాలు మహా దేవుడు వద్ద వరం పొందినట్టు పురాణాలు చెబుతున్నాయి. అంతే కాకుండా, ఒక్క సూర్యదేవుని ఆలయంలో మినహా మిగిలిన ఆలయాల్లో ప్రధాన దైవం శివుడు. కానీ, ఈ ఆలయంలో మాత్రం ప్రధానదైవం సూర్యుడు.

సూర్యభగవానుడితో పాటు గురుడుని 11 ఆదివారాలు పూజిస్తే ఏలినాటి శనితో పాటు ఇతర గ్రహ దోషాలు తొలగిపోతాయి. ఇందు కోసం ప్రత్యేకంగా నాడి పరిహారం, నవగ్రహ హోమాలు, సూర్య అర్చన వంటి పూజలు నిర్వహిస్తారు. తులాభారంలో భాగంగా తమ బరువుకు సమానమైన గోధుమ, బెల్లం తదితర వ్యవసాయ ఉత్పత్తులను ఈ ఆలయానికి సమర్పించుకుంటారు.

## స్థలవాసం

ఆలయంలో భక్తులు ఉండటానికి ఏర్పాట్లు ఉన్నాయి. ఇలా ఆల యంలోనే ఉండి పూజలు చేయడాన్ని స్థలవాసం అంటారు. ఈ స్థలవాసం చేయడానికి దేశం నలుమూలల నుంచి ఎంతో మంది నిత్యం ఇక్కడకు వచ్చి నవగ్రహాలను అత్యంత భక్తితో కొలిచి బాధలనుండి సేదతీరుతారు.

## ఆలయ సందర్శన వేళలు

ఉదయం 6 గంటల నుండి 11 గంటల వరకు మరియు తిరిగి సాయంత్రం 4 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు.

## ఎలా చేరుకోవాలి?

సూర్యనార్ ఆలయం ఉన్న ప్రాంతానికి సమీపంలోనే కుంభకోణం పట్టణం ఉంది. కుంభకోణానికి 15 కిలోమీటర్ల దూరం. ఇక్కడ అన్ని రకాల రవాణా వసతులు, బస సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి. 

# కుంభకోణం చుట్టూ నవగ్రహ ఆలయాలు

గ్రహాలు మొత్తం తొమ్మిది. సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు మరియు కేతువు. అయితే కుజ దోషం, శుక్ర గ్రహ దోషం, రాహు దోషం ఇలా ఇలా సర్వగ్రహరిష్టాలు తొలగిపోవడానికి తమిళనాడులో కుంభకోణం చుట్టూ నవగ్రహ దేవాలయాలు అనేవి ఉన్నాయి. వాటి వివరాలు.



## సూర్యదేవాలయం

తమిళనాడు రాష్ట్రం, తంజావూరు జిల్లాలో కుంభకోణం నుండి 15 కి.మీ. దూరంలో గల తిరుమంగళంకుడి అను ప్రాంతంలో సూర్యనార్ కోయిల్‌గా పిలువబడే సూర్యదేవాలయం ఉంది. పురాణం ప్రకారం బ్రహ్మ ఒకసారి నవ గ్రహాలకి కుష్టురోగం వస్తుందని శపించాడు. అప్పుడు శాపవిమోచనం కోసం ఈ ఆలయాన్ని సందర్శించి ఇక్కడ పూజలు చేసిన శాపవిమోచనం పొందారని, అప్పటి నుండి ఇది నవగ్రహ ఆలయంగా ప్రసిద్ధి చెందిందని చెబుతారు. ఈ ఆలయంలో పూజ చాలా నిష్ఠగా ఉంటుంది. పూజానంతరం ఆలయం చుట్టూ 9 సార్లు ప్రదక్షిణం చెయ్యవలసి ఉంటుంది. ఈ నవగ్రహ దేవాలయాల ప్రదక్షిణను భక్తులు పవిత్రంగా భావిస్తారు. ఇక్కడ ప్రధాన మూర్తి సూర్యభగవానుడు.

## చంద్ర దేవాలయం

తమిళనాడు రాష్ట్రం, తిరువైయార్‌కి సమీప దూరంలో చంద్ర దేవాలయం ఉంది. ఈ స్వామివారిని దర్శిస్తే దీర్ఘాయుష్షును, సుఖాన్ని



ప్రసాదిస్తాడని భక్తుల నమ్మకం. ఈ ఆలయంలో విశేషం ఏంటంటే, ప్రతి సంవత్సరం సెప్టెంబర్-అక్టోబర్ నెలలో వచ్చే పురట్టాసి, మార్చి- ఏప్రిల్‌లో వచ్చే ఫల్గుణి నక్షత్ర సమయంలో చంద్రకాంతి అనేది ఈ ఆలయం లోని శివలింగం పైన పడుతుంది.

## అంగారక దేవాలయం

తమిళనాడు రాష్ట్రంలోని, నాగపట్నం జిల్లాలో, వైదీశ్వరన్ కోయిల్ అనే రైల్వేస్టేషన్‌కు సమీపంలో వైదీశ్వరన్ ఆల యం ఉంది. పూర్వము ఒక ముని తనకు పెద్ద జబ్బు చేయగా, పరమే



శ్వరుని గూర్చి భక్తితో తపస్సు చేయగా, శంకరుడు ఒక వైద్యుని రూప ములో ప్రత్యక్షమై అతని జబ్బు నయం చేసాడని స్థల పురాణం తెలియ చేస్తుంది. అందువల్ల ఈ ప్రాంతంవారు ఇంట్లో ఎవరికీ ఏ జబ్బు చేసిన ఈ వైదీశ్వరుని ఆలయానికి వచ్చి మ్రొక్కుకుంటారు. శ్రీరాముడు జటా యువుకు ఇచ్చుటనే దహన సంస్కారాలు చేసినట్లు తెలుస్తుంది. అయితే నవగ్రహ దేవతామూర్తులైన బుధుడు, కేతువుకు ఇచట విడివిడిగా ఆలయాలు కన్పించుట ఒక విశేషంగా చెబుతారు.

## బుధాలయం

అంగారక ఆలయానికి కొన్ని కిలోమీటర్ల దూరంలో బుధాలయం ఉంది. ఈ ఆలయంలో కొలువై ఉన్న స్వామివారిని స్వేతారన్యేశ్వరుడని,



అమ్మవారిని బ్రహ్మ విద్యాంబికా దేవి అని కొలుస్తారు. ఈ ఆలయం 3000 ఏళ్ళ నాటిదిగా చెబుతారు.

## బృహస్పతి ఆలయం



కుంభకోణానికి కొన్ని కిలోమీటర్ల దూరంలో బృహస్పతి ఆలయం ఉంది. ఇక్కడి శివలింగం స్వయంభువు అని చెబుతారు. పార్వతీదేవి ఇక్కడే శివుడిలో ఐక్యమైందని స్థల పురాణం.

## శుక్రదేవాలయం



తమిళనాడులోని సూర్యదేవాలయానికి కొన్ని కిలోమీటర్ల దూరంలోనే శుక్రదేవాలయం ఉంది. ఇక్కడ బ్రహ్మ శివ పార్వతుల వివాహాన్ని దర్శించాడని పురాణం.

## శని దేవాలయం



తమిళనాడు రాష్ట్రం, తంజావూరు జిల్లా, తిరునల్లూరు అనే గ్రామంలో శని గ్రహ దేవాలయం ఉంది. ఈ ఆలయం చాలా పురాతనమైన ఆలయంగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడే నలమహారాజుకు శని పట్టుకొని పీడించడం ప్రారంభించాడని పురాణం. ఇక్కడకి నల తీర్థంలో స్నానం చేస్తే సర్వపాపాలు హరించుకుపోతాయని భక్తుల నమ్మకం. ఈ ఆల

యంలో వెలసిన స్వామివారి పేరు దర్భరణ్యేశ్వరుడు. ఈ దేవుడికి గరిక అంటే చాలా ఇష్టం. అందుకే ఈ ఆలయంలో గరిక మొక్కని అతి పవిత్రంగా భావిస్తారు. అందువల్ల ఈ స్వామిని దర్భాధిపతి అని కూడా అంటారు. ఇక్కడ దేవాలయాన్ని దర్శించినప్పుడు భక్తులు దర్భల కొసలు ముడివేస్తారు. ఇలా ముడివేస్తే తమ కష్టాలన్నీ గట్టెక్కుతాయని భక్తుల నమ్మకం. ఇక ఈ ఆలయంలోని శనీశ్వరుడికి బంగారు కాకి వాహనంగా ఉంది. అయితే ప్రత్యేకంగా శనివారంనాడు మరియు ఉత్సవాల సందర్భం గా మూలా విగ్రహానికి బంగారు కవచం తొడుగుతారు. శని దేవుకి ప్రతి రెండు సంవత్సరాలకి ఒకసారి శనిపీయేర్చి అనే ఉత్సవం జరుగుతుంది.

## రాహు దేవాలయం



తమిళనాడు రాష్ట్రం, కుంభ కోణానికి 5 కి.మీ. దూరంలో తిరునాగేశ్వరం అనే గ్రామం ఉంది. ఈ గ్రామంలో అతి పురాతనమైన రాహు గ్రహ ఆలయం ఉంది. భారతదేశంలో రాహుగ్రహమూర్తి కోసం ప్రత్యేకంగా నిర్మించబడిన అతి పెద్ద ఆలయం ఇది ఒక్కటే అని చెబుతారు. ఈ ఆలయంలో రాహుగ్రహ దోష నివారణకై ప్రత్యేక పూజలు జరుగుతాయి. ఈ ఆలయం వద్దే వెండితో చేసిన నాగపడగలు అమ్ముతారు. నిత్యం వచ్చే రాహుకాల సమయంలో రాహువుకు క్షీరాభిషేకం చేయిస్తుంటారు. భక్తులు ఇచట ఒక మహిమగా చెప్పుకునే విశేషం ఏంటంటే రాహుకాల సమయంలో మాత్రమే క్షీరాభిషేకం జరిపినప్పుడు రాహువు శిరస్సు పై

నుండి పాలు పోస్తే శిరస్సు దాటి కంఠభాగం చేరేసరికి ఆ పాలు నీలం రంగులోకి మారిపోతాయి. మిగిలిన సమయాలలో ఆలా జరుగదు. అందువలన నిత్యం రాహుకాల సమయంలో క్షీరాభిషేకం జరిపించుటకు భక్తులు కుతూహుల పడతారు.

## కేతు దేవాలయం



తిరువెన్నాడు నుండి కొంత దూరంలో కేజ్ పేరంపాలెం అనే గ్రామంలో కేతు గ్రహ ఆలయం ఉంది. కేతు గ్రహానికి ఇలా ప్రత్యేకంగా నిర్మించిన ఆలయం ఇదేనని చెబుతారు. ఇక్కడ రాహు కేతువులు జంటగా సర్పాకారంలో కలసి ఉండి, క్షీరసాగరమధనంలో శివునికి సహాయం చేసారని ప్రతీతి. ఇలా కేతు గ్రహానికి అంకితమైన ఈ ఆలయంలో కేతు గ్రహ దోష నివారణకై ప్రత్యేక పూజలు జరుగుతాయి. ఇక్కడ ఆలయ వద్ద పూజ సామాగ్రిలో భాగంగా ఒక పళ్ళెంలో 7 దీపాలు వెలిగించడానికి వీలుగా 7 ప్రమిదలను అమర్చిఇస్తారు. ఇక్కడికి వచ్చిన భక్తులు కేతుగ్రహానికి దానంగా ఉలువలను సమర్పించి, ఏడు దీపాలను వెలిగించి కేతువును పూజిస్తారు.



**శాస్త్రం ప్రకారం జాతకంలో సూర్యుడు బలంగా ఉన్నప్పడు వ్యక్తి జీవితంలో అభివృద్ధి అనేది ప్రారంభమవుతుంది. అంతే కాకుండా తలపెట్టిన పనులన్నీ సులభంగా పూర్తవుతాయి.**

# మందపల్లి శనీశ్వరాలయం



తూర్పుగోదావరి జిల్లా మందపల్లిలో శనీశ్వరాలయం ప్రసిద్ధి గాంచింది. పూర్వం అశ్వత్థూ, పిప్పలాదులనే రాక్షసులు ఈ ప్రాంతంలో తపస్సు చేసుకునే మునులను సంహరించి వారిని భక్షించేవారట. అప్పుడు వారంతా వెళ్లి అక్కడే పరమేశ్వరుని తపస్సులో ఉన్న శనీశ్వరునితో మొరపెట్టుకున్నారట. వారి మొరను ఆలకించిన మందుడు ఆ రాక్షసులను హతమార్చాడట. అసుర సంహారం వల్ల కలిగిన బ్రహ్మహత్యాపాతకాన్ని నివారించుకునేందుకు మందపల్లిలో శివలింగాన్ని ప్రతిష్ఠించి పూజలు చేశాడట. అప్పట్నుంచి ఆ ఆలయం శనైశ్చర క్షేత్రంగా పేరుపొందింది. శత్రుబాధ, రుణబాధ, రోగపీడతోనూ... ఏలినాటిశని, అర్ధాష్టమ శని తోనూ బాధపడేవారు ఈ స్వామికి తైలాభిషేకం జరిపిస్తే అవన్నీ తొలగిపోతాయని ప్రతీతి. ఏటా శ్రావణమాసంలోనూ శనిత్రయోదశి వచ్చే రోజుల్లోనూ మందేశ్వరుడికి ప్రత్యేకపూజలు నిర్వహిస్తారు.





## ప్రపంచంలోనే అతిపెద్ద శనీశ్వరుని విగ్రహం

కర్ణాటకలోని ఉడుపి సమీపంలో ప్రపంచంలోనే మొదటి 23 అడుగుల ఏకశిలా శ్రీ శని భగవానుని విగ్రహం

# నవగ్రహ శ్లోకాలు

నవగ్రహ శ్లోకాలు కష్టాలను/ ఈతి బాధలను తొలగించి, కోరిన కోరికలను తీర్చడంలో అద్భుతంగా పనిచేస్తాయి. దారిద్ర్య దుఃఖ బాధలు, శారీరక మానసిక రోగ రుగ్మతలు తొలగుతాయి. సర్వ కార్య విజయాలు, విద్యా ఉద్యోగ వ్యాపారాది లాభాలు, మనోవాంఛలు తీర్చుతాయి.

## నవ గ్రహ శ్లోకం

ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

## రవి 6000 సార్లు

జపాకుసుమ సంకాశం, కాస్యపేయం మహాద్యుతిం,
తమోరిం సర్వ పాపఘ్నం, ప్రణతోస్మి దివాకరం.

## చంద్ర 10,000 సార్లు

దధి శంఖ తుషారాభం, క్షీరో దార్ణవ సంభవం,
నమామి శశినం సోమం, శంభోర్మకుట భూషణం.

## కుజ 7,000 సార్లు

ధరణీ గర్భ సంభూతం, విద్యుత్ కాంతి సమప్రభం,
కుమారం శక్తి హస్తం, తం మంగళం ప్రణమామ్యహం.

## బుధ 17,000 సార్లు

ప్రియంగు కలికా శ్యామం, రూపేణా ప్రతిమం బుధం,
సౌమ్యం సత్వ గుణోపేతం, తం బుధం ప్రణమామ్యహం.

## గురు 16,000 సార్లు

దేవానాంచ ఋషీణాంచ, గురుం కాంచన సన్నిభం,
బుద్ధి మంతం త్రిలోకేశం, తం నమామి బృహస్పతిం.

## శుక్ర 20,000 సార్లు

హిమకుంద మృణాళాభం, దైత్యానాం పరమం గురుం,
సర్వ శాస్త్ర ప్రవక్తారం, భార్గవం ప్రణమామ్యహం.

## శని 19,000 సార్లు

నీలాంజన సమాభాసం, రవిపుత్రం యమాగ్రజం,
ఛాయా మార్తాండ సంభూతం, తం నమామి శనైశ్చరం.

## రాహు 18,000 సార్లు

అర్ధకాయం మహావీరం, చంద్రాదిత్య విమర్ధనం,
సింహికా గర్భ సంభూతం, తం రాహుం ప్రణమామ్యహం.

## కేతు 7,000 సార్లు

ఫలాశ పుష్ప సంకాశం, తారకా గ్రహ మస్తకం,
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం, తం కేతుం ప్రణమామ్యహం.

ఈ నవగ్రహ శ్లోకాలు ఎవరైనా పఠించవచ్చు. పైన గ్రహ శ్లోకాలు వాటి ప్రక్కనే చేయవలసిన జపసంఖ్య చెప్పడం జరిగింది. ఆ జపసంఖ్యను పూర్తిచేయడానికి చాలాసమయం పడుతుంది కనుక ఒకేరోజులో పూర్తి చేయవలసిన అవసరం లేదు. మీకు అనుకూలమైన కొన్ని రోజులు నియమం పెట్టుకుని రోజుకి కొంత పూర్తి చేసుకుని, ఆ గ్రహానికి ఇష్టమైన ధాన్యం ఇష్టమైన వారంలో దానం చేయడం ద్వారా ఆశించిన ఫలితాలను పొందవచ్చు.

# నవగ్రహ దోష నివారణ స్తోత్రం

**శ్రీ సూర్యగ్రహ దోష నివృత్యర్థం శ్రీ రామావతార స్తుతి పఠనంచ కరిష్యే:**

సీతావల్లభ దాశరథే దశరథనందన లోకగురో
రావణ మర్దన రామనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

**శ్రీ చంద్రగ్రహ దోష నివృత్యర్థం శ్రీ కృష్ణావతార స్తుతి పఠనంచ కరిష్యే:**

కృష్ణానంత కృపాజలధే కంసారే కమలేశహరే
కాళియమర్దన లోకగురో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

**శ్రీ కుజగ్రహ దోష నివృత్యర్థం శ్రీ నృసింహావతార స్తుతి పఠనంచ కరిష్యే:**

హిరణ్య కశిపుచ్ఛేదనతో ప్రహ్లాదాభయ దాయక హేతో
నరసింహాచ్యుత రూపనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

**శ్రీ బుధగ్రహ దోష నివృత్యర్థం శ్రీ బుద్ధావతార స్తుతి పఠనంచ కరిష్యే:**

దానవపతి మానాపహార త్రిపుర విజయ మర్దన రూప
బౌద్ధ జ్ఞానద బుద్ధనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

శ్రీ బృహస్పతిగ్రహ దోష నివృత్యర్థం శ్రీ వామనావతార స్తుతి పఠనంచ కరిష్యే:

భవ బంధన హర వితతమతే పాదోదక నిహతాఘతతే
వటుపటు వేష మనోజ్ఞనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

శ్రీ శుక్రగ్రహ దోష నివృత్యర్థం శ్రీ పరశురామావతార స్తుతి పఠనంచ కరిష్యే:

క్షితిపతి వంశక్షయ కరమూర్తే క్షితిపతి కర్తా హరిహరమూర్తే
భృగుహల రామ పరేశనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

శ్రీ శనైశ్చరగ్రహ దోష నివృత్యర్థం శ్రీ కూర్మావతార స్తుతి పఠనంచ కరిష్యే:

మంథనాచల ధారణహేతో దేవాసుర పరిపాలవిభో
కూర్మాకార శరీరనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

శ్రీ రాహుగ్రహ దోష నివృత్యర్థం శ్రీ వరాహావతార స్తుతి పఠనంచ కరిష్యే:

భూచోరక హర పుణ్యమతే క్రోడోద్ధృత భూదేవహరే
క్రోడాకార శరీరనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

**శ్రీ కేతుగ్రహ దోష నివృత్యర్థం శ్రీ మీనావతార స్తుతి పఠనంచ కరిష్యే:**

వేదోధ్ధార విచారమతే సోమకదానవ సంహరణే
మీనాతార శరీరనమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

**శ్రీ కలి దోష నివృత్యర్థం శ్రీ కల్కీవతార స్తుతి పఠనంచ కరిష్యే:**

శిష్టజనావన దుష్టహర ఖగతుర గోత్తమ వాహనతే
కల్కిరూప పరిపాల నమో భక్తంతే పరిపాలయమాం
రామస్మరణా ధన్యోపాయం నహిపశ్యామో భవతరణే
రామహరే కృష్ణహరే తవనామవదామి సదానృహరే

హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

## పై స్తోత్రం పఠించవలసిన విధానం

రవి స్తోత్రం ఆదివారం 6 సార్లు
చంద్ర స్తోత్రం సోమవారం 10 సార్లు
కుజ స్తోత్రం మాంగళవారం 7 సార్లు
బుధ స్తోత్రం బుధవారం 17 సార్లు
గురు స్తోత్రం గురువారం 16 సార్లు
శుక్ర స్తోత్రం శుక్రవారం 20 సార్లు
శని స్తోత్రం శనివారం 19 సార్లు
రాహు స్తోత్రం శని, ఆదివారం 18 సార్లు
కేతు స్తోత్రం మంగళవారం 7 సార్లు
ప్రతిరోజు మిగితావి ఒక్కసారి మాత్రమే.



# నవగ్రహ దోషాలను తొలగించే నవగ్రహ గాయత్రి మంత్రం



నవగ్రహ దోషాలను తొలగించే నవగ్రహ గాయత్రి మంత్రం. న గాయత్ర్యాః పరంమంత్రం నమాతుః పరదైవతమ్ అంటే తల్లిని మించిన దైవం లేదు. గాయత్రిని మించిన మంత్రం లేదని అర్థం. గాయత్రి మంత్రం గురించి ఋగ్వేదంలో తొలుత వివరించారు. గాయత్రి అనే పదం గయ త్రాయతి అను పదాలతో కూడుకుని ఉంది. గయాన్ త్రాయతే ఇతి గాయత్రీ అని ఆదిశంకరాచార్యులు తనభాష్యంలో వివరించారు. అనేక విధాలుగా గాయత్రి స్తోత్రం చేస్తారు. వీటిలో నవగ్రహ గాయత్రి కూడా ఒకటి. ఈ మంత్రం జపించడం వల్ల నవగ్రహ దోషాలు తొలగి శుభం జరుగుతుందని పండితులు చెబుతారు.

## సూర్య గాయత్రి

ఓం భాస్కరాయ విద్మహే మహాధ్యుతికరాయ ధీమహే తన్నో ఆదిత్యః ప్రచోదయాత్

## చంద్ర గాయత్రి

ఓం అమ్రుతేశాయ విద్మహే రాత్రిన్చరాయ ధీమహి తన్నశ్చంద్రః ప్రచోదయాత్.

## కుజ గాయత్రి

ఓం అన్గారకాయ విద్మహే శక్తి హస్తాయ ధీమహి తన్న: కుజః ప్రచోదయాత్.

## బుధ గాయత్రి

ఓం చంద్ర సుతాయ విద్మహే సౌమ్య గ్రహాయ ధీమహి తన్నో బుధః ప్రచోదయాత్.

## గురు గాయత్రి

ఓం సురాచార్యాయ విద్మహే దేవ పూజ్యాయ ధీమహి తన్నో గురుః ప్రచోదయాత్

## శుక్ర గాయత్రి

ఓం భృగువాస జాతాయ విద్మహే శ్వేతవాహనాయ ధీమహి తన్నో శుక్రః ప్రచోదయాత్

## శని గాయత్రి

ఓం రవిసుతాయ విద్మహే మందగ్రహాయ ధీమహి తన్నః శనిః ప్రచోదయాత్

## రాహు గాయత్రి

**ఓం శీర్ష రూపాయ విద్మహే వక్ర పందాయ ధీమహి తన్నో రాహుః ప్రచోదయాత్**

## కేతు గాయత్రి

**ఓం తమోగ్రహాయ విద్మహే ధ్వజస్థితాయ ధీమహి తన్నో కేతుః ప్రచోదయాత్**

ఎవరెవరికి ఏ గ్రహం అనుకూలంగా లేదో ఆ గ్రహానికి సంబంధించిన గాయత్రి మంత్రాన్ని ప్రాతఃకాలమందే స్నానము చేసి మంచి వస్త్రాలను ధరించి, శుచి శుభ్రతను పాటిస్తూ, నిశ్చల మనస్సుతో, భక్తి భావంతో పఠిస్తే తప్పక మంచి ఫలితాలు వస్తాయి అని పండితుల భావన.



# నవగ్రహ స్తోత్రం



జపాకుసుమసంకాశం కాశ్యపేయం మహద్యుతిమ్ ।
తమోఽరిం సర్వపాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్ ॥ 1 ॥

దధిశంఖతుషారాభం క్షీరోదార్ణవసంభవమ్ ।
నమామి శశినం సోమం శంభోర్మకుటభూషణమ్ ॥ 2 ॥

ధరణీగర్భసంభూతం విద్యుత్కాంతిసమప్రభమ్ ।
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥ 3 ॥

ప్రియంగుకలికాశ్యామం రూపేణాప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్ ॥ 4 ॥

దేవానాం చ ఋషీణాం చ గురుం కాంచనసంనిభమ్ ।
బుద్ధిభూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥ 5 ॥

హిమకుందమృణాలాభం దైత్యానాం పరమం గురుమ్ ।
సర్వశాస్త్రప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్ ॥ 6 ॥

నీలాంజనసమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయామార్తండసంభూతం తం నమామి శనైశ్చరమ్ ॥ 7 ॥

అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్యవిమర్దనమ్ ।
సింహికాగర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ ॥ 8 ॥

పలాశపుష్పసంకాశం తారకాగ్రహమస్తకమ్ ।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ ॥ 9 ॥

ఇతి వ్యాసముఖోద్గీతం యః పఠేత్సుసమాహితః ।
దివా వా యది వా రాత్రౌ విఘ్నశాంతిర్భవిష్యతి ॥ 10 ॥

నరనారీనృపాణాం చ భవేద్దుఃస్వప్ననాశనమ్ ।
ఐశ్వర్యమతులం తేషామారోగ్యం పుష్టివర్ధనమ్ ॥ 11 ॥

గ్రహనక్షత్రజాః పీడాస్తస్కరాగ్నిసముద్భవాః ।
తాః సర్వాః ప్రశమం యాంతి వ్యాసో బ్రూతే న సంశయః ॥ 12 ॥

# నవగ్రహాల అనుగ్రహాన్ని కలిగించే శ్రీ ఆంజనేయ నవరత్నమాలా స్తోత్రం



శ్రీ ఆంజనేయస్వామి వారిని పూజిస్తే సకల దేవతలని పూజించిన ఫలితం వస్తుందని పరాశర సంహిత'లో ఉంది. నవగ్రహాల అనుగ్రహం త్వరగా పొందాలంటే వాల్మీకి రామాయణంలోని ఈ 9 శ్లోకాలు నిత్యం పారాయణ చేయడం మంచిది అని పండితుల భావన. నవగ్రహాలు అత్యంత కరుణా స్వరూపులు. మనం పూర్వజన్మలలో చేసిన పుణ్యపాపాల బట్టి ఫలితాలని ఇస్తారు. కానీ భక్తితో నవగ్రహాలను ఇటువంటి స్తోత్రాలతో స్తుతిస్తే శుభఫలితాల్ని అనుగ్రహిస్తారు అని చెప్పబడుతుంది. శ్రీ ఆంజనేయ నవరత్నమాలా శ్లోకాల పారాయణం వల్ల విద్యార్థులకు మేధస్సు,

ఉద్యోగస్తులు, వ్యాపారులకు అభివృద్ధి, స్త్రీలకు వివాహం, సత్సంతానము మరియు వృద్ధులకు ఆరోగ్యం కలుగుతుంది. ప్రతి నిత్యం లేదా కనీసం శనివారం రోజు అయినా వీటిని పారాయణ చేయడం వలన శుభఫలితాలను పొంది నవగ్రహ అనుగ్రహం పొందవచ్చు. శ్లోకము తత్‌సంబంధిత గ్రహము, రత్నముల వివరములు స్తోత్రంలో తెలుపబడినవి.

## సూర్యుడు (మాణిక్యం)

**తతో రావణనీతాయాః సీతాయాశ్శత్రుకర్శనః ।**

**ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి ॥**

అర్థము : అరివీర భయంకరుడైన ఆంజనేయుడు రావణాపహృతయైన సీతజాడను అన్వేషించుటకై చారణాది దివ్యజాతులవారు సంచరించు ఆకాశమార్గమున వెళ్ళుటకు నిశ్చయించుకొనెను.

## చంద్రుడు (ముత్యం)

**యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ ।**

**స్మృతిర్మతిర్ధృ తిర్దాక్ష్యం స కర్మసు న సీదతి ॥**

అర్థము : నీవలె గట్టి ధైర్యము, దూరదృష్టి, సమయస్ఫూర్తి, పటుత్వము గలవాడు తన కార్యసిద్ధి యందు ఎన్నడును వైఫల్యమును పొందడు.

## కుజుడు (పగడం)

**అనిర్వేదః శ్రియో మూలం అనిర్వేదః పరం సుఖం ।**

**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ॥**

అర్థము : దిగులుపడకుండా ఉత్సాహముతో నుండుటవలన కార్యసిద్ధియు, పరమ సుఖము కలుగును. ఎల్లవేళలను అన్ని సందర్భములలో ఉత్సాహము కలిగి యుండటయే శ్రేయస్కరము.

## బుధుడు (మరకతం)

**నమోస్తు రామాయ సలక్ష్మణాయ**
**దేవ్యై చతస్యై జనకాత్మజాయై ।**
**నమోస్తు రుద్రేంద్రయమనిలేభ్య:**
**నమోస్తు చంద్రార్కమరుద్గణ౭భ్య: ॥**

అర్థము : శ్రీరామునకు నమస్కారము. జనక సుతయైన సీతామాతకు ప్రణతి, లక్ష్మణునకు నమస్కారము, వాయుదేవునకు నమస్కారములు. సూర్యచంద్రులకును మరుద్దేవతలకును నమస్కారములు.

## శుక్రుడు (హీరకం)

**రామ: కమలపత్రాక్ష: సర్వసత్త్వమనోహర: ।**
**రూపదాక్షిణ్యసంపన్న: ప్రసూతో జనకాత్మజే ॥**

అర్థము : ఓ జానకీ! శ్రీరాముడు కమలపత్రముల వంటి కన్నులుగల వాడు. తన నిరుపమానకాంతిచే సమస్త ప్రాణులకును ఆనందమును గూర్చువాడు. పుట్టుకతోనే అతడు చక్కని దేహసౌందర్యము, గుణ సంపదయు గలవాడు.

## శని (ఇంద్రనీలం)

**జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబల: ।**
**దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణ: ॥**

అర్థము : మహాబలసంపన్నుడైన శ్రీరామునకు జయము. మిక్కిలి పరాక్రమ శాలియైన లక్ష్మణస్వామికి జయము. అసహాయ శూరుడు, కోసల దేశప్రభువు ఐన శ్రీరామునకు నేను దాసుడను.

## గురుడు (పుష్యరాగం)

ప్రియాన్న సంభవేద్దుఃఖం అప్రియాదధికం భయమ్
తాభ్యాం హి యే వియుజ్యంతే నమస్తేషాం మహాత్మనామ్

## రాహువు (గోమేదికం)

**యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః ।**
**యది వాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః ॥**

అర్థము : నేను పతిసేవాపరాయణనే ఐనచో, తపమాచిరించియున్నచో, నేను నిష్కలంక పతివ్రతనైనచో ఓ అగ్నిదేవా! హనుమంతుని చల్లగా చూడుము.

## కేతువు (వైడూర్యం)

**నివృత్తవనవాసం తం త్వయా సార్ధమరిందమం ।**
**అభిషిక్తమయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవం ॥**

అర్థము : శత్రుమర్ధనుడైన శ్రీరాముడు వనవాసము ముగిసిన పిమ్మట నీతోగూడి అయోధ్యయందు పట్టాభిషిక్తుడగుటను నీవు త్వరలో చూడగలవు.



# నవగ్రహ పీడాపరిహార స్తోత్రం

ప్రతిరోజూ ఈ నవగ్రహ పీడా పరిహార స్తోత్రాన్ని ఉదయాన్నే తొమ్మిది సార్లు పఠిస్తే గ్రహపీడ తొలగి, కార్యసిద్ధి కలుగుతుంది అని నమ్మకము.



గ్రహాణామాది రాదిత్యోలోక రక్షణకారకః ॥
విషమస్థాన సంభూతం పీడాం హరతుమే రవిః ॥

రోహిణీ శస్సుధామూ ర్తిస్సుధాగాత్రస్సురాళనః ॥
విషమస్థాన సంభూతం పీడాం హరతుమే విదుః ॥

భూమిపుత్రో మహాతేజా జగతాం భయకృత్సదా ॥
వృష్టి కృదృష్టి హర్తాచ పీడాం హరతుమే కుజః ॥

ఉత్పాతరూపోజగతాం చంద్రపుత్రో మహాధ్యుతిః ॥
సూర్యప్రియకరో విద్వాన్ పీడాం హరతుమే **బుధః** ॥

దేవమంత్రి విశాలాక్షః సదాలోకహితే రతః ॥
అనేకశిష్య సంపూర్ణః పీడాం హరతుమే **గురుః** ॥

దైత్యమంత్రి గురుస్తేషాం ప్రాణదశ్చ మహామతిః ॥
ప్రభు స్తారాగ్రహణాంచ పీడాం హరతుమే **బృగుః** ॥

సుర్యపుత్రోదీర్ఘదేహో విశాలక్షః శివప్రియః ॥
మందచారః ప్రసన్నాత్మా పీడాం హరతుమే **శనిః** ॥

మహాశిరామ మహావక్త్రో దీర్ఘధంష్ట్రో మహాబలః ॥
అతనుశ్చోర్ధ్వకేశాశ్చ పీడాం హరతుమే **శిఖిః** ॥

అనేకరూపవర్ణైశ్చ శతశో థసహస్రశః ॥
ఉత్పాతరుజోజగాతాం పీడాం హరతుమే **తమః** ॥

## నవగ్రహా ప్రార్థన

**ఆరోగ్యం** పద్మబంధుః వితరతు నితరాం సంపదం శీతరశ్మిః ।
భూలాభం భూమిపుత్రః సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ॥

**సౌభాగ్యం** దేవమంత్రీ రిపుభయశమనం భార్గవః శౌర్యమార్కిః ।
దీర్ఘాయుః సైంహికేయః విపులతరయశః కేతురాచంద్రతారమ్ ॥

**అరిష్టాని** ప్రణశ్యన్తు దురతాని భయాని చ ।
శాంతిరస్తు శుభం మేஉస్తు గ్రహాః కుర్వన్తు మంగళమ్ ॥

# నవగ్రహధ్యానమ్



## సూర్యస్య ధ్యానం

ప్రత్యక్షదేవం విశదం సహస్రమరీచిభిః శోభితభూమిదేశమ్ ।
సప్తాశ్వగం సద్ధ్వజహస్తమాద్యం దేవం భజేఽహం మిహిరం హృదబ్జే॥

## చన్ద్రస్య ధ్యానం

శఙ్ఖప్రభమేణప్రియం శశాఙ్కమీశానమౌలిస్థితమీడ్యవృత్తమ్ ।
తమీపతిం నీరజయుగ్మహస్తం ధ్యాయే హృదబ్జే శశినం గ్రహేశమ్॥

## కుజ ధ్యానం

ప్రతప్తగాఙ్గేయనిభం గ్రహేశం సింహాసనస్థం కమలాసిహస్తమ్ ।
సురాసురైః పూజితపాదపద్మం భౌమం దయాలుం హృదయే స్మరామి ॥

## బుధ ధ్యానం

సోమాత్మజం హంసగతం ద్విబాహుం శఙ్ఖేన్దురూపం హ్యసిపాశహస్తమ్।
దయానిధిం భూషణభూషితాఙ్గం బుధం స్మరే మానసపఙ్కజేఽహమ్ ॥

## గురు ధ్యానం

తేజోమయం శక్తిత్రిశూలహస్తం సురేన్ద్రజ్యేష్ఠైః స్తుతపాదపద్మమ్ ।
మేధానిధిం హస్తిగతం ద్విబాహుం గురుం స్మరే మానసపఙ్కజేఽహమ్ ॥

## శుక్రస్య ధ్యానం

సన్తప్తకాఞ్చననిభం ద్విభుజం దయాలుం పీతామ్బరం ధృతసరోరుహద్వన్ద్వశూలమ్ ।
క్రౌంచాసనం హ్యసురసేవితపాదపద్మం శుక్రం స్మరే ద్వినయనం హృది పఙ్కజేఽహమ్॥

## శనేర్ధ్యానం

నీలాంజనాభం మిహిరేష్టపుత్రం గ్రహేశ్వరం పాశభుజఙ్గపాణిమ్ ।
సురాసురాణాం భయదం ద్విబాహుం శనిం స్మరే మానసపఙ్కజేఽహమ్॥

## సైంహికేయస్య ధ్యానం

శీతాంశుమిత్రాన్తకమీడ్యరూపం ఘోరం చ వైడుర్యనిభం విబాహుమ్।
త్రైలోక్యరక్షాప్రదమిష్టదం చ రాహుం గ్రహేన్ద్రం హృదయే స్మరామి॥

## కేతోశ్చ ధ్యానం

లాఙ్గలయుక్తం భయదం జనానాం కృష్ణామ్బుభృత్సన్నిభమేకవీరమ్।
కృష్ణామ్బరం శక్తిత్రిశూలహస్తం కేతుం భజే మానసపఙ్కజేఽహమ్॥

ఇతినవగ్రహధ్యానం సంపూర్ణమ్

# నవగ్రహ కరావలమ్బ స్తోత్రమ్

జ్యోతీశ దేవ భువనత్రయ మూలశక్తే
గోనాథ భాసుర సురాదిభిరీడ్యమాన ।
నణాంశ్చ వీర్య వర దాయక ఆదిదేవ
ఆదిత్య వేద్య మమ దేహి కరావలమ్బమ్ ॥ 1 ॥

నక్షత్రనాథ సుమనోహర శీతలాంశో
శ్రీ భార్గవీ ప్రియ సహోదర శ్వేతమూర్తే ।
క్షీరాబ్ధిజాత రజనీకర చారుశీల
శ్రీమచ్ఛశాంక మమ దేహి కరావలమ్బమ్ ॥ 2 ॥

రుద్రాత్మజాత బుధపూజిత రౌద్రమూర్తే
బ్రహ్మణ్య మంగల ధరాత్మజ బుద్ధిశాలిన్ ।
రోగార్తిహార ఋణమోచక బుద్ధిదాయిన్
శ్రీ భూమిజాత మమ దేహి కరావలమ్బమ్ ॥ 3 ॥

సోమాత్మజాత సురసేవిత సౌమ్యమూర్తే
నారాయణప్రియ మనోహర దివ్యకీర్తే ।
ధీపాటవప్రద సుపండిత చారుభాషిన్
శ్రీ సౌమ్యదేవ మమ దేహి కరావలమ్బమ్ ॥ 4 ॥

వేదాన్తజ్ఞాన శ్రుతివాచ్య విభాసితాత్మన్
బ్రహ్మాది వన్దిత గురో సుర సేవితాంఘ్రే ।
యోగీశ బ్రహ్మ గుణ భూషిత విశ్వ యోనే
వాగీశ దేవ మమ దేహి కరావలమ్బమ్ ॥ 5 ॥

ఉల్లాస దాయక కవే భృగువంశజాత
లక్ష్మి సహోదర కలాత్మక భాగ్యదాయిన్ ।
కామాదిరాగకర దైత్యగురో సుశీల
శ్రీ శుక్రదేవ మమ దేహి కరావలమ్బమ్ ॥ 6 ॥

శుద్ధాత్మ జ్ఞాన పరిశోభిత కాలరూప
ఛాయాసునన్దన యమాగ్రజ క్రూరచేష్ట ।
కష్టాద్యనిష్టకర ధీవర మన్దగామిన్
మార్తండజాత మమ దేహి కరావలమ్బమ్ ॥ 7 ॥

మార్తండ పూర్ణ శశి మర్దక రౌద్రవేశ
సర్పాధినాథ సురభీకర దైత్యజన్మ ।
గోమేధికాభరణ భాసిత భక్తిదాయిన్
శ్రీ రాహుదేవ మమ దేహి కరావలమ్బమ్ ॥ 8 ॥

ఆదిత్య సోమ పరిపీడక చిత్రవర్ణ
హే సింహికాతనయ వీర భుజంగ నాథ
మన్దస్య ముఖ్య సఖ ధీవర ముక్తిదాయిన్
శ్రీ కేతు దేవ మమ దేహి కరావలమ్బమ్ ॥ 9 ॥

మార్తండ చన్ద్ర కుజ సౌమ్య బృహస్పతీనామ్
శుక్రస్య భాస్కర సుతస్య చ రాహు మూర్తేః
కేతోశ్చ యః పఠతి భూరి కరావలమ్బ
స్తోత్రమ్ స యాతు సకలాంశ్చ మనోరథారాన్ ॥ 10 ॥

# నవగ్రహ కవచం

శిరో మే పాతు మార్తాండో కపాలం రోహిణీపతిః ।
ముఖమంగారకః పాతు కంఠశ్చ శశినందనః ॥ 1 ॥

బుద్ధిం జీవః సదా పాతు హృదయం భృగునందనః ।
జఠరం చ శనిః పాతు జిహ్వాం మే దితినందనః ॥ 2 ॥

పాదౌ కేతుః సదా పాతు వారాః సర్వాంగమేవ చ ।
తిథయోఽష్టౌ దిశః పాంతు నక్షత్రాణి వపుః సదా ॥ 3 ॥

అంసౌ రాశిః సదా పాతు యోగాశ్చ స్థైర్యమేవ చ ।
గుహ్యం లింగం సదా పాంతు సర్వే గ్రహాః శుభప్రదాః ॥ 4 ॥

అణిమాదీని సర్వాణి లభతే యః పఠేద్ ధ్రువమ్ ।
ఏతాం రక్షాం పఠేద్ యస్తు భక్త్యా స ప్రయతః సుధీః ॥ 5 ॥

స చిరాయుః సుఖీ పుత్రీ రణే చ విజయీ భవేత్ ।
అపుత్రో లభతే పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ॥ 6 ॥

దారార్థీ లభతే భార్యాం సురూపాం సుమనోహరామ్ ।
రోగీ రోగాత్ప్రముచ్యేత బద్ధో ముచ్యేత బంధనాత్ ॥ 7 ॥

జలే స్థలే చాంతరిక్షే కారాగారే విశేషతః ।
యః కరే ధారయేన్నిత్యం భయం తస్య న విద్యతే ॥ 8 ॥

బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః ।
సర్వపాపైః ప్రముచ్యేత కవచస్య చ ధారణాత్ ॥ 9 ॥

నారీ వామభుజే ధృత్వా సుఖైశ్వర్యసమన్వితా ।
కాకవంధ్యా జన్మవంధ్యా మృతవత్సా చ యా భవేత్ ।
బహ్వపత్యా జీవవత్సా కవచస్య ప్రసాదతః ॥ 10 ॥

ఇతి గ్రహయామలే ఉత్తరఖండే నవగ్రహ కవచం సమాప్తమ్

## శని శంఖం



ఈ రకములయిన శంఖాలకి నోరు పెద్దదిగా, పొట్ట చిన్నదిగా ఉంటుంది. ఒంటి మీద ముళ్లు ఎక్కువగా ఉంటాయి. అష్టమ శని, కంటక శని మొదలయిన శని సంబంధిత దోషాలని నివృత్తి చేయడానికి ఈ శని శంఖాలని పూజిస్తారు. శని శంఖాన్ని పూజించే వారికి పేదరికం, ఆక్సిడెంట్లు దరిచేరవని నమ్మకం.

# నవ గ్రహ సుప్రభాతం

## సూర్య

పూర్వాపరాద్రి సంచార చరాచరవికాసక
ఉత్తిష్ఠ లోకకల్యాణ సూర్యనారాయణ ప్రభో 1

సప్తాశ్వరశ్మిరథ సంతతలోకచార
శ్రీ ద్వాదశాత్మకమనీయత్రిమూర్తిరూప
సంధ్యాత్రయార్చిత వరేణ్య దివాకరేశా
శ్రీ సూర్యదేవ భగవన్ కురు సుప్రభాతం 2

అజ్ఞానగాహతమసఃపటలం విదార్య
జ్ఞానాతపేన పరిపోషయసీహ లోకం
ఆరోగ్యభాగ్యమతి సంప్రదదాసి భానో
శ్రీ సూర్యదేవ భగవన్ కురు సుప్రభాతం 3

ఛాయాపతే సకలమానవకర్మసాక్షిన్
సింహాఖ్యరాశ్యధిప పాపవినాశకారిన్
పీడోపశాంతికర పావన కాంచనాభ
శ్రీ సూర్యదేవ భగవన్ కురు సుప్రభాతం 4

## చంద్ర

సర్వలోకసముల్లాస శంకరప్రియభూషణా
ఉత్తిష్ఠ రోహిణీకాంత చంద్రదేవ నమోఽస్తుతే 5

ఇంద్రాది లోకపరిపాలక కీర్తిపాత్ర
కేయూరహారమకుటాది మనోజ్ఞగాత్ర
లక్ష్మీసహోదర దశాశ్వరథప్రయాణ
శ్రీ చంద్రదేవ కుముదప్రియ సుప్రభాతం 6

శ్రీ వేంకటేశనయన స్మరముఖ్యశిష్య
వందారుభక్తమనసాముపశామ్య పీడాం
లోకాన్ నిశాచర సదా పరిపాలయ త్వం
శ్రీ చంద్రదేవ కుముదప్రియ సుప్రభాతం 7

నీహారకాంతికమనీయకలాప్రపూర్ణ
పీయూషవృష్టిపరిపోషితజీవలోక
సస్యాదివర్ధక శశాంక విరాణ్మనోజ
శ్రీ చంద్రదేవ కుముదప్రియ సుప్రభాతం 8

## అంగారక

మేరోః ప్రదక్షిణం కుర్వన్ జీవలోకం చ రక్షసి
అంగారక గ్రహోత్తిష్ఠ రోగపీడోపశాంతయే 9

ఆరోగ్యభాగ్యమమితం వితరన్ మహాత్మన్
రోగాద్విమోచయసి సంతతమాత్మభక్తాన్
ఆనందమాకలయ మంగలకారక త్వం
మేషేంద్రవాహన కుజగ్రహా సుప్రభాతం 10

సూర్యస్య దక్షిణదిశామధిసంవదానః
కారుణ్యలోచన విశాలదృశానుగృహ్య
త్వద్ధ్యానతత్పరజనానన్నృణాన్ కరోషి
మేషేంద్రవాహన కుజగ్రహ సుప్రభాతం 11

## బుధ

బుధ ప్రాజ్ఞ బుధారాధ్య సింహవాహన సోమజ
ఉత్తిష్ఠ జగతాం మిత్ర బుద్ధిపీడోపశాంతయే 12

హే పీతవర్ణ సుమనోహరకాంతికాయ
పీతాంబర ప్రముదితాఖిలలోకసేవ్య
శ్రీచంద్రశేఖరసమాశ్రితరక్షకస్త్వం
తారాశశాంకజ బుధగ్రహ సుప్రభాతం 13

ద్రాక్షాగులుచ్ఛపదబంధకవిత్వదాతః
ఆనందసంహితవిధూతసమస్తపాప
కన్యాపతే మిథునరాశిపతే నమస్తే
తారాశశాంకజ బుధగ్రహ సుప్రభాతం 14

## గురు

ధనుర్మీనాది దేవేశ దేవతానాం మహాగురో
బ్రహ్మజాత సముత్తిష్ఠ పుత్రపీడోపశాంతయే 15

ఇంద్రాది దేవబహుమానితపుత్రకార
ఆచార్యవర్య జగతాం శ్రితకల్పపూజ

తారాపతే సకలసన్నుతధీప్రభావ
శ్రీధీష్పతిగ్రహ జనావన సుప్రభాతం 16

పద్మాసనస్థ కనకాంబర దీనబంధో
భక్తార్తిహార సుఖకారక నీతికర్తః
వాగ్రూపభేదసువికాసక పండితేజ్య
శ్రీధీష్పతిగ్రహ జనావన సుప్రభాతం 17

## శుక్ర

తులావృషభరాశీశ పంచకోనస్థితగ్రహ
శుక్రగ్రహ సముత్తిష్ఠ పత్నీపీడోపశాంతయే 18

శ్వేతాంబరాది బహుశోభితగౌరగాత్ర
జ్ఞానైకనేత్ర కవిసన్నుతిపాత్ర మిత్ర
ప్రజ్ఞావిశేషపరిపాలితదైత్యలోక
హే శుక్రదేవ భగవన్ కురు సుప్రభాతం 19

సంజీవినీప్రముఖమంత్రరహస్యవేదిన్
తత్త్వాఖిలజ్ఞ రమణీయరథాధిరూఢ
రాజ్యారియోగకర దైత్యహితోపదేశిన్
హే శుక్రదేవ భగవన్ కురు సుప్రభాతం 20

## శనైశ్చర

మండలే ధనురాకారే సంస్థితః సూర్యనందన
నీలదేహ సముత్తిష్ఠ ప్రాణపీడోపశాంతయే 21

చాపాసనస్థ వరగృధ్రరథప్రయాణ
కాలాంజనాభ యమసోదర కాకవాహ
భక్తప్రజావనసుదీక్షిత శంభుసేవిన్
శ్రీ భాస్కరాత్మజ శనైశ్చర సుప్రభాతం 22

సంసారసక్తజనదుష్పరిస్వప్రదాతః
భక్తిప్రపన్నజనమంగలసన్నిధాతః
శ్రీపార్వతీపతిదయామయదృష్టిప్రవాచ
శ్రీ భాస్కరాత్మజ శనైశ్చర సుప్రభాతం 23

తైలాన్నదీపతిలనీలసుపుష్పసక్తః
కుంభాదిపత్యమకరాధిపయే వహిత్వం
నిర్భీక కామిత ఫలప్రద నీలవాసః
శ్రీ భాస్కరాత్మజ శనైశ్చర సుప్రభాతం 24

## రాహు

గౌహుతే అధిదేవతా రాహో సర్పాః ప్రత్యధిదేవతాః
రాహుగ్రహ సముత్తిష్ఠ నేత్రపీడోపశాంతయే 25

నీలాంబరాది సమలంకృత సైంహికేయ
జ్ఞానప్రసన్న వరదానసుఖావహస్త్వం
శూర్పాసనస్థ సుజనావహ సౌమ్యరూప
రాహుగ్రహప్రవర నేత్రద సుప్రభాతం 26

సింహాధిపశ్చ తను సింహగతాసనస్త్వం
మేర్వప్రదక్షిణ చరదుత్తరకాయశోభిం
ఆదిత్యచంద్రగ్రసనాగ్రహలగ్నచిత్త
రాహుగ్రహప్రవర నేత్రద సుప్రభాతం 27

## కేతుః

చిత్రగుప్తబ్రహ్మదేవౌ అధిప్రత్యధిదేవతే
కేతుగ్రహ సముత్తిష్ఠ జ్ఞానపీడోపశాంతయే 28

చిత్రం చ తే ధ్వజరథాది సమస్తమేవ
సయేతరం చ గమనం పరితస్తు మేరుం
సూర్యస్య వాయుదితిసంచరతీహ నిత్యం
కేతుగ్రహప్రవర మోక్షద సుప్రభాతం 29

త్వన్మంత్రజాపపరసజ్జన సంస్తుతస్సన్
జ్ఞానం తనోశి విమలం పరిహార్య పీడాం
ఏవం హి సంతతమనంతదయాం కురు త్వం
కేతుగ్రహప్రవర మోక్షద సుప్రభాతం 30

## ఫలశ్రుతి

నిత్యం నవగ్రహదేవతానామిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః
తేశాం ప్రభాతసమయే స్మృతిరంగభాజాం
ప్రజ్ఞాం పరార్ధసులభాం పరమాం ప్రసూతే



# నవగ్రహాసూక్తం

ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనమ్ ధ్యాయేత్సర్వ విఘ్నోపశాన్తయే ॥

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యమ్ ఓం తత్సవితుర్వరే ఽణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ॥

ఓం ఆపో జ్యోతీరసో ఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥
మమోపాత్త-సమస్త-దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం
ఆదిత్యాది నవగ్రహ దేవతా ప్రసాద సిధ్యర్థం
ఆదిత్యాది నవగ్రహ నమస్కారాన్ కరిష్యే ॥

ఓం ఆసత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యఞ్చ ।
హిరణ్యయేన సవితా రథేనా ఽఽదేవో యాతిభువనా విపశ్యన్ ॥
అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్ ।
అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥
యేషామీశే పశుపతిః పశూనాం చతుష్పదాముత చ ద్విపదామ్ ।
నిష్క్రీతో ఽయం యజ్ఞియం భాగమేతు రాయస్పోషా యజమానస్య సన్తు ॥
ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ ఆదిత్యాయ నమః ॥ 1 ॥

ఓం ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియమ్ ।
భవా వాజస్య సంగథే ॥

అప్సుమే సోమో అబ్రవీదన్తర్విశ్వాని భేషజా ।

అగ్నిఞ్చ విశ్వశంభువమాపశ్చ విశ్వభేషజీః ॥

గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।

అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ సోమాయ నమః ॥ 2 ॥

ఓం అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్ ।

అపాగ్ంరేతాగ్ంసి జిన్వతి ॥

స్యోనా పృథివి భవా ఉనృక్షరా నివేశనీ ।

యచ్ఛానశ్శర్మ సప్రథాః ॥

క్షేత్రస్య పతినా వయగ్ంహితే నేవ జయామసి ।

గామశ్వం పోషయిత్న్వా స నో మృడాతీదృశే ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ అఙ్గారకాయ నమః ॥ 3 ॥

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేనమిష్టాపూర్తే సగ్ంసృజేథామయఞ్చ ।

పునః కృణ్వగ్గ్స్త్వా పితరం యువానమన్వాతాగ్ంసీత్త్వయి తన్తుమేతమ్ ॥

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ ।

సమూఢమస్యపాగ్ం సురే ॥

విష్ణో రరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోశ్ఞప్త్రేస్థో విష్ణోస్స్యూరసి

విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవే త్వా ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ బుధాయ నమః ॥ 4 ॥

ఓం బృహస్పతే అతియదర్యో అర్హాద్ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు ।
యద్దీదయచ్ఛవసర్తప్రజాత తదస్మాసు ద్రవిణన్ధేహి చిత్రమ్ ॥
ఇన్ద్రమరుత్వ ఇహా పాహి సోమం యథా శార్యాతే అపిబస్సుతస్య ।
తవ ప్రణీతీ తవ శూరశర్మన్నావివాసన్తి కవయస్సుయజ్ఞాః ॥
బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీమతస్సురుచో వేన ఆవః ।
సబుధ్నియా ఉపమా అస్య
విష్ఠాస్సతశ్చ యోనిమసతశ్చ వివః ॥
ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ బృహస్పతయే నమః ॥ 5 ॥

ఓం ప్రవశ్శుక్రాయ భానవే భరధ్వమ్ ।
హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్ ।
యో దైవ్యాని మానుషా జనూగ్ంషి అన్తర్విశ్వాని విద్మ నా జిగాతి ॥
ఇన్ద్రాణీమాసు నారిషు సుపత్ నీమహమశ్రవమ్ ।
న హ్యస్యా అపర్చన జరసా మరతే పతిః ॥
ఇన్ద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః
అస్మాకమస్తు కేవలః ॥
ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ శుక్రాయ నమః ॥ 6 ॥

ఓం శన్నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే ।
శంయోరభిస్రవన్తు నః ॥
ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ ।
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయగ్ంస్యామ పతయో రయీణామ్ ॥

ఇమం యమప్రస్తరమాహి సీదా ఉ_జ్గిరోభిః పితృభిస్సంవిదానః ।

ఆత్వా మన్త్రాః కవిశస్తా వహన్త్వేనా రాజన్, హవిషా మాదయస్వ ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ శనైశ్చరాయ నమః ॥ 7 ॥

ఓం కయా నశ్చిత్ర ఆభువదూతీ సదావృధస్సఖా ।

కయా శచిష్ఠయా వృతా ॥

ఆ ఉ_యజ్ఞౌః పృశ్నిరక్రమీదసనన్మాతరం పునః ।

పితరఞ్చ ప్రయన్త్సువః ॥

యత్తే దేవీ నిర్ఋుతిరాబబన్ధ దామ గ్రీవాస్వవిచర్త్యమ్ ।

ఇదన్తే తద్విష్యామ్యాయుషో న మధ్యాదథాజీవః పితుమద్ధి ప్రముక్తః ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితాయ రాహవే నమః ॥ 8 ॥

ఓం కేతుం కృణ్వన్నకేతవే పేశో మర్యా అపేశసే ।

సముషద్భిరజాయథాః ॥

బ్రహ్మా దేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్ ।

శ్యేనోగృధ్రాణాగ్స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్ ॥

సచిత్ర చిత్రం చితయన్తమస్మే చిత్రక్షత్ర చిత్రతమం వయోధామ్ ।

చన్ద్రం రయిం పురువీరమ్ బృహన్తం చన్ద్రచన్ద్రాభిర్గృణతే యువస్వ ॥

ఓం అధిదేవతా ప్రత్యధిదేవతా సహితేభ్యః కేతుభ్యో నమః ॥ 9 ॥

॥ ఓం ఆదిత్యాది నవగ్రహ దేవతాభ్యో నమో నమః ॥

